# నవీన సంవత్సరము

క. సంతోషము! సంతోషము! సంతోషము! నేఁడు నూత్న సంవత్సరము
శ్రాంతనయనోత్సవకర వాసంత శ్రీతోడఁ గూడి జననము నొందెన్.

తే. ఎల్లతరువులు సొంపుమైఁ బల్లవించె
నింబకుసుమ సుగంధముల్ నివ్వటిల్లెఁ
దరుణచూత శలాటువుల్ సరిఘవిల్లెఁ
బుష్పసారప్రవాహంబు పొంగి పారెఁ.

సీ. శ్రవణపేయంబులై చవులూరఁ జేసెడు కలకంఠ కలగాన గరిమచేత
నేత్రపర్వంబులై నింపు వేడుకఁ గూర్చు చిగురుజొంపమ్ముల సవురుచేత
మెయిగీవియకు హాయి మేకొల్పి పారవశ్యముఁ బెంచు మన్దానిలముల చేత
నాసాపుటంబు నానందంబునం దేల్చి రహించు లలిత సౌరభముచేత

తే. మానస క్లేశములనెల్ల మట్టుపఱచి
సకల భారత జనుల కుత్సవకరంబు
వత్సరారంభ మిదియంచుఁ బ్రకృతిలక్ష్మి
చాటుచున్నది నిజవికాసంబు కలిమి.

ఉత్సాహము. చారువాక్ప్రచారగాన సార కలనవలన, దు
ర్వార భావ మారుతాభిరామతన్, మనోహరో
దారసుగుణ సౌరభప్రదాన గరిమ నలరుచున్
భారతీయధీరులార! ప్రకృతి ననుకరింపుఁడీ!

చ. నవనవభావముల్ నిజమనంబుల నెప్పుడు నుప్పతిల్లఁగా
నవనవదివ్యభవ్య రచనల్ నిజవాక్కు నలంకరింపఁగా
నవనవసాధుసంగతి సనారతమున్ దనుపుల్లసిల్లఁగా
నవనవయత్నతన్ ముదమునన్ మనుఁడీ! నవవత్సరంబునన్.

తే. ప్రజకు నిత్యశుభంబులు పరఁగుఁ గాత!
ఋణగతిసిరాజు రాజ్యంబు నేలుఁగాత!
ఎల్లలోకంబులును సుఖియించుఁ గాత!
శాంతినిండార నీ సువత్సరము నందు.

మంగిపూడి వేంకటశర్మ.

# శుక్రనీతిసారము.



నమస్కార పూర్వకముగా నీతిశాస్త్ర ముపదేశింపుమని యడిగిన రక్క సులకు, మున్ను చతుర్ముఖుండు లోకహితంబుపొంటెఁ బెక్కువే లధ్యాయంబులు గల నీతిశాస్త్రమును రచించె ననియు దాని నల్పాయువు లగునరపతులు మొద లగువారి యుపయోగింబుకొఱకు వసిష్ఠాదుల మైనమేము సంగ్రహించితి మనియుఁ జెప్పి భార్గవుండు దీని నుపదేశించిన ట్లీగ్రంథమున నున్నది. భారతశాంతిపర్వ మున నేఁబదితొమ్మిదవ యధ్యాయంబునఁ దొల్లి యొకనిమిత్తమున దేవతలు వేఁడికొనఁ గమలసంభవుండు రాజ్యాంగంబులయిన స్వామ్యమాత్యాదులకు, సంధివిగ్రహాదులకు, సామదానాదులకు, నాన్వీక్షిక్యాదులకు మఱియుం గొన్నిం టికి బోధకం బగుపెక్కవయవములు గలశాస్త్రమును నూఱువే లధ్యాయంబుల రచియించె ననియు దానిని విశాలాక్షుండు, నింద్రుండు,

నీతిశాస్త్రోత్పత్తి.

బృహస్పతియు, శుక్రుండు మునులును నరులయాయువు నెఱింగి క్రమక్రమంబుగ సంగ్రహించి రనియు శుక్రుండు రచించినది నయితము వేయియధ్యాయంబు లున్నదనియుఁ జెప్పంబడె. ఇట్లుండుటచే నిప్పటికి శుక్రనీతి సారము శుక్రుఁడే రచించె ననుట సందిగ్ధము. కాని యెవ్వ డేవానిచే రచింపఁ బడినను భారతాదులకంటెఁ బూర్వమే యిది యున్నదనియు శుక్రుండు సంక్షే పించిన నీతిగ్రంథసార మనియుఁ దోఁచును. మఱియు నిది భాషాశైలులంబట్టి ప్రాతనమైన ఋషికవిత్వమువలెఁ గాన్పించును. ఇందలి యంశములు చిరకాల ముక్రిందట నీదేశము నేలినరాజులస్థితి, పాలనము, నప్పటిజనుల యాచారము మొదలగువానిఁ దెల్పును. మునుపటివా రెఱుంగరని యిప్పటివారు కొందఱు తలంచువిషయములు కొన్ని యిందుఁ గాన్పించును.

దీని మొదట నీతిశాస్త్రప్రశంసా పూర్వకముగా రాజకృత్యంబు లిట్లు చెప్పంబడె. రచించినవారియభిప్రాయానుసారంబుగా నొక్కొక్క యంశంబు దెల్పుశాస్త్రంబులు పెక్కులు కలవు గాని వానివలన వ్యవహారులకుం బ్రయో జనంబు లేదు. మఱియు నాయాయిశాస్త్రంబులు లేకున్న నందలియంశంబుల

నెట్టులేని నేర్వనగుఁ గాని దేనివిజ్ఞానంబున రాజులు పగఱ జయించి లోకరంజకులగుదురో యట్టి నీతిశాస్త్రంబు లేకున్న లోకమర్యాద నిల్వదు. ఏనికిఁ బ్రజాపాలనంబును దుష్టనిగ్రహంబును ముఖ్యధర్మంబులును, నీతి నెఱుంగనివానికవి దుస్సాధంబులును గావునను, నీతిశాస్త్రంబు వదలి తనయిచ్చవచ్చినట్లు సంచరించు రాజు దుఃఖభాజనుం డగుం గావునను జతుర్వర్గప్రదం బైననీతిశాస్త్రమును రాజవశ్యము నేర్వవలయు. ఎచట నీతిబలంబులు రెండునుండునో యచట సిరి విరివిగా నుండు. కాన నృపతి దనప్రేరణంబు నొందకయే యెల్లవారు తనయం దనురక్తులగునట్లు నీతి సంధరింపవలయు. రాజుదండంబునకు వెఱచియే లోకంబు తనధర్మమున నుండు. కార్యంబు లెల్ల దైవమానుషంబులందు సుప్రతిష్ఠితంబులు గావున నదృష్టానుసారంబుగ నెల్లపనులు జరుగు నని యుపేక్షింపరాదు. మున్ను రాజులేమిని జను లన్యోన్యపీడితులయి చెదరిపోవ నింద్రాదులయు సూర్యచంద్రులయు నంశంబులం బుచ్చికొని బ్రహ్మ యిజ్జగంబు రక్షింప నొడయని నిర్మించె. అక్కృతంబున రా జింద్రుండువోలె భాగంబు హరించుచు రక్షింప దక్షుండయి, వాయువు గంధంబునకుంబోలెఁ గర్మంబులకుం బ్రేరకుండయి, సూర్యుండువోలె లోకంబులతమంబు హరించి ధర్మంబునఁ బ్రవర్తిల్లఁ జేయుచు, యముండువోలె దుష్కర్ముల దండించుచు, నగ్నివలె శుచియై వరుణుండు తనజలంబులచేతంబలె ధనంబులచేత లోకంబుఁ దన్పుచుఁ, జంద్రుండు కిరణంబులచేతంబలెఁ దనగుణంబులచేతను గర్మంబులచేతను జనుల సంతసపెట్టుచుఁ, గుబేరుండువోలె ధనంబులకుం గాపరియై యుండవలయు.

నీతిశాస్త్ర ప్రయోజనము. సామాన్య రాజధర్మములు.

మఱియు రాజు ప్రజలకుఁ దండ్రివలె సుగుణంబు లలవఱచుచుఁ, దల్లివలె నపరాధంబు సైచి రక్షించుచు, గురువువలె హితం బుపదేశించుచు, సోదరుఁడువలె శాస్త్రోక్తం బయినభాగంబు హరించుచు, బంధుమిత్రులువలె వారిధనాదు లరయుచు నుండవలయు. ఱేఁడు పరోపదేశమాత్ర కుశలుండు గాక విరివియైన భోగారణ్యంబునం బడునింద్రియగజంబుల జ్ఞానాంకుశంబున మఱల్చుచు, మొదటఁ దన్ను వినీతుం జేసికొని పిమ్మటఁ బుత్త్రుల నమాత్యుల భృత్యులఁ బ్రజలను వినయవంతులఁ జేయునది. ఏలిక ప్రజాపాలనంబునఁ గామంబును, శత్రులయెడఁ గ్రోధంబును, సేనాసంపాదనంబున లోభంబును నిల్పి వేఱొండుచోఁ జొరనీఁదగదు. మఱియు దుష్టనిగ్రహంబును, దానంబును, రాజుల నరిగాఁపులఁ జేయుట, న్యా

యంబున ధనార్జనంబు, క్రొత్తదేశంబుల సంపాదనంబు, శత్రుసంహారంబు మొదలగునవి రాజునకు వలయుగుణంబులు. నటగాయకగణికాదులం దత్యాసక్తుండగురాజు శత్రులనోర నున్నవాఁడు. ఎవఁడు బుద్ధిమంతుల ద్వేషించుచు వంచకులతో సంతసిల్లుచుఁ దనదుర్గుణం బెఱుంగకుండునో యతఁ డాత్మనాశకుండగును. రాజుతప్పు పెద్దదియైన నేవాఁడు నెదుట భయంబునఁ జెప్పఁడు గాన వేగులవారివలనను లోకంబువలనను దుర్గుణంబుల నెఱింగి కీర్తికై విడుచునది; కాని ప్రజనవమానింపఁదగదు. విద్వాంసులవాక్యంబులుంబోలె శుకమయూరాదుల కూఁతలును రుచించుఁ గావునను, ప్రియవచనంబుఁ బోలినవశీకరణసాధనం బొండు లేదు గావునను రాజెల్లవారియందు మధురవచనంబు పచరించునది. మఱియు నాత్మంబోలె సుహృజ్జనంబులను, దేవతలవలె గురువులను, సద్భావంబున బాంధులను జూచుచు నెల్లవారలఁ దనయం దనురక్తులం జేసికొని యాస్తిక్యంబున దేవతారాధనంబుఁ గావించుచు నెల్లజంతువులయెడ దయాదాక్షిణ్యంబులు గల్గి ప్రవర్తింపవలయు. బుద్ధిబలపరాక్రమంబులు రాజులకు మిక్కిలి ముఖ్యగుణంబులు. తక్కినగుణంబు లెన్ని గల్గినను నీగుణంబులు లేనివాఁడు భూమి నేకొలఁదిదానిని బాలింప శక్తుండు గాఁడు.

ఱేఁడు పర్వతంబున కనతిదూరంబును బహువృక్షలతాకీర్ణంబును, దృణకాష్ఠజలసమృద్ధంబును నై నౌకామార్గంబున సముద్రంబునకుం గొనిపోవునది యైననదీతీరంబునఁ జక్కనిచోట, ప్రాకారంబులుఁ, గందకంబులు, నాల్గు దిక్కుల నాల్గుద్వారంబులుఁ, గొలువుచావడులు, నూతులుం, జెఱువులు, దేవాలయంబులు, సత్రంబులు మొదలగునవి గలరాజధానిం

**రాజగృహ నిర్మాణాది.**

గల్పించి యందుఁ బ్రజతో వసియించునది. (ఇట రాజగృహంబులు, చతురంగబలనిలయంబులు, నాయుధాగారంబులు, సభామండపంబులు, మొదలగువానిం గట్టువిధానంబును వానివానియందుఁ జేయవలయునలంకారంబులును, నిలుపవలయుయంత్రంబులును నిరూపింపఁబడె. మఱియు ధనికగృహంబులు,తక్కినవారియిండ్లు, బజారులు మొదలగునవి యేయేచోట్ల నెట్లుండవలయునో చెప్పంబడె.)

రా జందు వసించి, రాత్రి జాముగలప్పుడు లేచి, యాయవ్యయంబులు పరికించి, యాదినము వ్యయమునకుఁ గావలయుద్రవ్యంబుఁ గోశంబునుండి పుచ్చు

కొని, కాల్యంబులు నిర్వర్తించి, వ్యాయామాదులఁ గావించి, రాజకార్యంబులఁ గొన్నిటిఁ గావించి, స్వస్థచిత్తుండయి సుపరీక్షితంబును షడ్రసోపేతంబు నగున న్నంబు భుజియించి, తనయింటఁగల ప్రాంతవస్తువులను గ్రొత్తవానినిం బరికించి, యింకను వృద్ధులను బాలురను జూచి, న్యాయాధికారి విన్నవించినవ్యవహారం బులఁ బరిశీలించి, వ్యూహాభ్యాసంబునకు, వేఁటకు, సంధ్యావందనాదులకును, గొంతకాలంబు వెచ్చించి, రాత్రి భుజించి, వేగులవారివలన

సామాన్యదినచర్య.

వార్తలువిని, యాఱుగంటలు సుఖంబుగ నిద్రించువది. నృపతి తనయాయంబు నాఱుపాళ్లు చేసి మూఁట దండును గాపాడుచు, సాఁబాలు దానం బున వెచ్చించుచు, సంగోరునఁ బ్రకృతులజీతంబు లిచ్చుచుఁ, దక్కినయధికారుల వేతనంబుల నర్ధాంశంబున నిచ్చుచు, నర్ధాంశం బాత్మసుఖంబులకు వెచ్చించుచు, నొక్కపాలఁ గోశంబు పెంచుచుండవలయు. మఱియుం బుత్త్రిలు, మంత్రులు, బంధులు, మొదలగువారు తగినస్థలంబులఁ గూర్చుండ, బంగారుబెత్తంబులు ధరిం చినసేవకు లిరువంకలఁ గొలువ, రాజు సువస్త్రాభరణభూషితుండయి ముకుటంబు ధరించి, కవచంబుఁ దొడిగికొని, కత్తి నొఱనుండి తీసి యసాధారణంబు లగు చిహ్నంబులు ధరించి, కొలువుకూటంబునకు వచ్చి సింహాసనంబునఁ గూర్చుండి సావధానుండయి "సర్వస్మా దధికో దాతా శూర స్త్వం ధార్మికో హ్యసి" యను వంచకులపలుకుల ననాదరుం డయి, మంత్రులు మొదలగువారితో నాలోచించి బహుసంమతం బయినకార్యంబు చేయవలయు. ఇంక నెన్నియో రాజకృత్యంబు లిందుఁ జెప్పంబడె. వాని నన్నింటిని వ్రాసినం జాలస్థలంబు పట్టునని కొన్నిం టిని మాత్రము వ్రాసితిని. ఇంకను గొన్నింటిని క్రిందిరీతిని వ్రాయుచున్నాను.

ఇందు (శుక్రనీతిసారమున) రాజు లేవారికేని స్వత్వనివర్తనపూర్వకం బుగా భూమి నీరాదు గాని యిచ్చినఁ బుచ్చుకొన్నవారు జీవించునందాఁకనఁ దగునని యున్నది. ఇప్పటిదొరతనమువారు భూములఁ గొందఱకుఁ బుచ్చికొన్న వా రున్నంతకాలంబ కాక మఱికొన్నితరంబులదనుకను, మఱికొందఱకు శాశ్వ తంబుగను నిచ్చువాడుక గలదని వింటిని. మఱియు నిండ్లు కట్టుకొనుటకును, దోఁటలు వేయించుకొనుటకును, దేవాలయంబులకును రాజు తగినభూముల

భూదాననియమము.
పాంథశాలలు.

నీవచ్చునని యీగ్రంథమునఁ గాన్పించును. ఇప్పుడు నిట్లు తోఁటలకు నిండ్లు గట్టుకొనుటకును శాశ్వతముగా దొరతనమువారు భూముల నిచ్చుచున్నారు. ఇప్పుడువలె

మున్నును రాజధానులందును, దక్కినచోట్లను రాజమార్గముల వేయించి వానిని బాగుచేయించుచుండిన ట్లిందు నున్నది. మఱియు నప్పటిరాజులు రెండుగ్రామములకు నొకటియును బాంథశాల నిర్మింపించి దాని బాగుచేయించి యందొక్కయధికారిని నియమించుచుండినట్లు నాయధికారి మార్గమునం బోవువారివాహనంబులను శస్త్రంబులను బరీక్షించి వా రెక్కడనుండి యెక్కడకుఁ బోవుదురో యడిగికొని యాత్రికులంబుల నెఱింగి శస్త్రంబులఁ బుచ్చికొని లెక్కించి వారి నచ్చట నిద్రింపఁజేసి తలుపు మూసి తలారులచే రక్షించి ప్రాతఃకాలంబున మేల్కొల్పి వారల లెక్కించి యాయాయుధంబుల నిచ్చి పొలిమేరవఱకు గ్రామసేవకుల సహాయమిచ్చి పంపుచుండినట్లు నిందుఁ గాన్పించును. ఇప్పుడును నడవులుగల కొన్నిచోట్ల దూరగ్రామములమధ్యను బాటసారులసహాయార్థము కొందఱు రాజభటులును, శాలలు నున్నట్లు వింటిని. ఇప్పటిదేశాధిపతులువలె నప్పటివారును నానావిధములైన నౌకరులచే నన్ని కార్యస్థానంబులను గ్రామంబులను గాపాడుచుండినట్లు నిందుఁ జెప్పంబడె. ఏలిక తనదేశంబున నున్నవారు సేవకులందేని, దారపుత్త్రాదులందేని పరుషవచనంబులను నట్టిదండంబును గావింపరాదు. నూనికలు మొదలగువానియందును, నాణెంబులందును, మధుదుగ్ధఘృతాదులందును, రత్నసువర్ణాదులందును గూటంబు చేయరాదు. బలాత్కారంబుగ నేవారిచేత నేదియు వ్రాయించుకొనఁ గూడదు. చోరులు మొదలగువారిని, రాజవిద్వేషిని, నప్రకాశంబుగ రక్షింపరాదు. తండ్రి మొదలగుపూజ్యుల కగౌరవంబు గావింపరాదు. వికలాంగులకుఁ గీడు సేయరాదు. వాపీకూపంబులను మార్గాదులను బాధింపరాదు. స్వామిభృత్యులకు భార్యాభర్తలకుఁ బితృపుత్త్రులకు మఱియు నిట్టివారికి భేదంబు బుట్టింపరాదు. లంచంబు గ్రహింపరాదు. మనుష్యులయు, స్థావరంబులయు, గోగజాశ్వాదులయు, స్వర్ణరత్నాదులయు, మాదకద్రవ్యంబులయు, విషద్రవ్యంబులయుఁ, గ్రయవిక్రయంబులను, గ్రయపత్త్రాదులను, మద్యసంధానంబును, దత్తాపసంబును, వేటయు, శస్త్రధారణంబును, జూదంబును, నవీనసమాజనిర్ణయంబును రాజాజ్ఞ నొందక కావింపరాదనియుఁ, బరదారాభిమర్శనంబు, స్వామిద్రోహంబును, నిధిగ్రహణంబును, గూటసాక్ష్యంబును, ననృతవాదంబు మొదలగువానినొకప్పుడేని కావింపరాదనియు, నాసేవకులు కరంబుననేని శుల్కంబుననేని మఱి

సర్వసామాన్యధర్మములు.

రాజాజ్ఞనొందక చేయఁగూడని కార్యములు.

దేననేని దర్పాదులచే నేవారిని దిరస్కరింపరాదనియుఁ గుంచంబులు మొదలగు వానిని దూనికరాలను రాజముద్రాముద్రితంబులఁ జేసి ధరింపవలయుననియు నాఁబోతుల నెవ్వరేని విడిచిన వానిని వారు రక్షింపవలయుననియు, నెల్లవారు సద్గుణసంపాదనంబున నాసక్తులయి మనవలయుననియు, నాశాసనంబు విని దీనికి విరుద్ధంబుగఁ జరించువారిని మిక్కిలి దండింతుననియుఁ బ్రజలకుం దెల్పుచు శాసనంబుల వ్రాసి చదుకంబునఁ గట్టింపవలయుననియు నిం దున్నది. ఇందు మనుష్యుల నమ్ముటయేని, కొనుటయేని యిప్పుడు లేదు. స్వర్ణరత్నాదులను, గోగజాశ్వాదులను, దేశాధిపతులకుఁ దెల్పకయె యమ్మను గొనను బ్రజకు స్వాతంత్ర్యమిప్పుడు గలదు. అడవుల వేఁటాడను, మద్యపానంబు చేయ రాజాజ్ఞ నొంద నక్కఱలేదు. తక్కినవానిలో నావశ్యకమైనవానికి దృఢమైన శాసనములు గలవు.

**విద్యాభివృద్ధి.**

వాని నతిక్రమించినవారి నిప్పటిప్రభువు లా చట్టములనున్న ప్రకారము దండించుచున్నారు. రాజు తనదేశమునం దెల్లవిద్యలుం గళలు నభివృద్ధియగునట్లు చేయుచు వానియందుఁ గృతార్థులగు వారికిఁ దగినయుద్యోగము లీయవలయునని యిం దున్నది. ఇప్పటి ప్రభుత్వము వారును బెక్కుచోట్ల ననేకవిధము లగుపాఠశాలల నేర్పఱిచి, విద్యలం గళల నభివృద్ధిచేసి యందుఁ గృతార్థులగువారికిఁ దగినయుద్యోగముల నిచ్చుచున్నారు. రా జెంతదూరపువార్తనైన నొక్కదినంబునఁ దెప్పింపవలయునని యిం దున్నది.

**వార్తాహరణము.**

ఇప్పటిరాజులు తాము తెప్పించుకొనుటయే కాక యెల్ల వారికిని సులభముగ దూరదేశవార్త లంతకంటెఁ దక్కువ కాలమునన వచ్చునట్లు చేయుచున్నారు. రాజు లేఁటేటఁ దమ దేశమున సంచరించుచు, నధికారులచే రంజితులను బీడితులను గనుఁగొని, వారివ్యవహారంబులను న్యాయంబుగ విచారించుచు నధికారిపక్షపాతంబు మాని ప్రజాపక్షం బవలంబించి, పెక్కండ్రతో విరోధించిన యధికారులఁ దొలఁగించుచు, నన్యాయగామియైనమంత్రిని సయితము రహస్యంబున దండించుచుఁ, బలుమాఱ్లు చేసిన విడువవలయుననియు, నన్యాయవర్తు లయినరాజులరాజ్యంబును సర్వధనంబును హరించి యచట ధర్మాధికరణంబు నిల్పి మున్నటిరాజునకు నడవడిననుసరించి తగినభృతి యీవలె ననునది మొదలగు పెక్కంశము లీప్రకరణంబునఁ జెప్పి తరువాత నమాత్యాదుల నిట్లు చెప్పెను.

కార్యం బెంతయల్పంబయిన నొక్కనికి సుసాధంబు గాదన గొప్పదియగు దేశపరిపాలనం బట్టిదియని చెప్పనేల ? రా జెంతచదివినవాఁ డయ్యు నెంతయా లోచింపఁగలవాఁ డయ్యు మంత్రులను వదలి కార్యచింత చేయఁదగదు. స్వతం త్రుం డగురా జనర్థంబు నొందుఁ గావునను, వేఱువేఱు పురుషులందు బుద్ధివై భవంబు వేఱువేఱుగఁ గాన్పించుఁ గావునను వ్యవహారంబులు వివిధంబులు గావున, నొక్కనికిం దెలియ నశక్యకంబు గావునను బ్రాజ్ఞుం డగురాజు రాజ్యాభివృద్ధికై సభ్యుల, నధికారులఁ, బ్రకృతులను వరియించి యెల్లకార్యంబుల వారిసహాయం బునఁ జేయుచుండవలయు. శూరులు, హితోపదేశ కుశలులు, నాయాసంబున కోర్చువారు, కుమార్గంబునం బోవురాజును సయితము తమబుద్ధిబలంబున నుద్ధ రింపఁగలవారు, సన్మార్గాసక్తులు, సోమరులుగానివారు, జీవితంబునన సంతసిల్లువారు, కామక్రోధాదులులేనివారు,

సేవకులు.

దయాళురు, దృఢాంగులు, ధర్మరతులు, పరోపకారనిరతులు, రాజకార్యంబును దమకార్యంబుకంటె జాగ్రత్తగఁ జేయువారు, మఱియు సద్గుణంబులుగలవారు, సుసేవకులు. నాస్తికులు, జూదరులు, నాయంబుకంటె హెచ్చువెచ్చించువారు మొదలగువారు సుసేవకులు గారు. యువరాజు నమాత్యగణంబును రాజునకు దక్షిణవామభుజంబులుఁ గర్ణనయనంబులును. వారులేని రాజు లాయాయవయ వంబులు లేనివారువలె నగుచురును గాన బాగుగ విచారించి వారి నేర్పఱుపవల యును. రాజు ధర్మపత్నియందు జన్మించినపుత్త్రునికేని నతఁడు లేనియెడఁ దమవాతి దగ్గఱచుట్టమునకేని ధనుర్విద్యాదుల నేర్పించి నీతికుశలులం జేసి యమాత్యాదులచే శిక్షింపించి యౌవరాజ్యచిహ్నముద్రా ధికారంబునఁ గాక తక్కినరాజ్యకృత్యంబుల నియోగించి

యువరాజు.

యెల్లసుఖములం దన్పుచు మిగుల జాగరూకుండయి కాపాడవలయు. యువరాజు సంపన్మదంబునఁ దల్లిదండ్రులను సోదరులను దక్కినరాజభక్తులను రాజ్యము నందలిమహాజనులను నవమానింపక తండ్రియాజ్ఞ నేకార్యంబున నతిక్రమింపక, తనకార్యంబు ప్రతిదినంబు రాజునకు విన్నవించుచుండవలయు. ఇట్టివాఁడు శుక్లపక్షచంద్రుఁడువలెఁ గ్రమంబున నభివృద్ధిం జెంది రాజ్యంబు నొంది సుసహా యుండయి యమాత్యాదులతో సుఖంబుగఁ జిరకాలంబు భూమిం బాలించు. పురోధసుండు, ప్రతినిధి, ప్రధానుండు, సచివుఁడు, మంత్రి, ప్రాడ్వివాకుఁడు,

పండితుఁడు, సుమంత్రుఁడు, నమాత్యుఁడు, దూతుండు ననువారు పదుండ్రు రాజులకుఁ బ్రకృతులు. కొందఱి మతంబున నిందు దూతుండును బురోధయు విడువంబడిరి. వీరు భృతియందు సమానులు గావలయు. రా జెవ్వరికి వెఱచి చెడుమార్గంబునఁ బోకుండునో యట్టివారు మంచిప్రకృతులు. ఎవ్వరియాలోచనంబున రాజ్యంబును బ్రజయు సేనయుఁ గోశంబును రాజన్యుని సుచరితంబును వృద్ధిఁజెందవో, మఱెవ్వరిసహాయంబున శత్రునాశంబుగాకుండునో యట్టి ప్రకృతులవలనం బ్రయోజనంబు లేదు. కర్మపరుండు, ధనుర్వేదవిదుండు, వేదవేదాంగంబుల నెఱింగినవాఁడు, తనకోపంబున రాజునేని భయపఱచి ధర్మరతుం జేయువాఁడు పురోధ గావలయు. కార్యాకార్యంబుల నెఱింగినవాఁడు ప్రతినిధి. సర్వదర్శి ప్రధానుండు. సేనావిజ్ఞానంబు గలవాఁడు సచివుఁడు. నీతివిద్యాకుశలుండయి సామాదిప్రయోగంబులు దెలియువాఁడు మంత్రి. ధర్మతత్త్వంబు నెఱింగినవాఁడు పండితుఁడు. దేశకాలజ్ఞుఁ డమాత్యుఁడు. లోకశాస్త్రనయజ్ఞుండయిన న్యాయాధికారి ప్రాడ్వివాకుఁడు. ఆయవ్యయంబుల నెఱింగినవాఁడు సుమంత్రుఁడు. వీతభయుఁడగు షాడ్గుణ్యాదుల నెఱింగినవాఁడు దూత. (వీరి విశేషలక్షణంబులు మూలగ్రంథమునఁ జూడందగు)

ప్రకృతులు.

రాజు వీరి నప్పుడప్పు డొకనిపనికి నొక్కని మార్చుచు, నొక్కొకకార్యంబున మువ్వుర నియమించి, యందొకని ముఖ్యుని నిద్దఱదర్శకులను జేయుచు, మూఁడేని యైదేనియేడేని పదియేని వత్సరంబులు వారికార్యనైపుణ్యంబు పరికించి మార్చుచుండవలయు. అధికారమదంబున మోహింపనివారు దుర్లభులుగాన నెట్టివానినే నొక్కయధికారంబునఁ జిరకాలం బుండనీక వానిపదంబునఁ దర్వాతి సేవకునేని గుణవంతుఁడయిన వానిపుత్త్రునేని మఱొక్కనినేని నిల్పి క్రమక్రమంబుగ నుత్తమపదంబు నొందినవానిని మంత్రపదంబున నిల్పునది. మఱియు సేనలకు, నారామంబులకు, గృహంబులకు, ధాన్యాదులకు నాయాయివస్తువుల నెఱింగినవారి నధిపతులఁగావించి, యెల్లకార్యంబులను గుణశీలాదులవలె జాతికులంబు లేనాఁటను బూజ్యంబులు గావు గాన, వానిని బ్రధానంబుగాఁ జూడక సుగుణులను సుశీలురను రాజు నియోగించుచుండవలయు. మఱియును, సువర్ణాదులను, మణులను, సంగ్రహించి రక్షించుచు, నేవిధంబయిన పన్నును రాకున్నను నిరువదియేండ్లు దండును దన్నును గాపాడునంత ధనంబుఁ గోశంబున నిల్పుచు, మూఁడేండ్లు తనను సేనలను గాపాడునంతటి ధాన్యంబును, గార్యసాధకంబులయిన యెల్లద్రవ్యంబులను సంగ్రహించి తాఁదురక్షించుచుండవలయు.

ఇది యువరాజాది లక్షణసంగ్రహము. మఱియునిందు సేవకులకు జీతమిచ్చుచు, సంవత్సరమునకుఁ బదియునైదుదినములు రాజు సెలవీవలయునని యున్నది. ఇప్పటియధిపతులు నెలరోజు లిట్లిచ్చుచున్నారు. నలువదియేండ్లు క్రమంబుగ నధికారమున నున్నవానికి జీతములో సగముపకారవేతనము జీవించు నంతకాలము నీయవలయు ననునేర్పాటిందుఁ గలదు.

జీతములు, ఉపకార వేతనము.

ఇప్పటిప్రభుత్వమువారు నిరువదియైదేండ్లు పనిచేసినవానికిని నట్లిచ్చుచున్నారు. మఱియును బదియేండ్లకుఁదర్వాత సేవచేయలేక మానుకొన్నవానికి నేదియో కొంతయుపకారవేతన మిచ్చుచున్నారు. మృతినొందినతర్వాత నక్షముఁడగు కొడుకేనిఁ గన్యయేని సుశీలయగు భార్యయేని నున్నవాని వేతనంబున సగమీవలయునను నేర్పాటీగ్రంథమునఁ గాన్పించును. అయిదేండ్లుపనిచేసిన సేవకుఁడు రోగార్తుఁడయ్యెనేని మూఁడుమాసములు మూఁడువంతులు జీతమిచ్చుచుఁ జిరకాలము వ్యాధిపీడితుఁడయ్యెనేని నాలుమాసము లట్లిచ్చుచు తేఁడు సెలవిచ్చువాడుక యున్నట్లును సద్గుణసంపన్నుఁడైనసేవకుఁడు రోగియైన సగము జీతము నెప్పుడు నిచ్చునట్లును నిందుఁ గాన్పించును. ఇప్పటివారైదేండ్లని నియమము లేకుం

సెలవులు.

డనే కొలఁదికాలము పనిచేసినసేవకుఁడైనను రోగపీడితుఁడయ్యెనేని సగముజీత మిచ్చుచు నాలునెలలే కాక యింకఁ గొంతకాలము సెలవిత్తురని తెలియుచున్నది.ఒకవారమైనయెడల రోగికి వేతనం బేకొలఁదియును దక్కువచేయరాదని యిందున్నది. ఇప్పుడుసంవత్సరమునకు వారముకాదు రెండు వారము లప్పుడప్పుడు రోగమున్నను లేకున్నను సేవకుఁడు భృతిగ్రహించుచు సెలవు పుచ్చుకొన నర్హుఁడు. మఱియు నీప్రభుత్వమువారు పదియేండ్లు పనిచేసిన వారికినొక్కయేఁడు సగముజీతమిచ్చుచు సేవనికడిగినను సెలవిత్తురు. మునుపటి రాజులు పండుగుదినములును శ్రాద్ధదినములును వదలి తక్కినరోజుల నింటిపనులు చేసికొనుటకై పగలొక్కజామును రాత్రి నిద్రింప మూఁడుజాములును విడిచి తక్కిన యెల్లకాలమందు సేవకులచేఁ బనిచేయించిరి. ఇప్పుడు మనకుఁ దెలిసిన పండుగులకుఁగాక యెన్నియోపండుగులకు సెలవిత్తురు. మఱియు నీదొరతనము వారు సాధారణముగాఁ బగటిలో సగముకంటె నెక్కువకాలము పనిచేయనీయరు. రాత్రులు బొత్తిగాఁ బనిలేదు. కొందఱుద్యోగులకు దినమున నైదుగంటలే పని చేయవలయు నన్నయేర్పాటు నిప్పుడు గలదు. స్వామికార్యంబున హతుండయిన

వానికుమారునకు బాలుఁడై యున్నంత కాలము జీతమిచ్చి రక్షించుచు వానికి వయసువచ్చిన తర్వాత వానిగుణంబులంబట్టి జీతమేర్పఱుపవలెనని యున్నది. ఇప్పటివారట్లుకాక యీవిషయమున నెవ్వియో మంచియేర్పాట్లు చేసిరని తెలియవచ్చుచున్నది.

## భూమిపన్నులు.

భూమిపన్నులు.

నదీ మాతృకలైన భూములకుఁ బండినపంటలో సగమును, వాపీకూపతటాకాదుల వలనంబండినవానికి ఫలములో మూఁడవపాలును, వర్షాధారము సంబండినవానికి నాల్గవయంశంబును, రాతినేలలకుఁ జౌటినేలలకు నాఱవభాగంబును, మున్పటిరాజులు పుచ్చుకొన్నట్లిందుఁ గాన్పించును. ఇప్పుడీయీభూముల కిన్నవవంతు పన్ను పుచ్చుకొనుచున్నారని నేఁ జెప్పఁజాలనుగాని కాల్వలయాధారమునఁ బండువాని కెక్కువగను, దక్కినవానికిఁ దక్కువగను వ్యవసాయముచేసినవానికి నష్టములేకుండఁ బుచ్చుకొనుచున్నారని తెలియును. మఱియు నేభూములకైనను స్థితి (తరము) ననుసరించి పన్ను పుచ్చుకొనుచున్నారని తెలిసినది. ఇప్పటిరాజులు నదులబంధించి యనేకభూములకుఁ గాల్వలుఁ జెఱువులు మొదలగువానిం ద్రవ్వించి మిగుల దూరమువఱకు నీరు ప్రవహింపఁజేసి, చేసినంతటియుపకారము నాఁడు చేసినట్లు కాన్పింపదు. మఱియునింక దీనభేదములున్నట్లు నెట్టులేనికర్షకులకు లాభంబు గల్గునట్లు పన్నుగ్రహింపవలసినట్లు నిందుఁగాన్పించును. మఱియుఁ గుటుంబమునకుఁగాక వ్యవహారార్థ మేకొలఁదిధాన్యాదివస్తువులంగొన్నను, గొన్నవానినుండి వెలననుసరించియు, నమ్మినవానినుండి లాభముననుసరించియు, ముప్పదిరెండవయంశమేని, రాజభాగమని యిందున్నది. మఱియుఁ గొన్నవెలకంటెఁ దక్కువవెలకుఁగాని సమానమూల్యమునకుఁగాని యమ్మువానినుండి [illegible]ది గ్రహింపరాదనియుఁ, దనదేశమున దీనినొక్కసారియె రాజుగ్రహింపవలెననియు నున్నది. దేశాంతరమునకుఁ గొనిపోవుసరకులకును విదేశములనుండి వచ్చుసరకులకు నేమిపన్ను గలదో నాకుఁ దెలియదుగాని దేశమధ్యమునఁ గొనువానికీపన్నిప్పుడు లేశమును లేదు. కాని యాదాయపుఁ బన్నని యొకటి గలదు. అది యేటికి వేయిరూపాయలకంటె నధికలాభముగలవారినుండి యేటికిరువది రూపాయలిప్పటిరాజులు పుచ్చుకొందురని తెలిసినది. ఆ పన్నుసయితము క్షామము వచ్చినప్పుడు పేదల కుపయోగించు

సుంకము.

నిమిత్తమేర్పడినదని తెలియుచున్నది. మఱియునిందు (శుక్రనీతిసారమున) వడ్డి వ్యాపారముచేయువారివలన రాజు ముప్పదిరెండవయంశము పన్నుపుచ్చుకొనవలయుననియునున్నది. అడవినుండి కట్టెలు మొదలగువానిఁ దెచ్చుకొనువారివలన నిరువదవభాగము నప్పటిరాజులు గ్రహింపవలయు నట్లీగ్రంథమునం జెప్పంబడె. ఇప్పుడు నీయాటవికద్రవ్యములను దెచ్చుకొనువారికి మిగుల స్వల్పముగ నేదియో పన్నున్నదని తెలియవచ్చుచున్నది. మున్ను గోవులయు, నశ్వములయు, మేఁకలయు, గొఱ్ఱెలయు వృద్ధిలో నెన్మిదవయంశము గ్రాహ్యమైనదనియును, మఱియు గోవులు, గేదెలు, గొఱ్ఱెలు మొదలగువానిపాల నింటి కుపయోగించువారివలనఁగాక తక్కినవారివలనఁ బదియునాఱవభాగము రాజగ్రాహ్యమైనదనియు నిందుఁజెప్పంబడె. ఇప్పుడీపన్నులు రెండును లేవు. మున్ను వడ్రంగులు మొదలగువారివలన నెలకు రెండురోజులూరక పనిచేయించుకొన్నట్లిందున్నది గాని యిప్పటివారట్లు చేయించుకొనునట్లు లేదు.

గనులనుండి తీయువజ్రము మొదలగువానియందును బంగారునందును సగమును, వెండిని మూఁడవభాగమును, రాగికినాల్గవభాగమును, లోహంబునందును వంగసీసంబులందు నాఱవపాలు, క్షారంబులం దర్ధంబును వ్యయశేషంబున రాజు గ్రహింపవలయునని యిందున్నది. ఇప్పటివారిట్లు పుచ్చుకొనక గనులుగల భూములను వేలము వేయుదురని కొందఱవలనను,

గనులపన్ను.

సంవత్సరమునకింతసొమ్మని, యేర్పాటుచేసి యాభూములకుఁ బన్నుపుచ్చుకొందురని కొందఱవలననువింటిని. కాని నిశ్చయముగాఁ దెలియంజాలను. మఱియునాఁడు గృహములుకట్టుకొన్న భూములకును, నంగడిభూములకును, వ్యవసాయపుభూమికింబోలెఁగరము గ్రహించినట్లిందున్నది. ఇప్పటియేలిక లిట్లిండ్లుకట్టుకొన్న భూములకుఁబన్ను పుచ్చుకొనుట లేదు. కాని యంగడి భూములకుఁ గొన్నిచోట్లఁ బన్నుపుచ్చుకొనుచున్నారు. త్రోవను సంస్కరించి రక్షించుటకు మార్గగులవలనఁ బన్నుమున్ను పుచ్చుకొనుచుండిరని దీనం దెలియును. ఇప్పుడు త్రోవనడుచువారందఱవలనఁ

బాటపన్ను.

బన్నుపుచ్చుకొనుట లేదుగాని యీపనులకై భూములమీఁదనే కొంతపన్ను పుచ్చుకొనుచున్నట్లు తెలియుచున్నది. మఱియు మార్గమునం బోవు బండ్లు మొదలగువానికి వేఱుగాఁ గొంతపన్ను పుచ్చుకొనుచున్నారు. రత్నంబులకు శ్రేష్ఠంబులగు వస్తువులెల్ల రత్నంబులు గావున వానికిని దేశకాలా

రత్నాదుల వెలలు.

నుసారముగా మూల్యము రాజు నిర్ణయింపవలసినట్లిందుఁ గాన్పించును. కాని యిప్పటిరాజు లిట్లేర్పఱుచుచున్నట్లు తెలియలేదు. మఱియు నిందు గోగజాశ్వాదులకు వానిగుణంబుల ననుసరించి వెలలు చెప్పంబడినవి. వజ్రములు మొదలగు వానిలోఁ బెక్కింటికిఁ దూనికనుబట్టి మూల్యము నిర్ణయింపఁబడినది. బంగారు మొదలగువానికిని వెలలిందుఁ జెప్పఁ బడినవిగాని వానికి నిప్పటి వెలలకు వ్యత్యాసము గాన్పించును.

మఱియు నీనీతిశాస్త్రమున మిత్రామిత్రలక్షణంబులును రాజు సేవకుల నెట్లు పరీక్షింపవలయునో యేయేకార్యంబుల నెట్టెట్టివారి నియోగింపవలయునో యనునంశమును, వారి జీవితభేదంబులు మొదలగునవియుఁ జెప్పంబడె. ఇందు నాఁడువారికిఁ బొరుగింటికిఁబోవుటకు సయితమనుజ్ఞ యీఁగూడదని చెప్పంబడెఁ గానియిప్పటి ప్రజలకుఁబెక్కండ్రకిది సమ్మతముగాదు. రాజు గ్రామంబులందుఁ బురంబులందును గ్రామాధికారిని, సుంకముబుచ్చుకొనువానిని, బన్నువసూ

గ్రామాధికారులు.

లుచేయువానిని, సాహసాధిపతిని (తప్పుచేసినవారి దండించునధికారిని) లేఖకునిఁ (కరణమును) దలారిని నేర్పఱుపవలెనని యిందున్నది. ఈయేర్పాటిపుడునున్నది గాని కొంత భేద మున్నట్లు గాన్పించును. ఇప్పుడున్న వానింబోలినవో కావో నేఁ జెప్పంజాలను గాని నాళికమను పేర

తుపాకులు మందు.

తోఁ దుపాకులును వానిభేదంబులు వానియందుపయోగించుమందు,గుండ్లు మొదలగువాని స్వరూపము నిందుఁజెప్పంబడె. మఱియునభియోగంబుల స్వరూపంబులును రాజేని రాజుచే నాజ్ఞాపింపఁబడినవారేని వానివిచారింపవలయు రీతియు, రాజేయపరాధంబుల నెవ్వరుచెప్పకున్న ను చేసినవారిం దెలిసికొని దండింపవలయు సాక్షులెట్టివారు గావలయు నెట్టివారిచే వ్రాయంబడిన లిఖితంబులు చెల్లునవి యెంతకాలము చెల్లునను విషయమలో లిఖితభేదములు వానివ్రాయువిధంబులు మొదలగు నంశంబులు, నే యపరాధంబు నెట్టి వారి నెట్లు శిక్షింపవలయు, రాజువ్యవహారంబుం బరిశీలించునప్పు డెట్టిగుణములు

వ్యవహారదర్శనము.

గలవారిని యోగింపవలయు, నేనేరంబులఁ బ్రతినిధి (ప్లీడరు) గాక యపరాధంబు చేసినవార వివదింపవలయు, సభ్యులెట్టివారు గావలయుఁ బ్రతినిధి కెట్టి తగవుల నెంతసొమ్మీవలయు, నాహూతుండై రానివానినేమి చేయవలయును, ఏతగవులు నిరాబాధంబులు, ఏతగవులవాది ప్రతివాదులలో నేరు ముందు తమపక్షంబు స్థిరపఱుచుకొనవలయునది మొదలగు

సంశంబులు విస్తరముగఁ జెప్పంబడె. మఱియు రాష్ట్రస్వరూపంబు దుర్గస్వరూపంబును వానిభేదంబులు మొదలగునవి మిక్కిలి చెప్పంబడె. మఱియు నిప్పటి యట్లు మునుపును నరణ్యంబున వృక్షంబులు పెంచువాడుక యున్నట్లిందుఁ జెప్పంబడె. ఇంకను గళలయు విద్యలయు స్వరూపంబులిందు విస్తరించి చెప్పంబడె. మఱియు జనులెవ్వరియెడ నెట్లు ప్రవర్తింపవలయు నెవ్వరిఁదప్పక రక్షింపవలయు నది మొదలగు నంశంబులు రాజసేవకులు నిద్రనుండి లేచినది మొదలు సాయం

వివిధవిషయములు.

కాలమువఱకు నేమేమిచేయవలయు రాజకార్యంబులెట్లు చేయవలయు రాజసమ్ముఖమున కెట్లు పోవలయు వారితో నెట్లు సంభాషింపవలయుననునది మొదలగు నంశంబులును మిక్కిలి విస్తరించి చెప్పఁబడె. ఆయవ్యయాదు లెట్లువ్రాయవలయు వానినెవ్వరెవ్వరు పరికింపవలయునను నంశమును, జాతుల స్వరూపంబును, వానిధర్మంబులును నిందుఁ జెప్పఁబడె.

మఱియు నిందు దేవాలయంబుల భేదంబులును వానింగట్టు ప్రకారంబును నందలి ప్రతిమల స్వరూపపరిమాణంబులును వానిభేదంబును వానివాహనంబుల రచించు ప్రకారంబును నిరూపింపఁబడె. గుఱ్ఱములలక్షణంబులును వానిశిక్షా ప్రకారంబులు మఱివానితో సంబంధించిన యనేకవిషయములు చెప్పంబడె. ఇంకను బెక్కంశములిందుఁ గలవుగాని గ్రంథవిస్తరభయంబున వ్రాయనైతి.

'ఇందు' నను సర్వనామ మీ యుపన్యాసమునఁ బెక్కుచోట్ల 'శుక్రనీతి సారమున' ననుదానికి బదులుగా నుపయోగింపఁబడెను.

పురాణ పండా - మల్లయ్యశాస్త్రి.



శ్రీరస్తు.

# శ్రీమహాభారతాంధ్రీకరణ విమర్శనము.



శ్రీమన్నారాయణాపరావతారమని ప్రసిద్ధి వహించిన వేదవ్యాసుఁడు ధర్మార్థకామ మోక్షప్రదంబగు శ్రీమహాభారతమను పంచమవేదమును నిర్మించి దానిం ద్రిజగంబుల వెలయించి సకలజనోపయోగంబు గావించె. అట్టి మహాభారతము నిజప్రశస్తింబట్టి నిఖిలభాషలయందు నవతరణము నొందినది. దానిని నన్నయ తిక్కనెఱ్ఱాప్రెగ్గడలను ముగ్గురు కవితల్లజులు తెలిఁగించి యున్నవారు. అందు నన్నయభట్టారకుండు రాజమహేంద్రసంస్థాన కవియై యిప్పటి కించుమించు 830 సంవత్సరముల క్రిందట నాది సభాపర్వములు నరణ్యపర్వమున సగమును దెనిఁగించి కాలధర్మము నొందె. అంత దాదాఁపు 200 సంవత్సరములకు నెల్లూరు మండలమున మనుమభూపతికడం గవియై సోమయాజియైన తిక్కన యిప్పటికి రమారమి 650 వర్షముల క్రిందట విరాటపర్వము మొదలుకొని స్వర్గారోహణపర్వము వఱకునైన పదునేనుపర్వములు దెనిఁగించి 1198 కాలయుక్తి వత్సరాశ్వయుజ శుద్ధపూర్ణిమా దినంబునఁ బరమపదంబు నొందె. అంత 100 హాయనములకు 1369 లోపుననే నెల్లూరుమండలమునఁ గందుకూరునం జేరిన గుడ్లూరున నెఱ్ఱాప్రగడ జనించి యిప్పటికి సుమారు 550 యేఁడుల క్రిందట నన్నయ భట్టారకుండు తెలిఁగింప మిగిలిన యారణ్యమును దెలిఁగించి కృతార్థుఁడయ్యె. ఇట్లు మొత్తము మున్నూరు సంవత్సరములకు భారతము పూర్ణముగాఁ దెలిఁగింపఁబడి విరాజిల్లుచుండె. అట్లు భారత మాంధ్రీకరించి మూర్తిత్రయంబు నా నొప్పు కవిత్రయముయొక్క చరిత్రము సమగ్రముగ నిదివఱకె మాచదువరు లెఱింగియున్నవారు కావున నావిషయమిట విడిచి వారివారి యాంధ్రీకరణాదికముం గూర్చి యించుక విమర్శించి వ్రాయుచున్నాఁడను. మూర్తిత్రయాంధ్రీకృతమైన యప్పంచమవేదము (భారతము) సకలాంధ్ర ప్రపంచమునకును బ్రమాణలక్షణ గ్రంథమై నానారసాలవాలంబై:—

"శా॥ ఆయుష్యంబితిహాసవస్తు సముదాయం బైహికాముష్మిక।
శ్రేయఃప్రాప్తి నిమిత్తముత్తమ సభాసేవ్యంబు లోకాగమ।
న్యాయైకాంతగృహంబునాఁ బరఁగి నానావేద వేదాంతవి।
ద్యాయుక్తంబగు..."

అని ప్రఖ్యాతిఁగాంచి నిర్దుష్టమై కొన్నివందల సంవత్సరములనుండి మన దేశమున వన్నెకెక్కియున్నదనుట సర్వలోకవిదితము గదా! అట్టి యుత్తమ గ్రంథము నొదలసిడికొని దేవునిఁ బూజించినట్లు పూజింపవలయును కాని విమ ర్శించుటకుం దొడంగుట యెట్టివారికిం దగదని చెప్పునప్పుడు కించిజ్ఞుఁడనగు నేను దానింగూర్చి చర్చించుటయుఁ గేవల మనభిజ్ఞతయయని ముమ్మాటికిం జెప్ప వచ్చును. అయినను భాషావిషయమందుఁ జర్చించుట కెట్టివానికిని స్వాతం త్ర్యము కలదు. ఎట్టివారికిని గుణదోషములుండి తీరును. భారతకవులు మూ వురును గొన్నిచోట్ల మూలములోని కథలు సంగ్రహించియుఁ బెంచియు మా ర్చియుఁ జేర్చియుఁ దారుమారుచేసియుఁ దీసివేసియు యథేచ్ఛముగా గ్రంథ రచనచేసియున్నారు. కావున నాకాయాసందర్భములం దోఁచినట్లు చర్చించి వ్రాయుట పనియయ్యె. నక్క యెక్కడ దేవలోకమెక్కడ నన్నట్టు లో యన్న, నా రాని వీఁడెక్కడ ? నన్నయ తిక్కనాదుల కవిత్వమును విమర్శించు టె క్కడ? అని నిరసింపక నావ్రాసినదానిలో నెందేని యించుక గుణమున్నచో గ్రహింపుఁడు లేదేని యిది యిట్టిదని చెప్పి నాసందియములందీర్ప ననుగ్రహింతు రని పెద్దలం బ్రార్థించుచు నింకఁ బ్రస్తుతమునకు వచ్చుచున్నాఁడను.

## నన్నయ భట్టు.

వేదవేదాంగవేత్తయై శాస్త్రాధ్యయనముచేసి జపహోమ తత్పరుండై బ్రహ్మాండాది నానాపురాణార్థము లెఱింగి రాజరాజ నరేంద్రుని పురోహితుండై రాజమహేంద్రవరమునను్న స్మార్తవైదిక బ్రాహ్మణుండు, కవిత్వములేని కాల మున వాల్మీకి రామాయణమును జేసినట్లు తెలుఁగు కవిత్వములేని కాల మున నితఁడు భారతమును దెలిఁగించెనని కొందఱు చెప్పుదురు. శ్లోకరూప కవి త్వము లేనప్పుడు వేదంబులందలి యుక్తానుక్తాదిచ్ఛందంబుల ననుసరించి వాల్మీకి రామాయణమును జేసియుండునుగాని నన్నయభట్టునట్లు చెప్పుటకువలను పడదు. తత్పూర్వమే ప్రబంధకవులు కొందఱుండిరనుటకుఁ బ్రబలకారణములు న్నవి కాని లేకపోలేదు. నన్నయభట్టు కర్నాటపండితుఁడును, ధనఘు సహా

ధ్యాయియునగు నారాయణభట్టు తోడ్పాటునఁ గన్నడమునుండి కొన్ని యక్కరలు మొదలగునవి తెలుఁగున వ్రాసియుండవచ్చును. నారాయణభట్టు కన్నడభాషలో భారతమును వ్రాసియున్నాఁడు. అందలిపద్యములం బోలిన పెక్కుపద్యములు తెలుఁగుభారతమున నున్నవి. నేనొక సందర్భమున నిట్లు వినఁగలిగినవాఁడనైతిని. నన్నయభట్టునకుఁ బూర్వము తెలుఁగు కవులు లేరనుట సాహసము. ఇపుడిపుడు నన్నయపూర్వకవిత్వము బయటఁబడి శ్రోత్రపేయంబగుచున్నది గదా. తెలుఁగు, ద్రావిడకర్ణాటాది నానాభాషల సాంకర్యంబున నయినది. మూఁడు నాలుగు వేల సంవత్సరములకు మున్ను మంచి తెలుఁగుభాషయే లేదనుట నిశ్చయము. నన్నయకుఁ బూర్వమీభాష రెండు వేలయేండ్లనుండి వ్యాపకమును బొంది యున్నది. దానికిమున్నే పెక్కురు వ్యాకరణములను జేసి గ్రంథములు వ్రాసి యుందురు గాని నన్నయభట్టే, భాషనుసంస్కరించి భారతము చేసినాఁడనుట విశ్వాసపాత్రముకాదనుటయే సమంజస మని నాయభిప్రాయము. కానియతఁడు దానికిఁగొంత వ్యాపకమును గలిగించినాఁడు. ఈ యర్థము నన్నయభట్టు చెప్పిన యీక్రిందిభారతపద్యమువలన స్పష్టపడుచున్నది. చిత్తగింపుఁడు.

క. జననుతకృష్ణద్వైపా। యనమునివృషభాభిహిత మహాభారతబ
ద్ధనిరూపితార్థమేర్పడఁ। దెనుఁగునరచియింపు మధికధీయుక్తిమెయిన్

ఇదిరాజమహేంద్రుఁడు కవిని గూర్చిపలికినది. తత్పూర్వము తెలుగుకవిత్వమే లేకున్నచోఁదెలుఁగునకు లక్షణము వ్యాకరణమును బుట్టించి భారతము రచింపుమని చెప్పును. అట్లు చెప్పక యిట్లు చెప్పుటచేతఁ దెలుఁగుకవిత్వము తత్పూర్వమున్నదనియే యూహింపవచ్చును. మఱియు రాజిట్లు చెప్పిన నతండు "విద్వజ్జనంబుల యనుగ్రహంబునం జేసి నా నేర్చినవిధంబున నిక్కావ్యంబురచించెద." అనిచెప్పెనుగాని తానైనఁ గ్రొత్తకవిత్వము పుట్టింపవలసియున్నట్లు చెప్పలేదు. విద్వజ్జనంబుల యనుగ్రహమనుటచేఁ దెలుఁగులో నన్నయకు మించిన విద్వాంసులపుడుండిరనియే యూహింపనగు. మఱియును నన్నయభట్టారకుఁడు: —

ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకవితార్థ యుక్తిలో
నారసిమేలునానితరులక్షర రమ్యతనాదరింపనా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్మహా
భారతసంహితారచనబంధురుఁడయ్యె జగద్ధితంబుగన్॥

అని చెప్పి గ్రంథము ప్రారంభించినాఁడు. దీనివలనను దత్పూర్వము తెలుఁగు కవీంద్రులుఁ గవిత్వమునున్నదని తెలియనగు.

నన్నయభట్టారకుని కవిత్వము.

సీ. ముత్యాలకోవనా నత్యంతమమరెసు మృదుశబ్దజాలంబు పదిలపఱచి।
మొదలువెట్టెనఁ దుట్టతుదదాఁకఁ గమ్మెచ్చునందీఁగనాసాగి నడువఁజేసి
జాతియు రీతియు శయ్యాపాకంబును శైలియులీలమై జతనుపరచి।
యావంతయరసిశే నర్థభావంబులు దేటతెల్లంబుగాఁ దెలియఁజేసి।

తే. తగునలంకారములు వెట్టి సొగసుమీఱ।
నవరసంబులు చిప్పిల నవనవముగఁ।
గల్పనలుచేయుచును జీవకవితఁగూర్పఁ।
గలుగుకవినిమెచ్చనివారు గలరెజగతి॥"

అని కలభాషిణీనాటకములోఁ జెప్పినట్లు నాతికఠిన మృదుమధురశైలిం దగిలి రసభూయిష్ఠమై శ్రవణరసాయనంబుగ నుండును. పద్యము ప్రారంభించి నచో నిరర్గళమహాప్రవాహమువలెంబరుగెత్తునుగాని నట్లుగొట్టదు. అనుటకు భారతములోని:—

"మ. మదమాతంగతురంగకాంచనలసన్మాణిక్యగాణిక్యసం।
పదలోలింగొనివచ్చి యిచ్చి ముదమొప్పంగాంచి సేవించిర।
య్యుదయాస్తాచల సేతుశీతనగమధ్యోర్వీపతుల్ సంతతా।
భ్యుదయుఁ ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణప్రతాపోదయున్."

ఈపద్యము సాక్ష్యమిచ్చుచున్నది.

నన్నయ కవిత్వమందు మొత్తముమీఁద మూఁడువంతులు సంస్కృత పదంబులు నొకవంతు తెలుఁగుపదములు నుండును. సామాన్యముగా నిరర్థక ములయిన పదము లుపయోగింపఁడు:—

"క. ఆమూఁడు పర్వములలో।
నామాన్యుఁడు నుడువుతెలుఁగు లరసికొనికృతుల్।
దామురచియించి తిక్కన।
ధీమణి మొదలైనతొంటితెలుఁగు కవీంద్రుల్.

(అప్పకవీయము.)

అని మెప్పునకుఁ దగినట్లు తెలుఁగుపలుకు లితఁడు తనభారతమునఁ గుప్పించినాఁడు. నన్నయభట్టు మృతుఁడైనవెనుక నప్పటిరాజొకఁడు భారతశేషమాత్రయుఁ దెలుఁగున వ్రాయింప నెంచి యెవ్వఁడు సమర్థుఁడోయని:—

"ఉ. నిండుమనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణా।
ఖండలశస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్కమీ।
రెండును రాజులందు విపరీతముగాఁ బుర విప్రుఁడోపునో।
పండితశాంతుఁడయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మరింపఁగన్."

అను పద్యమును వ్రాసి దేశదేశములకుఁ భటులనంపె నఁట. తిక్కనసోమయాజిచూచి మరలనొక యాకుపై నా పద్యమే వ్రాసి దానికి వర్ణము వేసి పంపెనఁట. రాజును దానిం దిలకించి నన్నయకు నన్నయయే సాటియనియు సతనికిఁ గొంతవన్నెఁ బెట్టుదుననియుఁ గవియభిప్రాయమునుఁ యుత్సాహించి తిక్కనచే భారతము పూర్తి చేయించెనని చెప్పుదురు. ఈ కథయందు సత్యమున్నను లేకున్నను "నిండుమనంబు" అను పద్యమునుబోలిన పద్యమును రచించుట సులభముకాదని యూహింపవచ్చునుగదా! ఈ పద్యమంతకును మూలములో:—

"యథానవనీతం హృదయం బ్రాహ్మణస్యవాచి క్షురో నిశిత స్తీక్ష్ణధారః।
తదుభయమేతద్విపరీతం క్షత్రియస్య తదేవంగతేన శక్తోహం తీక్ష్ణహృదయత్వాత్తం శాప మన్యథాకర్తుం గమ్యతాం॥

ఇట్లున్నది. దానికిట్లు వ్రాసియున్నాఁడు. మఱియు నితని కవిత్వమందు మంచి మంచి కల్పనలు నుపమోత్ప్రేక్షాద్యలంకారములు శబ్దచిత్రార్థచిత్రంబులును గలిగి ద్రాక్షాపాకమై యుండును. ఈమహానుభావుఁడు భారతమునందు ముఖ్యముగా నాదిపర్వము తెలిఁగించుటలో నెంతపరిశ్రమ చేసియున్నాఁడో దానియందుఁ బడి మునిఁగి తేలిన చిత్తమునకుం బోలఁదోఁచి సహస్రస్పర్శించుచున్నయది. సంస్కృతాంధ్రములు రెండును సావధానముగాఁ జూచిన వారికీ విషయమున విశ్వాసముపుట్టక పోదని నా నమ్మకము. నన్నయభట్టురచించిన పర్వములలో నారణ్యము కొనభాగము నిస్సారముగా నున్నట్లు కొందఱు చెప్పుచున్నారు. అట్లు చెప్పనొప్పదు. అతని కవిత్వము సర్వత్రసమత్వమును పొందియున్నది. మూలానుసరణములయిన గ్రంథములు మూలము చూడనప్పుడన్నియు నొక తీరుననే కానిపించును. అందును సుప్రసిద్ధుల కవిత్వముపై మఱియొక యభిప్రాయ మెవ్వరికిని బోనే పోదిది నిశ్చయము. కవిత్రయమువారి కవిత్వము

సందును సందుముఖ్యముగాఁ దిక్కన సోమయాజికవిత్వమునందు లోపములున్నవని యెవ్వఁడు చెప్పసాహసింపఁ గలఁడు? సాహసించినచో వానినెల్లరుం బొడిచి పొడిచి చంపకమానరు. నాకీ ముగ్వురికవిత్వముకన్న మిన్నగా శ్రీనాథుని కవిత్వమున్నట్లును వీరికన్న నాతఁడెక్కువ పండితుండయినట్లు నభిప్రాయము. తిక్కన కవిత్వమందలి విరుపులు నా నెమ్మదికి సమ్మతములు కావు. ఇట్లన్నచో నెవ్వరో తప్ప నా మాటపాటింపరు. పాటింపరని భయంపడి వెనుదీయువాఁడఁగాను. అది యట్లుండనిండు.

భాషాంతరీకరణ మెట్లుండవలెను? దీనింగూర్చి కొంత చర్చించి ప్రస్తుతమునకు వత్తము. కావ్యనాటకాదులకు భాషాంతరీకరణమున్నదున్నట్లు సరిగఁ జెప్పినచో శ్లాఘ్యముగానుండదు. భాషాంతరీకరణము స్వకల్పితమువలె నుండవలయునుగాని భాషాంతరీకరణమనిపించుకొను నట్లుండరాదు. సారవత్తరమయిన కావ్యముననే యింతపదార్థము విడిచినను చేర్చినను రసాభాసముగనే యుండును గాని మూలాభిప్రాయమ్మై మూలార్థమును బోషించునట్లు క్రొత్తపదము వేసి రసపోషణము చేయవచ్చునుగాని యపార్థకములగు నమూలకపదములు వేయరాదు. కాన మూలాభిప్రాయము చెడ యపార్థముచుట్టుకొనును. మఱియు,

"శ్లో. లాక్షాగృహానల విషాన్న సభాప్రవేశైః ।
ప్రాణేషు విత్తనిచయేషుచ నః ప్రహృత్య ।
ఆకృష్టపాండవ వధూపరిధాన కేశా ।
స్వస్థాభవంతి మయిజీవతి ధార్తరాష్ట్రాః ॥"

ఇది వేణీసంహారములోనిది. లాక్షాగృహానల విషాన్నములఁ బ్రాణములు, సభాప్రవేశమున ధనమును, ద్రౌపదీపరిధాన కేశ గ్రహణమున మానమునని మూలాభిప్రాయము. ఇందుమానము గమ్యమానము. దీనికిఁ దెలుఁగు:—

శా. ఆలాక్షాగృహమందుఁ జిచ్చిడి విషంబన్నంబునం బెట్టిప్రా ।
ణాలింపట్టదుహోదరంబునను మాయద్యూతంబులుం గొట్టిపాం ।
చాలిన్వేణి గ్రహించి యీడ్చిమొలవస్త్రంబూడ్చి మానంబును ।
న్నాలంజేసిన వారలే బ్రదికియుండన్ స్వస్థులైయుందురే ॥

ఇట్లున్న మూలార్థమును సరణమందురు గాని యమూలకమని చెప్పసాహసింపరు. పురాణేతిహాసాదులకు భాషాంతరీకరణము మక్కికిమక్కిగానున్నచో హృదయంగమముగనుండఁబోదు. పురాణాదులలో నర్థపౌష్కల్యము గలిగింపని

పదములు పెక్కులుండును. చెప్పినయర్థమే మరల మరలఁ జెప్పఁబడుచుండు. అది సంస్కృత భాషగావున నెట్లుచెప్పినను వినువారికి గంభీరముగానే యున్న ట్లుండును. అట్లే భాషాంతరీకరించిన నసమంజసముగా నుండునని వేఱచెప్పవల యునా? సంస్కృతభారతము పురాణశైలింబోలి యున్నది గావున దానియం దుఁ జెప్పిన కథలే మరల మరలఁ జెప్పుచుండుటయు నిరవసరమైన తావులఁ బెంచుటయు నవసరమయిన తావులఁ దగ్గించుటయు నొక శ్లోకముననే చెప్పిన విషయము మరలఁ జెప్పుటయుఁ బాదమునకు రెండుమూడు వృథాసంబోధన పదములుండుటయు మొదలగునవి గలిగియుండుట కానుపించెడిని:—

" శ్లో. యత్రోషితం విశాలాక్షి త్వయాచంద్రనిభాననే।
తత్రాహముషితోభద్రే కుక్షౌకావ్యస్య భామిని." (భారతము)

" ఆ. చంద్రసదృశముఖి విశాలాక్షినీచేత।
నెందునుండఁబడెను యందుకావ్యు।
కుక్షియందు నేను గూడ నుంటిని భద్ర।
భామినీ విశాలపద్మనేత్ర.

ఇట్లుండి కవిత్వము ప్రీతినిబుట్టింపఁ జాలదు. కావునఁ బురాణాదుల భాషాంతరీకరణ మనుసరణరూపముగానే యుండుట యుక్తముగాని ప్రతిబింబ ముగానుండుట యుక్తముకాదు. అనుసరణమును విడిచి తిక్కనసోమయాజి విరాటపర్వమువలెఁ దెలిఁగించుట భాషాంతరీకరణమనుటకు వలనుపడదు. నన్న యభట్టారకుం డట్లుచేయక మూలము ననుసరించుచుఁ దనయిచ్చవచ్చినట్లు మార్చి మనోహరముగాఁ దెనిఁగించినాఁడు. సంస్కృతభారతమున నొక్క జర త్కారునికథ నాయాసందర్భంబులంబట్టి మూఁడునాలుగు సారులు చెప్పఁబడి యున్నది. మఱియు ననేకకథలిట్లే పౌనరుక్త్యమును బొందియున్నవి. తెలుఁ గుననట్లు చెప్పినకథనే సంగ్రహముగా నొకమారు నంతకన్న కొంచెమెక్కు వగా నొక్కమారు విపులముగా నొక్కమారు నంతకన్న విపులముగా మఱియొ క్కమారునుం జెప్పినచో నెట్లుండునో నేనిటవేఱవ్రాయ నవసరములేదు. సకల భాషావాగను శాసనుండగు నన్నయభట్టు తానిట్టికథల నన్నిమారులును దెలిఁ గింపక తగినతావులందు హృద్యములుగాఁ నొక్కొకమారే తెలిఁగించినాఁడు. మూలమున దుష్యంతునికథ యొక్కసందర్భమున యయాతికథకన్న మున్ను చెప్పఁబడియున్నది. తెలుఁగున నట్లుకాక యయాతికథ తరువాతనే దుష్యం

తునికథ విరాజిల్లుచున్నయది. ఇటఁ దద్వంశాను క్రమణిక యుంచుక విచారింప గగు నది యెట్లనినం జంద్రునకు బుధుఁడు, బుధునకుఁ బురూరవుండు, పురూరవు నకు నాయువు, ఆయువునకు నహుషుండు, నహుషునకు యయాతి, యయాతికిఁ బూరుఁడు, పూరునకు జనమేజయుండు, జనమేజయునకుఁ బ్రాచీశుఁడు, ప్రాచీ శునకు సంయాతి, సంయాతికి నహంయాతి, అహంయాతికి సార్వభౌముఁడు, సార్వ భౌమునకు జయత్సేనుండు, జయత్సేనునకు నవాచీనుండు, అవాచీనునకు మహా భౌముండు, మహాభౌమునకు నయుతనాయి, నయుతనాయికి నక్రోధనుండు, అక్రోధనునకు దేవాతిథి, దేవాతిథికి నరిహుండు, అరిహునకు బుుక్షుండు, బుుక్షు నకు మతినారుండు, మతినారునకుఁ దంసుఁడు, తంసునకు నీలినుండు, ఈలినునకు దుష్యంతుఁడు, దుష్యంతునకు భరతుండు. ఇట్లు పేర్కొనంబడిన వంశాను క్రమణికవలన దుష్యంతుఁడు యయాతికిఁ దరువాత 19-వ పురుషుఁడని తేలుచు న్నది. సంస్కృతభారతములో భరతవంశము సవిస్తరముగాఁ జెప్పుమనికోరిన జనమేజయునకు వైశంపాయనుఁడట్లు దుష్యంతునికథను ముందుచెప్పియున్నాఁ డు. నన్నయభట్టారకుఁ డదిసమంజసముగా లేదని కాఁబోలు వంశానుక్రమణిక ననుసరించి మార్చియయాతికథనే ముందుచెప్పినాఁడు. ఇట్లు చెప్పుటయే సమం జసమని నా యభిప్రాయము.

ఇంకనన్నయభట్టు శైలిందెల్ప నొక్కపద్యము నుదాహరించుచున్నాను.

శ్లో. కేశవం కేశిహంతార మప్రమేయ పరాక్రమం।
పూజ్యమానం మయా యో వః కృష్ణంనసహతేన్నృపః।
సర్వేషాంబలినాం మూర్ధ్నిమయేదం నిహితంపదం।
ఏవముక్తేమయాసమ్యగుత్తరం ప్రబ్రవీతుసః।
మతిమంతశ్చయేకేచిదాచార్యం పితరంగురుం।
అర్చ్యమర్చితమర్ఘార్హమనుజానంతు తే నృపాః।
తతోనవ్యాజహారైషాం కశ్చిద్బుద్ధిమతాంసతాం।
మానినాం బలినాం రాజ్ఞాం మధ్యే వైదర్శితేపదే॥

చ. ఎడపకయర్ఘ్యమచ్యుతునకిచ్చితిచ్చిన దీనికింపొడం।
బడమని దుర్జనత్వమున బల్కెడు వీరులమస్తకంబుపై।
నిడియెదనంచునుం జరణమెత్తెసభన్ సహదేవుఁడట్టిచో।
నుడిగిసభాసదుల్ పలుకకుండిరి తద్దయుభీతచిత్తులై॥

ఈ తెలుఁగుపద్యము మూలమునకు మెఱుఁగు వెట్టుచున్నదని సువర్ణాళికిం జెప్పవచ్చును. ఇక్కవికి సంస్కృతమందు మిక్కిలి యభిమానము, సంస్కృత పాండిత్యమును గలదు గావున భారతము మొదలను శ్లోకము రచించి యాశ్వాసాద్యంతముల సంస్కృత విశేషణములు ప్రయోగించె. ఈయాచారము తఱచుగా నిప్పటికిని గవుల కలవడియున్నది. నన్నయ కవిత్వములోఁ బెక్కుచోట్ల ప్రాసైక జాతీయములు వేయఁబడియె. ఇతని కవిత్వమందు శ్లేషశబ్దాలంకారములకన్న నర్థాలంకారము విశేషముగానుండును. దీనం జేసి శబ్దాలంకారమంత ప్రియముఁ గాదని యూహింపనై యున్నది. గీర్వాణమహాకవి శేఖరుండగు కాళిదాసుని కవిత్వమున నర్థాలంకారమే సర్వత్రచూపట్టెడిని. మఱియు మన నన్నయ సీసగీతములలోఁ బ్రాసములలో యతులలో యేర్పాటొకటిగానే వేసినాఁడు గాని యవియు నవియు నెందునుం గలకూరగంపఁ జేయలేదు. ఈనియమమును దిక్కనాదు లెవ్వరును బాటింపలేదు. కాళిదాసు మొదలు నేఁటివరకుం గల కవులెల్లరునుం దా మొకచోఁ జెప్పిన పద్యములను మఱియొకచో నట్టిసందర్భమున వ్రాసికొను నాచార మనుశ్రుతమైవచ్చుచున్నది. మన కవిత్రయము నామార్గమునే యవలంబించి తొల్లితారుచెప్పిన పద్యములు మార్చికాని మార్పకకాని మరల నిలుపుకొనుచున్నారు. దీనివలన గ్రంథరచనయందంత శ్రమయున్నదనియు గ్రంథములో నాశుకవిత్వముపయోగింప లేదనియు నూహింపఁదగు. నన్నయ ఆది భారతములో స్త్రీవర్ణనాదికము చేసినప్పు డనాగరకతగా నశ్లీలముగాఁ బ్రసక్తించి యుండలేదు. చక్కని శైలిలో భావరసాదుల నెల్లడించినాఁడు. అర్జున తీర్థయాత్రాకాలమందు మూలమందు లేకున్నను, స్వదేశాభిమానముం బురస్కరించుకొని వేఁగీదేశమును వర్ణించినాఁడు. ఇదిసర్వజన సామాన్యమగు నాచారమగుటం జేసి నేను నిప్పట్టున మన రాజమహేంద్రవరమును సూచించితిని. అర్జునుని తీర్థయాత్రాకాలమునకు వెనుక రెండువేలయేండ్ల కీయాంధ్రవిషయము పుట్టినది కావున సంస్కృత భారతమున వేఁగీదేశము వర్ణింపఁ బడలేదు. కవిత్వమందు నన్నయకుం గలధారాశుద్ధి తిక్కనాదులకు లేదు. ఈవిషయము ముందుఁ దెలియందగు. మరియు మూలములో:—

శ్లో. ధృతరాష్ట్రస్త్వచక్షుష్ట్వాద్రాజ్యం నప్రతిపద్యత।
పారశవత్వాద్విదురో రాజాపాండుర్బభూవహ॥

ఇత్యాదులెన్నియో ప్రమాణములవలనఁ బాండురాజు కురుదేశమునకు రాజైనట్లు మహాభారతమునఁ జెప్పఁబడి యుండఁగా నన్నయభట్టు:—

"ఇట్లు బ్రహ్మోత్తరంబుగాఁ బ్రజావృద్ధియు, సస్యసమృద్ధియునగుచుండ నాంబికేయు ధృతరాష్ట్రురాజ్యాభిషిక్తుంజేసి భీష్ముండు దనకు విల్లును విదురు బుద్ధియును సహాయంబులుగా రాజ్యంబు రక్షించుచున్నంత" అని మొదలగు పద్యముల ధృతరాష్ట్రుని రాజుగాఁ జెప్పియున్నాఁడు. దీనివలన జాత్యంధునకు రాజ్యపాలనాధికారము మొదలగునవి లేవను ధర్మశాస్త్రములకు భంగపాటు వచ్చును. ధృతరాష్ట్రుఁడే రాజైనయెడల నతని పుత్రుఁడు దుర్యోధనుఁడే రాజు గావలయును గదా! అట్లయినచో నాపిత్ర్యమయిన రాజ్యమిమ్మని యడుగుటయు నీయకున్న యుద్ధము చేయుటయు సకలధర్మవేత్తయగు ధర్మజునకు ధర్మంబులై యుండునా? దీనిఁగూర్చి పలువురు పలువిధముల నభిప్రాయపడుచున్నవారు. అట్లుచెప్పిన నన్నయభట్టే పైదానికి భిన్నముగాఁ బెక్కుచోట్లఁ బాండురాజేరాజుగా నున్నట్లు సూచించినాఁడు. పాండురాజు దిగ్విజయంబు చేసినప్పుడు రాజులెల్లరు "కానుకగావచ్చిరి సకలజగత్సేవ్యమానుఁ మహేంద్రప్రతిముం గౌరవ్యవంశప్రభు నఖిలమహీపాలు నాంబాలికేయుఁ" ఇందుఁబాండురాజు కౌరవ్యవంశ ప్రభువు. అఖిలమహీపాలుఁడనియును, శతశృంగవాసులు పాండురాజుమృతిఁ జెందినప్పుడు.

"క. ధరణీరాజ్య విభూతియుఁ।
బరిజనులను బాంధవులను బ్రజవిడిచి తప।
శ్చరణం దపసుల తనకుఁ।
శరణంబని నమ్మిపాండుజనపతి నెమ్మిఁ."

ధరణీరాజ్యవిభూతిని విడిచియనియు; మఱియు ధృతరాష్ట్రుఁడు "పాండవజ్యేష్ఠు యౌవరాజ్యాభిషిక్తుం జేసె" నని చెప్పుటంజేసియు; ధృతరాష్ట్రుఁడు తన కొడుకుతో "...అంగవైకల్యంబునం బరచక్రంబులకుం బ్రతివ్యూహంబులు రచింపనేరమిం జేసి రాజ్యంబునకుం దగకున్న"

ఉ. లోకనుతుండు పాండుఁడమలుండు మహాగుణరత్న పూర్ణర।
త్నాకరుఁ డత్యుదారమతి యంధుఁడనైనను నన్ను రాజుగాఁ
జేకొని నాకుభక్తిఁ బనిసేయుచు సర్వజగజ్జిగీషుడై।
యీకురువంశరాజ్య భరమింతయుఁ దాల్చెఁ బరాక్రమంబునన్.

అనిన దుర్యోధనుండు తండ్రితో

సీ. పైతృకం బగులక్ష్మీ పాండుభూపతిమున్ను తాల్చుటఁజేసి తత్తనయుఁడైన।
ధర్మజుఁడిప్పుడు తాల్చిననాతని తనయుండు మఱిదానిఁ దాల్చుమీఁద।
నిప్పాటఁ బాండువంశేశుల, వసుమతీరాజ్యార్హులగుదురు రాజ్యమునకుఁ।
బరువడిమేమింత వాసినమాపుత్రపౌత్ర వర్గంబును బాయునిఁక।

ఆ. నోరులఁగొలిచి కుడువనోపమే మట్లుగా।
కుండమమ్ముఁజేయఁ నోపుదేనిఁ।
బాండురాజు తొంటిభక్తియు నప్పాండు
తనయులందుఁ దయయుఁ దలపఁకుండు.

అని మొదలయిన స్థలములయందు నిట్లు చెప్పి తనతొంటివచనంబునంగల యర్థంబునకు విరుద్ధంబాపాదించు కొనినాఁడు. ఇదియంతయును విచారింపఁగా వేయిసంవత్సరములనాఁటి గ్రంథము గనుక తొంటివచనమున ధృతరాష్ట్రుని రాజ్యాభిషిక్తునిఁగాఁజేసి యనువాక్యము లేఖకపాఠక ప్రమాదజనితమో యని యూహించితి. ఇదియెంతవరకు నిజమో చెప్పఁజాలము. మఱియును బరీక్షిత్తుని సర్పభయమునుండి రక్షించుటకు వచ్చినవాఁడు కశ్యపుఁ డని వ్రాసినాఁడు. ఈవచ్చిన కశ్యపుండెవరు? తక్షకుఁడు, శేషుఁడు, గరుడుఁడు, ఇంద్రుఁడు, మొదలగు వారిఁగన్న ప్రజాపతియా? మఱియొకఁడా? అని శంకించుకొనఁగా నన్నయ భారతమందే:—

మధ్యాక్కర॥ ధరణిచరాచర భూతసంఘంబు దమవిషవహ్ని।
నురగంబు లేర్చుచు నునికికలిగి పయోరుహ గర్భుం।
డురగవిషాపేత జీవసంజీవనోపదేశంబు।
కరుణఁగశ్యపునకు నిచ్చె నఖిలలోక హితంబు పొంట.

అట్టి కశ్యపుండను బ్రహ్మర్షి...” అని వ్రాయుటచేత నితఁడు తక్షకాదులం గన్న కశ్యపుఁడనుటకు సందేహము లేదుగదా? బ్రహ్మచేత నురగమంత్రముఁ గొన్నవాఁడు మరియొక కశ్యపుఁడుకాఁగూడదా? యని శంకింతునేని

శ్లో. ఇత్యుక్త్వాసృష్టి కృద్దేవ స్తం ప్రసాద్య ప్రజాపతిం।
ప్రాదాద్విషహారీంవిద్యాం కశ్యపాయ మహాత్మనే. (భారతము)

(తనపుత్రులగు పాములనెల్ల కద్రువశపించెనని విని కశ్యపుఁడు కోపించు నపుడు బ్రహ్మవానినిఁ బ్రశాంతునిఁజేసి సర్పములవలన లోకము రక్షింపుమని విషహారమంత్రము కశ్యపప్రజాపతికి బ్రహ్మదేవుఁ డొసంగెను.)

అని యుండుటంజేసి యింద్రాదులంగన్న కశ్యపుఁడే యితఁడనుట స్పష్ట ము. అట్టిమహానుభావుఁడు కావలయునన్న రెండవప్రపంచమును బుట్టింపఁజాలిన వాఁడు గంధమాదనంబునం దపంబున్నవాఁడు కశ్యపుఁడు. ఆమహాతపస్వికి ధన ముకావలసివచ్చినదా? మఱియొకవిధముగా సంపాదించుకోలేక పరీక్షిత్తునకుఁ భాముమంత్రమువేసి వానివలన సంపాదించుకోనెంచి వచ్చెనా? అట్టివాఁడు తనకొడుకు తక్షకుని మాయలోఁబడి వంచితుండై వానివలన ధనము స్వీక రించుకొని మరలిపోయెనా? తక్షకుఁడుం దండ్రినిట్లు ధనమిచ్చి మరలింపఁ జేయఁజాలియుండెనా? ఇట్లు నన్నయభట్టు వ్రాయుట సమంజసమని నాకుఁదోఁప లేదు. మూలములోఁ గశ్యపగోత్రజుఁడొక బ్రాహ్మణుండనియు నామంత్రము బ్రహ్మవలనం బొందిన కశ్యపప్రజాపతివలన లోకమున వ్యాపకమై తనకు వచ్చె ననియుఁ జెప్పఁబడి యున్నది. అట్లున్నదానికిట్లు చెప్పుట చాలవిరుద్ధార్థమును బోధించుచున్నది. మఱియు, ఆస్తికుని ప్రార్థనంజేసి జనమేజయుండు సర్పయాగం బుడిగించెనని చెప్పి వెనుక మంత్రప్రభావంబునఁ దక్షకుం డగ్నికుండంబులోఁ బడుచున్నట్టును ఆస్తికుండాఁగినట్లును జెప్పినాఁడు. మూలముననిట్లులేదు. ఆస్తి కునిస్తుతికిమెచ్చి రాజు నీకుఁ గోరిన వరమిత్తునను నంతలో హోతతక్షకుని నా కర్షణంబుచేయ నతఁడువచ్చి యగ్నింబడునప్పుడు ఆస్తికుఁడు "వరమిమ్ము తక్షకా దులంగావు" మనికోర రాజుయజ్ఞ ముడిగినట్లున్నది. ఇట్లుండుటయే సాధువని నా మతము. మఱియునసేకస్థలములనిట్లు భిన్నాభిప్రాయంబులంబడి తెలుఁగు వ్యత్య యంబునంబడి పోయినది. గ్రంథవిస్తరభయంబున నావిషయమింతటితో ముగించి పూర్ణముగాఁ దెలిఁగింపఁబడని స్థలములొండురెండు చూపుచున్నాఁడను. ధృత రాష్ట్రునితోఁ గణికుఁడు చెప్పిన జంబుకాదులకథ తెలుఁగున లోపించినది. ఉదం కునిగురువునకు గురువైన యయోదధౌమ్యుఁడు శిష్యులకు విద్యచెప్పుటయు, వారిశుశ్రూషయు, వారిలోనొకఁడంధుండై కూపంబునంబడి యశ్వినీదేవతల నెంతయోస్తుతించుటయు లోనగు పెద్దకథను విడిచివేసినాఁడు. మఱియును సం స్కృతభారతములోని కొందఱపేరులు తెలుఁగున మఱియొకవిధముగాఁ బడియు న్నవి. ఉదంకునిగురువు సంస్కృతమున వేదుఁడు. తెలుఁగునఁ బైలుఁడయ్యె. ఇత్యాదులు వేనవేలు. దీనికేమికారణమో తెలియుట దురవగాహము. ఇంకరచ నాసౌష్ఠవాదులంగూర్చి చర్చింతము. గరుత్మంతుఁడు దాస్యమున వేగుచుఁ దల్లితో:—

ఉ. ఆయతపక్షతుండహతి నక్కులశైలములెల్లనుగ్గుగాఁ
జేయుమహాబలంబును బ్రసిద్ధియునుంగలనాకు నీపనిం
బాయకఱొమ్మునం దవసుఁ బాములమోవను వానికింబనుల్
సేయను నేమికారణము చెప్పుము దీనిఁబయోరుహాననా॥

ఇందుఁ దనప్రభావమత్యున్నతముగాఁ జెప్పిగరుత్మంతుఁడు తల్లిని 'పయోరుహాననా' అని సంబోధించినాఁడు. ఇదిసార్థకోపయోగవిశేషణము కాదనియుఁ దల్లినిట్లు కొడుకుపిలుచుట స్వభావమును న్యాయ్యమునుగాదనియు నాయభిప్రాయము. దీనికిసరియైనపద్యము:—

చ. అతులతపఃప్రభావనిధియైనుడికెక్కినకశ్యపప్రజా
పతికిసుతుండనై ప్రథితపక్షబలార్జితగౌరవంబునన్
క్షితిధరకోట్లనైననుసిచేయసమర్థతగల్గి వెల్గునే
నతినికృతిన్ భుజంగులకు నంజలిసేయఁగనేటికమ్మరో॥

మఱియునుదంకుఁడు జనమేజయునకు సర్పయాగబుద్ధిపుట్టించువాఁడై పోయి,

చ. మితహితసత్యవాక్య జనమేజయ భూజనవంద్య యేనుసు
స్థితిగురుదేవకార్యములుసేయఁగఁ బూనుటెఱింగివంచనో
న్నతమతియైయకారణమ నాకపకారముచేసెఁదక్షకుం
డతికుటిలప్రభావుఁడు పరాత్మవిశేషవివేకశూన్యుఁడై॥

వ. మఱియదియునుంగాక.

చ. అనవరతార్థదానయజనాభిరతున్ భరతాన్వయాభివ
ర్ధను సకలప్రజాహితవిధాను ధనంజయసన్నిభున్ భవ।
జ్జనకుఁబరీక్షితున్ భుజగజాల్ముఁడసహ్యవిషోగ్రధూమకే
తనహతిఁజేసి చేసెనతిదాంతుఁ గృతాంతనికేతనాతిథిన్॥

అట్టితక్షకుని సంహరింపుమనిచెప్పినాఁడు. లోకములోఁ గార్యార్థియైపోయినవాఁడెవ్వఁడు నిట్లుప్రసంగింపఁ డనుకొందును. రాజునుస్తుతించి వానికి నుపకరించుమాటలు చెప్పిసంతోషపెట్టి తరువాతఁ దనసంగతి యెఱిఁగించినచో కార్యానుసంధానముగానుండును. లోకజ్ఞుఁడగు నన్నయభట్టారకుం డిట్లు మూలాతిక్రమణముగాఁ జెప్పుటసాధువుకాదని చెప్పసాహసించుచున్నాను. ఉపరిచరమహారాజుకథలో జాలరులు చేపకడుపున దొరికినపిల్లలను ఉపరిచరునకీయ నతఁడు వారి నిగ్రహించి కొంతకాలముపెంచి తనమిత్రుఁడు సపుత్త్రికుఁడునగు దాశరాజున

కా కన్నెనిచ్చెననియుఁ బుత్రుని మత్స్యదేశమునకు రాజుగాఁజేసెననియు మూల ములోనున్నది:—

"శ్లో॥ ఉజ్జహ్రురుదరాత్తస్యాః స్త్రీపుమాంసంచమానుషం।
ఆశ్చర్యభూతం తద్గత్వా రాజ్ఞేథ ప్రత్యవేదయన్ ।
తయోఃపుమాంసం జగ్రాహ రాజోపరిచర స్తథా।
సమత్స్యోనామరాజాసీ ద్ధార్మికస్సత్యసంగరః ।
రాజ్ఞాదత్తాచదాశాయ కన్యేయం తేభవిష్యతి॥"

ఇట్లుండఁగా నన్నయభట్టారకుండు:—

"తే॥ తెరలవలనై చిజాలరి దిగిచిదాని ।
యుదరదళనంబుసేయ నందొక్క కొడుకు ।
నొక్క కూఁతును గనివాని నొనరఁదెచ్చి ।
దాశరాజున కిచ్చెను దక్షిణంబు॥"

అని జాలరి మత్స్యోదర సంభవులను దాశరాజున కిచ్చినట్లు వర్ణించి నాఁడు. దీని కేమి కారణమో తెలియదు. మఱియు ననేకస్థలముల నిట్లు చెప్పియు న్నాఁడు. సభాపర్వములోఁ దనకుఁ బ్రాణదాన మొనర్చిన యర్జునుంజూచి మయుండు, "ఏనుదానవ విశ్వకర్మ ననేకశిల్పకళాకుశలుండ మీకిష్టంబైనదాని నిర్మించెదంబనుపుండనిన నర్జునుం డచ్యుతు మొగంబుసూచి నితని నెద్దియేని నొక్క యపూర్వంబయినదాని నిర్మింప నియోగింపుమనినఁ గృష్ణుండు పెద్ద యుం బ్రొద్దువిచారించి మయునకిట్లనియె" అని వ్రాసినాఁడు. మూలమున నిట్లులేదు.

శ్లో॥ అహంహివిశ్వకర్మావై దానవానాంమహాకవిః ।
సోహంవైత్వత్కృతేకించి త్కర్తుమిచ్ఛామిపాండవ।

అర్జునః॥ శ్లో॥ ప్రాణకృచ్ఛ్రాద్విముక్తస్త్వ మాత్మానంమన్యసేనఘ ।
ఏవంగతేనశక్ష్యామి కించిత్కారయితుంత్వయా ॥
నచాపితవసంకల్పం మోఘమిచ్ఛామిదానవ ।
కృష్ణస్యక్రియతాంకించి త్తథాప్రతికృతంమయి ॥

నాకుఁ జేయుదునన్నది కృష్ణునకుఁ జేయుమని యున్నది. అర్జునున కిందుఁ గృష్ణునిపైఁగల తాత్పర్యము సూచింపఁబడినది. అట్టి యుత్కృష్టార్థమును నన్నయ భట్టు తెలుఁగునఁదీసికొనిరాలేదనుట నిశ్చయము. నన్నయవాఁడిన కఱకంఠుఁడు, ప్రాణగొడ్డము, కపిలజడలు, కపిలకన్నులు, లోనగునవి సంస్కృతాంధ్ర సంకర

సమాసములు గ్రామ్యములు. అనింద్యగ్రామ్యములని మనము శిరసావహించుచున్నారము. ఇవియన్నియు నరయఁగాఁదప్పులనియే నాయభిప్రాయము. తప్పులుకావనువా రిట్టిదొక్కక్రొత్తపద ముపయోగించిన వారి కప్పు డుత్తరము చెప్పవచ్చును. మఱియు నితండు వ్యతిరేకక్త్వార్థకంబు కళగా వ్యవహరింపఁబడుచుండె నాది పర్వము ద్వితీయాశ్వాసమున

క॥ అనఘ యిది యేటిశిపమే ।
మనుపమసుఃఖితుల మగుట నాధారము లే ।
కనుసంతానచ్ఛేదం ।
బున వేలెద మధమలోకముల తెరవుసనః॥

అనుపద్యములో "లేకను" అనిదృతాంతముగా వాఁడియున్నాఁడు. ఇది సాధువో యిటనేదే నర్థభేదమున సాధుత్వము కల్పింపఁబడినదో తెలియదు. రాహు, సీచు, దుష్టు, ధర్ము‍వు, కద్రువ, ఇత్యాదులు వేనవేలు నన్నయభట్టు వాడియుంటంజేసి సాధువులయి ప్రయోగశరణ్యంబులయ్యె. ఇంకఁ దిక్కనసోమయాజిం జర్చించుకొందము.

తిక్కనసోమయాజి.

ఇతఁడు స్మార్తనియోగి బ్రాహ్మణుఁడు. సంస్కృతాంధ్రంబులం దసమాన పాండిత్యముగలిగి శాస్త్రజన్య జ్ఞానంబునఁ గాకతిగణపతిరాజుకడనున్న బౌద్ధుల నోడించి షాడ్గుణ్యాది ప్రయోగనిపుణుండై మనుమసిద్ధికి రాజ్యమును దాయాదులనుండి తెచ్చియిచ్చి ప్రఖ్యాతినొందిన మహాపురుషుండు. ఇతనిపూర్వులు తొలితొల్తఁ గృష్ణామండలములోని వెల్లటూరున నుండుటంజేసి వెల్లటూరివారై గుంటూరుననుండి గుంటూరివారై కొట్టరువువారై పాటూరివారైరని తెలియవచ్చుచున్నది. ఇతఁడు సంతతలౌకిక వ్యాపారపారీణుఁడై యుండుటంజేసి సంచమవేదంబునాఁబడు భారతము నాంధ్రీకరించుటకుఁ దనకుఁ బవిత్రతచాలదని యగ్నిష్టోమముచేసి వైదికాచార సంపత్తివడసి విరాటపర్వము మొదలుకొని భారత మాంధ్రీకరించెననియుఁ దనయుంపుడుకత్తెకుం గొడుకగు కుమ్మరి గురునాథుని వ్రాయసకానిఁగాఁ దనయొద్దనిలుపుకొని గణపతింబోలు వ్రాయువాని కలమాఁగకుండఁ గవిత్వము చెప్పుదునని ప్రతినవట్టి గ్రంథముచెప్పుచు:—

"క॥ పలపలని మ్రూఁకలోఁగాల్ ।
నిలువకగుఱ్ఱంబు డిగ్గిసీకొడుకుగదా ।

కలిత భుజుం డగుచు నెక్కడ ।
తొలంగిచనియె నేమి చెప్పుదుంగురునాథా॥ ''

అనుపద్యములో "తొలంగిచనియె" అంతవఱకుం జెప్పి పైనిదోఁపక "ఏమిచెప్పుదుం గురునాథా" యని వ్రాయసకాని నుద్దేశించి పలికెననియు, నా చెప్పినదియే సరియనుకొని గురునాథుఁడు వ్రాసి పద్యము పూర్తియైనదని చెప్పి చదువఁగా నది కురునాథునితో సంజయుండు చెప్పినట్లర్థము సరిపడినదనియు నొకకథను గల్పించి చెప్పుదురు. ఇది విశ్వాసపాత్రమయినది కాదు. మహా విద్వాంసుఁడై యీశ్వర సాక్షాత్కారము గలిగించుకొన శక్తిసామర్థ్యములు గలిగి యజ్ఞకర్తాపేక్షుఁడైన మహామహుఁడొక కుష్ఠరోగికివి నుంపుడుకత్తెగాఁగొని యెననుట తిక్కన సోమయాజులయందలి ద్వేషబుద్ధిం గల్పింపఁబడినదే కాని నిశ్చయము కాదు.

మఱియుం దిక్కనసోమయాజి వ్రాయసకానితో నట్లు ప్రతిజ్ఞచేసి కవిత్వము చేయుటకుం దొడంగియుండఁడు. ఉన్నను అన్ని వేలపద్యములుగల పదునేను పర్వములు తుదముట్టింపఁగల మహాకవి "పలపలనిమూఁకలో" నను సామాన్యపద్యమునఁ బైపదముతోఁపక "తొలంగిచనియె" ననునంతవఱకుం జెప్పి "యేమిచెప్పుదుంగురునాథా" యనివగచెననుట హాస్యాస్పదము. ఇతఁడు భారతరచనకుందొడంగి హరిహరస్తుతిమాత్రముచేసి తనకన్న 200 వర్షములకు ముందున్నవాఁడై తన తెలిఁగింపఁబోవు భారతమున మూఁడుపర్వములు తెనిఁగించి ప్రసిద్ధిగాంచియున్న నన్నయభట్టును:—

ఉ. ఆదరణీయసార వివిధార్థగతిస్ఫురణంబుగల్గియ
ష్టాదశపర్వనిర్వహణ సంభృతమైపెనుపొంది యుండనం
దాదిఁదొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుండొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్॥

ఇట్లుస్తుతించి భారతరచనకుం దొడంగినాఁడు. ఆరణ్యపర్వశేషము విఘ్నాపహతమని దానినివిడిచి విరాటపర్వము మొదలుకొని వ్రాసెననితలంపనగు. నన్నయభట్టారకుండారణ్య పర్వమంతయును బూర్తిగ వ్రాసెననియు నది తిక్కనకాలమువఱకునుండె ననియు నాకారణంబుననతండు విరాటపర్వము మొదలుకొని ప్రారంభించెననియుఁ దరువాత నారణ్యపర్వము ఖిలీభూతముకాఁగా నెఱ్ఱాప్రగ్గడ

పూర్తి చేసెననియు నీ కారణంబుచేతనే నన్నయకు మూఁడు పర్వములు చేసె నని పేరువచ్చెననియుఁ గొందఱు చెప్పుచున్నారు. అది సమంజసము కాదు. నన్నయ చెప్పిన తక్కినభాగమును దిక్కన చెప్పిన భాగమునంతయు నుండ నడుమ నారణ్యపర్వములోఁ గొంత ఖిలమగుట తటస్థింపదు. ఖిలమగుటయే తటస్థించినపుడు గ్రంథమందక్కడనక్కడ భాగవతమునందువలెఁ బోయియుండును. అట్లుగాక యిట్లగుటవలన వనపర్వమంతయు నన్నయ వ్రాయలేదనియు, ఖిలీభూతము కాలేదనియుం దేలుచున్నయది. నన్నయ మూఁడు పర్వములు వ్రాసినట్లు తిక్కనాదులు చెప్పిరది యేమి యన్నచో మూఁడవపర్వములో సగము పైఁగా వ్రాసియుండెఁ గావున సామాన్యప్రతిపత్తిమై రెండునరపర్వములనుటకు మూఁడుపర్వములని చెప్పుట తటస్థించినది. లోకములో సాధారణముగా నొక వేయిలెక్కలోఁ గొన్ని పదులు తక్కువయయినను సరియైన లెక్క గనుపించుచున్నను ఆపరిషత్తునందుఁ జేరినవారు వేగురందురు కాని యెనిమిదివందల యెనుబదియెనిమిది మందియని సరియైన లెక్క చెప్పుట యిప్పటికిని జనులకభ్యాసము లేదనియు నట్లే నన్నయకు వచ్చిన పేరు ననియు గ్రహించునది. అదియటులుండనిండు. తిక్కనవిఘ్నాదిభయోద్విగ్నమానసుండై నిర్వచనోత్తర రామాయణంబున రామనిర్యాణంబునుంబలె యారణ్యపర్వశేషమును విడనాడెననిగాని విరాటాదిగ్రంథము ముగించినవెనుక దానిం దెలిఁగింతునని యట్లు ప్రారంభించి పదియైదుపర్వములును వ్రాసి కార్యాంతరవ్యగ్రతనుపేక్షించికాని శరీరానారోగ్య మరణాదులం జేసికాని తచ్ఛేషమును వ్రాయలేదని మనమూహించుకొనవలసియున్నది. ఇతఁడు తెలుఁగునందును సంస్కృతమందును బాండిత్యకవిత్వంబులు గలిగి యుభయకవిమిత్ర బిరుదపాత్రుండై మనుమభూపతికడ నాశ్రితుండై, అంతియకాక మిత్రుండై, చనువువడసి యతనిచే మామయని పిలువంబడుచుండునట్లు నిర్వచనోత్తర రామాయణమందలి—

క॥ ఏ నిన్ను మామయనియెదు। దీనికిఁ దగనిమ్ము భారతీకన్యకనా,
కీనర్హుఁడవగు దనినను। భూనాయకు పలుకుచిత్తమునకింపగుడున్ ॥

ఈపద్యమువలన స్పష్టమగుచున్నది. తిక్కనతన రామాయణమునందు:—

మ. అమలోదాత్తమనీష నేనుభయకావ్యప్రౌఢిఁ బాటించుశి
ల్పమునం బారగుఁడం గళావిదుఁడ నాపస్తంబసూత్రుండ గౌ
తమగోత్రుండ మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుండ న
న్నమకుం గొమ్మనమంత్రికిన్ సుతుఁడఁ దిక్కాంకుండ సన్మాన్యుఁడన్ ॥

అని చెప్పియుండుటం జేసి యుభయభాషా కవిత్వమున సంపూర్ణప్రజ్ఞ గల వాఁడనియుఁ జతుష్షష్టి కళలెఱింగినవాఁడనియు నీశ్వరభక్తుండనియుఁ దేలు చున్నది. కవిబ్రహ్మనాఁబడు నితండు విజయసేనమను మఱియొకగ్రంథము చేసి యున్నవాఁడు. అది రాజమహేంద్రనగరములో నామిత్రునియొద్ద నున్నదఁట. కాని నాకుఁ జూచుభాగ్యము పట్టినదికాదు. ఇతఁడు నిర్వచనోత్తర రామాయణము మనుమభూపతికిఁ గృతియిచ్చుటయేకాక "విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం" అని చెప్పియున్నట్లు కృతులందలి ఫలమెఱింగినవాఁడు గావున సర్వ సమర్థుఁడైన మూలఘటికకేతన్న నాదరించి వానివలన దశకుమారచరిత్రమును దనపేర నంకితముచేయించుకొనియె. కేతన దశకుమారచరిత్రము:—

"గీ॥ కవితఁజెప్పి యుభయకవిమిత్రుమెప్పింప।
నరిది బ్రహ్మకైన"

అని చెప్పియున్నాఁడు. దీనివలన విచారింపఁగా నప్పటికవులలోఁ దిక్కన సోమయాజి ఘనుండై సువిమర్శకుండై యితరుల సామాన్యకవిత్వమును మెచ్చనివాఁడై యుండుననితోఁచెడిని. యజ్ఞముసేయక మున్ను చేసిన రామాయణములోఁ గుకవినింద మొదలగునవి చేసియున్నాఁడు. సోమయాజి యైన వెనుక శాంతుండై భారతమున నట్టినిందలు మొదలగునవి చేయలేదు. తిక్కన కవిత్వము:—

"క॥ తెలుఁగుకవిత్వము చెప్పం।
దలఁచినకవి యర్థమునకుఁ దగియుండెడుమా।
టలుగొని వళులుం బ్రాసం।
బులునిలుపక యొగినిబులిమి పుచ్చుటచదురే॥"

"క॥ లలితపద హృద్యగద్యం।
బులనకథార్థంబుఘటిత పూర్వాపరమై।
యలఁతియలఁతి తునియలుగా।
హాలసంధించినవిధంబు నమరఁగవలయున్॥"

అని నిర్వచనోత్తర రామాయణమందుఁ జెప్పినట్లు చిన్నచిన్న పదములు చేర్చి పద్యమల్లగలవాఁడనియు, యతిప్రాసంబుల నిలుపక ధారాళముగా నోటికి వచ్చినట్లు అర్థమునకుఁ దగియుండెడుమాటలు ప్రయోగించి జనరంజకము చేయఁ గలఁడనుట స్పష్టము. ఇతనికవిత్వమునఁ దఱచుగా:—

చ॥ అసదృశకీర్తి...చూ। చిసగముచేసె॥

ఇట్లు ప్రాసములయందు విరుపులు గానుపించెడిని. మఱియు నితని పెక్కుపద్యములందుఁ జిన్నచిన్నపదములెన్నియే నిమిడి హృద్యములుగా నుండు ననుటకు:—

చ॥ పగయడఁగించుటెంతయు శుభంబది లెస్సయడంగునే పగిం।
బగవగఁగొన్నమార్కొనక పల్కకయుండఁగవచ్చునే కడుం।
దెగమొదలెత్తిపోవఁబగ దీర్పఁగవచ్చినఁగ్రౌర్యమొందునే।
మిగతిదలంచిసంబగకు మేలిమిలేదు ధ్రువంబు కేశవా॥

ఇది సాక్ష్యమిచ్చుచున్నది. సోమయాజి కవిత్వమునం గొనసంతు సంస్కృతపదములును మూఁడువంతులు తెలుఁగుపదములును నుండును. ఇతనికిని శబ్దాలంకారముకన్న నర్థాలంకారమే ప్రియము. ఇక్కని నన్నయకన్న మిన్నగా జాతీయపదములు ప్రయోగించియుండెను. సాధారణముగా నెక్కడనో కాని వ్యర్థపదములు తఱచుగా దొరలనీయఁడు. ఇతనికవిత్వ మన్వయకాఠిన్యమును బొంది కొన్నిచోట్ల నారికేళపాకమై చదువుటకు సులభసాధ్యము కాకయుండును. ధారాశుద్ధి కొంచెము తక్కువగానున్నను మొత్తముమీఁద మనోహరముగానే యుండును. కందపద్యరచన యితనికిఁ గుదిరినట్లు మఱియొకకవికిం గుదురనేరదు. "అలఁతియలఁతి తునియలుగాఁ" జేర్చి కవిత్వముచెప్పుదునని చెప్పినను బెక్కుతావుల నర్థకాఠిన్యముగల దీర్ఘసమాసములు, దూరాన్వయములు గల పద్యములు చెప్పియున్నాఁడు. రసాభ్యుచిత బంధముగ వర్ణించి తిక్కన యుద్ధభాగముల వీరరౌద్రరసముల నొప్పింపఁగలఁడు. ధారాశుద్ధి మొదలగువానిలో నన్నయభట్టు ఘనుండైనను యుద్ధము వర్ణించుపట్లఁ దిక్కనకుం జాలఁడని చెప్పవచ్చును. సీసగీతములలో నన్నయభట్టారకునికింగల నియమ మితఁడు విడిచినాఁడు. భారత భాషాంతరీకరణమున నితఁడు నన్నయభట్టారకుని మార్గమే యనుసరించినాఁడు గాని విరాటపర్వమునందును మఱికొన్నితావులయందును యథేచ్ఛముగాఁ బ్రవర్తించినాఁడు. ఈతఁడు భగవద్గీతలలోఁ గొన్ని శ్లోకములకుమాత్రము సరిగఁ దెనుఁగుచేసి తక్కినది యంతయుఁ గ్షప్తముచేసినాఁడు. మొదటిపద్యము:—

శ్లో॥ ధర్మక్షేత్రేకురుక్షేత్రే సమవేతాయుయుత్సవః।
మామకాఃపాండవాశ్చైవ కిమకుర్వతసంజయ॥ దీనికిఁ దెనుఁగు

క॥ మానుగ ధర్మక్షేత్రం ।
బైనకురుక్షేత్రమున మహాహవమునకుం ।
బూనిమనబలముఁ బాండవ ।
సేనయునిటువన్ని యేమి సేసెం జెపుమా॥

ఇందు "మానుగ" మొదలగుకొన్ని యమూలకపదము లున్నను బద్యముమూలము ననుసరించి యున్న దనుటకు సందియము లేదు. ఇక్కవి భారతమునఁ దక్కినపద్యములన్నియుఁ దక్కువచేసినను విరాటపర్వముమాత్రము మూలము కన్న నెక్కువగాఁ బెంచి రచించినాఁడు. అదితనభారతకృతికిఁ బ్రారంభముకావున నారంభశౌర్యమును జూపియుండనోపు. మఱియు భీష్మపర్వమునందలి శ్వేతకథయు సనత్సుజాతీయము నుత్తరగీతలు మొదలగు ననేక కథలితఁడు పూర్ణముగాఁ దెలిఁగింపమానివేసినాఁడు. భగవద్గీతలును మానివేసినవానిలోఁ జేర్చుకొనవలసినదియే. ఇక్కవి చంద్రుండు:—

ఉ॥ కావునభారతామృతముఁ గర్ణపుటంబుల నారఁ గ్రోలియాం ।
ధ్రావళిమోదముం బొరయునట్లుగ సాత్యవతేయ సంస్మృతిన్ ।
శ్రీవిభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వదీ ।
క్షావిధినొంది పద్యముల గద్యములన్ రచియించెదన్ గృతుల్॥

అని భారతరచనకుంగడంగెను. ఇందుఁ "గవిత్వదీక్షావిధినొంది" అని చెప్పుటచేత విరాటపర్వము మొదలుకొని స్వర్గారోహణపర్వము వఱకుంగల పదునేను పర్వములుం దెలిఁగించువాఁడై తదేకదీక్షవట్టి యున్నట్టులూహింపనగు. ఇట్టి మహాగ్రంథములు రచించునపుడు పట్టుదలతోఁ బనిచేయవలయుఁ గాని వారమున కొకనాఁడు వ్రాసి నాలుగునెలలుమాని మరినాలుగుదినములు వ్రాసియిట్లున్నచో నెప్పటికి నెట్టివారును బారంబు ముట్టింపలేరని నానమ్మకము. తిక్కనసోమయాజి రాజావలంబనము గలవాఁడు గావున నదియపనిగాఁగొని నాలుగైదు సంవత్సరములలోఁ బదునేను పర్వములును వ్రాసియుండునని తలంపనయ్యె. అట్టుదీక్షచేసి ప్రారంభించి:—

"చ॥ పరమపదాప్తి హేతువగు భారతసంహిత శౌనకాదిభూ ।
సురవరులింపునం గరఁగుచొప్పునఁ జెప్పినవారు మోదసం ।
భరితతఁబొంది యక్కథకుఁ బ్రాఁతిగనర్పితుఁజేసి రర్మిలిన్ ।
హరిహరనాథ సర్వభువనార్చిత నన్ దయఁజూడు మెప్పుడున్॥"

అనిపరిసమాప్తి నొందించినాఁడు. తిక్కనవిరాటపర్వారంభమందుఁ దన కుఁగలలోఁ దండ్రియగు కొమ్మనామాత్యుఁడును, హరిహరనాథుండును బ్రత్యక్షమయినట్లును హరిహరనాథుండు భారతముఁ దనకుఁ గృతియిమ్మనికోరి నట్లును వ్రాసియున్నాఁడు. ఈ యాచారమునే పెక్కురుకవులు తమతమగ్రంథ ములలో వాడుచువచ్చిరి. ఇదియసత్యమని మనము కొట్టివేయఁదగినది కాదు. విద్వాంసుఁడై కర్మజ్యేష్ఠుఁడైన తిక్కనసోమయాజి యంతవానికట్లు స్వప్నమగు టాశ్చర్యముకాదు. ఏదేనికార్యమును లోనిడికొని పండుకొనినప్పుడు నిద్రపట్టను. అప్పుడు వెడనిద్రలో నయ్యర్థమునే స్మరించుచుండ నెట్టియెట్టి చిత్రములైన కల లైనరావచ్చును గదా. ఇదికలయని సోమయాజియే చెప్పుకొనియెఁ గావున దానికి నవనాగరకు లాక్షేపింపరని నమ్ముచున్నాను. మఱియు నితండు సంస్కృ తారణ్య పర్వాంతమందలి కొంతకథను విరాటపర్వము మొదలంజేర్చియున్నాఁడు. తెలుఁగు భారతములోఁ దమతో నడవులంబడి యున్నవారి నెల్లంబుచ్చి పాండ వు లజ్ఞాతవాసంబేఁగుచు ధౌమ్యులతో రథములెక్కి కొంతచని రథములవారిని సేవకులను వంటలవారిని దాసీజనమును ధౌమ్యునిం బుచ్చినట్లున్నది. సంస్కృ తభారతములో నిట్లుకాక యజ్ఞాతవాసంబున వారువారు చేయఁదలంచుకొనిన పనులు మొదలగునవి నిర్ణయించికొనిన వెనుకనే యెల్లరను బంచినట్లున్నది. ఇందఱున్నప్పుడు రహస్యము చెడునని యూహించి తొలుత బ్రాహ్మణులంబుచ్చి నట్లు తిక్కన వ్రాసి యుండును. బ్రాహ్మణులేఁగినను వంటలవారు, నింద్రసేనాదు లు, దాసులు, ధౌమ్యులు, మొదలగు వారున్నారు. వారున్నప్పుడే విరటుని పాలికరుగునట్లు నిర్ణయించికొనిరి.

“ఇద్దఱతో నేకాంతము ముగ్గురతో లోకాంతము” అను సామెతయుండ నిట్లుమాత్రము తగునా? అట్లుకాదు. పాండవుల ననుసరించి యడవులఁబండ్రెం డేండ్లు శ్రమంపడిన వారెల్లరును వారికై ప్రాణములైన విడుచువారే. వారియెడ నెట్టిరహస్యంబైనం జెల్లును. కావున మూలమందున్నట్లే తెలుఁగున నుండుట సమంజసము. ఇటనీమార్పు నిరవసరమని నాయభిప్రాయము. పాండవులు ప్రేత భూపరిసరమున నస్త్రములు పెట్టి పురప్రవేశము చేయుచు “యాజ్ఞసేనీ పుర స్సరంబుగాఁ బుణ్యానదీ తీర్థావతరణంబుచేసి” అని పాండవులు నదీస్నానముచేసి నట్లు వ్రాసియున్నాఁడు. ప్రేతభూమికిని పురమునకును నడుమ నదియున్నట్లును

వీరుస్నానాదికము చేసినట్లును మూలమునలేదు. లేకున్నను ప్రేతభూమి యొద్ద నుండి వచ్చిరి కావున నదిసూర్యోదయ సమయము గావునఁ గర్మిష్ఠుండగు తిక్కనసోమయాజి శుద్ధ్యర్థమట్లు చెప్పియుండఁ బోలును. ఇది సాధువని తలంచెదను. ఈ స్థలమున మూలమున నొక యధ్యాయము ధర్మరాజు దుర్గాస్తవము సేసినట్లున్నది. అది తెలుఁగున గగనకుసుమం బయ్యె. మూలములో ధర్మరాజు కంకుఁడను బ్రాహ్మణుఁడై విరటునాశ్రయించి నట్లుండఁగాఁ దెలుఁగున సన్యాసియని చెప్పియున్నాఁడు. ఇట్లే తిక్కనసోమయాజి పెక్కుస్థలములఁ బెంచి పెక్కుకధలుమార్చి పెక్కుకధలుతీసివేసి తనయిష్టము వచ్చినట్లు గ్రంధముచేసియున్నాఁడు. ఇతని యాంధ్రీకరణముం గూర్చి విపులముగఁ జెప్పవలసియున్నది గాని గ్రంధవిస్తరభయంబు నన్ను బాధించుటంజేసి యిట్లుసంక్షేపించి యింక నితని శైలిందెలుపుట కొక్కపద్య ముదాహరించు చున్నాను.

శ్లో॥ నచత్వ దన్యం పశ్యామి యో న ఆపత్సుధారయేత్ ॥

ఈశ్లోకార్థమునకు:—

క॥ ఆపదగడవంబెట్టఁగ । నోపిశుభంబైన దాని నొడగూర్పను మా ।
కీ పుట్టువునకుఁ బాండు ।
క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా ॥

ఇట్లు పెంచి వ్రాసినాఁడు. ఈ తెలుఁగు మూలమునకు మెఱుఁగువెట్టునట్లున్నదని చెప్పవచ్చును. ఇతఁడు తనభారతములోఁ బెక్కువర్ణనములు చేసియున్నాఁడు. స్త్రీవర్ణనాదులందశ్లీల మెక్కుడను మిక్కిలిగాఁ గలిగింపలేదు. కవిరాక్షసుఁడుచేసిన నియమంబుమీఱి నన్నయవాడిన తెలుఁగులుగాక మఱికొన్ని యెక్కువ వాడియున్నాఁడు. "జగములనెల్లెడక్" అను పద్యమునందు నాలవ చరణమున "ఎం। తగుమతులైన" అని పద్యముచేసి యొంతయను దానిపైఁగుమతులను సంస్కృతపదముయొక్క కకారమునకు గకారమువేసి ప్రాసముఁగల్పించినాఁడు. ఇత్యాదులు పెక్కులితని కవిత్వంబునం బొడకట్టెడిని. ఇంక నెఱ్ఱాప్రగడం బ్రశంసింతము:—

ఎఱ్ఱాప్రగ్గడ:—ఇతఁడు పాకనాఁటినియోగి బ్రాహ్మణుఁడు. ప్రబంధశైలిం గ్రంథములు రచించుటంజేసి ప్రబంధపరమేశ్వరుండనియు శంభుభక్తిభరితుండై శంభుదాసుండనియుఁ బ్రసిద్ధింజెంది నెల్లూరురాజులకడ నాస్థానకవియై

తిక్కనకుం దరువాత 100 ఏండ్లకుబయలుదేరి భారతమునం దారణ్యపర్వశేషము 1600 గద్యపద్యములుగాఁ దెలిఁగించిన మహానుభావుండు. ఇతండు భారతమున:—

"చ॥ స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా।
వరణములై దళత్కమల వైభవజృంభన ముల్లసిల్లను।
ద్ధురతరహంససారస మధువ్రత నిస్వనముల్ సెలంగఁగాఁ।
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్॥"

అనునది మొదటిపద్యముగాఁ జెప్పినాఁడు. కవులు సామాన్యముగా మొదటి పద్యము శ్రీకారాదిగఁ జెప్పుదురు. ఇతఁడట్లు చెప్పక ఇట్లుచెప్పినాఁడు. ఇది ద్విత్వాక్షరయుక్తమై ఎఱ్ఱాప్రగడయను తనపేరునకు నరివర్ణచక్రోద్ధారణము ప్రకారము సాధ్యపుఁజౌకమునందు సాధ్యపుటింటనిలిచెఁ గావున సాధ్యసాధ్యమువచ్చినది. ఇది శ్రీకారమువంటిదై శ్రేయోదాయకంబగునని యప్పకవి చెప్పియున్నాఁడు. మఱియు నిక్కవివతంసము తనగ్రంథాంతమున "భవ్యచరిత్రుఁ" డను పద్యగీతమున:—

"గీ॥ ఎఱ్ఱనార్యుండు సకలలోకైకవిదితుఁ। డయిన నన్నయభట్టమహాకవీంద్రు।
సరససారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ। జెందుటయుసాధుజనహర్ష సిద్ధిఁగోరి॥

"క॥ ధీరవిచారుఁడు తత్కవి। తారీతియుఁగొంతదోఁపఁ దద్రచనయకా।
నారణ్య పర్వశేషము। పూరించెఁగవీంద్రకర్ణ పుటపేయముగన్॥"

ఇందు నన్నయభట్ట మహాకవీంద్రు సరససారస్వతాంశ ప్రశస్తి తన్నుఁ జెందెననియుఁ దత్కవితారీతి కొంతదోఁచెననియు వ్రాసినాఁడు. దీనివలన నితండు నన్నయ శిష్యపరంపరలోఁ జేరిన వాఁడని కొందఱు నిర్ణయించిరి. అదినిరాధారమైనది. ఇతఁడు నన్నయ తరువాత ౩౦౦ సంవత్సరములకు నైనవాఁడుగదా! నన్నయశిష్యులెవరో శిష్యులశిష్యులెవరో యప్పటి కెన్నివందలమంది తత్పరంపరలో గతించిరో తెలిసికొనుట కెవ్వరికిని సాధ్యముకాదు. కావున నట్లనుటకు వలనుపడదుగాని యెఱ్ఱనార్యుఁడు నన్నయభట్టారకుని గ్రంథములుచదివి భాషాజ్ఞానము గలిగించుకొని కవిత్వము చెప్పనేర్చెనని యూహించుట సమంజసమని నా యభిప్రాయము. ఎదియెట్లయినంగాని యితనికా నన్నయభట్టారకునందుఁ గలభక్తి యింతింతయని చెప్పఁదరంబుగాదు. ఇప్పటివారొక యేడుపుగొట్టుగ్రంథము తప్పు

లతడకగా నల్లిగాని యెటనైనం దొంగిలివచ్చికాని దానికి బ్రహ్మాండముగాఁ దమ పేరు పెట్టుకొనుచున్నారు. అట్టిచో నిట్టిమహాగ్రంథమును నైహికఫల మింతయు నపేక్షింపక యెప్పుడో పరమపదంబునొందిన నన్నయపేరనే రాజనరేంద్రుని కంకితముగా రచించినాఁడు. ఇదియెంతయును శ్లాఘాపాత్రమనియు నిట్టిమహాకార్య మెవ్వరును జేయఁజాలరనియు నానిశ్చయము. కొందఱీ సందర్భమున నిట్లుచెప్పక యారణ్యపర్వ మమంగళకరమైనదని భయంబునంజేసి తనపేరు పెట్టుకొనలేదని చెప్పుచున్నారు. అట్టి భయముగలవాఁడగునేని యాపనికే మొదటఁబూనుకొనఁడు. పూనుకొనినప్పుడు పేరుపెట్టుకొనుటకు వెనుదీయఁడు గావున నమంగళదాయకంబని పేరుపెట్టుకొనలేదనుటకన్న నన్నయభట్టారకునందలిభక్తిచేతనే యిట్లు చేసెననుట పైపద్యములవలన సిద్ధాంతీకరింపఁ బడుచున్నదని మాపాఠకు లెఱిం గెదరుగాక.

ఎఱ్ఱాప్రెగడకవిత్వము:—మృదుమధుర శైలిందగిలి ద్రాక్షాపాకమై రసవంతమై శ్రావ్యమై నానావిధగుణాలంకారభాసురంబై సహృదయహృదయంగమంబై యుండును. ఈతఁడు నన్నయ తిక్కనల కవిత్వమధ్యమున నిలిచియున్న వాఁడు గావున నన్నయ సామీప్యమున నతనికవిత్వమువలెను దిక్కన సామీప్యమున నతనికవిత్వమువలెను దనకవిత్వమును బ్రకాశింపఁజేసి వారివారి కవిత్వమునం గలియఁగూర్చి యున్నాఁడు. సంస్కృతాంధ్రపదము లితని కవిత్వమున సమత్వమును బొందియుండును. ఇతఁడీ భారతశేషమునేగాక రామాయణమును, హరివంశమును, అహోబల మాహాత్మ్యమును, రచించి జగదుపకారము గావించెను. ఇట నితనిశైలిం దెల్పుటకొక భారతపద్య ముదాహరించుచున్నాను.

"చ॥ ఎడపక వాఙ్మనఃక్రియల నేరికి హింస యొనర్పఁబూనరె ।
య్యెడలను దీనులం గరుణ యేర్పడఁ బ్రోవన చూతు రిచ్చుచోఁ ।
గడమవడంగ నీరెడిరి కాంక్షితముల్ దుదముట్టఁదీర్తురె ।
క్కుడుమదిఁగూర్తురాశ్రితులకుఁ వినుమన్నియు నార్యధర్మముల్॥"

ఇతఁడు సర్వవిధములచేతను నన్నయ తిక్కనల కవిత్వములవలెనే తన కవిత్వమునందు నలంకారాదులఁ బొందుపఱచినాఁడు. వారివలెనే యితఁడు కొన్నిస్థలములఁ బెంచియుఁ గొన్నిస్థలములఁగుదించియుఁ గొన్నిస్థలములడించియు భారతమును దెలిఁగించినాఁడు. నన్నయ తిక్కనామలవలె నితండును సంస్కృత

మునం బలుకఁబడెడు నామములు తెలుఁగున మఱియొక్కవిధముగా వ్రాసినాఁడు. నన్నయ తిక్కనలవలెఁ గథలను బూర్తిగాఁ దీసివేయలేదనునట్లు ప్రవర్తించినాఁడు. పెక్కుచోట్లఁ దనయిష్టమువచ్చినట్లు గ్రంథముచేసి సంస్కృతము ననుసరించియు ననుసరింపకయు నున్నాఁడు.

ఇతనికవిత్వము:—

చ॥ రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగనక్రసం ।
చయములఁజంచలచ్ఛటుల సైనికమత్స్యములన్ మహోన్నతం ।
బయికురురాజచంద్రు నుదయంబునఁ దద్దయుఁబొంగెఁబ్రస్ఫుర ।
ద్భయదమనోహర ప్రకటభంగులఁ దద్బలవార్ధియుద్ధతిన్॥

ఇట్లు సముద్రోపమానంబునొంది యనర్గళమైయుండు. ఇతని కవిత్వమందు జాతీయపదములు తక్కువగా నుండునుగాని జాతీయపదములువేసి చెప్పిన కవిత్వముకన్న నితనికవిత్వము మధురమైయుండును. ఇతఁడును గొన్నియద్భుత ప్రయోగములు చేసియున్నాఁడు. ఇతని కవిత్వాదికము మఱియు నిటపైనరయందగును. ఇట్లు ప్రసిద్ధివహించిన ముప్వురు కవివరేణ్యులు నీమహాభారతమును మూఁడువందల సంవత్సరములకుఁ బరిపూర్తిగఁదెలిఁగించి జగదుపకారంబుఁగావించినారు.

ఇంతవఱకు మనము భారతకవుల వృత్తాంతమును, వారువారు భారతమును రచించిన విషయమును, అందలి రచనాభేదంబులును, శైలియుం గొంచెము చర్చించుకొనియుంటిమి. మఱియును వారెంతవఱకు మూలము ననుసరించినారో యేపద్ధతులమీఁద వారు భారతమును దెలిఁగించినారో వారివారికిం గల భేదములేవ్వో యెవరెట్లు కథాసంవిధానంబున జనరంజకంబు గావించిరో యివి మొదలైన సంగతులు చర్చించుకొనందలంచి ప్రస్తుతము కవిత్వమెట్లుండవలయునో కావ్యములెట్టివి యుత్తమము లనిపించుకొనునో దీనింగూర్చి యించుక విచారించుకొందము.

—:కవిత్వము-కావ్యములు:—

లోకములో నుత్తమోత్తమమైన కవిత్వమెట్లుండవలయునో దానిస్వరూపస్వభావాదు లెట్టివియో తెలిసికొనుటకుందగిన యుత్తమగ్రంథములు మిక్కిలి తక్కువగానున్నవి. గురువులు, లఘువులు, గణములు, యతులు, ప్రాసములు,

ఇవి తెలిసికొనుట కవిత్వలక్షణముకాదని నాయభిప్రాయము. ఏబడిపంతులయొద్ద నైన రెండు కవిత్వపుముక్కలు నేర్చి నిఘంటువులు కొన్ని సంపాదించి

"నడుమన్ వృత్తము వోగణంబులకడన్ బల్గీతలన్ గీయుచున్ ।
వడికిం బ్రాసకుఁ గోశముల్వెదకుచున్ వల్లించుచున్ మాటికిన్ ।
దడకట్లాని దినత్రయంబునకుఁ బాదంబొండుగానల్లు" అనుదాని

కిం బాత్రమగునట్లు కల్లబొల్లి కవిత్వమల్ల నేర్చి లోకస్వరూప స్వభావాదివర్ణ నాకర్ణన పాత్రంబులగు గ్రంథంబులు రచియింపఁజాలక యెవ్వియో కొన్ని చెత్త పుస్తకములు వ్రాసి మహాకవులమని విఱ్ఱవీఁగు నిప్పటికవులు కవులుగారు. వారి కవిత్వము కవిత్వముకాదు. వారికావ్యములు కావ్యములుకావు. మృదుమధుర కవిత్వము తనంతఁదాఁ బుట్టవలయునుగాని తెచ్చిపెట్టుకొనిన రాఁజాలదు. సహజ కవితాధురీణులగు కాళిదాసప్రభృతులు మహాకవులు. వారికవిత్వము కవిత్వము. "విద్యలలో నుత్తమవిద్యకవిత్వము" అని మనతొంటివారు నిర్ణయించినట్లు కవితావిద్యకంటె మనుష్యునిచిత్త మిగురొత్తించువిద్య మఱియొక్కటిలేదు. "గాంధర్వంచ కవిత్వంచ జన్మనాసహసంభవేత్ । ఏకమాపాదమధుర మన్యదా లోచనామృతం॥" అని చెప్పియున్నను గాంధర్వము వినునప్పుడొక్క నిమేషము మాత్రము హృదయంగమంబయి యింపుసేయును. కవిత్వ మట్లుగాక సర్వదా మనంబునందగిలి రమింపఁజేసి పరమానంద మాపాదించుచుండును. కావున నే గాంధర్వమును మధురమునకు మాత్రము పోల్చినాఁడు. కవిత్వమును జచ్చిన వారిని బ్రదికించుటకును బ్రదికినవారిని జావుండఁజేయుటకునుం జాలి మధురము లకెల్ల మధురమగు నమృతమునకుం బోల్చినాఁడు. కవిత్వ మిట్టిప్రభావముగలది గనుకనే "సుకవితాయద్య స్త్రిరాజ్యేన కిం" అని మనవారు చెప్పియున్నారు:—

"చ॥ తెలియఁగఁ జిత్రకారుఁడు మదింగలనేర్పునఁ దీర్చిపూవుఁదీ ।
వలనుమరందముం జిలుక వ్రాసినయట్లు కవీశ్వరుండుమేల్ ।
జలిబిలిపద్దెముల్ రసము చిప్పిలవ్రాసిన వానిలోకులిం ।
పలరగ్రహించి లోనిరుజ లన్నియుఁబో సుఖియింతురెప్పుడున్॥"

అని మనవారు సుకవీశ్వరునిఁ జిత్రకారునకుం బోల్చుదురు. ఇది యుక్తము కాదు. చిత్రకారుని చిత్రములకన్న సుకవీంద్రుని కావ్యచిత్రంబులే మనోహరంబులు. చిత్రకారుఁడు తనచిత్రములో నాయాకాలస్వరూప స్వభావాదులంజూపఁగలఁడు. కాని మనోవ్యాపారచేష్టాదులం జూపఁజాలఁడు. కవియీరెండునుం

దన కవిత్వమున బాహ్యస్వరూప సందర్శనాది సాహాయ్య సంపత్తిననపేక్షింప కయే చూపి పాఠకుల మనఃపద్మము లలరింపఁగలఁడు. మనమెప్పుడుం గని విని యెఱుంగని లోకాంతరార్థంబుల నెల్లం గన్నులఁగట్టినట్లు తనకావ్యమున నగపఱు పఁగలఁడు. చిత్రకారుని చిత్రమునకుఁ గవిత్వమే మూలాధారము. వానిచిత్ర మొక కొన్ని యేండ్లకయినఁ జెడినశించును గాని కవితాచిత్రంబెప్పుడును వినాశనంబులేక కరంబుడంబుమీఱు. ఇట్టి మహాకవిత్వమే కదా రామకృష్ణాద్యుత్తమ పురుష జీవచారిత్రాదులం దెలియఁజెప్పి వారిస్వరూప స్వభావాదులెల్ల మన కంటికెదుం బెట్టుచున్నయది. మనము నట్టి సుకవిత్వ ప్రపంచమునంబడి తత్కాలగతుల మయినట్లగుచున్నారము. యుద్ధాదివర్ణనములందు మనము నడుము గట్టి యుద్ధభూములకురుకునట్టి వారమగుచున్నారము. సీతాద్రౌపదీప్రముఖ పరమ పతివ్రతాశిఖామణులు పరులతాయిడింబడి దుఃఖించుపట్ల మనముఁ గంటనీరు వెట్టుచున్నారముకదా!

" గీ. యతివిటుఁడుగాకపోవరా దస్మదీయ। కావ్యశృంగారవర్ణ నాకర్ణనమున
విటుఁడు యతిగాకపోరాదు వెసమదీయ। కావ్యవైరాగ్యవర్ణ నాకర్ణనమున॥"

అని సంకుసాల నరసింహకవి చెప్పినట్లు మనమాయావర్ణనముల మగ్నులమైయుందు మనుటకింతయును సందియము లేదు.

క. శ్రుతిశాస్త్రాంగపురాణ। ప్రతతియు నితిహాసకావ్యభరతాగమనుల్
స్మృతిసంగీతరతికళా। గతులనలంకృతుల నెఱుఁగఁగాఁదగుఁగవికిన్॥

అట్టిమహాకవి కవిత్వమందలి యాయారసములు వినునప్పుడు, ఆకవి, కాపువానికిఁ గాపువాఁడువలెను గోపునకు గోపుఁడువలెను, బిల్లవానికిఁ బిల్లవాఁడువలెను, బెద్దవానికిఁ బెద్దవాఁడువలెను, రాజునకు రాజువలెను, బంటునకు బంటువలెను, మఱియెవ్వరికెందగినట్లు వారికింబోలఁదోఁచును. కావ్యమునఁబక్కవి బాటసారియు, వేఁటకాఁడు, నాటలవాఁడు, బాటలవాఁడు, నేడ్చువాఁడు, నవ్వువాఁడు, జూదరియుం, జారుండునుఁ జోరుండును, సాత్వికుండును, దామసుండునుం, దపస్వియు, దేవుండునై కానిపించుచుండును. "శ్రు. అగ్నిశ్చచి ప్రతతమశ్చచిర్విప్రశ్చచి॥కవిః" అని వేదముచెప్పుచున్నది కావునఁ బరమపవిత్రుఁడగు నమ్మహాకవి మతగురువునుం బోధింపనేరని పరమార్థంబులెల్ల మనకు బోధించి మంచిమార్గంబునం బ్రవర్తింపఁజేయంగలఁడు గనుకనే సంకుసాల నరసింకవి:—

చ. మనమునఁగొన్న నెవ్వఁగలమాన్పి ఘటింతురుకావ్యసమ్మదం
బనఘ కథాముఖంబున హితాహితబోధమొనర్తురింపుగాఁ
గనుఁగొనుకంటెనస్ఫుతముగా నెఱిఁగింతురతీంద్రియార్థముల్
ఘనమతు లెల్లవారికి నకారణబంధులుగారె సత్కవుల్॥

అనిచెప్పియున్నాఁడు. మనస్తాపోపశమనముం జేసికొనందలంచిన మనుష్యుఁ డట్టిమహాకవినాశ్రయించినచో నతం డమ్మనుష్యునువ్వెత్తుగం గొనిపోయి మనమెప్పుడుంజూడని నందనోద్యాన వనంబులందును బర్వతారణ్య ప్రదేశంబులందును, నదీనదపులినతలంబులందును, బల్లెలం బట్టణంబులం ద్రిప్పిత్రిప్పి తత్తద్విశేషంబులెల్లం దెలియఁజెప్పి యొప్పించి తేర్పఁగలండని నిస్సంశయంబుగం జెప్పఁగలను. కటకటా! యిప్పుడట్టిసత్కవులు మిక్కిలితక్కువయయి పయిపయి వన్నెల్పచరించునట్టి కవులే శ్లాఘాపాత్రులైరి. వారికవిత్వమే స్తోత్రపాత్రం బగుచున్నదిగదా! "కుకవిసందడిఁబొసెరసజ్ఞులకుం గవితావిశేషముల్" అని చెప్పినట్లుత్తమకవులు నుత్తమగ్రంథంబులును బయుటఁబడుట లేదు అది యటుండనిండు.

కవియైనవాఁడు లోకంబులును లోకవృత్తంబులునుందెలుపుచు నీతిదాయకంబగు నొక్కచక్కని కథంగల్పించి దానివలన లోకముననొక క్రొత్తపదార్థముం బుట్టించి తన్కాలంబుననైన జగదుపకారంబున మహాఫలంబునొందియిహపరసాధనంబు గావించుకొననలయును. అట్టికావ్యములలో భారత భాగవతరామాయణాదు లుత్తమోత్తమములు. ఆమహాగ్రంథములనుండి మనము నేర్చుకొని జన్మసాఫల్యముఁ గలిగించుకొనఁదగిన విషయములు వేనవేలుగలవు. జకదేకవేద్యములగు వాని నిటంబేర్కొనుట నిరవసరము. ఇవియన్నియుం జరిగినకొంత కథంగ్రహించి రచియింపఁబడినవి. కాని కల్పితములుకావు. కావని కవుల కట్టుఁ బాటులకుం దానకంబులును గాలేవు. కావునఛాయామాత్రముగఁ గథకల్పితముకాకున్నను దక్కినసర్వవిషయంబులును గల్పితములై జగదనుసంధానము చేయఁబడినవికావునఁ గల్పితగ్రంథముల వైయనల్పఫలదాయకములగుచున్నవనుట నిర్వివాదాంశము. మఱియును సంస్కృతంబున నిట్టివి పెక్కులున్నవికాని తెలుఁగునమిక్కిలి తక్కువగానున్నవి.

అందుఁగథామాత్రమేకాక తక్కిన పెక్కువిషయములు సంస్కృతాదులనుండి గ్రహింపఁబడుచున్నవికావునఁ దక్కువయనుటకుం గారణంబు కలిగినది.

అట్టికల్పితగ్రంథములలోఁ దెలుఁగున మొట్టమొదటిది పింగళిసూరనార్యుని కళాపూర్ణోదయము. అందలి కథాసంవిధాన చమత్కారములు చదివితీరవలయును గాని చెప్పుటకు శక్యములుకావనుట యతిశయోక్తికాదు. ఇట్టికల్పితగ్రంథము లుత్తమములు. భాషాంతరీకరణములు మధ్యమములు. అశ్లీలవ్రీడాదు లలంకారంబులై దుర్నీతిని బోధించు చుండునవి యధమంబులు. ఇట్లుమూఁడుతెఱంగుల గ్రంథములు విరాజిల్లుచున్నయవి. భాషాంతరీకరణగ్రంథములకన్నఁ గల్పితగ్రంథములు స్వేచ్ఛందగిలియుండును. కావున సర్వవిషయంబులును గవిచర్చించుటకు వ్యవకాశముగలిగి విశేషోపయోగకరంబులగును. భాషాంతరీకరణములలోఁ గావ్యనాటకాదులందుఁ గవికింతయును స్వేచ్ఛలేదు. వాని బుద్ధినుపయోగింపవలసిన యవసరమును లేదు. భారతాదుల భాషాంతరీకరణము కొంచెమించుమించు కల్పితమునేపోలి యున్నదని చెప్పియుంటినిగదా! మన నన్నయతిక్కనాదులు కేవలకల్పితగ్రంథములనే రచింపక సంస్కృతానుసరణగ్రంథములేలచేసిరో యని శంకించుకొనినయెడల భారతాదులలోని నీతులెంతయును లేమిం జేసి సంస్కృతమురానివారి కవి యన్నియుం దెలిసికొనుట యావశ్యకమని యాకొఱతం దీఱుపనట్లుచేసి లోకోపకార పారీణులైరని సమాధానము చెప్పుకొనుచు మనకవిత్రయము వారెట్లుభారతమును దెలిఁగించిరో దానింబ్రస్తుతమునకుం దెత్తము.

కవిత్రయమువారు భారతమును మక్కికి మక్కిగాఁ దెలిఁగింపలేదనియుఁ గథానుసరణరూపంబుగఁ దెలిఁగించిరనియు నిదివఱకే మాచదువరు లెఱింగియున్నారు. భారతరచనయం దీషద్భేదము నొందియున్నను వారుముగ్గురు నొకమార్గముననే ప్రవర్తించినారు. కొన్నిచోట్ల మూలము ననుసరించినారు. కొన్నిచోట్లదానికి దవ్వయినారు. అట్టివారు భారతమెట్టిమెట్టి భేదంబులఁ దెలిఁగించినారో యెవరికవిత్వమహత్వం బెట్టిదో యీక్రిందవివరించుకొందము...అందు మొదట సంస్కృతానుసరణము:—

సంస్కృతభారతము - నన్నయతెలుఁగు.

"శ్లో॥ య ఐరావతరాజాన స్సర్పా స్సమితిశోభనాః।
స్ఫురంత ఇవ జీమూతాస్సవిద్యుత్పవనేరితాః।
సురూపా బహురూపా శ్చ తథా కల్మాషకుండలాః।
ఆదిత్యవ న్నాగలోకే రేజు రైరావతోద్భవాః।

బహూని నాగవేశ్మాని గంగాయా స్తీర ఉత్తరే।
తత్రస్థానపి సంస్తౌమి మహతః పన్నగా నహం।
ఇచ్ఛేత్కోఽర్కాంశు సేనాయాం చర్తు మైరావతం వినా।
శతా న్యశీతి రష్టౌ చ సహస్రాణి చ వింశతిః।
సర్పాణాం ప్రగ్రహా యాంతి ధృతరాష్ట్రో యమేజతి।
యేచైన ముపసర్పంతి యే చ దూరపథంగతాః।
అహ మైరావతజ్యేష్ఠ భ్రాతృభ్యోఽకరవం నమః।
యస్య వాసః కురుక్షేత్రే ఖాండవేచాభవ త్పురా।
తం నాగరాజ మస్తౌషం కుండలార్థాయ తక్షకం।
తక్షకశ్చాశ్వసేన శ్చ నిత్యం సహచరా వుభౌ।
కురుక్షేత్రే చ వసతాం నదీ మిక్షుమతీ మను।
జఘన్యజ స్తక్షకస్య శ్రుతసేనేతి య స్సుతః।
అవసద్యో మహద్యుమ్ని ప్రార్థయ న్నాగముఖ్యతాం।
కరవాణి సదా చాహం నమ స్తస్మై మహాత్మనే॥"

ఈతొమ్మిదిశ్లోకములు నాలుగుపద్యములుగా నన్నయభట్టారకుఁడు తెలిఁగించినాఁడు.

చ॥ బహువనపాదపాబ్ధికుల పర్వతపూర్ణ సరస్సరస్వతీ।
సహితమహామహీభర మజస్రసహస్రఫణాళి దాల్చి దు।
స్సహతరమూర్తికిం జలధిశాయికిఁ బాయక శయ్యయైనయ।
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్॥

చ॥ అరిదితపోవిభూతి నమరారుల బాధలు వొందకుండఁగా।
నురగుల నెల్లఁ గాచిన మహోరగనాయకుఁ డానమత్సురా।
సురమకుటాగ్రరత్నరుచి శోభితపాదున కద్రినందనే।
శ్వరునకు భూషణంబయిన వాసుకి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్॥

ఉ॥ దేవమనుష్యలోకములఁ ద్రిమ్మరుచున్ విపుల ప్రతాపసం।
భావితశక్తిశౌర్యులు నపారవిషోత్కటకోపవిస్ఫుర।
త్పావకతాపితాఖిలవిపక్షులు నైనమహానుభావులై।
రావతకోటిఘోరఫణిరాజులు మాకుఁ బ్రసన్నులయ్యెడున్॥

ఉ॥ గోత్రమహామహీధరనికుంజములన్ విపినంబులన్ గురు।
క్షేత్రమునం బ్రకామగతి ఖేలననొప్పి సహాశ్వసేనుఁడై ।
ధాత్రిఁ బరిభ్రమించుబలదర్పపరాక్రమదక్షుఁ డీక్షణ ।
శ్రోత్రవిభుండు దక్షకుఁడు శూరుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్॥

మూలముతోఁ బోల్చి చూడక విడిగాఁ జదివినప్పు డీపద్యములు మిక్కిలి మనోహరముగా నుండును. ఇందు 1. 2 పద్యములు మూలములో లేనివి క్రొత్తగాఁ జేర్పఁబడినవి. 3-వ పద్యమును మూలము ననుసరింపకున్న నైరావత పద మొక్కటి యున్నది గావున మూలార్థ మనందగు. 4-వ పద్యము కొంచెము మూలము ననుసరించుచున్నది.

"శ్లో॥ అహాని యుయుధే భీష్మో దశైవ పరమాస్త్రవిత్ ।
అహాని పంచ ద్రోణస్తు రరక్ష కురువాహినీం ।
అహానీ ద్వేతు యుయుధే కర్ణః పరబలార్దనః ।
శల్యోఽర్థదివసం చైవ గదాయుద్ధ మతఃపరం ।
దుర్యోధనస్య భీమస్య దినార్ధ మభవ త్తయోః ।
తస్యైవ దివసస్యాంతే ద్రౌణి హార్దిక్యగౌతమాః ।
ప్రసుప్తం నిశివిశ్వస్తం జఘ్ను ర్యౌధిష్ఠిరం బలం॥ "

ఈ శ్లోకములకు నన్నయభట్టారకుం డొక తరళపద్యము వ్రాసి తదర్థముసే మఱల కందము వ్రాసినాఁడు. ఆరెండు పద్యముల నీక్రింద వ్రాయుచున్నాను.

"తరళము॥ పదిదినంబులు భీష్ముఁ డాహవభారకుండు గురుండు పం।
చదివసంబులు కర్ణుఁడున్ దివసద్వయంబు దినార్ధమం।
దుదితతేజుఁడు శల్యుఁ డత్యధికోగ్ర వీరగదారణం ।
బది దినార్ధము గాఁగ నిట్లు మహాభయంకర వృత్తితోన్ ॥"

క॥ పదిదినము లైదు ప్రొద్దులు । పదపడి రెన్నాళ్లు నొక్కపగలున్ రేయున్ ।
మదమున రణమొనరించిరి । నదిసుత గురు కర్ణ శల్య నాగపురీశుల్॥ "

ఇందుఁ దరళము కొంతవఱకు మూలము ననుసరించినది కాని శల్యనాగపురీశులు నొక్క పగలు నొక్క రేయు నని చెప్పుటచేతను కందము విపరీతార్థమును గల్పించినది. ఇది కొన్ని ప్రాంతప్రతులయందుఁ గన్పట్టదు గావునను, నన్నయభట్టు చెప్పినయర్థమునే మఱలఁ జెప్పనివాఁ డగుటంబట్టియుఁ గంద

పద్యము ప్రక్షిప్తమని నాయభిప్రాయము. ఈ రెండు పద్యములయందును మూలమునందున్న రాత్రి యర్థము, అనఁగా నశ్వత్థామ నిద్రితులం జంపుట సూచింపఁబడియుండ లేదు.

శ్రీకృష్ణభారతమున :—

"చ॥ పదిదినముల్ నదీసుతుఁడు పంచదినంబులు కుంభజుండు రెం।
డు దినము లంగభూమివిభుఁడుర్ దివసార్ధము మద్రరాజు న।
ర్ధదినము కౌరవేశుఁ డలరాత్రిఁ గృపాదులఁ గూడి ద్రోణియుర్।
మదమునఁ బోరి రాహవమున న్వెనుఁదీయక శత్రుసేనతోర్॥"

ఆదిపర్వము. పంచేంద్రోపాఖ్యానము.

"శ్లో॥ తమబ్రవీద్భగవానుగ్రతేజా మైవం పునశ్శక్ర కృథాః కథంచిత్।
నివర్తయైనంచ మహాద్రిరాజం బలం చ వీర్యం చ తథాప్రమేయం।
ఛిద్రస్యచైవావిశ మధ్యమస్య యత్రాసతే త్వద్విధాసూర్యభాసః।
సతద్వివృత్య వివరం మహాగిరేస్తుల్యద్యుతీం శ్చతురోన్యార్ దదర్శ॥"

క॥ గర్వించిపలికి తగునీ। గర్వము భుజవీర్యమును బ్రకాశంబుగనీ।
పర్వతవివరము దెర్చివి। గుర్వింపుము చూతమనిన గోత్రభిదుండుర్॥

సీ॥ హరువచనమున నాగిరిరాజ వివరంబుఁ గరములఁ బట్టి చెచ్చెర దినేశ।
చండమయూఖముల్ రెండువిధంబులై యుండంగఁ దెర్చి యాఖండలుండు।
దనయట్టివారల ఘనశరీరులనందు నలువుర నన్యుల వెలయఁజూచి॥ ...

ఇందు విగుర్వింపుము మొదలగు శబ్దములు క్లిష్టార్థము లగుటయే కాక "దినేశచండ మయూఖములు రెండువిధములై యుండంగఁ దెర్చి" అని యున్నది. ఇది మూలార్థమును స్పృశింపక మఱియొక యద్భుతార్థమును వెల్లడించుచున్నది. ఈపద్యము లేఖకపాఠకులవలన నిట్లు మాఱిపోయిన దేమో యని నాతలంపు. ఇంక తిక్కన సోమయాజి భాషాంతరీకరణము :—

సంస్కృతము - తిక్కనసోమయాజి.

"శ్లో॥ వృకోదరవిరాటేత్వం వత్స్యసే కేనహేతునా।"

ఈ శ్లోకార్థమును పురస్కరించుకొని సోమయాజి :—

"సీ॥ కడిమిమై సౌగంధికమున యక్షులమద మడఁచి కృష్ణకుఁబువ్వులట్లు తెచ్చెఁ।
గిమ్మీరదానవు నమ్మేయి నిర్జించి విగతకంటకము గావించె వనము।

బకదైత్యుఁ దొడరి యాభంగి రూపరఁజేసి రక్షించె నేకచక్రాపురంబు।
నప్పాటఁబ్రబలు జటాసురునడరి దండితుఁజేసి మనలఁ బెట్టించుకొనియె।
తే॥ నితఁడు పుట్టినకోలెను నెసకమెసఁగ।
దర్పమునన వర్తిల్లెనుదగ్రమూర్తి।
యకట యొరుచిత్తమున కెక్కునట్లుగాఁగ।
మెలఁగి యేమివిధంబునఁ గొలుచువాఁడు॥—"

అని పెంచి వ్రాసినాఁడు. మూలములో ధర్మరాజును గూర్చి యస్టునుఁడును, అర్జునుంగూర్చియు, ద్రౌపదింగూర్చియు, ధర్మజుఁడును, ఇట్టి సమయంబున నెట్లు విరాటుపాలఁ బ్రవర్తించువారో యని నిర్వేదించుచుం బలికినట్లు మూలముననుండి భీమసేన నకుల సాత్యకులకు నందు ముఖ్యముగా భీమునకు నట్లు లేమి యనుకూలముగ లేదని సోమయాజి యిట్లు పెంచి వ్రాసియుండు ననియు నిది తగుననియు నా యభిప్రాయము.

"శ్లో॥ తతః కేశాన్ సముత్క్షిప్య వేల్లితాగ్రా ననిందితాన్।
కృష్ణాన్ సూక్ష్మాన్ మృదూన్ దీర్ఘాన్ సముద్గ్రథ్య శుచిస్మితా।
జుగూహే దక్షిణే పార్శ్వే మృదూ నసితలోచనా।
వాసశ్చపరిధాయైకం కృష్ణా సుమలినం మహత్।
కృత్వా వేషంచ సైరంధ్ర్యాస్తతో వ్యచరదార్తవత్॥"

"క॥ గారవమున నిజదేశా। చారము మైనల్లియున్న జడయగుకబరీ।
భారంబువిచ్చి తుఱుముగ। సైరంధ్రీజాతివేషసముచిత భంగిన్॥"
క॥ వలపలి దిక్కునకించుక। మలఁగంగాఁ దుఱిమికురులు మాపుసుపుట్టం।
బలవడఁగట్టి జటావ। ల్కలమున నవ్వేఁగుఁ జన్నుఁగవఁగప్పి తగన్॥
క॥ పరిచారికాత్వరేఖా। పరిణతిఁదనమేననచ్చువడ భావనకుం।
దిరమై తలకొనునంతః। కరణముతోఁ బురము ద్రుపదకన్యక సొచ్చెన్॥"

ఇట్లు తెలిఁగింపఁబడినది. మూలమందున్న ద్రౌపదీవేషము సరిగఁ దెలుఁగున రాలేదనియు, మొదటి పద్యము మూలార్థము నతిక్రమించినట్లు యున్న దనియు, మూఁడవపద్య మధికమనియుఁ దలంపనగు. ఉద్యోగపర్వమున శ్రీకృష్ణ భగవానులు:—

"శ్లో॥ అధర్మయుక్తం నచకామయేత రాజ్యంసురాణామపి ధర్మరాజః।
ధర్మార్థయుక్తంతు మహీపతిత్వం గ్రామేపికస్మింశ్చిదయంబుభూషేత్॥"

"గీ॥ ధర్మమార్గంబు తప్పక తలఁపుఁడొక్క । తెఱఁగుధర్మువుతప్పియుధిష్ఠిరుండు।
వడయనోడఁబడఁడయ్యెంద్రపదవిమైన। నుచితగతి నెంతవడసిననుల్లసిల్లు॥"

ఇట్లే యితని భాషాంతరీకరణమంతయు నుండు. ఇంక నేఱ్ఱాప్రెగడ భాషాంతరీకరణము.

సంస్కృతము - ఏఱ్ఱాప్రగడ.

"మూ॥ కిమహమేనం న ప్రతిజ్ఞాస్యామీహ॥"

దీనికి మానుగం బెంచి మనోహరముగా :—

"ఉ॥ అక్కట నేనెఱుంగనె మహాగుణభూషణు నమ్మహాత్ము న।
న్నిక్కడఁ బెక్కుమాఱులు ననేకభయంబులఁ బొందకుండఁగా।
నక్కటికంబుతోడఁ దగనాతఁడు గైకొని కాచెఁగాదె పెం।
పెక్కిన యన్నరేశ్వరుని నెన్నఁటికి న్మఱవంగవచ్చునే॥"

ఆరణేయ పర్వప్రారంభమున బ్రాహ్మణుండు ధర్మజునితో :—

"శ్లో॥ అరణీసహితం మంథం సమాయుక్తం వనస్పతౌ।
మృగస్యఘర్షమాణస్య విషాణే సమసజ్జత।
తమాదాయతతోరా జం స్త్వరమాణో మహామృగః।
ఆశ్రమాంతరితః శీఘ్రం ప్లవమానో మహాజవః।
తస్యదత్వా పదంరాజన్నాసాద్యచ మహామృగం।
అగ్నిహోత్రంనలుప్యేత తదానయతపాండవాః॥"

ఈ శ్లోకములకు రెండు కందములు చేసినాఁడు.

"క॥ తరుశాఖఁ దగిల్చిననా। యరణి యొకమృగంబు వచ్చి యతిరయమునన।
త్తరువున నొరసికొనంగా। ధరణీశ్వరతగిలెఁ జువ్వె తచ్ఛృంగమునన్॥
క॥ దానిఁ గొనిపఱచె నమ్మృగ। మానతరిపులోక నాకు నయ్యరణిఁ దగం।
గానిపుడు దేరఁబనుపవె। భూనుతనిత్య విధిలోపమునఁ జెడకుండన్॥"

ఈయాంధ్రీకరణము కొంచె మించు మించు మూలమునకు సరిపడి యున్నది. ఎట్లు చూచినను నెఱ్ఱాప్రెగడ కవిత్వము సరిపడియే యుండును. నన్నయ తిక్కనల కేఱ్ఱాప్రగడ చాలఁడను కింవదంతిని బురస్కరించుకొని యెంత నిరసన భావముతోఁ జూచినను బ్రబంధపరమేశ్వరుని కవిత్వము తక్కిన కవిత్వములకు సాటివచ్చునట్లు నాకుఁ గానుపించును గాని తక్కువగాఁ గానుపించుట లేదనుట

సత్యమునకు దూరము గాదు. మఱియును వారిలో నెవరి కవిత్వ మెట్టి సౌష్ఠవంబునం బడి యున్నదో కొంచెము విమర్శించి చర్చించుకొందము :—

"ఉ॥ క్షత్రియవంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణా।
క్షత్రియవైశ్య శూద్రులనఁగాఁ గల నాలుగు జాతులన్ స్వచా।
రిత్రము దప్పకుండఁగఁ బరీక్షితుఁగాచిన యట్లు రామహూం।
ధాత్రి రఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యేయుగంబులన్॥"

(నన్నయభట్టారకుఁడు)

"ఉ॥ క్షత్రియుఁ డోడునే తగదు కౌరవరాజ యొకండ నేఁ బృథా।
పుత్రుల లోనఁ బిన్న నినుఁ బోరికిఁ బిల్వఁగఁ బోక పాడియే।
ధాత్రిఁ బ్రసిద్ధి కెక్కి బలదర్పసమగ్రుఁడ నైన నీపునీ।
మిత్రులుగూడ నిట్లయిన మెత్తురె వత్తురె కొల్వ భూభుజుల్॥"

(తిక్కనసోమయాజి)

"ఉ॥ అత్రినిజంబు పల్కెఁ దగునాతనివాక్యము ధర్మయుక్త మిా।
ధాత్రి సమస్తముల్ భవదుదగ్రభుజాగ్రమునందుఁ దాల్చు స।
త్క్షత్రియుఁ డెల్లవారలను గావను బ్రోవఁ బ్రభుండు గావునన్।
శత్రునిషూదనుం డతఁడె శక్రుఁడు నీశ్వరుఁడున్ విధాతయున్॥"

(ఎఱ్ఱాప్రగ్గడ)

ఈపద్యము లొక్కప్రాసముగలవి యనిమాత్ర మిట సంగ్రహింపఁబడియె. వీనివలన వారికవిత్వ మిదమిత్థ మనుటకు వలనుపడదు. ఇవి యొండొకటికి మాతృకలు పుత్రికలునని యెన్నఁదగి యున్నవి. మూఁడు పద్యములందును క్షత్రియ శబ్దమున్నది. రెండింటిలో ధాత్రియున్నది. కాని నన్నయ పద్యమును నెఱ్ఱాప్రగడపద్యమును మిక్కిలి దగ్గఱలో నున్నవి. ధరణీప్రజలను గాచి రక్షించుట మొదలయిన క్షత్రియలక్షణము చెప్పఁబడియున్నది. తిక్కనసోమయాజి పద్యములో నట్టి లక్షణము చెప్పఁబడియుండలేదు గాని రాజనీతియును పౌరుషమును సూచింపఁబడియున్నవి. మొదటిపద్యమున నన్వయము సుగమము కాదు. మూఁడవదానిలో భవచ్ఛబ్ద స్వారస్యమేమియో తెలిసికొనవలసియున్నది. కావున నిందు మొదటిది కడపటిదిగాను రెండవది మొదటిదిగాను గడపటిది రెండవదిగాను జెప్పుకొనవచ్చును.

## వనవర్ణనము.

మానిని॥ పచితనర్చి తలిర్చిన గ్రోవుల నిమ్మ గుత్తావుల జొంపములన్।
బూచినమంచియశోకములన్ సురపొన్నలఁ బొన్నల గేదగులన్।
గాచి పెడంగుగఁ బండిన యాసహకారములం గదళీతతులం।
జూచుచు వీనుల కింపెసఁగన్ వినుచున్ శుకకోకిలసుస్వరముల్॥ ''

(నన్నయభట్టు)

సీ॥ కమనీయ కమలినీ కల్లోల వీథులఁ గదలురాయంచలగతులయొప్పు।
బహుపుష్పపల్లవ ప్రకరచిత్రితములై తనరారు తరులతాతతులసొంపు।
మకరందరసపాన మదవిలోలంబులై క్రాలెడి మెలఁదేఁటిగములయులివుఁ।
బరిపక్వమంజుల ఫలరసోద్ధతములై పలుకురాచిలుకల పటురవంబుఁ॥
ఆ॥ ప్రియుఁడు వేఱువేఱఁ బ్రీతిమైఁ జూపుచుఁ।
జెప్పుచును జనంగఁ జిగురుఁబోఁడి।
కనుచు వినుచు నిర్వికారసల్లాపంబు।
లార నతని తెఱఁగు నరయుచుండె॥ (ఎఱ్ఱాప్రగడ)

సీ॥ చంచులఁ జిగురాకుఁ జించియాడుచు నలి।
నెలుఁగిచ్చుగండుఁ గోయిలలసొంపు,।
నలరుఁదేనియఁ గ్రోలి యొలయుసోలంబున।
మురియు తేఁటులనును మ్రోఁతయింపుఁ,।
దమిఁ బండ్లరస మాని తమలోనఁ జెలఁగుచుఁ।
బల్కు రాచిల్కల పదువురంగుఁ।
గొలఁకులఁ గెలఁకులఁగూడి క్రీడించుచుం
డెడునంచతండంబు నడబెడంగుఁ॥
తే॥ దరగఁదేలుచుఁ బూఁదీఁగఁ దగులువడుచు।
వచ్చుచిఱుగాలి సోఁకున కిచ్చమెచ్చి।
తగిలికొని యాడుచును వినతయును గద్రు।
వయును మున్నిటిచేరువవనమునందు॥ (తిక్కనసోమయాజి)

ఈ మూఁడు పద్యములును వనవర్ణనములోనివని గాని వసంతవర్ణనములోనివని గాని చెప్పుకొనవచ్చును. నన్నయపద్యము వనవర్ణనమనిన నొప్పును

గాని తక్కినవి వసంతవర్ణనములనియే చెప్పనొప్పు. ఈమూఁడు పద్యములును స్వభావోక్త్యలంకారమునే బోధించుచున్నవి. నన్నయపద్యము చిన్నదియైనను జాతిలోఁ బెద్దదిగానే యున్నది. తిక్కనపద్యమునుజూచి యెఱ్ఱన తనపద్యమును వ్రాసెనని తోఁచెడిని. తిక్కనసోమయాజి 4-2-3 చరణంబులంబోలి యెఱ్ఱాప్రెగ్గడ 1-3-4 చరణంబులు శబ్దభేదముతక్క యర్థభేద మిసుమంతయును లేక యున్నవి. చిత్తగింపుఁడు.

మఱియు నన్నయభట్టు:—

లయగ్రాహి॥ కమ్మనిలతాంతములకు మ్మొనసివచ్చుమధు
పమ్ములను గీతనినదమ్ము లెసఁగం జూ।
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధిమ్ముకు
శమ్ములను నానుచు ముదమ్మొనర వాచా
లమ్ములగు కోకిలకులమ్ము లరవమ్ముమధు
రమ్ముగుచు వీఁచెననిశమ్ము సుమనోభా।
రమ్మున నశోకనికరమ్ములును జంపకచ
యమ్ములును గింశుకవనమ్ములును నొప్పెన్॥

ఇట్లు మనోహరంబుగా యథావద్వస్తు వర్ణనము చేసియున్నాఁడు.

స్త్రీవర్ణనము.

సీ॥ పలుకులముద్దును గలికిక్రాల్గన్నుల తెలుపును వలుఁదచన్నుల బెడంగు।
నలఘుకాంచీపదస్థలముల యొప్పును లలితాననేందు మండలమురుచియు।
నళినీలకుటిలకుంతలముల కాంతియు నెలజవ్వనంబున విలసనమును।
నలసభావంబును బాలుపును మెలపునుగలుగు నగ్గిరికను దలఁచితలఁచి॥
(నన్నయభట్టు)

ఇందుఁ బ్రథమపాదాంతమును మనవనాగరకు లింతగ ర్హింతురేమో చెప్పఁజాలను గాని పద్యమంతయు మిక్కిలి మనోహరముగా నున్నదని చెప్పఁగలను. మఱియు నాలవపాదము నిరుపమానమైన దనియు నిట్లువర్ణించుట మఱియొకనికిఁ బట్టువడదనియుం గూడఁ జెప్పఁగలను.

సీ॥ అల్లఁదనంబున నమవుకైకొనఁజూచు నడపుకాంతికి వింతతోడవుగాఁగ।
వెడవెడనూఁగాడవింతయై యేర్పడఁదారని వళులలో నారు నిగుడ।

నిట్టలుద్రోచుచు నెలవులకలమేరతెల్లనుజిగిమెక్కి యేర్పడంగ। [రం
వెలుపునుగప్పానువెలయంగమెఱుంగెక్కి తారకంబులంగల్కి తనముదొడ
జరణములును నడుము జన్నులు గన్నులు।
జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు।
చునికిం దెలుపుచుండ నుత్తరసనుదెంచె।
నలరుమరుని పువ్వుటమ్ముఁబోలె॥ "
ఇందుఁ దెలుఁగుపదము లధికతరం బొరసియున్నవి.

సీ॥ మెలఁతలవాలిక మెఱుఁగుకన్నుల యొప్పుఁ
చెలినవ్వు మొగముల విలసనంబు

తే॥ నడబెడంగులు నన్ను వనడుములందు।
వెలయువళుల భావంబులు వలుఁదచన్నుఁ।
గవల్ననిక్కును నేర్పడఁ గనికరంగి। ?
మదనమార్గణ విదళిత హృదయుఁడయ్యె॥ (ఎఱ్ఱాప్రగడ)

ఇది నన్నయపద్యముం బోలియున్నది. అందు శబ్దమున కిందుస్వారస్యము విచారింపఁదగు. ఇంకఁ గల్పనాచమత్కారముం గూర్చి చర్చింతము.

నన్నయభట్టారకుని కథపటిపద్యము.

ఉ॥ శారదరాత్రు లుజ్జ్వల లసత్తరతారక హారపంక్తులం।
జారుతరంబులయ్యె వికసన్నవకైరవ గంధబంధురో।
దారసమీర సౌరభముదాల్చి సుధాంశు వికీర్యమాణక।
ర్పూరపరాగపాండు రుచిపూరములం బరిపూరితంబులై॥

ఇందు శ్రీధ్వనించుచున్నది. ఈపద్యము చదువునప్పుడు దీనియందలి స్వభావోక్తివలన మనకునాశ్వయుజ కార్తికమాసంబులలోని వెన్నెలరాత్రులు జ్ఞప్తికి వచ్చును గదా. ఆరాత్రులయందొక పల్లెయందుఁగాని పట్టణంబునందుఁ గాని వెన్నెలబయలంగూరుచుండి వికసించిన కలువపూవులనుండి వచ్చినసమీర సౌరభము నాస్వాదించునప్పు డెట్లుండునో యీపద్యము చదువునప్పుడు నట్లుం డుననుటకు సందియములేదు. ఇట్లున్న దానికే జీవకవిత్వమని మనపెద్దలు వ్యవహరించినారు. మఱియు నిందు......"శారదరాత్రులు సుధాంశు వికీర్యమాణ కర్పూర......పూరితంబులై ఉజ్జ్వలలసత్ ......తారకహారపంక్తులం జారుతరంబులయ్యె" అని వర్ణించినాఁడు. కవులెవ్వరును వెన్నెలయుఁ జుక్కలు

నేకకాలావచ్ఛిన్న భాసమానముగా వర్ణించియుండ లేదు. చంద్రోదయము కాఁగాఁ జుక్కలు పోవునట్లుగానే చెప్పియున్నారు. ప్రత్యక్షము నట్టిదియే. అట్టిచో నిట్లు నన్నయభట్టారకుండు చెప్పుటకు నేమి కారణమో విచారింపనగు. తిక్కన సోమయాజి యభిమన్యుని వివాహ సమయమున :—

“క॥ పెనుఁగుదుటనిడినచూతం। బునునవమాలికయుఁబోలెఁ బొలుపొందిరతం।
దును నమ్ముగ్ధయునేకా। సనమున నున్నపుడు నూత్న సౌభాగ్యమునన్॥”

ఈ పద్యమువలన మండిగలలో మొక్కలు పెంచు నాచారము మన దేశమునఁ దొల్లిటినుండియుఁ గలదని తెలియఁబడుచున్నది. ఏకాసనగతులగు వధూవరులొక కుదిటిలో మొలపించిన విరజాజియు మావిమొక్కయు నెట్లుండు నట్లుండిరని సరసముగా వర్ణించినాఁడు. ఇది మిక్కిలి మనోహరమై యున్న దనుట కిందలి నూత్న సౌభాగ్యమే సాక్ష్యమిచ్చుచున్నది.

ఎఱ్ఱాప్రగడ శరద్వర్ణనమున.

తే. విశదశారదాంబుద పరివేష్టనమునఁ।
బొలుచుగగనంబు ప్రతిబింబమో యనంగ।
వికచకాశవనీ పరివేష్టనమున।
నతిశయిల్లె నిర్మల కమలాకరములు॥

చెఱువులు మొదలగునవి శరత్కాలమునఁ దేరి నిర్మలజలపూరితములై యుండును. ఆకాశప్రతిబింబములని చెప్పుటచేతఁ గమలాకరములు మిక్కిలి పెద్దవియని తేలుచున్నది. కమలాకరములచుట్టును ఱెల్లుపూచియున్నదని చెప్పుటచే నాగరకసౌందర్యమునకుఁ గొంతలోపమో యనియు ఱెల్లుపువ్వంతయు నాకొలఁకునంబడి నీళ్ళకుఁ గల్మషముం గలిగించుననియుఁ దెలియందగు. శరత్కాలమును వర్ణించుచు “విశదశారదాంబుద పరివేష్టనమున” అని చెప్పుటకన్న “విశదాంబుద పరివేష్టన” మనిన నభిప్రాయము సరిపడియుండుననియు నాయభిప్రాయము. ఇంకరసము లలంకారములంగూర్చి యించుక చర్చించుకొందము.

నన్నయభట్టు నలోపాఖ్యానమున:—

“సీ॥ కలహంసపలికిన పలుకులు గణియించు వడిదానిపోయిన వలనునూచుఁ।
బలుకదు సఖులతో లలితాంగి మిన్నక యలయుచునుండు దా ననుదినంబుఁ।
చారువిభూషణా హారవిహార శయ్యాసనభోగంబులందు విముఖ।
యయిరేయుఁ బగలు నిద్రయునెప్పునెఱుఁగక దమయంతినలుఁడనుధరణీనాథు॥

"ఆ॥నందబుద్ధినిలిపి కందర్పబాణత । యగుచునున్న యది ధరాధినాథ।
ధరణిపతుల నెరుల నురుగుణాఢ్యులవిన। నెల్ల దెంతవిభవయుక్తునైన॥"

ఇందు విప్రలంభశృంగారము వర్ణింపఁబడినది. అలంకారము స్వభావోక్తి. ఇత్యాద్యలంకారము లితనికవిత్వమందు విభూషణంబులై విరాజిల్లుచున్నవి.

తిక్కనసోమయాజి.

"శా॥ శక్తిస్ఫారధనంజయాయతభుజాసంరంభగాండీవని।
ర్ముక్తక్రూరశరావళీ దళితశత్రువ్రాతముల్ శోణితా।
సిక్తాకారతఁ బొంది సాంద్ర కుసుమశ్రేణీ వికాసోల్లస।
ద్రక్తాశోక తరువ్రజంబుల క్రియన్ రంజిల్లిరొప్పెంగడున్॥"

ఇందు వీరరసము వర్ణింపఁబడినది. అలంకారము. ఉపమ.

ఎఱ్ఱాప్రగడ సావిత్రీచరిత్రమున.

"చ॥ ఒడలువశంబుగాదు భ్రమనొందినయట్లు మనంబుదూలెడిన్।
గడఁగిశిరంబు శూలవిశిఖ ప్రకరంబుల నొంచినట్టిద।
య్యెడు నిలువంగనోర్వ నొకయించుకసేపు శ్రమంబుదీరనీ।
యెడ శయనింతు నావుడు సితేక్షణమెత్తని సంభ్రమంబుతోన్॥"

ఇందుఁ గరుణరసము వర్ణింపఁబడినది. అలంకారము.—ఉత్ప్రేక్షానుప్రాణితస్వభావోక్తి.

మఱియుం గవిత్రయమువారు భారతమునం గల పాత్రముల నెవ రెట్లు మార్చి యోగ్యతాయోగ్యతలంగూర్చి చర్చించిరో, కథాసంవిధానంబున నెవ రెట్లు జనరంజకంబుగావించిరో, ఎవరికవిత్వము రసవంతముగానున్నదో, ఎవరి వర్ణనాంశములు మనోహరములో, ఇత్యాది విషయము లెన్నియో యిటుఁ జర్చించి వ్రాయవలసియున్నది గాని గ్రంథవిస్తరభయంబునం జేసియు నాకుఁ దీరిక లేమిం జేసియు, నాయావిషయములెల్ల మఱియొకప్పుడు వ్రాసి ప్రకటింప నెంచి పండితులదయకుం బాత్రుండనై యిప్పుడింతతో విరమించుచున్నాఁడను.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.



# కావ్యగీతము.

---

సుకవిమూర్ధన్యభావంబో • ధకములైన
లలితసూక్తులనక్షరం • బులుగఁ జేయు
నిస్తులంబైన వరలేఖి • నీముఖంబు
సుప్రసన్నప్రభావంబుఁ • జూపుఁగాక !

(౦)

రథ్యములఁ గోలుదినరాజు • రథముఁద్రిప్పి
మహీజనంబుల వడఁకించు • మంచువిప్పి
తరువరంబులజీర్ణప • త్త్రములదూసి
విశ్వమెల్లెడనాశల • వెలయఁజేసి
వత్సరముతోడశిశిరంబు • వదలిపోవ
విరిసరులతోడ నలరుదె • మ్మెరలతోడఁ
దలిరుగొమ్మలతోడఁ గో • కిలలతోడఁ
గమ్మపుప్పొళ్లతోడ భృం • గములతోడ
వల్లరులతోడ నిత్యోత్స • వములతోడ
మేలిదినములతోడ యా • మినులతోడ
నల్లనల్లనమధుమాస • మరుగుదెంచె;
నైననేమాయెశాశ్వత • మైనదేది ?
కాంచుచుండంగనిదియును • గడచిపోవు;
నిట్టిశిశిరవసంతంబు • లేమిలెక్క ?
యెన్నికల్పాంతరంబులె • న్నెన్నియుగము
లెన్ని యేండ్లెన్నియాయనంబు • లెన్ని ఋతువు
లెన్ని నెలలెన్నిపక్షంబు • లెన్ని దినము
లెన్ని రేలెన్నియామంబు • లెన్ని గడియ
లెన్ని నిమిషంబులీరీతి • నేగినవియొ ?

వడివడిగఁబోవుకాలప్ర ♦ వాహమందుఁ
బొడమునుడిగుండములలోనఁ ♦ బడిమునింగి
పాంచభౌతికవస్తుప్ర ♦ పంచమెన్ని
యెన్ని మార్పులనందలే ♦ దింతదనుక ?
ఎట్టయెదుటనో, వెనుకనో ♦ యెఱుకపడియొ,
యెఱుకపడకుండనో భువి ♦ జరగిపోవు
చున్న యీపరిణామంబు ♦ లన్నిటికిని
మనముగనఁజాలునానవా ♦ ళ్లను లిఖించి
ప్రకృతిచూపుచునేయుండు ♦ వికృతలీల;
భౌతికంబైనయట్టిప్ర ♦ పంచమునకుఁ
గేవలాదర్శనంబెస్వా ♦ భావికంబు
గానిదానికి, మనమంత ♦ గాగ్రహింపఁ
గలమొలేమోయనెడుశంక ♦ గలుగఁబోదు;
అరయఁగావ్యప్రపంచంబు ♦ నందుఁగూడ
నట్టికాలాతిపాతంబు ♦ లట్టిమార్పు
లట్టిచిహ్నంబులేపొడ ♦ కట్టుచుండు;
నైననుబ్రదర్శంబున ♦ యందెకాక
బోధనంబునఁగూడఁబ్ర ♦ బుద్ధమైన
దగుటఁగావ్యంబెవరణీయ ♦ మగునుగాదె !
పరమమైనట్టికావ్యప్ర ♦ పంచమందు
దర్శితములైనప్రకృతిచి ♦ త్రంబులెల్లఁ
గాలవాహినివడిలోనఁ ♦ గలసిపోక
యుండునప్పటికెప్పటి ♦ కొక్కగతినె;
నగరరాజమయోధ్యయె ♦ న్నటిదో ? పుణ్య
వనగిరినదీనదంబులె ♦ ప్పటివొ ? సేతు
కలనమేనాఁటిదో ? మహా ♦ జలధిలోని
లంకయెప్పటిదో? నిష్క ♦ ళంకుఁడైన
మేటిశ్రీరామచంద్రుఁడే ♦ నాఁటివాఁడో ?
పరమసాధ్వీమహీజయె ♦ ప్పటిదో ? ఖలుఁడు

పఙ్క్తికంధరుఁడెప్పటి ◆ వాఁడొ చూడ
నాస్థలంబులుమున్నటి ◆ యట్ల లేవు;
తెలుపునా కాలమంతయుఁ ◆ దిరిగిపోయె
నాఁటివారొక్కరైననీ ◆ నాఁడు లేరు
కానితత్తత్స్వరూపల ◆ క్షణము లెల్ల
నతులకావ్యప్రపంచచి ◆ హ్నితములగుటఁ
గావ్యమునఁబూర్వమెట్లెల్ల ◆ గాంచగలము.
ఉచితదేశంబులను దత్త ◆ దుచితరీతి
నుచితసమయంబులను దత్త ◆ దుచితలీల
నుచితపాత్రంబులను దత్త ◆ దుచితవృత్తి
నుచితభంగిఁ బ్రదర్శించి ◆ యుచితవచన
గతులనుచితానుచితధర్మ ◆ తతులనెల్ల
నెఱపి కావ్యప్రపంచంబు ◆ గఱపుచుండు.
ధర్మదేవతా నిర్మలో ◆ త్తమపవిత్ర
సుప్రసిద్ధానురూపవ ◆ చోమధురిమ,
శ్రీరమారమణీమణీ ◆ చిరదయార్ద్ర
పావనాలోకనాతి ప్ర ◆ భావపటిమ,
ప్రియసతీహృదయాంభోజ ◆ విలసదతను
భావనిస్తులనిశ్చల ◆ ప్రణయమహిమ,
మోక్షలక్ష్మీమనోజ్ఞ స ◆ ముత్సుకప్ర
భాసమానాభినుత మంద ◆ హాసగరిమ
మెల్ల నొకచోటఁ బడయంగ ◆ నెంతు వేని
పడసి నెమ్మది నలరారఁ ◆ గడఁగుదేని
నలరియును భావములఁ జొక్కఁ ◆ దలతు వేని
చొక్కి పరమార్థము గ్రహింపఁ జూతు వేని
నలఘుతరదివ్యవస్తు సం ◆ కలితమైన
కలితగుణభావవర్ణనా ◆ లలితమైన
లలితశబ్దార్థమధురసో ◆ చ్ఛలితమైన

చలదమేయాభినవరసో • ల్లలితమైన
సరసకావ్యంబునొకసారి • చదువుకొనుము!
తెలుపుచాటున నిలుచుండి • తమివెలార్చు
వలపుటిల్లాలినునుముద్దు • పలుకువోలె
మెలపునం జేరి కౌఁగిట • నలముకొనిన
కలికిజవరాలి వగగుల్కు • పలుకువోలె
నలసియలయించితలపించు • నలవెఱింగి
కులుకుప్రాయాలి నెఱసిబ్బు • పలుకువోలె
నేదినీమానసమునెల • యింపఁగలదో?
యేదినీయాత్మకానంద • మీయఁగలదో?
యేదితనతోడనిన్నెన • యింపఁగలదో?
అట్టిసద్వస్తునిస్తులం • బైనదాని,
నట్టినవరసబంధురం • బైనదాని,
నట్టిపరమార్థసాధనం • బైనదాని
నెఱిఁగిసత్కావ్యముగ గ్రహిం • యింపుమయ్య!
మించుసంసారజలధి దాఁ • టించునావ
మంచిచెడ్డలగతు లేర్ప • రించుత్రోవ
మానసికరోగములనెల్ల • మాన్పుమందు
మహితదీప్తికరంబైన • మంచివిందు
సరసకావ్యంబుననెసీకు • దొరకఁగలదు.
పొదలుపరితాపమున మది • చెదరునపుడు
దొరలుదుఃఖంబుననుదారి • తోఁపనపుడు
వడఁకునెమ్మేనికలనత • వొడమునపుడు
జీవితమునందు నిస్పృహఁ • జెందునపుడు
మదిఁగుదురఁ జేసి, చల్లని • మాటచెప్పి
కలఁక నెడలించి, ధైర్యంబు • గలుగఁ జేసి
తల్లితండ్రులఁబోలి, పె • ద్దలనుబోలి
యిష్టసఖుఁబోలి, ప్రాణనా • యికనుబోలి
గురుజనముఁబోలి, వలయు నెల్లరనుబోలి

యెల్లవిధములనీమేలు • నేఘటింప
సదుపదేశంబునీఁజాలు • నదితలంపఁ
గావ్యమునకంటెవేఱొండు • గానరాదు.
అరసిచూడనిరర్థక • మగునయేని
నక్షరసమష్టియే పదమనఁగరాదు;
లోకహితలక్షణాయుతంబు • గాకయున్నఁ
బద్యగద్యాత్మకంబె కా • వ్యంబుగాదు;
హృదయభావంబులను వెల • యింపకున్నఁ
గలముపట్టినమాత్రానఁ • గవులుగారు;
ఉచితగతిరసభావంబు • లొప్పకున్నఁ
గవులువ్రాసినదంతయుఁ • గవితగాదు;
వరుసవెట్టియష్టాదశ • వర్ణనములఁ
బెంచివర్ణించి మొఱ్ఱిక్క చె • ల్లించుకొఱకె
ధరణికాకాశమునకు సూ • త్రములఁగట్టి
తలతిరుగఁజేయు కల్పనల్ • తార్చుకొఱకె
అస్వభావపథంబుల • ననుగమించి
కడఁగితడఁబాటుగాఁ గథ • నడపుకొఱకె
తగసిచిక్కులఁబెట్టి బం • ధంబులనుచు
నల్లిబిల్లిగఁబద్యంబు • లల్లుకొఱకె
గణయతిప్రాసములగట్టి • గాఁగుదించి
పద్యములలోనఁ బద్యముల్ • పన్నుకొఱకె
ఓష్ఠ్యమస్పర్శకంబు ని • రోష్ఠ్యమనుచుఁ
ద్వ్యక్షరద్వ్యక్షరైకాక్ష • రంబులనుచుఁ
బ్రాసగతులంచు శబ్దచి • త్రంబులనుచు
సర్వగురులఘువర్ణప్ర • సారమనుచు
వ్యర్థవాక్యావళీ విడం • బనముకొఱకె
వ్రాయఁబడినవి యెల్లఁ గా • వ్యంబులగునె ?
అర్థములతోడవాక్యంబు • లమరుచుండఁ
జిత్తముఁగరంచుగతిధ్వనుల్ • సెలఁగుచుండ

భావము సెలంగ రసముట్టి ♦ పడుచునుండ
సమయసముచితవర్ణనల్ ♦ సాగుచుండఁ
బాత్రరూపంబులెదుటఁగ ♦ న్పట్టుచుండఁ
దత్తదుచితస్వభావముల్ ♦ తట్టుచుండ
సరణివిడకుండఁగాఁగథ ♦ జరగుచుండఁ
బాఠకులమానసములలోఁ ♦ బశఁగఁజేసి
నిశ్చయజ్ఞానగరిమనం ♦ దింపఁజేసి
పాత్రపాఠకతతినైక్య ♦ పడఁగఁజేసి
మోదమో, ఖేదమో, కష్ట ♦ మో, సుఖంబొ,
ధైర్యమో, దైన్యమో, యద్భు ♦ తంబొ, భయమొ,
కోపమో, యీర్ష్యయో, మోహ ♦ తాపభరమొ
యనుభవింపఁగఁజేసియ ♦ య్యాదనులందు
నెల్లధర్మంబులకురా ♦ కృతిగఁజేసి
హృదయఫలకంబులందుఁజి ♦ త్రింపఁజాలు
నట్టికావ్యంబెసత్కావ్య ♦ మగునిజంబు
కలితగంగాప్రవాహావ ♦ గాహనమున
గాత్రముపవిత్రమైకాంతిఁ ♦ గాంచినట్లు
అనుపమానప్రభావది ♦ వ్యాంజనమున
నేత్రములునిర్మలంబులై ♦ నెగడినట్లు
క్రమతరశాణయంత్రసం ♦ ఘర్షణమున
జీవమణిదీప్తమై విరా ♦ జిల్లినట్లు
పటుతరానలసంపుట ♦ పాక కలనఁ
గనకము త్తప్తమైవన్నెఁ ♦ గన్నయట్లు
సరసకావ్యరసామృతా ♦ స్వాదనమున
హృదయసీమపవిత్రమై ♦ సదమలమయి,
దివ్యమై, తీక్ష్ణమై, సము ♦ ద్దీప్తమగుచు
నిశ్చలానందపదవి నం ♦ దించుచుండ
నీనరుఁడుకోరఁదగినదిం ♦ కేమిగలదు?
విధివిధానంబులెవ్వుడుభా ♦ వింపఁబోము

ప్రకృతిసూత్రంబుకరమునఁ • బట్టఁబోము
విశ్వమనియెడుకావ్యంబు • విప్పఁబోము
అంతరాళంబులోనున్న • దరయఁబోము
కాంచెదమునిన్ను కావ్యమా! • కన్నులార
వినియెదమునిన్ను సతతంబు • వీనులార
చదివెదమునిన్ను నోరూరఁ • జవులుదేర
మననమొనరించెదమునిన్ను • మనసుదీరఁ
గడఁగి ధర్మార్థకామమో • క్షంబులనెడి
పూరుషార్థచతుష్కంబుఁ • బొందఁజేసి
యనితరజ్ఞాన సంపద • నందఁజేసి
మమ్ముఁజరితార్థులనుజేయు • మాసతంబు!

వేంకటపార్వతీశ్వర కవులు.

# ద్రావిడ భాషాపంచక నిరూపణము.

## ౧-వ భాగము.

ఇతరదేశమునుండి మనయార్యులీభరతఖండమునకుఁ జేరకమునుపటి నుండియు నీదేశమం దాదిమనివాసు లయినమనుష్యులయొక్క జాతులు కొన్ని యున్నట్లు మనప్రాచీనగ్రంథములవలనను బాశ్చాత్యపండితులచే వ్రాయఁబడిన చరిత్రలవలనను దెలియవచ్చుచున్నది. అట్టి జాతులలో నయిదుజాతులవారు గౌడులనియు నయిదుజాతులవారు ద్రావిడులనియుఁ జెప్పఁబడుచున్నట్లు "సారస్వతాః కాన్యకుబ్జా గౌడమైథిలకోత్కలాః। పఞ్చగౌడా ఇతి ఖ్యాతావిన్ధ్యస్యోత్తరవాసినః; కర్ణాటా శ్చైవ తైలిఙ్గా గుర్జరా రాష్ట్రవాసినః। ఆన్ధ్రాశ్చ ద్రావిడాః పఞ్చ విన్ధ్యదక్షిణవాసినః" అనుస్కాందపురాణ వచనములచే స్పష్ట మగుచున్నది. వీరు నివసించుదేశములనుబట్టి వీరి కీనామము లబ్బినవి. ఇచ్చట మనకు గౌడులనువారివిషయమయి చర్చింపఁ బనిలేదు. ద్రావిడుల చరిత్ర మన కావశ్యకము. వీరాంధ్రకర్ణాట గుర్జరద్రవిడమహారాష్ట్రు లని అయిదు తెగలవా రనియు వీరు వింధ్యపర్వతమునకు దక్షిణముగానుండు దేశములయందు నివసించెడువా రనియుఁ బైనుదాహరింపఁబడిన స్కాందపురాణవచనముచేఁ గానవచ్చుచున్నది. వీరిలో నాంధ్రు లనువారిగుఱించియు ద్రావిడులనువారిగుఱించియు శ్రుతిస్మృతీతిహాసపురాణాదులయం దక్కడక్కడ వక్కాణింపఁబడియున్న ప్రమాణవచనములంబట్టి విమర్శింపఁగా వీరిప్రాచీనవర్తనము మనకుఁ గొంతదెలియనగు. శ్రుతి. ఋగ్వేదముయొక్క ఐతరేయబ్రాహ్మణము. (అమ్మాఁడిలక్ష్మీనృసింహశాస్త్రిగారి తెలుఁగుకూర్పు. 265పుట. 7 పంచిక 3 అధ్యాయము. 18 కండిక. "తస్య హ విశ్వామిత్ర స్యైకశతం పుత్రా ఆసుః పంచాశత్కనీయాంస స్తద్యే జ్యాయాంసో న తే కుశలం మేనిరే తా ననువ్యాజహారాంతా న్వః ప్రజా భక్షీష్టేతి త ఏతేఽంధ్రాః పుండ్రాః శ్శబరాః పుళిందా మూతిబా ఇత్యుదంత్యా బహవో భవంతి వైశ్వామిత్రాదస్యూనాం భూయిష్ఠాః" ఆ విశ్వామిత్రునికి నూఱుగురు పుత్రు లుండిరి. వారిలో నేఁబదిమంది మధుచ్ఛందుఁ డనెడు వానికంటె జ్యేష్ఠులు. ఏఁబదిమంది కనిష్ఠులు. జ్యేష్ఠు లయినవారు తమతండ్రి శునశ్శేపునియందు జ్యేష్ఠత్వ మారోపించెద నన్న నొప్పుకొన

లేదు. అపుడు విశ్వామిత్రుఁడు వారిపైఁ గోపించి "మీసంతతివారు నీచజాతులయి జనింతురు గాక యని శాపం బొసంగెను. ఆ ప్రసంగ దచ్ఛ్యాపానుసారముగా నాంధ్రులు పుండ్రులు శబరులు పుళిందులు మూతిబాలు మొదలయిన నికృష్టజాతిమనుష్యులు విశ్వామిత్రునివంశజులు. మధుచ్ఛందుఁడు కనిష్ఠులయిన యేఁబదిమందితోను దాఁడి చెప్పినమాటకు సమ్మతించి శునశ్శేపునిఁ దమకు జ్యేష్ఠునిఁగా నొప్పుకొనఁగా విశ్వామిత్రుఁడు సంతసిల్లి వారియాయురారోగ్యైశ్వర్యాభివృద్ధికై వరము లొసంగె ననితాత్పర్యము. "మనుస్మృతి - దశమాధ్యాయము. 43-44 శ్లోకములు. శనకై స్తు క్రియాలోపా దిమాః క్షత్త్రియజాతయః। వృషలత్వం గతాలోకే బ్రాహ్మణా దర్శనేన చ । పౌండ్రకా శ్చోడ్రద్రవిడా కాంభోజా యవనా శ్శకాః। పారదా పహ్లవా శ్చీనాః కిరాతా దరదాః ఖశాః। (ఈశ్లోకములయందుఁ జెప్పఁబడిన క్షత్రియజాతు లుపనయనాది క్రియాలోపముచేతను, విప్రసేవాభావముచేతను శూద్రత్వము నొందిరని భావము) మహాభారతము అశ్వమేధపర్వము 29 అధ్యాయము 14-15-16 శ్లోకములు:— "తత స్తు క్షత్రియాః కేచి జ్జామదగ్న్యభయార్దితాః। వివిశు ర్గిరిదుర్గాణి మృగా స్సింహార్దితా ఇవ। తేషాం స్వవిహితం కర్మ తద్భయా న్నానుతిష్ఠతామ్। ప్రజా వృసలతాం ప్రాప్తా బ్రాహ్మణానా మదర్శనాత్ । ఏవం తే ద్రవిడాభీరాః పుండ్రా శ్చ శబరై స్సహ। వృషలత్వం పరిగతాః వ్యుత్థానాత్ క్షత్రధర్మిణః॥("పూర్వముకొందఱు క్షత్రియులు పరశురామునివలన భీతినొంది సింహముచేఁ బీడింపఁబడినక్షుద్రమృగములవలెఁ బరచి గిరిగుహాంతరములం జొచ్చిరి. బ్రాహ్మణసేవావిహీను లయినవారిసంతానము వర్ణాశ్రమవిహితకర్మలను బరిత్యజించి శూద్రత్వము నొందెను. అట్టివారే ద్రవిడులనియు నాభీరులనియుఁ బుండ్రులనియుఁ జెప్పఁబడుచున్నారు." అని తాత్పర్యము) భారతము ఆరణ్యపర్వాంతర్గతమార్కండేయ పర్వములో యుధిష్ఠిరమార్కండేయ సంవాదములో 188 అధ్యాయము 35-36 శ్లోకములు:—"మృషానుశాసినః పాపా మృషావాదపరాయణాః। ఆంధ్రా శ్శకాః పుళిందా శ్చ యవనా శ్చ నరాధిపాః। కాంభోజా బాహ్లికా శ్శూరా స్తథాభీరా నరోత్తమ। న తదా బ్రాహ్మణః కశ్చిత్ స్వధర్మ ముపజీవతి" (మార్కండేయుఁడు యుధిష్ఠిరునకుఁ గలియుగమాహాత్మ్యమును వర్ణించి చెప్పుచు నీకలియుగమందు "పాపులైన యాంధ్రులు, శకులు, పుళిందులు, యవనులు మొదలైన నికృష్టజాతులు రాజు లగుదు రని చెప్పి

నాఁడు.) సభాపర్వాంతర్గత దిగ్విజయపర్వమందు సహదేవకృత దక్షిణదిగ్విజయములో 31 అధ్యాయము 72-73 శ్లోకములు:—"దూతైరేవ వశే చక్రే కరం చైనా న్యదాపయత్ । పౌండ్రాంశ్చ ద్రవిడాంశ్చైవ సహితాం శ్చోడ్రకేరళైః। ఆంధ్రాం స్తాలవనాం శ్చైవ కళింగా నుష్ట్రకర్ణికాన్। అటవీం చ పురీం రమ్యాం యవనానాం పురం తథా" (ఓఢ్రులు కేరళులు అనువారితోఁ గూడిన పౌండ్రులను, ద్రవిడులను, ఆంధ్రులను తాళవనులను, కళింగులను ఉష్ట్రకర్ణకులను దూతలచే వశముచేసికొని వీరలు తనకుఁబన్ను చెల్లించునట్లు చేసికొనెను (సహదేవుఁడు దక్షిణదిశను జయించుటకు వెళ్లినపుడు). రామాయణము కిష్కింధాకాండము 41 సర్గములో 12 వ శ్లోకము:—"తథైవాంధ్రాం శ్చ పుండ్రాంశ్చ చోళా న్పాండ్యా న్సకేరళాన్" ఆంధ్రపుండ్రచోళపాండ్య కేరళదేశములను వెదకుఁడని కపులతోఁ సుగ్రీవుఁడు చెప్పినమాట. ఇట్లు పైనుదాహరింపఁబడిన గ్రంథవచనముల ప్రామాణ్యమును బట్టి విచారింపఁగా నీయాంధ్రద్రావిడజాతులెంతప్రాచీనకాలమునుండి యీభరతఖండము నధివసించుచు వచ్చెనో యావిషయ మెల్లరకు స్పష్ట మగుచున్నది. ఏ రార్యులతోఁ దఱుచుగాఁ బోరాడి వారిపై శత్రుత్వము వహించియుండుటచే వీరిని దస్యులని పిలుచుచుండిరి. పైని వ్రాసినప్రకారము వీరు మొదట మృగప్రాయులై యనాగరికు లుగా యున్నను గాలక్రమమున బలిసి తెలివిగలవారయి గ్రామములను బట్టణములను గట్టుకొని రాజ్యములను స్థాపించి ప్రబలు లైనట్లు చరిత్రవలన మనకుఁ గానవచ్చుచున్నది.

## ద్రావిడులు.

ద్రవిడశబ్దము 'ద్రు గతౌ' అనుధాతువునుండి నిష్పన్న మయినది. ద్రవిడు లనఁగాఁ బరుగెత్తి పోయినవారు. పరశురామునిదాడి కోర్వలేక కొందఱు క్షత్రియులు విపినంబులకుఁ బోయి వర్ణాశ్రమధర్మంబుల విడనాడి శూద్రత్వము నొంది రని మహాభారతములోఁ జెప్పఁబడియున్న దని యిదివఱకే వ్రాసియున్నాను. ఆర్యులు వీరి నసురు లనియు, మ్లేచ్ఛులనియు దస్యువు లనియు, వీరు నివసించుదేశము మ్లేచ్ఛదేశ మనియు గ్రంథములయందు వ్యవహరించి యున్నారు. వింధ్యకు దక్షిణమునఁ గన్యాకుమారివఱకు నుండుదేశము ద్రవిడదేశ మని చెప్పఁబడుచున్నది. ఇప్పుడు మన మరవము, కన్నడము, మలయాళము మొదలగుభాషలను మాట్లాడువారిని మాత్రము ద్రావిడు లని పిల్చుచు

న్నాము. ఇది సరి గాదు. పైనుదాహరింపఁబడిన శ్లోకప్రకారముగఁ గర్ణాటాంధ్రద్రావిడాది పంచజాతులకు ద్రావిడు లని సామాన్యనామము గలదు. వీరు వ్యవహరించుభాషలు గూడ ద్రావిడభాష లనఁబడును. ఈపంచద్రావిడభాషలతోఁ దెలుఁగు, కన్నడము, అరవము, తూలు అనెడి నాల్గుభాషలును బరస్పరసంబంధము పరస్పరసాదృశ్యమును గలిగియున్నట్లు గూర్జరమహారాష్ట్రభాషల కీమొదటినాల్గుభాషలతో నిసుమంతయుఁ బోలిక లేకుండుటయే గాక యారెండును బంగాళీ, హిందీ, పంజాబీమొదలగు నౌత్తరీయభాషలతో సంబంధసాదృశ్యములు గలిగియుండుటం జేసి యాగూర్జరమహారాష్ట్రభాషలు రెండు నీద్రావిడభాషాకుటుంబమునుండి తొలఁగింపఁబడినవి. కాల్డువెల్ (Caldwell) మొదలగు పాశ్చాత్త్యపండితు లీభాషాసంఘమునకు ద్రావిడభాషాకుటుంబ మని పేరిడిరి. ఏడవశతాబ్దమందు జనించి జగద్విఖ్యాతపాండిత్యము సంపాదించి పూర్వమీమాంసాశాస్త్రనిర్వాహకుఁడైన కుమారిలభట్టను నొక యాంధ్రబ్రాహ్మణుఁడు తెలుఁగు, అరవము, కన్నడము, మలయాళము అనునిముఖ్యభాషలు నాల్గింటికి నాంధ్రద్రావిడభాష యని నామధేయ మొసంగెను. ఆంధ్రద్రావిడభాష యనఁగా నాంధ్రదేశమందును ద్రవిడదేశమందును నివసించుజనులచే మాట్లాడఁబడుభాష యని యర్థము. దక్షిణహిందూస్థానమునందు హెచ్చుగుజనసంఖ్యచే మాట్లాడఁబడుభాషల లాంధ్రభాషయు, అరవభాషయు నైయుండుటచేతను గన్నడభాషను దెలుఁగులోను మలయాళము నరవములోను నంతర్భావింపఁజేసి యాకుమారిలభట్టీభాషల కాంధ్రద్రావిడభాష యని మొత్తముగా నొకవ్యవహారనామ మిడుట యుక్తముగానే గానవచ్చుచున్నది. ఈద్రావిడభాషాకుటుంబములోఁ బండ్రెండుభాషలున్నవి. వీనిలోఁ దమిళము, మలయాళము, తెలుఁగు, కన్నడము, తూలు, కొడగు నను నాఱుభాషలును సంస్కరింపఁబడినభాషలు. తక్కిన తూడ, కోట, గోండు, ఖోండు, ఓరాన్, రాజమహాల్ అనునాఱుభాషలును సంస్కారహీనము లయినభాషలు. వీనితో మన కిచటఁ బనిలేదు. మొదటఁ జేర్పఁబడినయాఱుభాషలలోను దమిళము తెలుఁగు, కన్నడము, మలయాళము తూలు అనువాని యొక్క తారతమ్యము నీవ్యాసమందుఁ గొంత విమర్శింతము.

## అరవము.

పూర్వోక్తభాషా పంచకమం దరవభాష యనునది మిక్కిలి ప్రచుర మయినది. దీనికిఁ దమిళ మను నామాంతరము కలదు. ఈ భాష మాటలాడువారు పూర్వ

కాలమందు గంగాతీరమం దుండెడి తామ్రలిప్తి యనుపట్టణమునుండి మొదట దక్షిణహిందూస్థానమునకుఁ జేరిరి. ఈతామ్రలిప్తమనునది విష్ణుపురాణము చతుర్థాంశము, ఇరువదినాల్గవ యధ్యాయమునందును మహాభారతము సభాపర్వాంతర్గత దిగ్విజయపర్వమునందు ముప్పదవయధ్యాయమునందును జెప్పఁబడినది. విష్ణుపురాణము-'కోసలాంధ్రపుండ్ర తామ్రలిప్తసముద్రతటపురీం చ దేవరక్షితో రక్షితా" భారతము- 'సముద్రసేనం నిర్జిత్య చంద్రసేనం చ పార్థివమ్, తామ్రలిప్తం చ రాజానం కర్వటాధిపతిం తథా " తమిళ మనుశబ్ద మీతామ్రలిప్తిశబ్దభవము. తమిళశబ్ద మాంగ్లేయభాషలో టమిల్ అని మారినది. ఈ తామ్రలిప్తి యనుపట్టణమునుండి వచ్చినవారికిఁ దమిళులనియు వారిభాష తమిళమనియు వాడుక చేయఁ బడుచున్నది.

ఈభాషలన్నిటిలో నిది మిక్కిలి ప్రాచీన మయినది. దీనిని దఱుచుగా నరవ మని వాడుచున్నారు. అరవ మనుపదమున కనేకవ్యుత్పత్తు లున్నవి. అందులోఁ గొన్నిటి నీదిగువ నుదాహరించుచున్నాను.

(1) తమిళభాషలో 'అరం' అనఁగా ధర్మము, యోగ్యత. ఈభాషలో ధర్మప్రతిపాదక మయినగ్రంథము లితరభాషలయందు కంటె నెక్కుడుగా రచింపఁబడియున్నవి. కావున నీభాష కరవమనియు నట్టిగ్రంథములను బాగుగఁ జదివి ధర్మపరు లగుటచే నీజాతివారికి అరవ లనియుఁ బేరు.

(2) అరివు. అనఁగా జ్ఞానము. వీరు తక్కినవారికంటె నధికజ్ఞానము గలవారు గావున నరవ లనిపించుకొనుచున్నారు.

(3) అరవము - రవమనఁగాధ్వని. అది లేనిది అరవము. ఈతమిళభాషలో ఖ. ఘ. ఛ. మొదలగు నొత్తక్షరములు లేవు గనుక నట్లు పిలువఁబడుచున్నది.

దీనికి సంస్కృతభాషలో ద్రవిడము లేక ద్రమిడ మనిపేరు. ఈ భాష మాటలాడువారు పూర్వకాలమందు పాండ్య లనియు చేర లనియు చోళు లనియు మూఁడుతెగలవారుగా నుండిరి. వీరిలో పాండ్యులు ప్రధాను లయిన ట్లూహింపఁబడుచున్నారు. సింహళద్వీపాధీశ్వరుఁ డయినవిజయనృపాలుఁడు పాండ్య దేశాధిపతియొక్క పుత్త్రికను వివాహముచేసికొన్నట్లు మహావంశ మనుబౌద్ధగ్రంథములో నొకకడఁ గలదు. యుధిష్ఠిరసోదరుఁ డైనయర్జునుఁడు తీర్థాటనముఁ జేయుసమయములో పాండ్యరాజదుహితను బరిణయ మైనట్లు భారతములో నున్నది. ఇట్టిపురాణకథలవలన వాస్తవచరిత్ర మెప్పుడును దేలదు

గాని అగస్టస్ చక్రవర్తికడకు పాండ్యదేశపురాజు రాయబారి నంపె నని ప్లినీ పెరిప్లస్ అనువారు వ్రాసినవ్రాఁతలవలన నీపాండ్యు లాకప్పుడు మిక్కిలి ప్రబలులయియున్నట్లు నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

చోళులు:—వీరు రెండవతెగవారు. అశోకునిశాసనములలోను చాళుక్యవంశపురాజులతో సంబంధించిన తెలుఁగుశాసనములలోను వీరినిగుఱించి చోడు లని చెప్పఁబడియున్నది. వీరినే చీనాయాత్రికుఁ డయినహుయాన్‌త్సాంగనువాఁడు చోళియా యనుపేరుచేఁ జెప్పియున్నాఁడు. కాని పదునొకండవశతాబ్దములో నీచోళశాఖవా రొక రుత్తరసర్కారుల నేలినట్లు చరిత్రమువలనఁ గానవచ్చుచున్నది. వీరి యాదిమనివాసస్థానము తంజావూరు, తిరుచినాపల్లిమండలములతోఁ గూడినకావేరీతీర మని గ్రంధాంతరమువలన స్పష్ట మగుచున్నది. పదునొకండవశతాబ్దములో నీచోళులు ద్రావిడదేశము నంతయును స్వాధీనపఱచికొని యేకచ్ఛత్రముగా నేలినట్లు శాసనములవలన నిశ్చయింపఁబడినది.

చేరులు:—వీరు కేరళదేశస్థులు. మొదటిరెండుతెగలవారివలెఁ దమిళులు. వారికిని వీరికి నించుకంతైనను భేదములేదు. చేరన్, చోరన్, పాండియన్ అనునీమువ్వురు రాజసోదరులు. తామ్రపర్ణీనదీతీరమం దున్న కొల్కైయను పట్టణమందు నివసించి యైకమత్యముతో రాజ్యము నేలుచుండెడివారు. కాలక్రమమున వీరుమువ్వురు విడిపోయిరి. పాండ్యుఁ డనువాఁడు స్వదేశమునందుండి పోయెను. చేరన్, చోరన్ అనువా రుభయులు తమబాహుపరాక్రమమును విదేశములయందు వెల్లడిచేయుచుఁ దూర్పునందును బశ్చిమమందును రాజ్యములను స్థాపించిరి. పాండ్యకేరళచోళులయొక్క చరిత్రము హరివంశము మొదలగుపురాణములయందుఁ గూడఁ గానవచ్చుచున్నది.

### ఈ భాషయొక్క ప్రాచీనత.

తమిళవాఙ్మయ మాంధ్ర కర్ణాటమలయాళ వాఙ్మయములకంటెఁ బ్రాచీనతరము. ఆంధ్రభాషకు కణ్వుఁడను వాఁడొనర్చినయుపకారముకంటెఁ దమిళభాషకగస్త్యుఁ డొనర్చినయుపకారము శతగుణ మధిక మని యెన్నఁబడుచున్నది. ఇతఁడు తమిళభాషకు మొట్టమొదట నక్షరసమామ్నాయము నేర్పాటుచేయుటయే గాక యాభాషయొక్క వ్యాకరణసిద్ధాంతములను బరిష్కరించి నన్నూల్ ఇలక్కణ (మంచిశాస్త్రలక్షణము) మనుపేరుగల మొదటి వ్యాకరణమునుగూడ వ్రాసెను. ఇంతియ గాక యితఁడు వైద్యశాస్త్రము, రసవాదము, శిల్పశాస్త్ర

ము, జ్యోతిషము ధర్మశాస్త్రము, మొదలగు నేఁబది శాస్త్రగ్రంథములను రచించి వానిసిద్ధాంతములను దమిళులకు మునుమున్న గరపినాఁడని వారిచరిత్రయం దున్నది. కాని యాగ్రంథములభాషాశైలి విమర్శింపఁగా నవి నవీనములుగాఁ గానవచ్చుచున్న వనియు నావ్యాకరణము గూడ నగస్త్యునంతప్రాచీనునిచే రచింపఁబడినట్లు గానరా దనియు నిప్పటిగొప్పతమిళపండితులు చెప్పుదురు. ఇతని తరువాత నీతనిశిష్యుఁడగు తొల్కాప్పినాయర్ అను నతఁడు తొల్కాప్పియ మనునొకగ్రంథమును రచియించెను. తొల్కాప్పియ మనఁ బ్రథమకావ్యము. ఇది ప్రాచీనవ్యాకరణగ్రంథ మని యిప్పటితమిళపండితులు గూడ నొప్పుకొనుచున్నారు. తరువాతి గ్రంథము కురళ్ అనునది. ఇది ప్రాచీనగ్రంథములలో నొకటి. ఇందుఁ బ్రాచీనసాంఖ్యమతసిద్ధాంతము చర్చింపఁబడినది. శంకరాచార్యుల యద్వైతసిద్ధాంత మిందులో నెచటను ఖండితముగాఁ గాని మండితముగాఁ గాని లేశము గానరానందున నిది శంకరాచార్యులకంటె ముందు వ్రాయఁబడిన దని దృఢముగాఁ జెప్పవచ్చును. ఇంతియగాక హరియో హరుఁడో పరుఁడని స్థాపించి యాదేవతా విషయమయిన భక్తియే మోక్షోపాయ మని ప్రతిపాదించు పౌరాణిక సిద్ధాంతములు గూడ నిందులోఁ గానరావు. దీనివలన నీగ్రంథము శైవ వైష్ణవమతము లుత్పన్నములు గానికాలమందు రచింపఁబడినట్లు కానవచ్చుచున్నది. పిమ్మట నాలడియార్ చింతామణి, కంబరామాయణము, శ్రీవైష్ణవుల నాలాయిర ప్రబంధములు మొదలగున సంఖ్యేయము లయినగ్రంథము లీభాషలో వ్రాయఁబడియున్నవి.

## కర్ణాటకభాష.

ప్రాచీనతలో నిది యరవమునకు, నాంధ్రభాషకుఁ దరువాతిభాష. ఈ భాష మైసూరునందును దక్షిణమహారాష్ట్రమందును నిజాము రాజ్యము యొక్క పడమటిజిల్లాలయందును వ్యవహరింపఁబడుచున్నది. నీలగిరినివాసులగు బడగ లను నొకజాతిమనుష్యులచే మాటలాడఁబడుభాష యీ ప్రాచీనకర్ణాటకభాషయొక్క వికృతి. అరవమందువలె నీ భాషయందును గ్రాంథికభాషయనియు గ్రామ్యభాషయనియు విభాగము కలదు. గ్రాంథికభాషయందు సంస్కృతపదములు మెండు. కర్ణాటక మనుశబ్దము తెనుఁగువారిని గన్నడముమాటలాడువారిని వారిభాషలను జెప్పెడుసామాన్యవాచకము. కన్నడ మనునది కర్ణాటకశబ్దభవము. స్వదేశపండితులు కర్ణాటకశబ్దమును సంస్కృతశబ్దముగా నెంచుచున్నారు

“కర్ణ మనఁగాఁ గొండలోయ. అందు సంచరించువారు కర్ణాటులు. ద్రావిడులు కొందఱు దక్షిణదేశమునుండి పైకి క్రమముగా వ్యాపించి మలయపర్వత ప్రాంతములయందున్న లోయలలో సంచరించు మనుజులతోఁ గలసి తమ ద్రావిడమును లోయలలో సంచరించువారిస్వభాష యగు కర్ణమును జేర్చి కొంతకాలము వాడుకొనుచుండిరి. పిదపఁ గొంతకాలమునకు నుత్తరదేశమునుండి కొందఱార్యులువచ్చి యామలయపర్వత ప్రాంతదేశమున నివసించు కర్ణాటు లను వారితోఁ గలసి తమప్రాకృత సంస్కృతములును వారికర్ణాట ద్రావిడములును గలిపి రూపభేదములతో వ్యవహరించుకొనుచు వచ్చుటంజేసి యధికజనులు మాటలాడుకొను ద్రావిడకర్ణాటకములలో నీయల్పసంఖ్యాకులు మాటలాడు ప్రాకృత సంస్కృతములు గలిసిపోయి తాదాత్మ్యములం బెంది యంతయుం గర్ణాటం బనియే వ్యవహరింపఁబడుచుండె. ఉత్తరదేశమునుండి వచ్చెడియార్యులకు దక్షిణపుఁగొన నున్న ద్రావిడదేశముకంటె దానికుత్తరమున నున్న కర్ణాటదేశము సన్నిహితంబగుటంజేసి యిచటనే యెక్కుడుగ నివసించియున్నకతంబున నఱవమునకంటెఁ గన్నడమునఁ బ్రాకృతసంస్కృతపదములు మెండుగఁ దొలుతం బ్రవేశించినవి. కావుననే కన్నడము ప్రాఁతకన్నడ మనియుఁ గ్రొత్తకన్నడ మనియు నిరుదెఱఁగులయ్యె” (ఆంధ్రభాషారత్నము) మఱికొందఱు పాశ్చాత్యపండితులీ శబ్దమునకు కరునాడు (నల్లనిదేశము) అని వ్యుత్పత్తిని గల్పించిరి. కేశిరాజను పండితునిచే రచింపఁబడిన శబ్దమణిదర్పణ మను నొకప్రాచీనవ్యాకరణ మీభాషలోఁ బ్రధాన మయినది. ఈగ్రంథకర్త జైనమతస్థుఁడు. కన్నడభాషను మిక్కిలి శ్రద్ధతోఁ గృషిచేసినవారిలో జైనులు మొదటివారు. కేశిరాజు తనకంటెఁగూడఁ బ్రాచీను లయినయనేకగ్రంథకర్తలను దనగ్రంథమునందుఁ బేర్కొనియున్నాఁడు. ప్రాచీన కర్ణాటకభాషయందు వ్రాయఁబడిన యనేక గ్రంథముల నీతఁడు తనగ్రంథమునం దుదాహరించియుండుటవలన నీభాష ప్రాచీనమయినదని తెలియవచ్చుచున్నది. క్రీస్తుశకము 800 మొదలుకొని 1189 సంవత్సరము వఱకు కళ్యాణనగరమందుండి రాజ్య మేలినచాళుక్యవంశజులలో నొకఁ డైన తైలపనృపుని ఖడ్గవర్ణనతోఁ గూడినయొకపద్యము నీకేశిరాజు తనగ్రంథమందొకవిషయములో నుదాహరణముగా నిచ్చుటచే నీతఁడుపదియవశతాబ్దమునాఁటివాఁడని నిష్కర్షింపఁదగియున్నది. ఇతనికాలమందే కన్నడభాషలోనికిఁ దద్భవరూపములుగాను దత్సమరూపములుగాను సంస్కృతపదము లనేకములు తేఁ

బడినవి. ఈ కేశిరాజు వ్రాసినవ్యాకరణ మీఁదినమువఱకు వ్యవహరింపఁబడుచు న్ననవీనకన్నడభాషకుఁ గూడ సమన్వితమయి నిరుత్తర మయినమూలప్రమాణగ్రంథముగా నెన్నుకొనఁబడుచున్నది.

## మలయాళము.

ద్రావిడభాషలలో నిది యరవమునకు రెండవది. అరవమున కిది మిక్కిలి దగ్గఱిభాష. మలయపర్వతపంక్తికిఁ బడమటిభాగమందును మలబారునందును మంగుళూరుదగ్గఱ నున్నచంద్రగిరిమొదలు తిరువనంతపురము దనుక నుండుదేశమందు నీభాష వాడుకచేయఁబడుచున్నది. మలబారుతీరమం దిది యరవముతోఁ గలిసియుండును. మలబారుసముద్రతీరము పూర్వకాలమునం దనేక విదేశీయ జాతులవారిచేఁ దఱుచుగా సేవింపఁబడినను మళయాళీ లితరద్రావిడ జాతులవారికంటె నెక్కుడు స్వమతాభిమానము పూర్వాచారపరత్వమును గలిగియున్నారు.

## మలయాళశబ్దనిర్వచనము.

మలయాళశబ్దమునకు మలయార్మమనియు రూపాంతరము కలదు. ఇందులో మొదటిది సంస్కృతపద మగుమలయ మని కొందఱు భ్రమపడుచున్నారు. అదికాదు. పర్వతవాచి యయిన "మలై" అను ద్రావిడశబ్దము. మలై యనునదియే మలయ మయ్యెనని యిప్పటిశబ్దశాస్త్రవేత్తల (Philologists) సిద్ధాంతము. ఎట్లన:—ఆర్యు లీభరతవర్షముపైకి దండెత్తిరాకమునుపే యీద్రావిడు లాదిమనివాసు లయియుండుటచే వీరికిని నూతనాగతు లయినయార్యులకును గలిగిన పరస్పరసంబంధముచేఁ గొన్ని యార్యభాషా పదములు దేశభాషలలోనికిఁ గొన్ని దేశభాషాపదము లార్యభాషలలోనికిఁ బరస్పరవినిమయము నొంది వక్తలకుఁ దెలియకుండ మెల్లమెల్లన సంక్రమించినవి. అట్లు సంక్రమించిన శబ్దములలో నీమలైయనునది యొకటి. ఈవిషయమునుగూర్చి యింక ముందు విపులముగాఁ జర్చింపఁదలంచి యున్నాఁడను గావున నిపు డింతతో విరమించి ప్రకృత మనుసరించెద.

మలయాళశబ్దముయొక్క ద్వితీయభాగము "ఆలం" అనునది. పదమధ్యమందు నిలుపు కూడ దని సూచించుటకు మధ్య యకారము చొనుపఁబడినది. ఆలంఅనుశబ్దము "కలిగియుండుట" అనునర్థమిచ్చు ఆళ్ ధాతువునుండి నిష్పన్నమయినది. ఇట్లు వ్యుత్పాదిత మయిన మలయాళశబ్దమునకు పర్వతములు గల ప్రదేశ మని యర్థము.

ఈ మలయాళపుభాష అరవభాషకంటె భిన్నమయినది కాదు గావున సంస్కృతపండితు లీ రెండుభాషలకును ద్రావిడ మనునొక్క పేరే పెట్టిరి. మలయాళదేశము సంస్కృతభాషలో కేరళ మని చెప్పఁబడుచున్నది. క్రీస్తునకుమునుపు మూఁడవశతాబ్దమం దీకేరళదేశము నేలినరాజుపేరు కేరళపుత్త్రుఁడని కపర్దగిరిలో నున్న యశోకునిశాసనములలోఁ గానవచ్చుచున్నది. ఈకేరళశబ్దము మలయాళభాషలో చేరళము, చేరమనియు నరవభాషలో "కేర" అనియు వాడుక చేయఁబడుచున్నది. కేరళదేశనివాసి యగు మనుష్యుఁడు కేలన్ - కేలు అనఁబడును. ఇది కేరళశబ్దభవము. ప్లినీ యనుగ్రీకుదేశస్థుఁడీ దేశపురాజును "కెలుబోత్రస్" అని వ్యవహరించినట్లు టాలమీ యనువాఁడొకగ్రంథమునను వ్రాసెను. కావున నీ "కేలన్" శబ్దము మిగులప్రాచీనముగాఁ గానవచ్చుచున్నది. ప్రాచీన కేరళదేశము రెండు భాగములుగా విభజింపఁబడియున్నది. అందులో నొకటి సముద్రతీరదేశము. అది నేఁటికిని సంస్కృతభాషలో కేరళమనియు నరవభాషలో చేరదేశమనియుఁ బిలువఁబడుచున్నది. రెండవభాగము కోయంబుత్తూరు సేలము జిల్లా మైసూరులోఁ గొంతభాగమునై యున్నది. దీనికి కొంగుదేశ మనియు చేరదేశ మనియు నామద్వయము కలదు. ఈభాష యరవభాషయొక్క ప్రాచీన శాఖ యయియుండిన నీ కాలమందుఁ గ్రియాపదముల (యొక్క) తుదనుండు కర్తృవాచిప్రత్యయములను మానుటచేతను విస్తారముగా సంస్కృతపదములఁ గలుపుకొనుటచేతను నీభాష అరవభాషకంటెఁ గొంచెము భేదించియుండుటచే ద్రావిడభాషాకుటుంబములో నొకటి యనుటకంటె నిది యరవముయొక్క వికృతి యనఁదగియున్నది. మలయాళపుఁగావ్యము లరవభాషాకావ్యములను బోలియున్నవి. రామచరిత మనునొకకావ్య మాభాషలో నుత్తమ మయినది. ద్రావిడభాషలలో హెచ్చుసంస్కృతపదములు గలది మలయాళము. మిక్కిలి తక్కువసంస్కృతపదములతోఁగూడినది అరవము. ద్రావిడదేశమందు సంస్కృత గ్రంథములు మెండుగా వ్రాయఁబడియున్న గ్రంథాక్షర మనునొకజాతిలిపినుండి మలయాళపులిపి పుట్టినది. ఈ మలయాళపుభాష పూర్వ మరవభాషకంటె నీషద్వైషమ్యము కలిగియున్నదైనను బూర్వోక్తభేదలక్షణములచే నరవభాషకంటె మిక్కిలి విజాతీయత నొందిన దగుటచే దానిపుత్త్రిక యనుతొంటి వ్యవహారమును విడిచి దానికిపుడు సోదరి యనఁదగియున్నది. ఇందులో రామాయణము మహాభారతము తక్కినపురాణములు గూడ వ్రాయఁబడియున్నవి.

## తూలూభాష.

సంస్కరింపఁబడిన ద్రావిడభాషలలో తూలూభాష యొకటి. దీనికిఁ బ్రత్యేకము లిపి గాని వాఙ్మయము గాని లేకున్న నిది సంస్కరింపఁబడినభాషలలో నొకటిగా నెట్లు పరిగణింపఁబడెనో తెలియదు. ఇపు డీభాషను కన్నడలిపితో వ్రాయుచున్నారు. దీనికి వాఙ్మయము లేకున్నను ద్రావిడభాషాకదంబములో బాగుగ విస్తరిల్లిన భాషలలో నిది యొకటి. ఇపు డీభాష సుమారు మూఁడు లక్షలమందిచే వ్యవహరింపఁబడుచున్నది. ఈభాష మాటలాడుమనుష్యులు ద్రావిడజాతులందఱిలోను బ్రాచీనసంప్రదాయములయందును బూర్వాచారములయందును మిక్కిలి పట్టుదల గలవారుగా నెన్నఁబడుచున్నారు. తూలూశబ్దమునకు "సాధువైన" యనియర్థము గావున నీశబ్దము మనుష్యులనే తెలియఁజేయును. ఇది కన్నడముతో సాదృశ్యముగలిగి యున్నది. ఇది మలయాళ భాష యొక్క శాఖ యని కొంద ఱభిప్రాయపడిరి గాని యిది సరికాదు. మలయాళమునకు నరవభాషకుఁగల భేదముకంటె దీనికి మలయాళమునకు నెక్కుడు భేదముగలదు.

## ఆంధ్రభాష.

ఆంధ్రులభాష యాంధ్రభాష. ఈయాంధ్రులుగూడ మిక్కిలి ప్రాచీనులన్న సంగతి యుపోద్ఘాతమం దుదాహరింపఁబడిన ఋగ్వేదీయైతరేయబ్రాహ్మణాదిప్రమాణవచనములచే స్పష్టమగుచున్నది. వీరు నివసించుదేశము కృష్ణా గోదావరీ నదులనడుమ నుండు నరణ్యప్రదేశమని కొందఱు దండకారణ్యమని మఱి కొందఱు చెప్పుచున్నారు. ఎద్దియయినను నెట్లయినను మొదట వీరి నివాసప్రదేశమునిబిడారణ్యప్రచురమయియుండుటంజేసి వీరిదేశమునకు పైదేశస్థులు "దృష్టిని ప్రసరింపఁజేయనియ్యనిది" అనునర్థ మిచ్చునాంధ్ర మనునామం బిడిరి. భగవద్రామానుజముని సహస్రనామభాష్యములో "చాణూరాంధ్ర నిషూదనః" అను భగవన్నామమును నిర్వచించుటలో నాంధ్రశబ్దనిష్పత్తి నిట్లుకనఁబఱచినారు "అంధ దృష్ట్యుపఘాతే"యనుచురాదిధాతువునకు "సర్వధాతుభ్యః ష్ట్రన్" అను ఔణాదిక సూత్రముచే "ష్ట్రన్" ప్రత్యయము రాఁగా "ఆంధ్ర శబ్దము నిష్పన్న మయినది."

ఈ యాంధ్రభాష ప్రాచీనతయందు శబ్దవిస్తరమందును ద్రావిడభాషాసంఘములో నరవభాషకు రెండవది. చెవుల కింపుగా వినఁబడుటలో దీనిని

మించిన దేదియు లేదు. అర్వాచీను లయిన యూరోపువారిచే యీభాష "గెంటూ" అని పిలువఁబడుచున్నది. క్రైస్తవులు కానివారు 'అనునర్థ' మిచ్చు పోర్చుగీసుభాషాశబ్దమగు "గెంటూ" యనుపదము మొదట హిందూప్రజలను వాడుకచేయఁబడినది. ఇటీవలఁ దెలుఁగను స్థానమందే స్థిర మయ్యెను. తమిళభాషకు మలబారను శబ్దముచే వ్యవహారమువలెనే తెలుఁగుభాషకు "గెంటూ" అనుశబ్దముచే వ్యవహరించుట యిప్పుడు మాసిపోయినది. ఇప్పు డీతెలుఁగుభాష ప్రతి కటక్ సమీపదేశము మొదలుకొని [illegible] శ్రీకాకుళమునందును, దక్షిణ హిందూస్థానముయొక్క తూర్పుభాగమందంతటను మైసూరు మహారాష్ట్ర దేశములయొక్క తూర్పుసరిహద్దునను బళ్లారి, కడప, కర్నూలు, జిల్లాలు కలుపుకొని నిజామురాష్ట్రములోఁ గొంతవఱకును నాగపూర్, గోండ్వానా దేశములలోఁ గొంతభాగమందును మాటలాడఁబడుచున్నది. పైనిఁ జెప్పఁబడిన తెలుఁగుదేశమునకు మహమ్మదీయులు తిలింగానా యని పేరిడిరి.

మేడేపల్లి - వేంకటరమణాచార్యులు.



# అరవదేశమునందలి యాంధ్రవాఙ్మయము.

పరిషత్పుస్తకాలయమున కరవదేశమునందలి లిఖితపుస్తకములు సుమారు 400 లు సంపాదింపఁ బడినవి. ఈపుస్తకములను గుఱించి వాఙ్మయపరిశోధకులు తెలిసికొనఁదగిన యంశములు కొన్ని గలవు.

ఈ గ్రంథములలో నరవదేశనివాసులు రచించిన వనేకములున్నవి. వీనినిఁ బరిషత్పుస్తకాలయమున కొసఁగిన వారిలోఁ దెలుఁగు వ్రాయుటకుఁ గాని చదువుటకుఁ గాని సమర్థులుకానివారు పెక్కురు గలరు. తెలుఁగాదేశమున రాజాదరముకల భాషగానుండిన దినములలో గ్రంథకర్తలు బయలుదేఱి గ్రంథముల రచియించియుండిరి. వారాంధ్రదేశమునుండి పోయియచ్చట స్థిరపడినవారుగాఁ గానివారిసంతతివారుగాఁ గాని యుండవలయును. కేవలమరవవారు వ్రాసినగ్రంథములుగూడఁ గొన్ని యీ సంచయమునందున్నవి. దక్షిణదేశమునందుఁ దెలుఁగునకుఁ బ్రభుపోషణమున్న సమయమున నాంధ్రులనేకు లాప్రాంతములకుఁ బోయిరనుట వాస్తవము. ఇప్పటికిని వారిసంతతి వారచ్చట నున్నారు. పరిషత్తు సంపాదించిన దక్షిణదేశగ్రంథ సంచయమునందుఁ గొన్ని

## సంస్కృతగ్రంథములు

కూడ నున్నవి. కాని తెలుఁగు పుస్తకముల సంఖ్యకంటె వీనిసంఖ్య మిక్కిలి తక్కువ. ఈసంస్కృత గ్రంథములలోఁ గొన్ని యరుదైనవి యున్నవి; కొన్ని యాధునికదాక్షిణాత్యపండిత విరచితములున్నవి. మంకిభట్టకృతమైన ప్రాతిశాఖ్యభాష్యమును (భరద్వాజశిక్ష), కేశవమిశ్రుని తర్కభాషయుఁ గాంచీనాథుని రతిరహస్య దీపికయు, శంకరుని శారీరమీమాంసాభాష్యమును, దిరుమ

లదేవరాయల గీతగోవింద వ్యాఖ్యానమును వీనిలోముఖ్యములైనవిగా నున్నవి. తర్కగ్రంథమగు గదాధరవిరచితసామాన్యనిరుక్తి ననుపేరు పుస్తకాగితములపై వ్రాయఁబడి యున్నది. పాలకాప్యమునికృత ననానువర్ణితాధ్యాయ మని యొక శాస్త్ర మున్నది. దానిలో గజరోగచికిత్సా వృత్తాంతము ముని చక్కఁగ వివరించినాఁడు. మఱికొన్ని వైద్య సంగీత శ్రౌత గ్రంథములుగూడ నున్నవి. ఇవి యన్ని తెలుఁగులిపియందే యున్నవి.

భరతముని విరచితమైన యభినయదర్పణమును, శార్ఙ్గసూరి ప్రణీతంబైన సంగీతరత్నాకరమును గలవు. తక్కినవి

## తెలుఁగు గ్రంథములు.

నన్నయ మొదలు పెద్దనాదులవఱకును గల కవుల గ్రంథములలో మిక్కిలి ప్రఖ్యాతిచెందినవే యిందున్నవి. అనఁగా భారతము, రామాయణము, భాగవతము, మనుచరిత్ర, వసుచరిత్ర, రాఘవపాండవీయము, హరిశ్చంద్రనలోపాఖ్యానము, నరసభూపాలీయము మొదలగునవి యున్నవి కాని హెచ్చుకీర్తి గడింపని ప్రబంధములు పూర్వకాలపువి యంతగా లేవు. ఆంధ్రదేశమున నంతసుప్రసిద్ధుఁడైన శ్రీనాథుని గ్రంథమొక్కటియైన నంచయమునఁ గాన రాకుండుట చిత్రముగ నున్నది. మొత్తముమీఁద మధ్యకవుల కావ్యములు నాథునికులకావ్యములును సంచయమునందు హెచ్చుగానున్నవి. ఆప్రాంతములం దాంధ్రభాష కర్ణాట రాజులరాజ్యకాలమున వ్యాపించినది. కావున నంతకుఁ బూర్వపు వాఙ్మయముకంటెఁ దరువాతి వాఙ్మయమే యచ్చట నధికముగా నున్నది. మఱియు విజయనగరరాజులనాఁటి వాఙ్మయమే దక్షిణదేశమున 18 వశతాబ్దియందు బయలుదేఱిన వాఙ్మయమునకు మాతృకగా నున్నది. సంచయమునందలి యీ తెలుఁగు గ్రంథములను, బురాణములు, నిఘంటువులు, వ్యాకరణము, ఛందస్సు, అలంకారశాస్త్రము, కళలు, పద్యకావ్యములు, శతకములు, దండకములు, యక్షగానములు, ద్విపదకావ్యములు, వచనకావ్యములు నని విభజించి యొక్కొకశీర్షిక క్రింద వాని వానిని గుఱించి క్లుప్తముగఁ జెప్పెదను.

# పురాణములు.

నన్నయభట్టపోతనభాస్కరవిరచిత భారత, భాగవత, రామాయణములును గ్రొత్తవి కొన్నియు నీసంచయమున నున్నవి. రామాయణము సంస్కృతమునమహాకావ్యముగాఁ బరిగణింపఁబడుచున్నను సౌలభ్యముకొఱకుఁ బురాణములక్రిందఁజేర్చితిని. విష్ణుపురాణాదులు, వచనకావ్యములు, కొన్నియున్నవిగాని వానినిగూర్చిప్రబంధములక్రిందఁజెప్పెదను. పోతనరచించినదిగాక,హరికభట్టారకకృతంబైన భాగవతమొండున్నది. ఇది పద్యకావ్యము. ఏకాదశ ద్వాదశ స్కంధములు మాత్ర మున్నవి. హరికభట్టారకుఁడు హనుమద్భక్తుఁడు. గ్రంథమును హనుమంతునికే యంకితము చేసెను. ఈతఁడు సహజసారస్వత చంద్ర నామాంకుఁడు. గ్రంథాదియందలి

"శా॥ బంధూక ప్రసవాతిరిక్తవదనుఁ బ్రఖ్యాతునిం రామహృ
ద్బంధుఁ వాయుతనూభవుందలఁచి విద్వత్కోటి, మద్వాగ్విభూ
తింధాత్రి న్వినుతింప భాగవతమం దేకాదశ ద్వాదశ
స్కంధంబుల్ దెనిఁగింతుఁ బూర్వకథితస్కంధాను పూర్వంబుగన్

అనుపద్యమువలన నీతఁడు భాగవతమును బూర్తిగఁదెలిఁగించెనేమోయను సందియము కలుగుచున్నది గాని గ్రంథమును జదువ నానందియము తొలఁగుటకుఁ గారణములు కాన్పించుచున్నవి. వెలిగందలనారయ పూరించిన యేకాదశ ద్వాదశ స్కంధములలోని పద్యములవంటి పద్యములిందుఁ గన్పట్టుచున్నవి. మాదిరికొక్కటి చూపెదను.

గీ॥ భక్తులగు యాదవేంద్రులఁ బరఁగఁజూచి
యన్య పరిభవమెఱుఁగరీ యదువులనుచు
వీరిఁ బరిమార్ప నేఁ దక్క వేఱొకండు
దైవమిఁక లేదు త్రిభువనాంతరము లందు. వెలిగందల నారయ్య.

గీ॥ మత్సమర్పిత భక్తిచే మలయుఁ గాన
నన్యపరిభవమెఱుఁగ దీయదుబలంబు
వీరిఁ బరిమార్ప నేఁ దక్క వేఱె మఱొక
దైవమోపునె త్రిభువనాంతరము లందు. హరికభట్టారకుఁడు.

సింహాకవియొక్క యాంధ్రకౌముదిలోని సూత్రములకు నన్నయభట్టీయము లోని సూత్రములకును భేదము హెచ్చుగా లేదు. ఆంధ్రశబ్దచింతామణిని దీనిని బోల్చి చూడఁగా సూత్రములకుఁ బ్రతిసూత్రములు కల్పింపఁబడినట్లు తోఁచు చున్నది.

1 నామ్నః ప్రాతిపదికం.

2 ప్రత్యయోవర్ణకః.

3 ధాతుఃక్రియా.

4 ద్రుతాఖ్యోనః.

అను సూత్రములు కొంచెము హెచ్చుతక్కువగా రెండిటికి సమము. ఇట్టి వనేకములుకలవు.

1 నిత్యముకోఽచి.

2 వాఽలతః.

3 అనాదిషు విభక్త్యతః. సంధి. ఆంధ్ర కౌముది.

1 సంధిర్నాచోచ్యనతః.

2 వాఽలతః

3 అనాదిషు విభక్తిషూతోఽవా. సంధి. ఆంధ్ర. చింతామణి.

ఈత్రిసూత్రీద్వయమునుబట్టియే రెండుగ్రంథములకును గల సంబంధము తెలిసికొనవచ్చును. ఆయనగ్రంథము నీయనయో యీయనగ్రంథము నాయన యో లేక యిద్దఱును మఱియొకగ్రంథమునో చూచి యుండవలయు ననుట నిర్వి వాదమైనయంశము. లక్ష్మీనృసింహాకవి,

శ్లో. ఆథర్వణానికాణ్వాని భార్గవాస్పత్యాని సంవిదన్
కౌముదీమాంధ్రశబ్దానాం సూత్రాణిచకరోమ్యహం.

అని గ్రంథాదియందుఁ జెప్పియున్నాఁడు. కనుక నీతఁ డథర్వణాచార్యు లకుఁ దరువాతివాఁడనుటస్పష్టము. ఇతఁడు నన్నయభట్టునుగాని నన్నయభట్టీ యమునుగాని దడవియుండలేదు. ద్వితీయాచార్యుఁడైన యథర్వణుని నుదాహ రించినప్పుడు ప్రథమాచార్యుఁడైన నన్నయనేల మానును? కనుక లక్ష్మీనృసిం హాకవికాలమునాఁటి కాంధ్రశబ్దచింతామణి పుట్టలేదేమో. ఆంధ్రకౌముదినిఁ జూచి యెవ్వరో చింతామణిఁవ్రాసి నన్నయపేరిడియుందురు. నన్నయభట్టీయ

మును జూచియే నృసింహ మాంధ్రకౌముదిని రచించి దొంగతనము బయల్పడకుండఁ జింతామణినిఁ గప్పిపెట్టెనని యేలచెప్పరాదు? అనికొందఱు శంకింపవచ్చును? లక్ష్మీనృసింహకవి గప్పిపెట్టినచో నధర్వణుఁడైన నేల నన్నయను బేర్కొనియుండఁడు? ముందువారుదాహరింపకుంటయే వెనుకటివారు లేరనుటను దెలుపుననుతర్కమున్నచోటుల వర్తింపదుగాని సందర్భములనుబట్టి చూడనియ్యెడ వర్తించునని నిస్సంశయముగఁ జెప్పవచ్చును. సంచయములోని పుస్తకములనుబట్టిచూడ ఆంధ్రశబ్దచింతామణికిఁ దెలుఁగైన యప్పకవీయముగాని, వ్యాఖ్యానమైన యహోబలపండితీయముగాని యచ్చట వాడుకలో నుండినట్లుకాన్పింపదు. ఆంధ్రశబ్దచింతామణి దక్షిణదేశ మందుఁ బ్రచారములో లేకపోవుటయే యచ్చటఁ దెలుఁగు వర్ధమానదశయం దుండినకాలమునఁ జింతామణి పుట్టియుండలేదనుటకు నిదర్శనముగాఁ జెప్పవచ్చు ననితలఁచెదను. దక్షిణదేశమునందలి తెలుఁగు గ్రంథములన్ని సంపూర్ణముగ సంపాదింపఁబడినప్పుడీ విషయమును గూర్చి యెక్కువ దృఢముగా సిద్ధాంతము చేయవచ్చును.

ఆంధ్రకౌముదీ కర్తయగు లక్ష్మీనృసింహాము కాలమునాఁటికిఁ గణ్వరచితమును, బృహస్పతిరచితమునైన తెలుఁగువ్యాకరణము లుండెనఁట. వీని పేరులే యిప్పుడరుదుగ వినుచున్నాము. ఈవ్యాకరణములు దొరకినచో భాషాతత్త్వపరిశోధకులకమూల్యసాధనములుగానుండును. లక్ష్మీనృసింహకవి మండ్రువంశజుఁడు; వరదసోమయాజికిని నాంచారమాంబకును దనయుఁడు. అష్టభాషా పండితుఁడు. సర్వలక్షణశిరోమణి నాథునికుఁడైన గణపవరపు వేంకటకవి రచించెను. దీనియందుఁ బెక్కంశములుకలవు. "పలనాటిగొల్లలపాటజాతి" యని పాడినవేంకటకవియే యితఁడు. "కర్ణాటకవులలో మేటి" యని యితఁడు తనను గూర్చి లక్షణశిరోమణిలోఁ జెప్పికొనెను.

## ఛందస్సు.

కవిజనాశ్రయముయొక్క 7 ప్రతులీ సంచయమునఁగలవు. కవిజనాశ్రయమునకే భీమచ్ఛందస్సని నామాంతరముకలదు. భీమకవి విరచిత జ్యోతిష పద్యములు 237 గల చిన్నపుస్తకమొకటియున్నది. వేములవాడ భీమకవి జ్యోతి

షపటలములు వ్రాసెననియు నవి యిప్పుడు కానవచ్చుచుండ లేదనియు, వాడు కగలదు. భీమకవి జోస్యమని యొక గ్రంథ మచ్చుపడియున్నదంట. దానిప్రతు లిప్పుడు కన్పట్టవు. ఆ భీమకవియే యీభీమకవియై యీపద్యములే యీపద్యములై యుండిన నుండవచ్చురు. గ్రహములీ యీ స్థానములం గుండినచో మనుజుఁడిట్టివాఁడగునని యీపద్యములలో నున్నది. భీమనవిరచిత జ్యోతిష పద్యముల నుండి యొకపద్యము నుదాహరించెదను.

క. చదువులయందును జాణయు
సదలక లేఖలను వ్రాయవలసినవాఁడౌ
నదితీరవాస పరుఁడగు
సుదతులకును శిక్షచేయు సుజ్ఞానియునౌ.

మఱియు

క. నృపులకుఁ బ్రియుఁడై యుండును

అని ప్రారంభించి

శివవిష్ణులయందు భక్తిచేసెడివాఁడౌ

అని పవలకుఁ బ్రాసమైత్రి కల్పించినాఁడు. పూర్వలాక్షణికుల మతంబున "ప, వ" లకును "ప,బ" లకును బ్రాసమైత్రి యున్నట్లే యనుమానింపఁదగును. లక్ష్యములు కానవచ్చుచున్నవి. వెల్లంకితాతంభట్టు,

క॥ వబయోరభేదమనియెడు
నెపమున పఫ బభలు వాకునేర్పున వడిగా
నుపమింపవచ్చుఁ గృతులం
దుపనిషదుచితార్థ సూక్తులొలసినచోటన్

అనుపద్యమున "ప,బ"లకుఁ బ్రాసమైత్రిచూపినాఁడు. నాల్గుపాదములలో నొక పాదమునమాత్రమిట్లు రావచ్చునని కొందఱు తలంతురు. ఈప్రాంతముల నిప్పుడు సులక్షణసారముంబోలె దక్షిణదేశమునం దాకాలమునఁ గవిజనాశ్రయ ముపయోగపడినట్లు తోఁచుచున్నది. వీరనఛందస్సని యొక్క గ్రంథమున్నది. ఈవీరన్న భీమన్నను దడవినాఁడు గనుక భీమన్నకుఁ దరువాతివాఁడని నిశ్చయింపవలసి యున్నది. ఆనందరంగరాట్ఛందపుఁ బ్రతులు 5, 6 కలవు. దీనిని రచించిన కస్తూరిరంగకవి యాధునికుండు. అనంతుని ఛందస్సుకూడ నున్నది.

తాతంభట్టుకవిలోకచింతామణి కలదు. దానిలో సర్ణనీయ వళిప్రాసదోషాధికారం బులున్నవి; గ్రంథముపూర్తిగ లేదు. తాతంభట్టు కవిలోక చింతామణికిఁగావ్యాను శాసనంబని పేరు పెట్టియున్నాఁడు. ఇప్పు డచ్చుపడియున్న సులక్షణసారము యొక్క యట్టపైఁ దద్గ్రంథకర్త తాతంభట్టని ముద్రించి యున్నారు. ఈ యచ్చు పడ్డ సులక్షణసారమునకుఁ దాతంభట్టు కర్త కాఁడు. కవిలోక చింతామణియే యీ సులక్షణసారంబని భావించుట తప్పు. దీనికంటెఁ జింతామణి విలక్షణ మైనది. లింగముగుంటతిమ్మయసులక్షణసారమునకు దీనికిని భేదములు కాన్పించు చున్నవి.

# అలంకార గ్రంథములు.

అజ్ఞాతకర్తృకంబయిన సాహిత్యలక్షణంబును, నారాయణయ్యం గారు తెలిఁగించిన యాంధ్రరసమంజరియుఁ దప్ప నలంకారగ్రంథములలో నూతనములీ సంచయమున లేవు.

# కళలు.

ధనుర్విద్యావిలాసము, ఖడ్గలక్షణమునని రెండుగ్రంథము లీశీర్షికక్రింద రాఁదగినవి యున్నవి. ధనుర్విద్యావిలాసమును గొండవీటిరాజగు కృష్ణాని తిరుపతిరాయనింగారి ప్రోత్సాహంబున రచించి గ్రంథకర్తయగు కృష్ణమాచార్యుఁడు కోదండరామస్వామి కంకితంబు చేసెను. తిరుపతిరాయలు వెలమ; కుతుపశాహివలనఁ గొండవీటిరాజ్యమును బొందిన కృష్ణానిమాణిక్యరావు వంశస్థుఁడు. తిరుపతిరాజుతండ్రి యౌరంగజేబుకాలములోనివాఁడని గ్రంథమువలనఁ దెలియుచున్నది కావున నిది 17 వ శతాబ్ద్యంతముననో 18 వ శతాబ్ద్యాదినో పుట్టి యుండును. ధనుర్విద్యావిలాసములో గ్రంథకర్త కొండవీటినిట్లు వర్ణించి యున్నాఁడు:—

సీ॥ పసమించుభీష్మక ప్రముఖావనీపాలకులకు వజ్రపుజోడు కొండవీడు
శత్రురాజాధిరాజ విరాజదైశ్వర్య కులకంబుముకుఁద్రాఁడు కొండవీడు
అఖిలయాచకరాజహంస యూథములకుఁ గొందామరలనాడు కొండవీడు
దేవతాయతనమై దీపించుకల్యాణ కుధరంబుపైదోఁడు కొండవీడు

హరిహరవిరించి ముఖదేవతా వతంస
సంసదభిరామ హేమవిశాల సాల
జాగ్రదగ్రముహుర్ముహుశ్చటులపటహ
ఘుమఘుమధ్వానములఁగూడు కొండవీడు.

ఈ గ్రంథ మమూల్యమైనదిగాఁ గన్పట్టుచున్నది. ఇది సంస్కృతమున కాంధ్రీకరణముకాదు. తిరుపతిరాజు తా నభ్యసించిన విధంబుల నుపన్యసింపఁగా గ్రంథకర్త విని యాప్రకారము పద్యములలోఁ వ్రాసెను. అట్లయ్యు గ్రంథమంత ద్రోణుఁడర్జునునకుఁ జెప్పినట్లు సూతుఁడు శౌనకాది మహాత్ములకుఁ జెప్పిన విధమున వైశంపాయనుఁడు జనమేజయునితోఁ జెప్పినని కృష్ణమాచార్యుఁడు కోదండరామస్వామిని సంబోధించి వచించినభంగి నున్నది. ఇట్లు చెప్పుట మన వారి కాచారము. ఈయాచారము ననుసరించియే కాఁబోలును మొన్న మొన్న జరిగిన బొబ్బిలియుద్ధ వృత్తాంతముకూడ నారదుఁ డింద్రునకుఁ జెప్పవలసివచ్చినది కాని దిట్టకవినారాయణ చెప్పుచుండఁగా మనము విననోఁచినవారము కాకపోయితిమి. చారిత్రక విషయములను నిటీవలి రాజుల కాలములోఁ గట్టఁబడిన దేవాలయంబులంగూర్చిన యంశంబులను సూతునివక్త్రబిలంబే వినిపించినది; శౌనకాది మహాత్ముల శ్రవణకుహరంబులే యాలించినవి; నైమిశారణ్యాసుహోరుహంబుల మొదిగొమ్మలే తలలూఁచినవి. సూతనికిఁక నైన విశ్రాంతి యీయని వారు కృతఘ్నులుగదా.

ధనుర్విద్యావిలాసమంతయు స్వానుభవముచేఁ దిరుపతిరాజు వివరించినది గనుక మిక్కిలి విలువగల గ్రంథముగా మనమెన్నఁదగి యున్నది. దీనిలో విషయంబులను సంక్షిప్తముగాఁ గృష్ణమాచార్యుఁడే యిట్లు చెప్పినాఁడు.

"ఈ ధనుశ్శాస్త్రంబునం గురుసంకీర్తనంబును, శిష్యావరణంబును, విద్యాప్రభావ సూచనంబును, సఖండాఖండకోదండద్వయ నామోద్దేశంబును, ధనుర్నిర్మాణ ప్రమాణప్రముఖ విశేషవిభాగంబును, మార్గణపరిగణనా ప్రీణనంబును, దద్విధానమాన ప్రశంసనంబును, పుంఖోపసంఖ్యానంబును, పక్షపరిమాణ ప్రశంసయు, నిషంగరచనా ప్రవచనంబును, మౌర్వీవిధాన కథనంబును, నంగుళిత్రాణ ప్రకీర్తనంబును, జ్యారోపణ ప్రకరణంబును, ధనురూర్ధ్వాధర భాగ విభాగంబును, ముష్టిప్రకరణంబును, స్థానోపసంఖ్యానంబును, శరగ్రహణ హస్త ప్రతిపాదనంబును, సంధానక్రమ వివరణంబును, ఆకర్షణహస్తప్రస్తావం

బును, బాణహస్తక్షేత్ర నిరూపణంబును, దృష్టిలక్షణా న్వీక్షణంబును, ధను రాకర్షణ కౌశలోపన్యాసంబును, శరవ్యాపార యోగ్యతిధివార తారకాకరణ విస్తర ప్రస్తావంబును, ఖురళికారంగ ప్రసంగంబును, రంగప్రవేశ లక్షణనిర్దేశం బును, ధనుశ్శరపూజా యోజనంబును, గురుప్రణామస్థేమంబును, శరశరాసన గ్రహణ పౌర్వాపర్య పర్యాలోచన సూచనంబును, లక్ష్యశుద్ధి లాభంబును, లక్ష్యవేదికారచనా వివేచనంబును, నారాచమోచనప్రకార సూచనంబును, చిత్రలక్ష్యభేదనోపాయ ప్రతిపాదనంబును, శాబ్దలక్ష్యశరాభ్యాస విలాసంబును, దూరనికటస్థలలక్షితలక్ష్యభేదన దృష్టి ముష్ట్యంగుళనియమన లక్షణాన్వీక్షణం బును, రథారోహణ శరాభ్యాస విశేషభాషణంబును, గజారోహణ శరప్రయో గ విధానంబును, హయారోహణ శరమోక్షణ వివరణంబును, దూరాపాతి శరాభ్యాస విస్తరప్రకీర్తనంబును, శరప్రయోగ సమయాసమయ నిరూపణం బును, శరగమనగుణదోషవినిభాగంబును, దివ్యాస్త్రమంత్ర తంత్రప్రయోగ విస్తరప్రస్తావంబును లోనుగాఁ బంచచత్వారింశల్లక్షణంబులు ఘటితంబులై యుండు."

గ్రంథమునందు మొదట వెలమవారి చరిత్రమించుక గలదు. ఇట్లు వ్రా యఁబడిన గ్రంథములు తెలుఁగు బాసలో మిక్కిలి యరుదు. ఈగ్రంథము గణింపఁదగినదని నాయభిప్రాయము.

ఖడ్గలక్షణమను రెండవగ్రంథము నెవ్వరు రచించిరో తెలియదు. దీనిలో నాలుగు పత్రములుమాత్రమే యున్నవి. కత్తులపేరులు, వాని పొడవువెడల్పులు నీగ్రంథములోఁ జెప్పఁబడినవి.

## పద్యప్రబంధములు.

సంచయమునందలి పద్యకావ్యముల కర్తలగు 47 గురుకవులలో 27గుర రవదేశవువారుగా నున్నారు. వీరు 18 వ శతాబ్దియందుండినవారు. అచ్చటచ్చటఁ జ్యుతసంస్కారంబును శృంగారాతిరేకంబును వీరి పద్యప్రబంధముల విశేషలక్షణ ములుగాఁ గన్పట్టుచున్నవి. పచ్చిశృంగారమును వర్ణించు తారాశశాంక విజయక ర్తయగు శేషము వేంకటపతియు, రాధికాసాంత్వన కర్త్రియగు ముద్దుపళనియు నరవదేశవువారే. కొంచెమెచ్చుతక్కువగ నీ తరగతిలోఁ జేరిన చేమకూర వేంక

టకవియు నరవదేశస్థుఁడే. ఈతరగతిలోని వాఁడేయగు సాంబశివకవి యను నతఁడు బిల్హణీయముకూడఁ దెనుఁగున రచించి దక్షిణదేశపు శృంగారమునకుఁ గొలం తవాపెను. బిల్హణీయమునకు బిల్హణీయములు, తారాశశాంక విజయమునకుఁ దారాశశాంకవిజయములు, రాధికా సాంత్వనమునకు, రాధికాసాంత్వనములు రచించిన యీదాక్షిణాత్యాంధ్రకవుల శృంగారాభిరతి యేమని వర్ణింతుము ? సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడొక రాధికాసాంత్వనము నేకాశ్వాసముగ రచించెను. విజయరంగ చొక్కభూపాలునిచే సువర్ణదండాదులుగొన్న బద్యపూడి మెట్టభూపాలుఁడు తారాశశాంకకథరచించి యువజన హృదయానందమని పేరి డెను. మఱియిద్దఱరవవారు తారాశశాంక కీర్తనలు, తారాశశాంకనాటకము (యక్షగానము) వ్రాసిరి. ఇవి గాక యరవలు రచించినవి మదనానందము, మీాన కేతనాభ్యుదయము, శృంగార రసమంజరి యను పేరులుగల గ్రంథములుకూడ సంచయమున నున్నవి. వీని నన్నిటినిఁ జదివినచో నీతిపథ దూరుండైన భ్రష్టుండుం బోలె మద్యపానవ్యభిచారాదిదుష్కర్మదూషితంబులగు సందుగొందులయందుఁ గవిత పతిత కావలసివచ్చెఁగదాయని పరితాపము కలుగక మానదు. అనంగరంగ మను రతిశాస్త్రము సంస్కృతమునఁ గల్యాణమల్లవిరచిత మొక్కటి యున్నది గాని పూర్తిగలేదు. అతిశృంగారమును వర్ణించిన దాక్షిణాత్యాంధ్రగ్రంథములే వ్యాకరణోల్లంఘనమును బ్రారంభించినవి. ఒకదేశభాష యన్యదేశమునందును నన్యదేశ ప్రాంతములందును వికృతమగుచుండును. ఈయవస్థ మన తెలుఁగున కింతకుఁ బూర్వము పట్టినది. ఇప్పుడు పట్టుచున్నది. స్వచ్ఛమైన భాష కేనాఁటి కిని హాని వాటిల్లదు. కొందఱు హాని కలిగింపవలెననియత్నించినను గలుగనేరదు.

దాక్షిణాత్యాంధ్ర గ్రంథకర్తలలో "అళఘురి, పెరియన్న" యని యిద్దఱు గేవల మరవపేరులు గలవారే యున్నారు. సముఖము వేంకటకృష్ణప్పనాయక విరచితమైన యహల్యాసంక్రందన ప్రతియొక్కటి యున్నది; కాని సంపూర్ణము గాలేదు.

## శ త క ము లు.

ఇదివఱ కిచ్చటఁ బ్రచారములో నున్న దాశరథ్యాది శతకము లీసంచ యమునఁ గలవు. అరవదేశస్థులు రచించిన శతకములు కూడ నున్నవి.

"గీ॥ తాళనిచ్చునె ప్రేమ కాంతాలలామ" యనియంత్యపాదము గల కాంతాలలామ శతకము పచ్చి శృంగారముతో నిండియున్నది. ఇదియు నరన దేశనివాసి రచించినదియే. శృంగారపద్యము లని మఱియొక శతక మున్నది. రామశతకము, ముక్తికాంత పద్యములు, సుబ్బరాయ శతకము, ప్రసన్నజన చింతామణి, సుబ్రహ్మణ్య శతకము, సిద్ధరామ శతకము, కాళహస్తి శృంగ శతకము, మీనాక్షీ శతకము ననునవియు నున్నవి.

## దండకములు, చూర్ణికలు.

సంచయమునందలి దండకములలో భోగినీదండకము తప్పఁ దక్కినవన్ని దక్షిణదేశమునందు జనించినవే యైయున్నవి. ఈ దండకములందును శృంగారము పొంగి పొరలుచున్నది. చంద్రాననా దండకము, లీలావతీదండకము, నామగిరి లక్ష్మీ దండకము, కామాక్షీ దండకము, [సూర్యదండకము], భోగినీదండకము, [శక్తిగణపతి దండకము], సుబ్రహ్మణ్య దండకము, వినాయక దండకము, ముద్దళగిరి దండకము ననునవి ముఖ్యము లైనవి. రాజులుంచుకొన్న భోగమువారినిఁ గూర్చిన దండకములు వీనిలో నున్నవి; భోగపుఁబడంతుల వాదములును నిందుఁ గలవు. భద్రాచలమువారి చూర్ణిక, గోపికాగీత చూర్ణిక, పాంచాలి రంగయ్యంగారి చూర్ణిక, రామస్వామి చూర్ణిక, యనునవి సంచయమునందున్న చూర్ణికలు.

## యక్షగానములు.

సంచయమునందలి యక్షగానములలో నొకటి రెండు తప్పఁ దక్కిన వన్నియు దక్షిణదేశమునం దుద్భవిల్లినవే యైయున్నవి. వీనిలోను శృంగారము మిక్కిలి యెక్కువగా నున్నది. గోపాల విలాసము, రంగపురిపారిజాత నాటకము, తారాశశాంక నాటకము, ననుపేరులను బట్టియే చదువరులు వానిలోని శృంగార రసమును గ్రహింపఁగలరు. దక్షిణదేశంబున నుద్భవిల్లిన యతిశృంగారరస ప్రవాహంబు నాలుగు పాయలై, పద్యప్రబంధశతకదండకయక్షగానముల యందుఁ బాఱినదని చెప్పవచ్చును. సీతాకల్యాణము, ఎఱుకల కొఱవంజి

నాటకము, పార్వతీకల్యాణము, (మహాకోదండ వేంకన్న), సుగ్రీవవిజయము నను యక్షగానములు కూడ సంచయమున గలవు.

## ద్విపద ప్రబంధములు.

నలచరిత్రము (రాఘవకవి), సారంగధరచరిత్ర (భాగవతుల రామదాసుడు), ధర్మాంగదచరిత్ర (బొమ్మకంటి నృసింహకవి), రామాయణము (రంగనాథుడు), మైరావణచరిత్రము, భారతోద్యోగపర్వము (తిమ్మయ), గీతరఘునందనము (తిరుమలకవి), అనునవి సంచయమునందలి ముఖ్యద్విపదకావ్యములు. ఇవియన్ని దక్షిణదేశములోఁ బుట్టినవని చదువరులు భ్రమింపకుందురుగాక! బొమ్మకంటి నృసింహకవి యెవ్వరోకాని ద్విపదకావ్యములు విరివిగా వ్రాసియున్నాఁడు. ఈతఁడు రచించిన నలచరిత్రముయొక్క ముద్రితప్రతి నాయొద్దనున్నది. తిమ్మయ యుద్యోగపర్వమును జదువ నితఁడు భారతమంతయు ద్విపదకావ్యముగా రచించినట్లు కన్పట్టుచున్నది. గీతరఘునందనము గొప్పగ్రంథము. రంగనాథుని తరువాతనే ద్విపదకావ్యరచన ప్రబలినట్లు చెప్పుటకనేకాధారములు గలవు. మనలో ననేకులిప్పుడు ద్విపదకావ్యములన్నఁ జుల్కనగాఁ జూచుచున్నారు. ద్విపదకావ్యముల రచించుట సులభమనియు నందువలన నవి పండితజనాదరణీయములు కావనియు వారి యభిప్రాయము. కవితకుఁ గష్టమేమి సుఖమేమి? ఎముకలు విఱుచుకొని చెప్పిన పద్యములలో నెక్కువరసముండునని కాఁబోలు వీరియభిప్రాయము. సాధారణ పద్యకావ్యములు రచించుటకంటె గణపవరపు వేంకటకవివలె బాధకవిత్వము చెప్పుట కష్టతరముగదా. అందువలనఁ బద్యకావ్యములకంటె బంధకవితాకావ్యము లెక్కువగా నాదరింపఁదగినవని చెప్పవచ్చునా? గ్రంథము రచించుటకుఁగవి యెంతకష్టపడినాఁడని పరికించుట విమర్శకులపనిగాదు. "గ్రంథమున రసమెట్లుపోషించినాఁడు? ఎట్టిభావములున్నవి? భావానుకూలముగ శైలియున్నదా? భావముల నెట్లు వ్యక్తీకరించెను?" అని విచారింపవలసి యుండును. ఈ చర్చకిది స్థలముకాదు కావున నింతటితోఁ జాలింతును.

## వచన ప్రబంధములు.

సంచయమునందలి వచనకావ్యములు దాదాఁపుగ నన్ని దక్షిణదేశమునందే యుద్భవిల్లినవి. చదువరులెఱుంగఁ గోరుదురని వాని పేరులుక్రింద నుదాహరించుచున్నాను.

1. పంచతంత్రము.
2. భగవద్గీత.
3. మహావాక్యము.
4. గురుశిష్యసంవాదము.
5. ఆత్మైకబోధ.
6. భాగవతము.
7. విక్రమార్కచరిత్రము.
8. శ్రీరంగమాహాత్మ్యము (పాండ్యమండలాధీశ్వరుండైన విజయరంగ చొక్కనాథుఁడు.)
9. పాండవుల యశ్వమేధ వృత్తాంతము.
10. సాలభంజికల కథలు.
11. శ్రీరంగమాహాత్మ్యము.
12. జైమినిభారతము (సముఖ వేంకటకృష్ణప్ప నాయకుఁడు.)
13. ద్వాత్రింశత్సాలభంజికల కథలు.
14. రాయ వాచకము (విశ్వనాథరాయనిస్థానాపతి.)
15. రామాయణము (తుపాకుల అనంతభూపాలుఁడు.)
16. రామాయణము (శ్యామరాయకవి.)
17. గజారణ్యమాహాత్మ్యము.
18. రామాయణము.
19. రామాయణ సంగ్రహము.
20. భేతాళపంచవింశతి.
21. వచననైషధము.
22. పంచపదమహావాక్యము.
23. వాసుదేవమననము.
24. మాఘమాహాత్మ్యము (విజయరంగ చొక్కనాథుఁడు.)
25. వైశాఖమాహాత్మ్యము.

వీనిలోఁ గొన్నిటికి రెండేసిమూఁడేసి నాల్గేసి ప్రతులున్నవి. ఈగ్రంథములలోఁ దుపాకుల యనంతభూపాల విరచితమైన విష్ణుపురాణము మాత్రము

ముద్రితమైయున్నది. ఆంధ్రభాషాజ్ఞానములేని యప్రౌఢులు గ్రామ్యభూయిష్ఠముగా వ్రాసినగ్రంథములుకొన్ని వీనిలోనున్నవి. పైగ్రంథములన్నిటియందును దఱుచుగా వాక్యమధ్యవిసంధికానవచ్చుచునేయున్నది. తుపాకులయనంతభూపాలునిరచన మనోహరముగను విన సొంపుగను నున్నది. కొలఁది వ్యాకరణదోషముల కేమిగాని తక్కినగ్రంథములలోని వచనముగూడ మిక్కిలి చక్కఁగనున్నది. వీనియందలి వాక్యముల శయ్యయుఁ బదసంబంధమును నాంధ్రభాషాతత్త్వము ననుసరించి యున్నవి. ఇంగ్లీషుభాషాసంపర్కము లేని యాకాలమున నుదయించిన వచనకావ్యములు వాఙ్మయజిజ్ఞాసువుల కమూల్యములుగదా. చిన్నయసూరికిఁ బూర్వము వచనవాఙ్మయము విరివిగాలేదనియే యనేకులు భ్రమపడియుండిరి. గ్రంథములుదొరకనియప్పుడు భ్రమపడక యేమిచేయుదురు? ఇట్టిగ్రంథములను సంపాదించి వాఙ్మయవిమర్శకులకు వెలుంగునొసంగిన సాహిత్యపరిషత్తు ముందుముం దీదృశోపకారములు భాషకునల్పవలయునని యాంధ్రులాసపడుట యుచితంబయగును. పూర్వోదాహృత గ్రంథపట్టికలోని రాయవాచకమును విశ్వనాథరాయలవారి "స్థానాపతి" రచించెను. ఈస్థానాపతి కృష్ణదేవరాయల సమీపముననుండి యాయనవృత్తాంతమును జూచినది చూచినట్లు వ్రాసెను. ఈగ్రంథము చరిత్రగా మిక్కిలియుపకరించును. ఇట్లువ్రాయఁబడిన చరిత్రములు తెలుఁగునఁబెక్కులులేవు. ప్రత్యక్షముగాఁ జూచి వ్రాసిన చరిత్రాంశములయొక్క ప్రామాణ్యమునుగూర్చి నేనుజెప్పవలసినపనిలేదు. దీనిలో శూద్రగ్రామ్యము తఱుచుగాఁ బొడకట్టుచుండుటచే నీ"స్థానాపతి" శూద్రుఁడని తోఁచుచున్నది. ఆకాలపువచనశైలి తెలియుటకై సముఖము వేంకటకృష్ణప్ప నాయకుని జైమినిభారతమునుండి కొన్నిపఙ్క్తు లుదాహరించుచున్నాను:—

"అచ్చట మత్పుత్త్రుండైన మదనుని విషంబ్బు పెట్టించ్చి చంప్పించ్చెదనని యూహించ్చి తన తనయుని పేర స్వహస్తలిఖితంబ్బుగా నొక్కపత్త్రిక వ్రాసి ముద్రవైచి చంద్రహాసుని చేతికిచ్చి వినయంబ్బుర నెనరుదోఁచునట్లుగా చేరంబ్బిలిచి యీపత్త్రికంగ్గొని నీవొకండ్డను కుంతలపురంబ్బునకుంజని నాపుత్త్రునికిఁ గంమ్మ యిమ్ము యచ్చట నీకు సకలశోభనంబ్బులు గలుగుననిన చంద్రహాసుండ్డుపోయి ఆకంమ్మ గైకొని మనోమారుతవేగంబైన తురంగ్గంబ్బునెక్కి నిమిషమాత్రంబ్బున కుంతలపురంబ్బునకుంజని తత్పురప్రాంతంబ్బునంద్దు చంచ్చ చ్చంచ్చరీక ఝుంకార

సంక్కులంబైన యొక్కయుద్యానవన మధ్యంబ్బున హృద్యంబైన పద్మాకరంబ్బు పొడగని రాయంచ్చజక్కవ పెంగ్గురుల గరుల గరువలిచే నెగయు పుప్పొడులనప్ప లించ్చినవిప్పగునల్లకలువలు నుల్లసిల్లు తేనెసోనల నానిన చలిగాలిము(మొ?)లకల వలనం శ్రమంబ్బుదీర తురంగ్గంబ్బు సాబానీవశంబ్బుచేసి పల్లవ పుష్పఫలభరితంబైన సహకారవృక్షంబ్బునీడ బడలికెదీర పవ్వళించ్చి నిదురింప్పుచునుండ్డ ఆకుంతల మహీకాంత్తుని కూతుపు చంప్పకమాలిని దుష్టబుద్ధితనయ విషయయు మన్మథు నారాధింప్పంగ్గోరి సఖీజనులతోడంగ్గూడ నవ్వనంబ్బునకువచ్చి పల్లవితంబ్బులుకుసుమితంబ్బులు ఫలితంబ్బులునగు పొన్నలు పొగడలు గోరంట్లలు శామంత్తెలుచూతంబ్బులు పారిజాతంబ్బులు జాజులు విరిజాజులు మల్లెలు మొల్లలు పోకమాకులు మొదలగు తరులతానికరంబ్బుల కుసుమంబ్బులు గోయుచువిరిగొత్తు నెండ్డొరుల మ్రోదుచు నొయ్యారంప్పునడలచే వనమయూరంబ్బుల గర్వంబ్బులుదింప్పుచు పూలరెమ్మఁ గూడివంప్పుచు పువ్వులకై మదిదింప్పుచు సఖులచేరంబ్బిలుచుచు సరసంప్పుపలుంగ్గులచే మత్తకోకిలంబ్బుల మదంబ్బులడంప్పుచు పువ్వుతీవియలు వంప్పుచు మేనిమెఱుంగ్గుల వనంబ్బెల్లనింప్పుచు నిటలంబ్బులనటించ్చు కుటిలాలకంబ్బులచే తుమ్మెదలంగ్గదుముచు పల్లవంబ్బులంచిదుముచు కోసినవిరులు పైయెద లోనం దురుముచు తళుకువాలారుజూపుతూపులు బాలకురంగ్గ హృదయాంగ్దంబ్బులునాడుచు తేనియవాకలంద్దాటుచు తమసౌరభంబ్బులచే కుసుమసౌరభంబ్బులు మాటుచు రాజనంద్దనయగు చంప్పకమాలియు మంత్రితనయయగు విషయయు పువ్వులుగోసి యలసి కమలాకరంబ్బుడాసి వేడుకమీర జలక్రీడలాడి విగళితహార మణి గణంబులచే కమలాకరంబ్బు రత్నాకరంబ్బు సేయుచు తత్తటంబ్బుల దువ్వటంద్దంబ్బులగట్టి సొమ్ములుబెట్టి కుంక్కుమకస్తూరికలలంద్ది యవ్వేలంద్దులు మన్మథ పూజసేయుచుండ్డ నయ్యవసరంబ్బున నమ్మంత్రికొమారికె యక్కోలనిగట్టున తీయమామిడిచెట్ల నీడలోనిదురింప్పుచునున్న చంద్రహాసునింగాంచ్చి అంద్దియలు మొలనూలు మువ్వలు రవలమెట్టెలు మ్రోయకుండ మెల్లమెల్లనంజని యక్కుమారవరుని రూపరేఖాసౌందర్యకళావిలాసంబ్బునకుంజొక్కి చక్కెరవిలుతుని శారికింజిక్కిచేరంజని అడపసంచ్చితాటకట్టియున్న కంమ్మవిడిచిచూచి చెయివ్రాలు దెలిసి యవ్వాక్కణలాద్యంతమున్ను చదువుకొని నిజజనకునివిషమబుద్ధికి పరితాపంబ్బు నొంద్దుచు రూపరేఖావిజిత రమాకుమారుండైన యీరాచకుమారునకు విషమొసంద్దుమని వ్రాసిననింతనిర్దయుండు జగంబ్బునంగ్గలండ్డె యనివగచి విష

మొసంగ్గుమని వ్రాసినయక్షరంబ్బుల నమయకారంబ్బువ్రాసి తాముసింప్పక నావచ్చునంత్తలో విషయ యొసంగ్గుమనివ్రాసి యప్పటిముద్రవైచి అడపసంచ్చి తాటంగ్గట్టి పెన్నిధింజూచి విడువంజాలని పేదవడువున నవలనడుగిడంజాలక కొంత్త దడవుచూచుచుండ్డి పరాధీనగావున దీనమానసయై యెటుంగ్గనియట్ల రాజపుత్త్రిక డకుంజని తదనుమతిబడసి నిజగృహంబునకుంజనియె. అంత చంద్రహాసుండ్డు నిదురమేల్కాని సరసీజలంబ్బుల ప్రక్షాళితపాణిపాదవదనుండై తేటనె.....నప్పురంబ్బునకుంవచ్చి యడనెడ శుభశకునంబ్బులు పొడగనుచు ప్రధానినాకిటికింజని ఘణిహారిచేతనరాక మంత్రికుమారున (కెఱిం) గ్గించ్చుటయు నతండ్డు పుళింద్దకుని సుతుండ్డు వచ్చినాండనివిని సంభ్రమంబ్బుగా నెదుర్కొని గాఢాలింగ్గనంబ్బుగావించ్చి సంత్తసంబ్బున యేకాంత్తప్రదేశంబ్బునకుంజని పుళింద్దునిసేమంబ్బడుగుచు తండ్రి ముద్రవైచిన పత్రిక నొసంగ్గిన కేలంగ్గైకొని శ్రీమతుసకలగుణ సమృద్ధుండైన దుష్టబుద్ధియగు కుమారుండ్డగు మదనునిదీవించ్చి పుత్తెంచ్చిన శుభప్రయోజనంబ్బు. పుళింద్దునిముద్దుపట్టి కులస...నపౌరుషంబ్బుగల మేటి. యెల్లప్పుడు మనకు మహాహితుండ్డు. వీనిం గనుంగ్గొనిన యాక్షణంబ్బున సందేహంబ్బుమాని విషయ నొసంగ్గినావచ్చునంత్తలో యల్లకార్యంబ్బులు చక్కబెట్టునది యను వక్కణచదువుకొని సంతసించ్చి నాసహోదరికి తగినవరుండ్డు దొరికె మేలుమేలనుచు ము(మౌ)హూర్తిక(కు)లు(ల)రావించ్చి యారాత్రి శుభలగ్నంబ్బు గలుగుటవలస వివాహంబ్బు గావించ్చి మహేంద్రవైభవంబ్బున సముచితవిధానంబ్బు లాచరింప్పుచునుండ్డె."

దక్షిణదేశగ్రంథముల యందర్థానుస్వార ముండవలసిన చోట శ్రద్ధతోనుంపఁబడియున్నది. ఆకారమున మాత్ర మీయరసున్న పూర్ణానుస్వారమును బోలియున్నది. అంతటఁ బూర్ణానుస్వారమే పూర్వ ముపయోగించిరి కాని యర్థానుస్వారము లేదనుకొందమా పద్యపాదములందు గణభంగము సంభవించును. మనదేశపుఁ దాళపత్రగ్రంథములలో నర్థానుస్వారము కానరాదు. మనవారికంటె దాక్షిణాత్యు లర్థానుస్వారమును మిక్కిలి జాగరూకతతోఁ బాటించిరి. ద్రుతమున కాదేశముగా వచ్చిన యరసున్నను వీరంత పాటించినవారు కారు. సిద్ధానుస్వారములను (పదమధ్యమందలివి—అతఁడు, అరఁటి, నెలఁత, చెలఁగు) విడిచిపెట్టక యుంచిరి. దీనికిఁ గారణ మారయఁగా దక్షిణదేశస్థులు "వాఁడు" మొదలైన యరసున్నగల పదముల నుచ్చరించునప్పుడు సానునాసికోచ్చారణము చేయుదురని తెలియవచ్చుచున్నది. దక్షిణ మండలములందున్న తెలుఁగు

వారిప్పటికి వచ్చినాండు, పోయినాండు, పేండ (పేఁడ) చీంపురుకట్ట యని యను స్వారము నాత్యస్ఫుటముగ వినఁబడునట్లు మాటలాడుచుందురఁట. ఇందువలననే దాక్షిణాత్యగ్రంథములం దీయనుస్వార మెక్కువగాఁ బాటింపఁబడి యుండును. అరవకన్నడ మళయాళభాషలందు ముక్కుసహాయముతోఁ బలుకవలసిన పదములు పెక్కులుకలవు. మనదేశమునందుఁ గూడనీ యనుస్వారముచ్చారణములో నుండి కాలక్రమమున జాఱిపోయియుండును. నే నుదాహరించిన జైమినీభారత పఙ్త్తులలోఁ జదువరులుకొన్ని విశేషములు కనిపెట్టవచ్చును. అనుస్వారము తరువాత వచ్చిన యక్షరము ద్విత్వమునుబొంది యున్నది. ఐకారము పరమైనప్పుడు ద్విత్వముకానరాదు. కొన్నిచోట్ల ద్రుతమునకు బదులుగావచ్చిన యనుస్వారమునకుఁబరముగానున్న యక్షరము ద్విత్వముం బొరసియుండలేదు; కొన్నిస్థలంబులం బొరసియున్నది. గట్టు, బడలిక వీనిలోని "అ" కారము "ఎ" కారమైనది. యడనెడ, యల్ల, యెల్ల అనుచోటుల యకారముమీఁది "అ, ఎ" అను నచ్చులొకటికొకటి మాఱినవి. "గు త్తి" "గొ త్తి" గా మాఱినది. సముచ్చయమైన "ను" "న్ను" అని యొకచోనున్నది. ఇంకఁగొన్ని మార్పులునుగలవు. అను స్వారము, అచ్చుల మాఱ్పులు, ద్విత్వము, మొదలగునవి స్వరశాస్త్ర (Phonetics) ప్రవిష్టులు గమనింపవలసిన విషయంబులుగదా.

అక్కిరాజు ఉమాకాంతం.



# అనితల్లి కలువచేఱు శాసనము.

⟵⟹(౦)⟸⟶

ఈశాసనము గోదావరిజిల్లా కాకినాడతాలూకాలోని ఆర్యవటగ్రామమందు కాశీనాథభట్ల సుబ్రహ్మణ్యముగారి యొద్ద నుండఁగా నామిత్రు లగు దుగ్గిరాల ప్రకాశరావుగారి మూలమున నాకులభించినది. గ్రంథమంతయు మూఁడు రాగిరేకుల కిరుప్రక్కలను నాలుగవరేకున కొకప్రక్కను జెక్కఁబడియున్నది. మొదటిరేకునకు ముం దక్షరసంరక్షణార్థమై యుత్తరేకొకటి చేర్పఁబడియున్నది. రేకులపరిమాణము $11\frac{1}{2} + 5\frac{1}{2}$ అంగుళములు. ఈరేకు లన్నియు నొకకంకణమున గ్రుచ్చియున్నవి. కంకణ మతికినచో రాజముద్రయు దానిపై నందివిగ్రహమును సూర్యచంద్రుల విగ్రహములును గలవు.

లిపి:—ఈశాసనపులిపి కాటయవేముని తొత్తరమూడి శాసనము మొదలయిన యానాఁటి శాసనములయందలి తెలుఁగు లిపిని బోలియున్నది. ఈలిపికిని వర్తమానకాలమందలి తెలుఁగులిపికిని భేదము స్వల్పముగా నున్నది. శవర్ణరూపము విలక్షణము. భ, భూ, అను నొత్తక్షరముల యొత్తు సూచించుటకై యిప్పుడు మనము వ్రాయు నక్షరముక్రింది నిలువుగీటు లేదు. హల్లులతోఁగలసియున్న ఈ, ఏ, ఓలదీర్ఘమును దెలుపుగుర్తు లేదు. దయనునక్షరము కుడివైపు గీత బాగుగాఁగలియక కొంచె మెడముండుటమాత్రమే దానికిని ధయను నక్షరమునకును గల భేదము. ఐకారము హల్లుతోఁ గూడినప్పుడు కొడవలి యాకారము చెందుచున్నది. రవర్ణమునకు బదులు సంయుక్తాక్షరములందు వెలపలగిలప యథేచ్ఛముగా నుపయోగింపఁబడియున్నది. అనుస్వారమునకుఁ బరమందు వచ్చు హల్లులు కొన్నిచోటులమాత్రము ద్విత్వము నొంది యున్నవి.

భాష:—శాసనమంతయు సంస్కృత పద్యరూపముగా నున్నది. పద్యములసంఖ్య 76. కలువచేఱు గ్రామము హద్దులపేళ్లు తెలుఁగు మాటలే కాని యవిగూడ సంస్కృత వాక్యములలో నిమిడి యున్నవి. భాష సలక్షణముగను శైలి ధారాళముగను నున్నవి.

శాసనగ్రంథ సంగ్రహము:—కవి మొదటి యేడు శ్లోకములలో నాది వరాహ గజానన పశుపతి సూర్యచంద్ర చతుర్ముఖుల స్తుతించి పిదప వర్ణచతుష్టయమును వర్ణించి యున్నాఁడు. విద్యావంతులును, తపోధనులును, సత్కర్మ నిరతులు నగు విప్రులును, దాననిరతులును, దేవబ్రాహ్మణ పూజాపరులును, సర్వ వర్ణపాలకులును, శూరులునగు క్షత్రియులును, కృషిగోరక్షవాణిజ్యానుపాలనాది నిజకర్మపరాయణులును, దేవబ్రాహ్మణగురు పూజాపరులు నగు వైశ్యులును, పరోపకారపరాయణులును, శూరులు నగు సచ్ఛూద్రులును విరాజి ముఖభుజోరు పాదములవలనఁ బుట్టిరి. (శ్లో. 8-11). అందుఁ బ్రజాంత్యాచరణాదిగుణములచే వైశ్యులు బ్రాహ్మణులను, భూపాలనాది గుణములచే శూద్రులు క్షత్రియులను బోలియున్నారు. (శ్లో. 12) స్వానుష్ఠానపరులగు విప్రులవలన నృపలక్ష్మియు, రాజులవలన విప్రుల తపోలక్ష్మియు నభివృద్ధి నొందును గాన బ్రాహ్మణ క్షత్రియుల కన్యోన్యాశ్రయము విధియై యున్నది. వైదికలక్ష్మి—యనఁగా వైదిక విద్యయు వైదికాచారములును భరతఖండమందు మాత్రమే కలవు. ఆభరత ఖండములో మల్లికార్జున భీమేశ్వర కాళేశ్వరనామక త్రిలింగము లే దేశమునఁ గలవో యా దేశమునకు త్రిలింగ (తెలుఁగు) దేశమని పేరు. అదేశము మిక్కిలి ఫలవంతమయినది. అందు సాంగవేద పురాణాది విద్యలు విలసిల్లుచున్నవి. (శ్లో. 15-18).

ఈ త్రిలింగదేశము ననేకరాజులు పాలించి స్వర్గస్థులయిన పిదప కాకతియ్యకులుఁడగు గణపతి యనునాతఁడు రాజయ్యెను. కాకతి యనుదేవత కృప చేత నొక గుమ్మడి తీఁగ పుత్త్రినొకనిఁగనెను. ఆతనివంశమున కగుటవలన కాకతీయ వంశమని పేరువచ్చెను. (19-21) గణపతి కాలధర్మము నొందిన పిదప నాతని కూఁతురగు వీరరుద్రమదేవి కొంతకాలము భూపరిపాలన మొనర్చి యనంతర మాభారము తనదౌహిత్రున కొప్పగించెను. (21-22). ప్రతాపరుద్రుఁడు నిరాతంకముగా రాజ్యముచేయునపుడు విద్యలెంతయు విలసిల్లెను. గజపతి బిరుదాంకితుఁడగు ఉత్కళనాథునికంటెను, అశ్వపతియయిన పాశ్చాత్యాధీశ్వరునికంటెను, నరపతియయిన త్రిలింగాధీశుఁడే యధికుఁడుగానుండెను. (శ్లో 23 26). ప్రతాపరుద్రుఁడు స్వర్గమున కేఁగినపిమ్మట నాతని రాజ్యమంతయు యవనులచే నాక్రమింపఁబడియుండ సముద్రములో మునిగియున్న భూమండలము

నాదివరాహావతారుఁడగు నారాయణుఁ డుద్ధరించినట్లు యవనోదరస్థ మగు నాంధ్రదేశమును ప్రోలయనాయకుఁ డుద్ధరించెను. ప్రోలయ నాయకుని యనంతరము కాపయనాయకుఁడు రాజ్య మొనర్చి తురుష్కులచే నపహరింపఁబడిన యగ్రహారముల మఱల బ్రాహ్మణుల కిచ్చుటయకాక క్రొత్తగాఁగూడ ననేకాగ్రహారములు చేసెను. అంతఁ గొంతకాలమునకు కాపయనాయకుఁడు కాలధర్మము నొంద నాతనిఁగొలుచుచుండిన డెబ్బదియైదుగురు నాయకులును త్రిలింగదేశమును విభజించుకొని యొక్కొక్కఁ డొక్కొక్కభాగము నాక్రమించి యేలసాగిరి. (శ్లో 27-32). వారిలో పంటకులోద్భవుండును, శివపూజా ధురంధరుండును, సంతతభారతవీరపురుషకథా శ్రోతాంతరంగుఁడును, పాతాళగంగా సోపానావళి నిర్మాతయునగు వేమారెడ్డి ముఖ్యుఁడు. అతనికి అన్నపోత, అన్నమాచ, అన్నవేములను ముగ్గురుకొడుకులుండిరి. అందులో అన్నపోతారెడ్డికి కుమారగిరి రెడ్డియనుపుత్త్రుఁ డుదయించెను. (శ్లో. 33-36). కాటయరెడ్డికి మునిమనుమఁడును, మారయరెడ్డి మనుమఁడు, కాటయరెడ్డికి తనయుఁడును, అన్నపోతారెడ్డి యల్లుఁడునునగు కాటయవేమారెడ్డి తన బావమఱందియైన కొమరగిరిరెడ్డికి మంత్రియై యుండెను. ఆకాటయవేమునకు కుమారగిరియను కొడుకును అనితల్లి యను కూఁతురును గలిగిరి. కాటయవేముని యనంతరమాతని (రాజమహేంద్రవర) రాజ్యమునకు కుమారగిరి యధిపతియై గతించిన (శ్లో. 37-43) పిదప స్వామిద్రోహపరాయణులగు కున్నృపతులచే నాక్రమింపఁబడిన రాజ్యమును దొడ్డయఅల్లనరేంద్రుఁడు నిజబాహుబలముచే జయించి కాటయవేముని కూఁతురును, తనకోడలు నగు అనితల్లి స్వాధీన మొనర్చెను. అల్లాడరెడ్డికి వేమాంబికయందు జనించిన వీరభద్రారెడ్డియే యనితల్లి భర్త. ఆతనియన్న పేరు వేమారెడ్డి. బావ వేమారెడ్డి సచివుఁడై సహాయ మొనర్చుచుండ ననితల్లి భూపరిపాలన మొనర్చుచు 1345 వ శకాబ్దమున వైశాఖమాసమందు శ్రీమార్కండేయుని సన్నిధిని దేవబ్రాహ్మణక్షేత్రముల మీఁది పన్నును విడిచిపెట్టుటయకాక (శ్లో. 44-51), యాసంవత్సరమునందే శ్రావణబహుళాష్టమీతిథిని శ్రీశైలాధిపరామేశ్వరు సన్నిధిని కల్వచేఱు అనుగ్రామమును అన్నవరమను నామాంతరముతో కాశనాథ భట్టు కుమారుఁడగు పరహితాచార్యుఁడను వైద్యునకు దత్తముచేసెను. ఈవైద్యునివంశమునకు మూలపురుషుఁడగు పరహితుఁడను నాతఁడొకానొక కాలమందొక సర్పము దౌడలు

రెంటికి నెముక గ్రుచ్చుకొని బాధపడుచుండుట చూచి యా యెముకను నూడఁ బెఱికి పుంసునకుఁ జికిత్స యొనర్చి, పరహితుఁడను నన్వర్థనాముఁడయి యాస ర్పమువలన నభయదానమును బొంది చికిత్సచేయఁ దొడఁగ నాఁటినుండియు సర్పచికిత్స యాతని వంశంబున ననుసృతంబుగ వచ్చుచుండెనఁట.

దత్త గ్రామమునకు హద్దులు:—తూరుపునమాడ్త పుంత, ఆగ్నేయిదిశను పుట్టపుంత, దక్షిణమున మడుగు, నైరృతి దిక్కున కోటపుంత, పడమట వెలగపుట్టగల మఱ్ఱిపుంత, వాయవ్యదిశను జమ్మిపుంత, ఉత్తరమునఁ బ్రేకేటిపుంత, ఈశాన్యమున నూతిపుంత.

చరిత్రాంశ విమర్శనము.—కాకతీయరాజవంశ చరిత్రమునందును, రెడ్డిరాజుల రాజ్యవృత్తాంతమునందును, ఇదివఱలో సందిగ్ధములుగా నున్న కొన్ని యంశము లీశాసనమువలన స్పష్టమగుచున్నవి. కొన్ని శాసనములలో కాకతీయ రాజులు తాము సూర్యవంశపు క్షత్రియులమని చెప్పుకొనియున్నారు. ఈమాట గణపతిదేవుని కాలమునకుఁ బూర్వము పుట్టిన శాసనములలో లేదు. ప్రతాపరుద్ర దేవాంకితమగు ప్రతాపరుద్రీయమను ప్రతాపరుద్రయశోభూషణమందు

"తాదృఙ్మధ్యమలోక భాగ్యవిభవాదింద్రాది బృందారకైః।
క్షోణ్యాం క్రీడితు మిచ్ఛుభిశ్చిరతరం సంప్రార్థితః పద్మభూః॥
అత్యర్కేందుకుల ప్రశస్తమసృజద్యం కాకతీయాన్వయం।
తస్మిన్ సంప్రతి వీరరుద్రవపుషా జాగర్తి లక్ష్మీపతిః॥"

అని నాయకప్రకరణమందును,

1. "సోమార్కాభిజనం తమద్య జయతి శ్రీకాకతీయాన్వయం।"
2. "సూర్యసోమాన్వయామాత్యమహత్త్వాద్యాధరీకృతా।
అస్మాభిరధికుర్వాణైః కాకతీయకులస్థితిం॥"
3. "సాహస్రాంశవమైందవంచ మహతీయే ద్వేకులే నిర్మితే।
తేజాతే లఘునీ గుణైర్విజయిని శ్రీకాకతీయాన్వయే।"

అని యచ్చటచ్చట నాటకప్రకరణమందును, కాకతీయవంశము సూర్య చంద్రక్షత్రియవంశములకంటె భిన్నమయినట్లును;

"క్షుద్రక్షత్రియ పక్షశిక్షణవిధౌ ప్రోక్షిప్త కౌక్షేయకాః।" అని నాయకకావ్యప్రకరణములందును

"స్వామి న్నేతే సోమార్క వంశ్యా నరపతయో మహాతి మర్థానా మర్హంతి. తేన స్వేషు స్వేషు పదేషు ప్రతిష్ఠాపనీయాః ప్రస్థాపనీయాశ్చ"

అని నాటకప్రకరణమందును, కాకతీయరాజులకును క్షత్రియరాజులకును వైర ముండినట్లును విద్యానాథుఁడు చెప్పియున్నాఁడు. వీనిని బట్టి చూడ కాకతీయులు క్షత్రియేతరు లని నిరభ్యంతరముగా నూహింపవచ్చు నని నా యభిప్రాయము. సాధారణముగా క్షత్రియులు సూర్యవంశమునందో చంద్రవంశము నందో పుట్టినవా రని దేశసంప్రదాయము. ఇంతియ కాక కాకతి యను పరశక్తి కృపవలన నొకానొక గుమ్మడితీగ కొడుకు నొకనిఁ గనె ననియు నాతనివంశ మాకారణమున కాకతీయవంశ మయ్యె ననియుఁ బ్రస్తుత శాసనమున నీవంశమున కమానుషోత్పత్తి కల్పింపఁబడుటకూడ నీయూహను దృఢపఱచుచున్నది. పుదుకోట రాజవంశావతారవర్ణనములో నావంశకర్త యింద్రునకొక మనుష్యస్త్రీయందుఁ బుట్టె నని యున్నది. పుదుకోటరాజులు క్షత్రియేతరులు. సామాన్యవంశములోఁ బుట్టినవా రున్నతస్థితికివచ్చిన పిదప తమవంశమున కదివఱకు లేని మహత్త్వమును గల్పించుకొన్నందున కుదాహరణము లనేకములు గలవు.

"ఆమూలాత్ఫలితా ప్రసత్తిలతికా పత్యుస్స్వయం భూప్రభో।
రాజ్ఞాక్షత్రియమౌళిమండన మణే స్తాతస్య సానుగ్రహా"

(నాటక ప్రకరణము)

అను పద్యములో "క్షత్రియమౌళిమండనమణి" యను విశేషణమున క్షత్రియశబ్దము సామాన్యభూపాల వాచకముగా గ్రహింపవలయును.

గణపతిదేవుని యనంతరము కాకతీయరాజ్యమును బాలించిన రుద్రమదేవి యాగణపతిదేవుని కూఁతురని యీశాసనమున స్పష్టముగాఁ జెప్పఁబడినది. (శ్లో. 22) ఈరుద్రమదేవి గణపతిదేవుని భార్యయని కొందఱు తలంచుచుండిరి, కాని యది సత్యముకాదని యిప్పుడు నిశ్చయమగుచున్నది. ఇందునకుఁ బ్రమాణాంతరములు కూడఁగలవు. వానిలో ప్రతాపరుద్రీయము ముఖ్యమయినప్రమాణము. ఏతద్గ్రంథాంతర్గత నాటకప్రకరణ ప్రథమాంకమునందు:—

"ఏవం మానుషశంభునా గణపతిమహారాజే నాభ్యంతర స్యానుభవమహిమ్నః సదృశ మ్మాత్ర పుత్ర ఇతివ్యవహారః కృతః। తదనుగుణా చ రుద్ర ఇత్యాఖ్యా॥" అను వాక్యములవలన రుద్రమదేవి గణపతిదేవుని తనయ యయినట్లును,

ఆమె పుట్టినప్పుడే గణపతిదేవుఁడు తనకుఁ బుత్త్రుఁ డుదయించెనని ప్రకటించి యాశిశువునకు రుద్రుఁడను నామమిడెననియు;

మఱియు,

"స్వీకృతే పుత్త్రిభావేన దౌహిత్రే ప్రాజ్యమాజ్ఞయా।
అస్మిన్నిధేహి ధౌరేయే గుర్వీ ముర్వీధురామ్"

అను శ్లోకమువలన నారుద్రమదేవి తనదౌహిత్రుఁడగు ప్రతాపరుద్రుని పుత్త్రునిగా స్వీకరించెననియుఁ దేలుచున్నది.

దీని కనుగుణముగా,

1. స్వయంభూస్తాత ఇత్యేతావీశ్వరౌ దివ్యమానుషౌ।"
2. "రాజ్ఞా క్షత్రియ మౌళిమండనమణే స్తాతస్య సానుగ్రహా।"
3. "శిరసికృత స్తాతస్య నియోగః।"

ఇత్యాద్యనేక స్థలములందుఁ బ్రతాపరుద్రుఁడు రుద్రమదేవిని గూర్చి ప్రశంసించునప్పు డామెను తండ్రిగా భావించుచు వచ్చెను. రుద్రమదేవి గణపతిదేవుని కూఁతురును, ఆమెకుఁ బ్రతాపరుద్రుఁడు స్వీకారముచేత కొడుకునగుట వలననే, నాటకప్రకరణ పంచమాంకమునందలి

"యస్త్వద్గోత్రి మహత్తరస్య జగతాంత్రాతు స్స్వయంభూవిభో।
స్తత్త్రాదృక్చరితాద్భుతై ర్మహిమభి స్స్వై ర్యై ద్వితీయో భవత్।
దేవో సౌ గణపేశ్వరః ప్రతికలం స్ఫారప్రసాదోన్ముఖో।
నప్త్రుస్తే కులమండనస్య మహతీం పుష్ణాతు రాజ్యశ్రియం॥"

అనుపద్యములోఁ జెప్పినచొప్పున ప్రతాపరుద్రుఁడు గణపతికినప్త (మనుమఁడు) అయ్యెను.

రుద్రమదేవి రాజ్యకాలములోఁ బుట్టిన యనేక శాసనములలో రాజుపేరు రుద్రరాజనియు, రుద్రమహారాజనియు పుంలింగముగానే యున్నది. ఇయ్యది "ఏవంమానుషశంభు" నేత్యాది వాక్యానుసారముగానే యున్నది.

రుద్రమదేవి గణపతిదేవుని కూఁతురనుట కిన్ని ప్రమాణములుండఁగా నామె యాతనిభార్యయను ప్రతీతి లోకమునఁ గలిగినది. ప్రతాపరుద్రీయనాటక ప్రకరణమునందలి "యో రుద్రో రజతాచలే స్థితి మగా దర్ధాంగనారీః పురా" యనుశ్లోకమునకు వ్యాఖ్యచేయునవసరమున కుమారస్వామి సోమయాజి "పురా కిల కాకతికుల సంభూతే గణపతినామ్ని మహారాజే దుహితృమాత్ర సంతానే

కదాచి దైవయోగేన కాలపరిపాక ముపేయుషి తన్మహిషీ రుద్రదేవీ నామ రాజ్ఞీ బహూని వర్షాణి తద్రాజ్యమకంటకం పరిపాల్య పరిణతాసతీ దౌహిత్రే ప్రతాపరుద్రే రాజ్యధురాం నిదధే" అని యమూలకముగా వ్రాసియున్నాఁడు. దీనికిని మూలమునకును గల భేదమునకు సమాధాన మెచ్చటను జెప్పియుండలేదు. పిదపఁబుట్టిన కొన్నిగ్రంథములలోఁ గూడ నిట్లే యున్నది. రుద్రమదేవి రాజ్యము చేయుకాలమున నీదేశమునకు వచ్చియున్న మార్కోపోలో యను నిటలిదేశస్థుఁడుగూడ నారాజ్ఞి వెనుకటిరాజు భార్య యనియే వ్రాసియున్నాఁడు. ఈమత భేదము గలుగుటకుఁ గారణ మూహ్యము. ఏది యెట్లున్నను ప్రతాపరుద్రీయమును బట్టియు, ప్రకృతశాసనమును బట్టియు రుద్రమ గణపతి కూఁతురనియే నిశ్చయింపఁదగియున్నది.

ప్రతాపరుద్రునితో కాకతీయరాజ్యము సాంతమయినది. తురుష్కులు ప్రతాపరుద్రుని జయించి యాతనిదేశములోఁ గొంతభాగము నాక్రమించుకొనిరి. దూరదేశముల నాయా నాయకు లాక్రమించి స్వతంత్రముగాఁ బాలింపసాగిరి. వారిలో ప్రోలయనాయకుఁ డొక్కఁడు. అతఁడు గతించినపిదప నాదేశమును కాపయ యను నాయకుఁడు పరిపాలించెనఁట. అతనిక్రింద డెబ్బదియయిదుగురు నాయకు లుండినట్లును, కాపయనాయకుని యనంతరము వారాతని దేశమును విభజించుకొని స్వాధీనపఱచుకొన్నట్లును, వారిలో కొండవీటిరెడ్డిరాజులకు వంశకర్తయగు వేమారెడ్డి యొక్కఁడనియు నీశాసనమువలనఁ దెలియుచున్నది. ఇదివర కెచ్చట నీకాపయనాయకుని పేరు వచ్చియుండలేదు. ప్రోలయకాపయలకును, కాపయ వేమనలకును చుట్టఱిక మేమయిన నుండెనేమో తెలియదు. తురుష్కు లాక్రమించుకొనఁగా మిగిలిన కాకతీయరాజ్యమంతయు కాపయపాలిటిదనుకఁ గలిసి యేకముగానున్నట్లే యిందువలనఁ దెలియవచ్చుచున్నది.

కొండవీటిరెడ్లు:—వేమారెడ్డి కొండవీటిరెడ్డిరాజులకు వంశకర్త. ఆతని యనంతర మతని పెద్దకుమారుఁడగు అనపోతారెడ్డియుఁ, బిదప నాతనితమ్ముఁడు అనవేమారెడ్డియు రాజ్యముచేసిరి. అనవేముని యనంతర మనపోతారెడ్డి కుమారుఁడగు కుమారగిరిరెడ్డి రాజ్యముచేసెను. కుమారగిరిరెడ్డికి కాటయవేముఁడను మంత్రి యుండెను. ఈతఁడు కుమారగిరికి మంత్రిమాత్రమేగాక

చెల్లెలి పెనిమిటియు మేనత్త కొడుకును గూడ. ఇట్లు తనకు మంత్రియు బంధువు నగు కాటయవేమునకు కుమారగిరి రాజమహేంద్రవరము రాజధానిగాఁగల పూర్వదేశము బహుమాన పూర్వకముగా నిచ్చివేసెను. అప్పటినుండియు రాజమహేంద్రవర రాజ్యము కొండవీటిరాజ్యము నని రెడ్డిరాజ్యము రెండుభాగములయినది. ఈవిధమంతయు "ఎపిగ్రాఫియా ఇండికా" యను పత్రిక 4 వ సంపుటములోనే నిదివఱకుఁ బ్రకటించియున్న తొత్తరమూడి శాసనమున వివరింపఁబడియున్నది.

కాటయవేమునకు కుమారగిరియను నొకకుమారుఁడును, అనితల్లి యను నొకకూఁతురు నుండిరి. అనితల్లి అల్లాడరెడ్డి కొడుకగు వీరభద్రారెడ్డికి భార్య యయ్యెను. ఈతఁడే శ్రీనాథుని కాశీఖండమునకుఁ గృతిపతి. తండ్రియనంతరము కుమారగిరిరెడ్డి కొలఁదికాలము భూపాలన మొనర్చి మృతినొందిన పిదప స్వామి ద్రోహులగు నాతని భృత్యులే కొందఱు దేశము నాక్రమించుకొనఁగా అల్లాడరెడ్డి వారినోడించి రాజ్యము నిష్కంటక మొనర్చి తనకోడ లగు అనితల్లి కొప్పగించెను. ఆమె పేరనే భర్తయగు వీరభద్రారెడ్డియు బావయగు వేమారెడ్డియు రాజ్యతంత్రము నడపుచుండిరి.

"మ॥ మనుతుల్యుండగు కాటభూవరుని వేమక్ష్మాతలాధీశునం
దనఁ బాణిగ్రహణంబు చేసె బ్రియ మొందన్ వీరభద్రేశ్వరుం
డనితల్లిన్వినతామతల్లినుదయాస్తాద్రీంద్రసీమావనీ
ఘనసామ్రాజ్యసమర్థసుప్రథిత సాధ్వీందిరాదేవతన్ ॥"

అను కాశీఖండపద్యమీయర్థమునే దృఢపఱచుచున్నది.

సత్యమిట్లుండ శ్రీనాథవిరచిత భీమఖండములోని

"పోలయవేమన్నపోతాన్న వేమ కుమారగిరీశ్వరానుకులం బూజ్యసామ్రాజ్య పీఠస్థులంగాంచె. తత్సంబంధబాంధవంబున వసుంధరాభారధౌరంధర్యంబునం + + + + + దిశలల్లాడ నల్లాడభూవల్లభుండు రాజమహేంద్రంబు రాజధానిగా సింహాద్రి పర్యంతంబు + + + విశ్వవిశ్వంభరాభువనమండలంబుఁ బరిపాలించె" నను వచన మాధారము చేసికొని రావు బహద్దరు కందుకూరి వీరేశలింగముగారు శ్రీనాథ కవిజీవితములో అల్లాడరెడ్డి రాజమహేంద్రవరమునకు స్వతంత్రరాజయినట్లును అతని వెనుక రాజ్యమాతని కొడుకు వీరభద్రారెడ్డికి క్రమాయాతముగా సంక్రమించినట్లును అభి

ప్రాయపడియున్నారు. ఈ యభిప్రాయము సరికాదని ప్రకృతశాసనము స్పష్ట పఱచుచున్నది. అల్లాడరెడ్డికి రాజమహేంద్రవరరాజ్యము కొండవీటిరెడ్ల సంబంధ బాంధవంబున వచ్చిన దని స్థూలమార్గముగా శ్రీనాథుఁడు చెప్పెనే గాని రాజ్యప్రాప్తికి ముఖ్యకారణమును వివరించియుండలేదు. అల్లాడరెడ్డి రాజమహేంద్ర వరమునకు ప్రభువు కాఁడనియు శత్రువులవలన రాజ్యమును విడిపించి తనకోడలగు అనితల్లి కిచ్చెననియు శాసనమువలన స్థిరపడుచున్నది. అతఁడు జీవించియున్నంత వఱకు అనితల్లి యనుమతిని వ్యవహారము నడిపియుండవచ్చును, గాని, యతఁడుగాని యతనికొడుకులు వేమవీరభద్రులు గాని రాజులు కారనియు రాజ్యాధికార మనితల్లియందే యుండెననియు సిద్ధాంతము చేయవలసియున్నది. అట్లుగాక అల్లాడరెడ్డియే రాజయియుండినచో నాతని యనంతర మారాజ్యమతని పెద్దకొడుకగు వేమారెడ్డికి రావలసి యుండును గాని రెండవకుమారుఁడగు వీరభద్రునకురాఁ గూడదు. కొన్ని చోటుల వేమవీరభద్రు లిద్దఱు రాజ్యమొనర్చినట్లును, కొన్ని చోట్ల వీరభద్రునిచే వేమారెడ్డి రాజ్యముచేయించినట్లును శ్రీనాథుఁడు చెప్పియున్నాఁడు.

గీ॥ రాజరఘురాములల్లాడరమణసుతులు
ధాత్రిఁబాలింతు రాచంద్రతారకముగ
వేమభూవల్లభుండును వీరవిభుఁడు
నన్నదమ్ములు హరియును హరుఁడుఁబోలె

ఉ॥ తమ్మునివీరభద్రవసుధాధిపు విక్రమవీరభద్రుని
న్సమ్మదలీలరాజ్యభరణస్థితిఁ బట్టముగట్టిబాహుద
ర్పమ్మున వేమభూవరుఁడు వ్రాసెజగద్విజయ ప్రశస్తివ
ర్ణమ్ములు దిగ్ధురంధర సురద్విపకుంభవిషాణమండలిన్॥

భీమఖండము. ఆ ౧.

వీరిరువురిలో నెవరుగూడ రాజు కాన ట్లిప్పుడు స్థిరపడినది.

భీమేశ్వర కాళేశ్వర మల్లికార్జున లింగములు మూఁడు నుండుటచేఁ త్రిలింగదేశమున కాపేరు వచ్చిన దని తొలుత విద్యానాథుఁడు

"యైర్దేశ స్త్రిభి రేష యాతి మహతీంఖ్యాతిం త్రిలింగాఖ్యయా।
యేషాం కాకతిరాజకీర్తివిభవైః కైలాసశైలాః కృతాః।

తే దేవాః ప్రసరత్ప్రసాదమధురా శ్శ్రీశైలకాళేశ్వర।
ద్రాక్షారామనివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రేయసే జాగ్రతు॥"

(ప్రతాపరుద్రీయనాటకప్రకరణము.)

అను పద్యము నందుఁ జెప్పి యున్నాఁడు. ఈ వ్యుత్పత్తినే శాసనకావ్యకర్త కూడ గ్రహించినాఁడు.

ఉత్కళ (ఓఢ్ర) దేశాధీశ్వరులు గజపతులనియు, తురుష్కరాజు లశ్వపతులనియు, ఆంధ్రభూపాలురు నరపతు లనియు నింతకుఁ జెప్పఁబడినది. ఆ బిరుదములు వారికి వారివారి సేనాంశవిశేషములం బట్టి యనఁగా సేనాచతురంగములలో గజము లెక్కువగా నుండుటచేఁ నుత్కళరాజులకు గజపతు లనియు, అశ్వబలమధిక మగుటచేఁ దురుష్కుల కశ్వపతు లనియు, కాల్బల మతిశయించి యుండుటచేఁ త్రిలింగాధీశులకు నరపతు లనియు బిరుదములు వచ్చి యున్నవి. కటకప్రాంతారణ్యమునం దిప్పటికి నేనుఁగులు కలవు. పూర్వ మింతకంటె నధికముగా నుండి యుండును. హిందూరాజులకంటెఁ బాశ్చాత్యులకే యశ్వబలమప్పటికి నధికముగా నుండిన ట్లగపడుచున్నది. పూర్వకాలమునందు భరతఖండములో నొక సింధుదేశములో మాత్రము గుఱ్ఱము లుండినట్లు తోఁచుచున్నది. వానికి సైంధవము లని సంజ్ఞ. పారశీకాదిజాతుల గుఱ్ఱములఁ బాశ్చాత్యులు దేశాంతరములనుండి తెచ్చుకొను చుండెడివారు. కృష్ణదేవరాయని నాఁడుఁ గూడ పోర్చుగీసుదేశస్థులు గుఱ్ఱముల పారశీకాదిదేశములనుండి తెప్పించి కర్ణాటరాజుల కమ్ముచుండెడివారు. హిందూరాజులలో నుత్కళాధీశులకుఁ దప్ప తక్కినవారికి పదాతిసైన్యమే యధికముగా నుండెను.

"నవలక్షధనుర్ధరాధినాథే। పృథివీం శాసతి వీరరుద్రదేవే।
అభవత్పర మగ్రహారపీడా। కుచకుంభేషు కురంగలోచనానాం."

అను చాటుపద్యమును బట్టి ప్రతాపరుద్రుని సేనలో తొమ్మిది లక్షల కాలరు లుండినట్లు తెలియచున్నది. కావుననే యాతనికి నరపతి యను సంజ్ఞ వచ్చినది. కర్ణాటరాజులు కూడ నరపతులే యని నరపతి విజయాదిగ్రంథముల వలనఁ దెలియచున్నది.

అనితల్లి తల్లి దొడ్డాంబిక యని యీ శాసనమునం దున్నది. కాటయవేమునకు మల్లాంబ యను భార్య యుండినట్లును, ఆమె తనపేర మల్లవరము అను అగ్రహారము చేసి బ్రాహ్మణుల కిచ్చినట్లును తొత్తరమూడి శాసనము

నందున్నది. దీనివలన మల్లాంబ, దొడ్డాంబ యను నిరువురు భార్యలు కాటయ వేమారెడ్డి కుండిన ట్లూహింపవలసి యున్నది. ఈ మల్లాంబికయే కొండవీటివారి యాడపడుచును, కుమారగిరిని కన్నతల్లియు నని యూహింప వచ్చును. అనితల్లి కాటయవేముని రెండవభార్యకుఁ బుట్టిన కూతురు. కావుననే కుమారగిరి యనంతరము రాజ్యాధికారమునుగూర్చి వివాదము పుట్టియుండవచ్చును.

కలువచేఱు అను గ్రామమును అన్నవర మను పేరుతో అనితల్లి పరహితుఁ డను మహావైద్యునకు శ్రీశైలాధిపరామేశ్వరుసన్నిధిని 1345 వ శకాబ్దమునకు సరియయిన శోభకృత్సంవత్సరమున శ్రావణబహుళాష్టమీ దివసమందు దానముచేసె నని యీశాసనము చెప్పుచున్నది.

పరహితుఁడు కాళనాథుని తనయుఁడు. ప్రకృతము శాసనస్వామి యగు కాళనాథభట్ల సుబ్రహ్మణ్యముగారి కాళనాథుని వంశములోని వాఁడనియు, కాళనాథభట్లవారను నింటిపేరీకాళనాథునిబట్టియే వారికి వచ్చెననియు నూహింపఁ దగియున్నది. వీరు కాసలనాటి వారు. వీరిది భారద్వాజసగోత్రము. యజుశ్శాఖ. వీరి యింట వైద్యవిద్య నేఁటికిని గలదఁట.

దత్తగ్రామము కృష్ణాజిల్లా, తణుకు తాలూకాలో నిడదవోలునకు సమీపమున నున్న కలవచెర్లయని తోఁచుచున్నది. దీని దగ్గఱ మోర్త, పేకేరు (శాసనములో మోడ్త, ప్రేకేరు) అనుగ్రామములు గలవు "శ్రీశైలరామేశ్వరుని" యాలయ మెద్దియో తెలియకున్నది.

1345 వ శకాబ్దమునకు సరి యయిన శోభకృత్సంవత్సరము 1423 వ క్రైస్తవసంవత్సరమునకు సరిపోవుచున్నది.

జయంతి రామయ్య.

# అనితల్లి కలువచేఱు శాసనము.

మూలము.

మొదటిపత్రము, మొదటిపుట.

1. అవిఘ్నమస్తు శ్రేయ శ్శాశ్వత మాతనోతు స హరి ర్యః క్రీడ
యా క్రోడతాం ప్రాప్త స్సప్తస
2. ముద్రపాథసి సముద్రిక్తే స్థి(1)రాత్మా విరేజ । ఫేనాయతే కనత్సకృ
ద్వివలనా త్సిక్తాఖిలాంగ స్తతః పంకా
3. లేప ముపేత్య కించి దధ భూదా రోభన త్సౌప్తభూః । ౧ । అవతు
గజోదితవపు ర ప్యగజోదితవపు రుదా
4. ర మాదిమహః । భూతేశసంభవ మపి ప్రథితా మభూతేశసంభవ
త్వే(2) । ౨ । వామాంగే భీమతో పితో దక్షిణభాగే స
5. పౌరుషః పాయా త్పశుపతి ర్ద్వీపిద్విపసింహాదిసుదర్శనః । 3 । ఉద
యాస్తాచలోత్తంసా విందుమార్తాండమ
6. ణ్డలౌ । రత్నాదీపా వి ప్రోద్దండౌ తాండవే పురవైరిణః । ౪ ।
వరుణావరోధలలనాలలాటికా గగనాపగాకమలి
7. నీమృణాలికా । స్మరరాజదిగ్విజయవైజయంతికా పరిజృంభతే ప్రతి
పదిందురేఖికా । ౫ । చతురానన
8. జనికర్తు ర్విష్ణో రుదభూ చ్చ ముఖభుజోరుపదాత్ । వర్ణానాం
చాతుర్వర్ణ్యం ధృతయే ధర్మార్థకామ
9. మోక్షాణాం । ౬ । పదారవిందా త్పరమస్య పుంసో య శ్చతు
ర్థః క్షితిజాహ్నవీభ్యాం సహైవ జాతా
10. సహజే తదస్యా జాతేః కుమారపావనతే సుజాతే । ౭ । తత్రాగ్ర
జాతిజా విప్రాః ప్రాప్తవిద్యా స్తపస్వినః । షట్కర్మనిర
11. తా శ్రౌతస్మార్తప్రవర్తనతత్పరాః । ౮ । ద్వితీయ్యాజాతిప్రభవాస్తు
శూరా దానాంబుధారార్ద్రకరారవిందాః । స ద్వైవ దే

---

(1) స్థి. (2) ంవః.

12. వావనిదేవపూజాపరాః పరం పాలితసర్వవర్ణాః । ౯ । కువర్ణంతి కర్మ సహజం కమణవాణిజ్యపాశుపాల్యాది । కృ
13. తదేవగురుసుహీసురపూజా వైశ్యా స్తృతీయ్యజాతీయ్యాః । ౧౦ । అకృతౌ పాపవిహీనాః కృతౌ తు ఘనపుణ్యా
14. ఫలవిశేషభుజః । శూద్రా శ్చతుర్థజాతిప్రభవాః శూరాః పరోప కారపరాః । ౧౧ । వైశ్యాః ప్రశాంత్యాచరణప్రథా

మొదటిపత్రము, రెండవపుట.



15. నైః ప్రాయో గుణై విప్రహితాభవంతి । శూద్రా నరేంద్రాః క్షితి రక్షణాద్వైశ్య స్సవైర్ గుణైః క్షత్రియభూపతుల్యా
16. ః । ౧౨ । స్వానుష్ఠానపరై విప్రైః నృపలక్ష్మీ వివర్ధతే । తైశ్చ విప్రతపోలక్ష్మ్యా స్త దన్యోన్యాశ్రయో విధిః । ౧౩ । అపరిమిత
17. యుగచతుష్టయగమనాగమనప్రవర్తనాకారః । ఆయాతి యాతి కాలః కులాలదండాగ్రనున్నచక్రనిభః । ౧౪ ।
18. శ్వేతవరాహే కల్పే సప్తమమన్వంతరే స్థితే వర్షే । భారతసంజ్ఞే ఖండే భరత స్యైత్రేవ నైదికీ లక్ష్మీః । ౧౫ । శ్రీశైలస్థి
19. తమల్లికార్జునవిభు శ్రీదక్షివాటీపతి భీమేశ స్సురకామినీసహచరః కాళేశ్వరాధీశ్వరః । దేశే యత్ర వసంతి సంతత మ
20. తో దివ్య త్రిలింగస్థితే స్సోయం దేశశిఖామణి విజయతే దేశ స్త్రిలింగాహ్వయః । ౧౬ । అంగసమేతా శ్రుతయో విశా
21. మాంసాన్యాయధర్మశాస్త్రాణి । సపురాణా నిత్యేతా విద్యా విల సంతి భరతఖండగతాః । ౧౭ । కాసారై స్సరసై స్సరో
22. జరుచిరై రారామసీమావనైః పుష్యత్పుష్పఫలావనమ్రతరుభిః కీరాళివాచాలితైః । పూగశ్రేణినిబద్ధపన్నగలతా
23. జాలై స్సశీతానిలై శ్చేతోమోదవిధాయిభి ర్నభజతే కోవా పరాం నివృతిం । ౧౮ । కృతధర్మ్మకర్మ్మసు నిరంతరసమ్యక్ప

24. రిరక్షితక్షితితలేషు నృపేషు । శ్రీయుగావతంసనామేషు ప్రోగినక్షే ష్వ
వనే స్తతో గణపతిః పతి రాసీత్ । ౧౯ । న్యథా

25. దుద్దండకోదండఖండితారాతిమండలః । కాకతీయ్యవంశో రాజా రంజి
తాం స్వగుణైర్భువం । ౨౦ । కాకత్యా

26. ః పరశక్తేః కృపయా కూశ్మాండవల్లికా కాచిత్ । పుత్రీ మసూత త
దేత త్కులమనఘం కాకతీయ్యసాజ్ఞ ముభూత్

27. । ౨౧ । పిత యుపరతే తద్వ దరత్న దఖిలాం(3) క్షితిం సరుద్రమదే
వీతి దుహితా మహితా గుణైః । ౨౨ । అథ సా గు

28. ర్రమదేవీ ప్రతాపరుద్రే హృతారినృపభద్రే । దౌహిత్రే సుచరిత్రే
సర్వాం మురర్వీం నిధాయ ముదితవతీ । ౨౩ । తస్మిన్ రాజని శా

29. సతి క్షితితలం భూమండలాఖండలే భృత్యాసూత్యసుహృన్నిజద్విజ
బుధాచార్య్యాదయ స్సంమతాః తల్లక్ష్మీమది

30. తా స్వమందిరగతా శ్శత్రుక్షితీశాః పున ర్వేలాంకానసన్నైలకాననం
గతా స్తత్కీర్తిర్విత్రాసితాః । ౨౪ । విద్యావిశేషై ర్విసమయాపచా

---

రెండవపత్రము, మొదటిపుట.

31. రై ర్వితీర్ణైర్విశ్వజనోపకారైః । విద్వన్నికాయా వితతప్రతాపే
విద్యోతతే వీతరజ స్యముష్మిన్ । ౨౫ । గజపతి రు

32. త్కళనాథః పాశ్చాత్యాధీశ్వ రోశ్వపతిః । తాభ్యాం నరపతి రధికః
ప్రతాపరుద్రో యత త్రిలింగేశః ! ౨౬ । తస్మిన్ ప్ర

33. తాపరుద్రే స్వస్థానం స్వేచ్ఛ యైవ యాతవతి । అథ సాభూ య్యవ
వనమయీ జాతైవా హాహామహానుహాహామహామా

34. । ౨౭ । వరాహవ ద్వారిధివారిమగ్నాం ధరా మశేషా యవనోద
ర స్థాం । సముద్ధర న్ప్రోలయనాయకేంద్ర స్తతః

35. ప్రతిష్ఠాపయతిస్మ తద్వత్ । ౨౮ । స్వగాత్రితిథా ప్రోలయభూమి
పాలే విశ్వేశ్వరాజ్ఞా మధిగమ్య గత్వా । అపాలయ

(3) దరత్నుదఖిలాం.

36. త్కాపయనాయకేంద్ర స్తదియ్యరాజ్యం తరస్ప్రతాపః । ౨౯ । అథ పంచో త్తరస త్తతినాయకసం సేవ్యమానప

37. దపద్మః । కాపావనీశ్వరః శ్రీవిశ్వేశ్వరకరుణయా క్షితి మరక్షత్ ।3०। తురుష్కై ర్వ్యై సమాక్రాంతా స్తే చాన్యే కాపభూ

38. భుజా । అగ్రహారాః పున ర్దత్తా భూమో భువ మభూపయన్ । 3౧ । విశ్వేశ్వరాయ వివిధాం ప్రవిధాయ సేవాం

39. యాతే విభౌ దివిచ తత్పదసేవనాయ । తై ర్నాయకై స్వనగరా ణ్యధిగమ్య సర్వై స్సంరక్షితా గతవిరోధకథై స్వదే

40. శాః । 3౨ । తేషాం వేమనరేశ్వరః క్షితిభుజాం ధర్మాత్మనా మ గ్రణీ శ్శశ్వద్భారతదివ్యపూరుషకథాధౌతాంత

41. రంగ స్సుధీః । శ్రీమత్పంటకులోద్భవ శ్శివపదద్వంద్వైకసేవాపరో విప్రాశీర్వచనోన్నతో జితరిపు స్సూర్యోజ్జ్వలత్ప్రి తా

42. పోదయః । 33 । ప్రాక్సైవ పాతాళగంగాయా యా పితా వేమ భూభుజా । సా సోపానావళీ చిత్రం స్వర్గంగా స్త్వ

43. ధిరోహిణీ । 3౪ । పుత్రా ధాత్రీపతే స్తస్య త్రిమూర్తయ ఇవ త్రయః । అన్నవోతాన్న మాచాన్న వేమనామ విభూప

44. ణాః । 3౫ । అన్నవోతవిభోః పుత్రః కుమారగిరి రున్నతః । శివా వాసతయా భాతి భూభృత్కులశిరోమణిః । 3౬ ।

45. అస్తి ప్రశస్తగుణభూ రరిజద్భుజశ్రీః కీర్తిప్రియో జగతి కాటయ వేమభూపః । భక్త్యా కుమారగిరిభూమి

---

రెండవపత్రము, రెండవపుట.

46. పతే ర్యా ఆసీ త్సున్వగ్రజానుజసుహృత్సచివాదిరూపః । 3౭ । శ్రీమత్కాటయభూపతే ర్భుజభృతో నప్తా ప్ర

47. తాపోన్నతేః పౌత్రో మారమహీశ్వరస్య తనయః శ్రీకాటయోర్వీ విభోః । జామాతా ప్రభురన్నవోతనృపతే ర్వే

48. మత్కుమారాధీశ్వరో య స్యాసీ త్సకుమారగి రాధిపతి స్త్వాః
పతి ర్దైవతం । ౩౭ । మాలా మమ్లానపుష్పా మివ శిర
49. సి వహ న్నస్య భూభర్తు రాజ్ఞా మాజ్ఞాం ఖర్వీకృతారిక్షితిపతి
రఖిలా మప్రతీపప్రతాపః । జిత్వా సామ్రాజ్యల క్ష్మీ
50. మనుపమవిభవాం జృంభయ న్సంభృతశ్రీ కీర్తిస్సేవాప రో భూ
త్కో మరగిరివిభోః కాటయాధీశ వేమః । ౩౯ ।
51. వేమవిభు ల్లక్ష్మీవా నంగీకృతసర్వమంగళో జిష్ణుః । ప్రద్యుమ్నం
శక్తిధరం జయంత మయతిస్మ సుతకుమారగి
52. రిం । ౪౦ । జాతమాత్రేణ జాతో సా సర్వసర్వసహేశ్వరః ।
ఆదిగర్భేశ్వరః ఖ్యాతః కుమారగిరిభూపతిః । ౪౧ ।
53. యస్యా వేమనృపాలో జనకో దొడ్డాంబికా తు జనయిత్రీ । సా దివ్య
త్యనితల్లీ సమూర్తి రివ దేవభూమిదేవశ్రీ
54. ః । ౪౨ । వేమక్షితీశతిల కేథ కథావశేషే. భర్తా కుమారగిరి
రస్య సుతో భువ్యభూత్ । పశ్చాద్ధరాధిపతిభావజు
55. గుప్త యేవ స్వస్థాన ఏవ స కుమారగిరీశ్వ రోసి । ౪౩ । అథ వేమే
శ్వరబంధు ర్విలసతి భువనప్రశ స్తగుణసింధుః
56. దొడ్డయఅల్లనరేంద్రః ప్రథితమహాసమర కేళినిస్తంద్రః । ౪౪ ।
స్వామిద్రోహపరాయణ కునృపతిజలరాశి
57. జలనిమగ్నధరాం । దొడ్డయయల్లనరేంద్రో హరి రివ సౌకర్యతా
స్సముద్ధృతవాన్ । ౪౫ । దురితరహిత
58. చిత్తో దొడ్డయాల్లాడభూపో భువ మరిజనవశ్యాం భూయసా హ్యా
త్య దోష్ణా । విమలగుణయుతాయా
59. ం వేమభూపాత్మజాయా మవనిసురసుధాయా మన్నితల్యాం స్వధర్త
। ౪౬ । భూలోకభాగ్యోదితకల్ప
60. వల్లీ శిష్టాశ్రితానిష్టవిభేదభల్లీ । పవిత్రచారిత్రవధూమతల్లీ వేమక్షి
తీశస్య సుతాన్నతల్లీ । ౪౭ । త



మూఁడవపత్రము, మొదటిపుట.

61. స్యాః పతిః పతి రశేషమహీపతీనాం వేమాంబికాల్లియ న్నృపాల
వరేణ్యసూనుః । శ్రీవీరభద్ర ఇతి సర్వగుణై
62. కభద్రః కీర్త్తిప్రతాపతు లితేశ్వరవీరభద్రః । ౨౮ । త స్యాగ్రజో
జయతి వేమయభూతలేంద్ర శ్రీకామినీవివి
63. ధచారువిలాససాంద్రః । లన్యానభిజ్ఞ (4) సముపాశ్రితరామచంద్రః
ప్రత్యర్థివంశకమలాకరపూర్ణచంద్రః
64. । ౨౯ । వినతనరపాలపాళీకనదురు మాళిస్రగుదితగంధపదాబ్జా । అని
తల్లీ పతిదై వా ఘనసచివీభూతభావు
65. కా భువ మవతి । ౩౦ । శాకే శరయుగవిశ్వై నైశాఖే మాసి భువ
మవత్యనితల్లీ । సురవిప్రక్షేత్రకరం మార్కండేయేశ
66. సన్నిధౌ త్యక్తవతీ । ౩౧ । జగతి సదుపకర్త్తా జాహ్నవీశుద్ధభర్త్తా
సతతసుకృతకర్త్తా సత్యవాక్యోపహర్త్తా । కృతప
67. రశివసఖ్యః కుత్సితాశేషసౌఖ్యః ప్రధితపరహితాఖ్యః పావనో వైద్య
ముఖ్యః । ౩౨ । జననావనసంహారణే ష్వాత్య
68. స్యాహం కథం విధాతాస్మి । ఇతి పరహితతను మీశం నూనం సో
మాస్మయా త్యుమారూపా । ౩౩ । పితా పరహి
69. త స్యాస్య మల్లినాథో భిషగ్వరః । పితామహః పరహిత స్సర్వ
వ్యాధిచికిత్సకః । ౩౪ । దీర్ఘాస్థిస్యూతవక్త్రోభయ
70. పుట మసకృ ద్దర్శయంతం స్వమాస్యం దృష్ట్వా వల్మీకపార్శ్వే
భుజగవర ముపే త్యాభయో యః కృపాళుః కృత్వా సమ్యక్చి
71. కిత్సా మచిర మపరుజా తేన దత్తాభయశ్రీ రన్యాత్థోపక్రమత్వా
త్పరహితభిషజోనామ త స్యార్థయుక్తం । ౩౫ ।
72. శ్రీమత్పరహితనామాచార్య్య స్సర్వాగమార్థతత్వజ్ఞః । సర్వచి
కిత్సా మకరో త్తదుపజ్ఞా పరహితాభిధానశ్రీః । ౩౬ ।
73. తతః పరహితాచార్య్యా త్తనయో విశ్రుతశ్రుతః । వైద్యవిద్యా
నవద్యశ్రీరామనాథాఖ్య యోదభూత్ । ౩౭ । శ్రీరామ

(4) అన్యానభిజ్ఞ

74. నాథతనయా వినయావనమ్రా _ స్త్రితాగ్ని తుల్యమహస స్తులిత స్త్రి (5)
వేదాః । విశ్వో త్తరః పరహితో ౽పి చ దేవనార్యః శ్రీ
75. కాళనాథభిషగీశ ఇతి ప్రసిద్ధాః। ౧౮ । తేషాం సని శేషగుణ శ్రీకా
శ్రీకాళనాథభిషగీశాత్ । జాతాః పుత్రా నామ

---

మూఁడవపత్రము, రెండవపుటం

---

76. య । పరహిత దేవార్యా వరదనామానః । ౧౯ । అత్రిగోత్రకమ
లాకరభానుః తేషుసాధుజనతాసురధేనుః । ౧
77. క్రతీకరణకర్మణి బంధు జ్జృంభతే పరహితో గుణసింధుః ।
౨౦ । శ్రీమద్ద్వైదికకర్మకర్మఠమతి శ్శైవాచనా
78. త్పరః శశ్వద్దీనజనావనో విమలధీ రాయయ్యార్యో౽వేదవిత్ । శాం
త స్సత్పురుషప్రియ శ్శుచియశో దాతా కళాకో
79. విదో లక్ష్మీస్థైర్యనిధిః కృతీ పరహిత శ్రీకాళనాథాత్మజః । ౨౧ ।
సరసాసు సంహితారసదానవసిద్ధాభిహిత విక
80. త్వాసు । నరసురదనుజాదికృతా స్వపి నరయోగ్యాసు పరహితో
జయతి । ౨౨ । ఉభౌ కువలయప్రియౌ కరగతా
81. మృతా వౌషధప్రసిద్ధికృతికోవిదౌ సుమనసౌ చ సంశీవనౌ। సదా
శివవతంసకౌ సుమహసౌ ధృతాత్రేయతౌ
82. శశీ పరహితశ్చ తౌ వపిచ కాళనాథాత్మజౌ । ౨౩ । విశుద్ధగుణ
భూషణో విహితదోషసంభాషణః ప్రకాశితయ
83. శోధనః ప్రవితతాత్మచిద్బోధనః । శ్రుతార్థనిధికందర స్సుభగధీర
తామందరః ప్రభు ర్జయతి దేవనః పరహితా
84. నుజః పావనః । ౨౪ । శైవ శ్శాంతమనాః కళాతిచతురో వేదే య
జు ష్యగ్రణీ రాధివ్యాధిచికిత్సక స్సుకృతినాం దా
85. తా వివేకీ శుచిః । ధీర స్సత్పురుషో నదీనహృదయో దీనార్థిసా
ర్థప్రియో ధన్యో దీవ్యతి కాళనాథతనయ శ్రీదే

(5) త్రి.

86. వనాయ్యా స్సుధీః । ౬౫ । విద్యానవద్యహృదయో వినయోన్నత
శ్రీః సుభ్రాతృభావసుభగ స్సుజనైకబంధుః । శ్రీ

87. కాళనాథతనయ శ్శివపాదభక్తో వశ్యాత్మనాం హి పరమో వరదా
య్యా వయ్యాః । సంతం సద్గుణశాలినం శుచిమ

88. నోవాక్కాయకర్మాన్వితం రాగద్వేషవివర్జితం వితమసం విద్యా
ధనంధార్మికం । వైద్యం వైదిక మాశ్రితం పర

89. హితం గ్రామేణ సంభావయం త్యా య్యా భార్యకసన్నిభా పతియు
తా ప్రితా (6) న్యతల్యంబికా । ౬౭ । శాకాబ్దే

90. శరవేదరామశశభృత్సంఖ్యే శుభే శోభకృద్వత్సరే శ్రావణకృష్ణవిష్ణు
దివసే శ్రీకల్వచేఱుం శుభం । గ్రామం ద

91. త్తవతీ స(తీ)పరహితాచార్యాయ శైలాధిపశ్రీరామేశ్వరసన్నిభా
పతిహిత శ్రీరన్యతల్యంబికా । ౬౮ । గ్రా

---

నాలుగవపత్రము.

92. మస్య కలువచేఱో రన్నవరాఖ్యాం విధాయ నిజనామ్నా । పరహి
తభిషజే ప్రాదా దనిత

93. ల్లి గ్రామ మష్టభూతియుతం । (౬౯) । సీమా పురస్తాద్దిశి మామ్రత్తపుం
తః సీమా తు వహ్నే దిశి పుట్ట

94. పుంతః । సీమా ప్రాదాద్ధ్రం దిశి సూరనూనో స్సీమా తు యాతో
దిశి తోంటపుంతః । ౭౦ । సీమా

95. ప్రతీచ్యాం దిశి మఱ్ఱిపుంతో వల్మీకవేశంతకపత్తియుక్తః । సీమా తు
వాయో దిశి జమ్మిపుంతః

96. ప్రేకేటిపుంతో దిశి చోత్తరస్యాం । ౭౧ । ఈశస్య సీమా దిశి నూం
తిపుంత స్సపల్వలో గేహాతృణైః

97. ప్రశస్తః । ఏవంచ సీమా లిఖితా విభక్తా స్సామంతవాచా స్నవరా
గ్రహారే । ౭౨ । రాయవేశ్యాభుజ

---

(6) ప్రీతా.

98. రంగాంకో భేతాళః కలికాలజః । జయ్యాదల్లయసేనన్యాఃపతి ర్భువ
శంకరః । ౨౩ । దేవబ్రాహ్మ
99. ణవి త్తవర్జనమహాప్రఖ్యాతవీరవ్రతః శ త్రుప్రతాపని ర్ధూమీకరణ
ప్రఖ్యాతవీరవ్రతః । ని
100. త్యం శంకరపాదపూజనమహాప్రఖ్యాతవీరవ్రతో జయ్యాదల్లయవేను
భూతలపతి ర్దా
101. నాఖ్యవీరవ్రతః । ౨౪ । సామాన్యోయం ధర్మసేతు ర్నృపాణాం
కాలే కాలే పాలనీయో భవద్భిః । స
102. ర్వా నేతా భావినః పార్థివేంద్రాన్ భూయో భూయో
యాచతే రామచంద్రః । ౨౫ । ఏ కైవ భగినీ లో
103. కే సర్వేషా మేవ భూభుజాం । నభోగ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా
వసుంధరా । ౨౬ । మంగళమ
104. హాశ్రీ శ్రీ శ్రీ శ్రీ మార్కండేశ్వరా.

# హిందువుల గణితశాస్త్రములు.

ప్రథమమునుండియు హిందువులు నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానపరాయణులు. కర్మానుష్ఠానమునకు సంకల్పాదులును కాలనిర్ణయాదులును ఆవశ్యకములు. అయనమాసపక్షతిథి నక్షత్రాదులచే ననుష్ఠానకాలము నిర్ణయింపఁబడును. సూర్యచంద్రాదిగ్రహగణగతులచే నీ యయనాదినిర్ధారణము కర్తవ్యము. అందువలన నార్యు లాదినుండియు ఖగోళశాస్త్రము నభ్యసింప నారంభించిరి. ఈశాస్త్రము గణితశాస్త్ర సాహాయ్యము లేనియెడల దురవగాహము. కావున నంకగణితము, బీజగణితము, త్రికోణమితి (Trignometry) మున్నగు గణిత శాస్త్రముల జ్ఞానమావశ్యకమయ్యెను. మఱియు యాగశాలలలోని వేదికల రూపపరిమాణాది స్థిరారణార్థము క్షేత్రగణితముకూడ నావశ్యకమాయెను. ఇట్లనేక విధగణితశాస్త్రములు క్రమక్రమముగ వృద్ధిపఱుపఁబడినవి.

కాలక్రమమున నార్యులలోనంతఃకలహములవలనను, అన్యదేశీయుల దండయాత్రాది బాధలవలనను దేశము దుర్దశపాలయ్యెను. విద్యా పక్షపాతులగు మహనీయుల సాహాయ్యము లేనందున ననేకశాస్త్రములు లుప్తమయి పోవు దశకువచ్చినవి. దైవానుకూల్యమునఁ గొందఱుఘనులు తమజ్ఞానమును గ్రంథరూపమున నిడినందున వానిమూలమున మనపూర్వుల జ్ఞానభాగము కొంత తెలియుచున్నది. మనదేశములోని యపురూపతాళపత్రములను సేకరించి వానిని దమవ్యాఖ్యానములతోఁ బ్రకటించుటచేఁ బాశ్చాత్య శాస్త్రజ్ఞులు మనకుఁ గొంతసాహాయ్యమొనర్చిరి. అచ్చటచ్చట వ్యాఖ్యానములలో వారి యభిప్రాయములు కొన్ని మనకు ననమ్మతములయినను, మొత్తమున వారియుద్యమములచే నీ గ్రంథములు వెలువడ నారంభించెనని వారలకు నెంతయుఁ గృతజ్ఞులయి యున్నవారము. ప్రకృతము మనదేశీయులనేకు లీ విధమగు సత్కార్యమునకుఁ బూని యున్నవారు. వారియుద్యమములవలన గణితశాస్త్ర గ్రంథములు కొన్ని వెలువడినవి. అంతర్హితములయి యింక నెన్ని యున్నవో తెలియకున్నది.

ప్రకృతము మనదేశమునందుండు గణితశాస్త్రగ్రంథములఁ బట్టి యార్యులీ శాస్త్రమును జాలవఱకు నభివృద్ధి చేసిరని చెప్పవచ్చును. పాశ్చాత్యదేశీయుల

చే నిటీవల కనుగొనఁబడిన యంశములలో ననేకములు మనయార్యులకుఁ దెలిసి యుండెను.

మనకిప్పుడు తెలిసియుండు గణితగ్రంథములలో నిక్కలి పురాతనంబైనది "లఘ్వార్యభట్టీయము". ఇది యార్యభట్టుఁడను సిద్ధాంతిచే రచియింపఁబడినది. ఇతఁడు క్రీ. శ. 476 సంవత్సరమున పాటలీపుత్రమున జన్మించినటులఁ దెలియుచున్నది. ఇతని గ్రంథము ఖగోళశాస్త్రమును గుఱించినదైనను, గణితశాస్త్ర విషయమై కొంత యిందుఁజర్చింపఁ బడియున్నది. ఇతనివెనుక సుప్రసిద్ధగణితజ్ఞుఁడు "బ్రహ్మస్ఫుటసిద్ధాంత" కర్తయయిన బ్రహ్మగుప్తుఁడు. ఇతఁడు క్రీ. శ. 6-వ శతాబ్ద్యంతమునందును 7-వ శతాబ్ద పూర్వభాగమునను ఉండినవాఁడు. ఇతనిగ్రంథమున రెండధ్యాయములు గణితశాస్త్రమును గుఱించినవి. ఇతఁడుజ్జయిని నక్షత్రశాలలో ముఖ్యాధికారిగ నుండెను. అటుపిదప శ్రీధరాచార్యులు క్రీ. శ. 9-వ శతాబ్దమున నుండినటులఁ దెలియుచున్నది. వీరు గణితసారమను 300 పద్యముల గ్రంథమును వ్రాసియున్నారు. తదనంతరము పద్మనాభుఁడను గణితవేత్త బీజగణితగ్రంథము నొక్కటి వ్రాసెను. క్రీ. శ. 12-వ శతాబ్దమున భాస్కరాచార్యుఁడను గొప్పగణితశాస్త్ర విద్వాంసుఁడు "సిద్ధాంతశిరోమణి" యనుగ్రంథమును వ్రాసియున్నాఁడు. అందలి "లీలావతి" "బీజగణితము" అను భాగములు గణితవిషయకములు. ఇతఁడుజ్జయిని నక్షత్రశాలలోఁ బూర్వము బ్రహ్మగుప్తుఁడుండిన పదవి నలంకరించినవాఁడు. ఇతనిగ్రంథములోని గణితభాగమునకు "లీలావతి" యని నామంబిడుటకు నొకయైతిహ్యము కలదు. తనకూఁతురయిన లీలావతియొక్క వివాహకాలము తనకు ననిష్టదాయకమని తాను జ్యోతిశ్శాస్త్రముచేఁ దెలిసికొని యందుచే నామెకు వివాహము సలుపక తనవద్ద నుంచుకొనెననియు, ఆమె మనోల్లాసమునకై గణితభాగమును వ్రాసి దానికి నాయమనామంబిడెననియుఁ జెప్పుటవాడుక. బీజగణితాంతమున శ్రీధర పద్మనాభుల గణితములు విస్తారముగ నుండుటచే మందమతులకు సులభముగ నవగాహ్యమగునటుల వారి గణితభాగములను దాను సులభముగ వ్రాసినటులఁ జెప్పియున్నాఁడు. ఇతనివెనుక ప్రసిద్ధగణకు లంతగనుండినటులఁ గానము. "మహాసిద్ధాంతము" అనుగ్రంథమును రచియించిన ఆర్యభట్టుఁడను గణితజ్ఞుఁడు శ్రీధరాచార్యులకును భాస్కరాచార్యులకును మధ్యకాలమున నుండి

నటులఁ దెలియుచున్నది. ఇతనికిని లఘ్వార్యభట్టీయ గ్రంధకర్తకును సుమారు 500 సంవత్సరముల కాలభేదముండినటులనున్నది. ఈ "మహాసిద్ధాంత"మున రెండధ్యాయములు గణితమునుగుఱించినవి. ఈగ్రంధకర్తలలో ననేకులు ఖగోళశాస్త్రవిషయమయి వ్రాయుచుఁ బ్రసక్తానుప్రసక్తముగ గణితమునుగుఱించి కొన్ని యధ్యాయములువ్రాసిరి. ఈగ్రంధములు పద్యరూపముగ నున్నవి; "సిద్ధాంతశిరోమణి" మాత్రము గద్యపద్యాత్మకము. ఇవికాక ఖగోళవిషయకమయిన "సూర్యసిద్ధాన్త" మనునదియు, వరాహమిహిరుని గ్రంధమగు "బృహత్సంహిత" యనునదియుఁ గలవు. ప్రస్తుతము మనవిచారముల కవి యనావశ్యకములు.

ఆధునికగణిత శాస్త్రములలోని యనేకవిషయములు మనపూర్వులకుఁ దెలిసియుండినవి. వానిలోఁగొన్ని యన్యదేశీయుల సంపర్కముచేఁ దెలిసినను, ననేకవిషయము లనన్యసహాయముగా మనదేశీయులచే నూహింపఁబడినవి. ఇట్లూహింపఁబడిన యంశములు పిదప గణితశాస్త్రసాహాయ్యముచే నిర్ధరింపఁబడినవి. గ్రీక్కుదేశపు గణితజ్ఞుఁడగు యూక్లిడ్ అనువాతని క్షేత్రగణితమునఁ బ్రథమపుస్తకములోని నలువదియేడవ తత్వము (I. 47 Euclid) మన పూర్వులకుఁ దెలియును.

ఆపస్తంబః:—చతురశ్రస్యాక్ష్ణయారజ్జుః
ద్విస్తావతీం భూమింకరోతి.

ఒకచతురశ్రముయొక్క (Square)మూలలను జేర్చురజ్జువుపై(Diagonal) నిర్మింపఁబడు చతురశ్రము రెండింతలుగ నుండును.

బోధాయనః:—దీర్ఘచతురశ్రస్యాక్ష్ణయారజ్జుః పార్శ్వమానీతిర్యఙ్మానీచయత్
పృథక్ భూతే కురుతః తదుభయంకరోతి.

దీర్ఘచతురశ్రముయొక్క (Oblong) మూలలను జేర్చురజ్జువుపై నిర్మింపఁబడు చతురశ్ర మాదీర్ఘచతురశ్రముయొక్క పార్శ్వమానతిర్యఙ్మానభుజములపై (The two sides) నిర్మింపఁబడు చతురశ్రద్వయమునకు సమముగ నుండును.

ఈతత్వముల నిరూపణము బ్రహ్మగుప్తభాస్కరగ్రంథములలోనున్నది.

శూన్యాంకమును (Zero) దశాంశభిన్న వ్యవహారమును (decimal fractions) మొట్టమొదట హిందువులచే నుపయోగింపబడినవి. ఈ సంజ్ఞను లేనియెడల నాధునిక గణితము లెటులనుండునో నూహ్యాతీతమై యున్నది.

అంకగణితాది ప్రత్యేక గణితశాస్త్రములలో నుపయోగపడువాని నెంతి తెలియునో కొంతవిచారింతము. అందుఁ బ్రథమమున

అంకగణితము. ఈ శాస్త్రమున సంకలన (addition), వ్యవకలన (subtraction), గుణన (multiplication), భాగ (division), వర్గ (square), వర్గమూల (square root), ఘన (cube), ఘనమూలములను (cube root), అష్టవిధపరికర్మములను బాగుగఁ దెలియును. ఈ పరికర్మములను (operations) భిన్నంబులకుఁగూడ (fractions) నుపయోగించిరి. శూన్యపరికర్మము లలో (operations as applied to zero) భాగహారవిషయము తప్ప నన్నియుఁజక్కగనున్నవి. కొన్ని గ్రంథములలో a÷0=0 అనియు, మరికొన్ని గ్రంథములలో a÷0=a అనియునున్నది. దీనిని వ్యాఖ్యాతలు a÷0=a అని సవరించియున్నవారు. ఇది యన్యదేశీయుల సంపర్కముచే వ్యాఖ్యాతలకుఁ దెలిసి యుండవచ్చును. వ్యస్తవిధి (inversion), ఇష్టకర్మ (the rule of false assumption), త్రైరాశికము (rule of three), పంచరాశికాదులు (compound rule of three), వాపీపూరణాదులు (pipes and cisterns), మిశ్రవ్యవహారములు (interest, discount, partnership etc), గుణనాదిస్ఫుటము (the test of multiplications), మొదలగు విషయములయందిప్పటి మిక్కిలి వృద్ధిఁ జెందియుండిరి. ఈ క్రింది యుదాహరణములచేఁ జదువరులకే యివి స్పష్టమగును.

వ్యస్తవిధి విషయమై

"ఛేదంగుణం, గుణంఛేదం, వర్గంమూలం, పదంకృతిం।
ఋణంస్వం, స్వమృణంకుర్యాత్ దృశ్యేరాశిప్రసిద్ధయే."

అని భాస్కరుఁడు వ్రాయుచున్నాఁడు.

వ్యస్తవిధిలో దృశ్యాంకమునుండి (the given number) రాశ్యంకము (the required one) వచ్చుటకై ప్రశ్నలోని భాగహారమును గుణకారముగాను, గుణకారమును భాగహారముగాను, వర్గమును వర్గమూలముగాను, వర్గమూలమును

వర్గముగాను, సంకలనమును వ్యవకలనముగాను, వ్యవకలనమును సంకలనముగాను జేయవలయును.

ఇష్టకర్మవిధిలో భాస్కరుని గ్రంథమున నొక ప్రశ్నయున్నది.

శ్లో॥ "కామిన్యా హారవల్ల్యాః ప్రణయకలహతో మౌక్తికానాం త్రుటిత్వా
భూమౌయాత స్త్రిభాగ శ్శయనతలగతః పంచమాంశోస్య దృష్టః।
ఆప్తష్షష్ఠస్సు కేశ్యా గణక! దశమకస్సంగృహీతః ప్రియేణ
దృష్టం షట్కంచసూత్రే కథయకతి పయై ర్మౌక్తికైరేష హారః" ॥

ప్రణయకలహమున నొక స్త్రీయొక్క ముక్తాహారము భిన్నమై యా మౌక్తికములలో మూడవభాగము భూమిపైఁ బడెను; అయిదవభాగము శయనముపై నుండెను; ఆఱవభాగమామెచేతిఁ జిక్కెను; ఆమె భర్తకుఁ బదియవభాగ మబ్బెను; సూత్రమున నాఱు మౌక్తికములు మిగిలి యుండెను. ఆముక్తాహారములోని మౌక్తికముల సంఖ్యయెంత?

ఇచ్చటఁ బ్రథమమున మన యిష్టానుసారముగ నొక సంఖ్యను స్వీకరించి (let the number be "one") దానిమూలమున నిర్ధార్యాంకమును బొందుట వాడుక. ఈవిధమగు గణితములలో భాస్కరాచార్యుఁడు సాధారణముగ '3' అను సంఖ్యను మూలాంకముగ స్వీకరించుచున్నాఁడు. ఈసంఖ్యయాదితని కేల యింతపక్షపాతమో తెలియకున్నది.

ప్రశ్నలలోననేకములు మనదేశీయుల యాచారవ్యవహారాది విషయకములయి యున్నవి. ఈ ప్రశ్నములమాత్రము చదివినయెడఁ బరదేశీయులు మన మతాచారములఁ గొన్నిటిఁ దెలిసికొనవచ్చును.

వాపీపరిపూరణ వ్యవహారంబున,

శ్లో॥ యేనిర్ఘరా దిన దినార్ధ తృతీయ షష్ఠైః
సంపూరయంతిహిపృథక్ పృథగేవ ముక్తాః।
వాపీంయదాయుగపదేవసఖేవిముక్తాః
తేకేన వాసరలవేన తదావదాశు॥

కొన్నినిర్ఘరంబులొక వాపికను నీవిధముగఁ బూరించుచున్నవి. మొదటిది 1 దినమునను, రెండవది ½ దినమునను, మూడవది ⅓ దినమునను, నాలుగవది 1/6 దినమునను బూరింపఁగలదు. అవియన్నియుఁ జేరిన వాపిక యెంతకాలమునఁబూరింపఁబడును?

త్రైరాశికంబున,

శ్లో॥ ప్రకృష్ట కర్పూర పలత్రిషష్ట్యా చేల్లభ్యతే నిష్క- చతుష్క- యుక్తం।
శతం, తదా ద్వాదశభిస్స పాదైః పలైః కిమాప్నోతి సఖే విచింత్య ॥

అఱువది మూడుపలముల ప్రశస్తకర్పూర విక్రయముచే నూటనాలుగునిష్కములు కలిగినయెడల, 12¼ పలముల కెంత వచ్చును ?

గుణనాదిస్ఫుటవిషయమై "మహాసిద్ధాంతమున" నీవిధానము చెప్పఁబడియున్నది.

శ్లో॥ గుణ్యగుణకగుణన భువాం
రాశీనాంస్వాంకయోగకః కార్యః।
క - స్థానాంతః ... ... ... ... ...
... ... ... ...
తద్గుణ్య గుణకహతియుతి
తుల్యేగుణనోద్భవేస్ఫుటంగుణనం ॥

గుణ్యములోని ( multiplicand ) యంకెల నొకే స్థానముగలసంఖ్యవచ్చువఱకుఁ జేర్చి, యీయంకెను గుణకములోని( multiplier ) యంకెల నిలాగునఁ జేర్చఁగ వచ్చునంకెతో గుణించి యీమొత్తములోని యంకెల నవిధముగఁ జేర్చవలయును. ఇటులఁ జేర్చిన యంకె గుణనములోని ( product ) యంకెలను జేర్చఁగవచ్చునంకెకుసరియైనయెడల గుణనము సిద్ధము.

భాగహారస్ఫుటవిషయమై

శ్లో॥ ... ... తద్వత్
భాజ్యచ్ఛేదాప్తి భాజకాదీనాం।
... ... ... ...
ఆప్తిచ్ఛేదక ఘాతే
తుల్యయుతే యోభవేదంకః।
తేనసమానే భాజ్యే
స్పష్టం లబ్ధంతదా శేషం ॥

[ భాజ్య = dividend, ఛేద = divisor, ఆప్తి = quotient (in this context), శేష = remainder, ఘాత = product, అర్థము స్పష్టము. ]

ఇట్లు వర్గవర్గమూలములకును స్ఫుటవిధానము చెప్పఁబడియున్నది.

ఈ స్ఫుటమున నంకెలవినిమయములును, శూన్యసంఖ్యల న్యూనతాధిక్యములును గనుగొనఁబడవు. కావున నీ స్ఫుటమవిశ్వసనీయమని యూఘునికగణిత శాస్త్రముచే నిర్ధరింపఁబడియున్నది.

## బీజగణితము

అంకగణితమువలె బీజగణితమునను మనయార్యులు మిగుల నభివృద్ధిఁ జెందినవారు. ధనఋణసంఖ్యల (positive and negative numbers) గుణనాదివిషయమై యీనిబంధనమును గనుఁగొనిరి.

శ్లో॥ స్వయోరస్వయోః స్వంవధః । స్వర్ణ
ఘాతేక్షయః । భాగహారేపిచైవం నిరుక్తం॥

[స్వం = positive; అస్వం = negative; స్వర్ణ = స్వ + ఋణ = positive & negative; వధః=ఘాతః=multiplication; క్షయః=negative]

రెండు ధనసంఖ్యలను గాని రెండు ఋణసంఖ్యలను గాని గుణించినయెడ ధనసంఖ్యయగును. ధనఋణసంఖ్యలను గుణించిన ఋణమగును. భాగహారములలోను నిదియే విధానము.

మఱియు,

శ్లో॥ కృతిః స్వర్ణయోః స్వం; స్వమూలే ధనర్ణే।
నమూలంక్షయస్యాస్తితస్యాకృతిత్వాత్ ॥

[కృతిః = వర్గము = square; మూలం = వర్గమూలము=square root; తస్యాకృతిత్వాత్ = తస్య + అకృతిత్వాత్]

ధనఋణసంఖ్యలవర్గము ధనసంఖ్యయగును. ధనసంఖ్యయొక్క వర్గమూలములు ధనఋణసంఖ్యలు. ఋణసంఖ్యవర్గము కానందున దానికి మూలము లేదు.

రెండురాసులవిషయమై కొన్ని యంశములు తెలిసినయెడల నారాసులఁ గనుఁగొను విధములును, శ్రేఢీవ్యవహారములలో (progressions) సంకలితశ్రేఢియును (arithmetical progression), గుణోత్తర శ్రేఢియును (geometrical progression), ax2+bx+c=0 అనుగణితమునమూలమును (x) కనుఁగొనువిధములును, ఆమూలస్వరూపములును (whether positive or negative); కుట్ట

కవ్యవహారములును (indeterminate equations), క్రమక్రమముగ వృద్ధిచే యఁబడినవి.

ఈకరణసూత్రములలోఁ గొన్నింటిని జేర్చెదను.

సూ॥ రాశ్యంతరేణవిభజేత్ వర్గవియోగం ఫలంయోగః ।
యోగే న్తరయుక్తోనే ద్విభక్తే సంక్రమణాఖ్యే స్తః ॥

రెండురాసులయొక్క వర్గభేదమును ఆరాసుల భేదముచే భాగించిన నారాసుల యోగమగును. అనగా $(x^2-y^2)\div(x-y)=x+y$. రాశియోగరాశ్యంతరములను బరస్పరముగా సంకలించినను వ్యవకలించినను వచ్చిన సంఖ్యలను రెండుగవిభజించినయెడల రాసులువచ్చును. అనగా $\frac{(x+y)+(x-y)}{2}$, $\frac{(x+y)-(x-y)}{2}$ అనునవిరాసులని యభిప్రాయము.

శ్రేఢీవ్యవహారమునఁ బ్రకృతసంఖ్యలయొక్కయు (of the first x natural numbers, ప్రథమాదివిషమాంకములయొక్కయు (of the first x odd numbers), సమాంకములయొక్కయు (of the first x even numbers), ప్రథమాద్యంకకృతులయొక్కయు (of the square of x natural numbers) ప్రథమాద్యంకఘనములయొక్కయు (of the cubes of x natural numbers) సంకలనములు మనవారలకుఁ దెలిసియుండినవి.

(a) అంత్యధనమును (the last term) కనుఁగొనుటకు సూత్రము.
వ్యేకపదఘ్న చయో ముఖయుక్ స్యాదంత్యధనః ॥

(వి + ఏక + పద + ఘ్న + చయః। పద = number of terms; చయః = the common difference; ముఖ = the first term.)

పదమున నొకటిఁద్రోసి యామిగతను చయముతో గుణించి ముఖమునకుఁ జేర్చిననంత్యధనమగును. అనగా $l=a+(n-1)d$ అని యూరోపియనులు గణితశాస్త్రములోఁ దెలియఁజేయు నంశము.

b. మధ్యధనమునకు.

సూ॥ ముఖయుత్ దళితం తన్మధ్యధనం ॥

ఆయంత్య ధనమునకు ముఖమునుఁ జేర్చి ద్వేధీకరించిన మధ్యధనమగును. అనఁగా,

middle term $= \frac{a+l}{2}$

c. సర్వధనమునకు (the sum of the series).

సూ॥ పదసంగుణితంతత్సర్వధనం ॥

ఆమధ్యధనమును పందముచేగుణించిన సర్వధనమగును. అనఁగా

$$S = \frac{n}{2}(a+l)$$

ఈసూత్రముల విధానక్రమము కొంచెము యోచించిన విశదమగును.

ఈక్రింది పద్యముచే శ్రేఢీవ్యవహారములలోని ప్రశ్నల స్వరూపము కొంత దెలియ నగును.

శ్లో॥ పంచాధికశతంశ్రేఢీ ఫలంస_ప్తపదంకిల ।
చయంత్రయం వయం విద్మో వదనం వద పండిత ! ॥

ఒకసంకలిత శ్రేఢియొక్క సర్వధనము (sum) 105; పదము (number of terms).7; చయము (common difference) 3; ఆశ్రేఢియొక్క ముఖ ధనమును (first term) కనుఁగొనునది.

శ్రీధరాచార్యులు ax+bx+c=0 అనుగణితముయొక్క మూలమును కనుఁగొనుపద్ధతి నిటులఁ దెలుపుచున్నారు.

(ఈగణితమునవాధునికసంకేతాక్షరములే ఉపయోగింపవలసియున్నది).

దృశ్యము $ax^2+bx+c=0$

దీనిని $4_a$ తో గుణించిన

$4a^2x^2+4abx=-4ac$ అగును

అనఁగా $(2ax+b)^2-b^2=-4ac$ ,,

,, $(2ax+b)^2 = b_2-4ac$ ,,

,, $2ax+b = \sqrt{b^2-4ac}$ ,,

,, $x = \frac{-b+\sqrt{b^2 \; 4ac}}{2a}$ ,,

వి_స్తరభీతిచే బీజగణితవిచారము నింతతో నిలుపవలసి యున్నది.

## జ్యామితి లేక క్షేత్రగణితము.

ఇతరగణిత భాగములయందు వలె సిద్ధాంతమున మనయార్యులంత యభివృద్ధిఁ జెందినట్లు కానము. అయినను గొన్నియంశములు మాత్రము ప్రశంసార్హములు. త్రిభుజ,(triangle) చతుర్భుజాది(quadrilaterral) క్షేత్రభూఫలములను (areas) కనుఁగొను విధములును, త్ర్యస్రక్షేత్రమున (right-angled triangle) కర్ణ (hypotenuse) కోటిభుజములలో (the remaining sides) పరస్పర సంబంధములును, వృత్తక్షేత్రమున (circle) సమత్రిభుజాది (regular polygons of sides from three to nine) రేఖాకృతుల భుజములనిర్ధరించు సూత్రములును, వృత్తక్షేత్రమున పరిధి (cricumference) జ్యా (chord) శర (the height of an arc) వ్యాసాదుల(diameter) పరస్పర సంబంధములును, వృత్తక్షేత్ర వైశాల్యమును, గోళోపరిభాగవైశాల్యమును (the surface of a sphere) గోళఘనమును (its volume) సమఖాత ( excavations of the form of a prisom or a cylinder)సూచీఖాత(of the form of a pyramid or a cone) ఘనమును మనయార్యులకుఁ దెలియును.

త్ర్యస్రక్షేత్ర కర్ణముమీఁది చతురస్రము ఆక్షేత్రముయొక్క కోటి భుజములమీఁది చతురస్రములకు సమమను తత్వమును (Euclid 1. 47) భాస్కరాచార్య లిటుల నిరూపించుచున్నారు.







A. B. C. అను త్ర్యస్రముయొక్క B C కర్ణముమీఁది చతురస్రము B C D E- ఇది A B C కి సమమైన నాలుగు త్ర్యస్రములుగాను, ఒక చిన్న చతురస్రముగాను పటములోఁ జూపియున్న రీతిగ విభజింపఁబడును. రెండేసి త్ర్యస్రములచే K L, L M అనురెండు దీర్ఘచతురస్రములు నిర్మింపఁబడి వాని మధ్యమున నాచిన్న చతురస్రము P అనుస్థానమున నుంపఁబడును. ఇట్లుచేయుటచే

M O, K O అను రెండు చతురస్రము లేర్పడును. ఇవి A B C త్ర్యస్రము యొక్క కోటి భుజములమీఁది చతురస్ర సమములు.

దీనినితరవిధంబునఁ గూడ భాస్కరాచార్యులు నిరూపించిరి. ఈ నిరూపణపద్ధతి యూక్లీడ్ క్షేత్రగణితములోని యాఱవ పుస్తకములో నెనిమిదవ తత్వము ననుకరించినది.

త్రిభుజక్షేత్రమున భూఫలమునకై

"లంబగుణం భూమ్యర్థం స్పష్టంత్రిభుజేఫలం భవతి" అని సూత్రము.

త్రికోణ క్షేత్రమున భూమ్యర్థమును (half the base) లంబముచే (altitude) గుణించిన క్షేత్రఫలమగును.

శ్లో॥ వృత్తక్షేత్రే పరిధిగుణిత వ్యాసపాదః ఫలంయత్
క్షుణ్ణంవేదైరుపరి పరితః కందుకస్యేవ జాతం ॥
గోళస్యైవంతదపిచ ఫలం; పృష్టజంవ్యాసనిఘ్నం
షడ్భిర్భక్తం భవతినియతం గోళగర్భఘనాఖ్యం ॥

వృత్తక్షేత్రమున వ్యాసచతుర్థాంశముతో పరిధిని గుణించిన నగుఫలమును $[(2 \times \frac{22}{7} \times r)(\frac{2r}{4}) = \frac{22}{7} r^2]$ నాలుగుతో గుణించినఁ గందుకోపరిభాగవైశాల్యమగును. ఇదియే గోళముయొక్కయు వైశాల్యము (the surface of a sphere). ఈ ఫలమును $(4 \times \frac{22}{7} r^2)$ వ్యాసముచే గుణించి యాఱుతో భాగించిన యెడల గోళఘన మగును. అనఁగా

'volume of a sphere $= (4 \times \frac{22}{7} r^2)(\frac{2r}{6}) = \frac{4}{3} \times \frac{22}{7} r^3$

ఇట్లు అంక, క్షేత్ర, బీజగణితములతోఁ గాక సమక్షేత్ర త్రికోణమితిలోను (plane trigonometry) గోళత్రికోణమితిలోను (spherical trigono metry) ఆర్యులు పరిశ్రమపడి యుండిరి. సమకోణమును (right angle) 90 భాగములుగను, ప్రతి భాగమును 60 విభాగములుగను విభజించిరి. 90, 45, $22\frac{1}{2}$, 15, $7\frac{1}{2}$, $3\frac{3}{4}$ మున్నగు భాగములు గల కోణములయొక్క జ్యా, (sine) కోటిజ్యా, (cosine) ఉత్క్రమజ్యా (versed sine) వీనినిఁగనుఁగొనిరి. వృత్తక్షేత్రమున పరిధిని వ్యాసముచే భాగించిన సుమారు 3.1416 వచ్చునని తెలిసికొనిరి.

గణితశాస్త్రమున నింతజ్ఞానమును మనపూర్వులు సంపాదించియుండుట మన కెంతయు నాశ్చర్యావహమై యున్నది. ప్రాయికముగ గణిత గ్రంథములలో మనవారలు సూత్రములను మాత్రము వ్రాసి వానియుపలబ్ధి మార్గములను వ్రాయకపోవుటకుఁ గారణము తెలియకున్నది. ఒకవేళ వారికా మార్గములు సుజ్ఞానములగుటచే వ్రాయనవసరము లేదని తలంచిరేమో? వారీ సూత్రములఁ గూడ వ్రాయనియెడ మనమేమి చేయుదుము? దైవానుకూల్యమున నీసూత్రములనైన వారు వ్రాసియుండుటచేఁ గదా వారిజ్ఞానసంపత్తి మనకుఁ దెలియుచున్నది. ప్రకృతముననున్న వానితోనైన మనము సంతోషింపవలయును. "ఏకః స్వాదు నభుంజీత" అనుమన యార్యోపదేశమును మనమున నిల్పి, మనయానందములను మనముమాత్ర మనుభవింపక మన సహోదరులకుం గూడఁ బంచియిచ్చుట ముఖ్య కర్తవ్యము.

కపిస్థలం - కృష్ణమాచార్యులు బి. ఏ.



# ఆంధ్ర సాహిత్య పరిషత్తు.

## (TELUGU ACADEMY).

## పరీధావినామసంవత్సర కార్యనివేదనము.



మనపరిషత్తునకు వేయేండ్లకు రెండుసంవత్సరములు వచ్చినవి. విద్దెములు చేయుచున్నది. వచ్చీరాని మాటలాడుట కారంభించినది. ఇట్టి చిన్నికూన పెద్ద పను లేమియుఁ జేయఁజాలదని వేఱె చెప్పనక్కఱలేదుకదా! అయినను పరిషత్తు గతసంవత్సర మేమేమి చేసెనో, ఇప్పుడు దానిస్థితి యెట్లున్నదో చూతముగాక.

సభ్యులు.

గత సంవత్సరారంభమున 25 గురు యావజ్జీవ సభ్యులుండిరి. వారిలో నొక్కరు సాధారణ సభ్యులుగా మాఱిరి. ఇద్దఱు నూతన సభ్యులు చేరిరి. సంవత్సరాంతమున యావజ్జీవ సభ్యుల సంఖ్య 26. ఈసంవత్సరములో కొప్పూరి చంద్రారెడ్డిగారును, మహీసురపుర వరాధీశ్వరాస్థానమందు మహామంత్రిపదము నలంకరించుచున్న ఎచ్. వి. నంజుండయ్యగారును యావజ్జీవ సభ్యులయిరని విన్నవించుట కెంతయు సంతసించుచున్నారము. దొడ్డప్పనాయకనూరు జమీందారులగు ఆనరెబిల్ దివాను బహద్దరు వి. రామభద్రనాయుఁడుగారుకూడ పరిషత్సభ్యుల మయ్యెదమని తెలిపియున్నారు.

సంవత్సరారంభమున 58 మంది సాధారణ సభ్యులుండిరి. వీరిలో నిద్దఱు పేళ్లు యావజ్జీవ సభ్యుల పట్టిలోఁగూడ నున్నందున, సాధారణ సభ్యుల పట్టి నుండి తొలఁగింపఁబడినవి. మఱియొకరిపేరు రెండుమాఱులు వ్రాయఁబడియుండినందున నొకచోటఁ దీసివేయఁబడినది. ఒకరు కాలధర్మము నొందిరి. ఇద్దఱు సభ్యత్వమును వదలుకొనిరి. నలువురు గౌరవార్థసభ్యులుగా మాఱిరి. సంవత్సర

మధ్యకాలమున 72 నూతన సభ్యులు చేరిరి. వీరిలో నిద్దఱు సభ్యత్వము వదలుకొనిరి. సంవత్సరాంతమున సాధారణ సభ్యుల సంఖ్య 115.

గతసంవత్సరమున 21 మంది గౌరవార్థసభ్యులుగ నియమింపఁ బడిరి. ఈ తరగతి క్రిందికి రావగిన వారింకను పలువురు గలరనియు వారలు సత్వరమే క్రమక్రమముగా నట్టివారందఱు నిందుఁ జేరుదు రనుటకు సందేహము లేదు. పరిషత్తునకు విద్వత్సాహాయ్య మవశ్యముకదా.

ఇంతకన్న సభ్యుల సంఖ్యలో మార్పులేవియు లేవు.

కార్యనిర్వాహక సభ.

బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులుగారు తమ కార్యదర్శిత్వమును వదలుకొనిరి. వారికి బదులు వేఱొకరిని నియమింపవలసియున్నది. కార్యనిర్వాహక సభ్యులలో నిద్దఱు ముఖ్యులగు (బళ్లారి) ధర్మవరము కృష్ణమాచార్యులుగారును, పినపాకము శ్రీనివాసాచార్యులుగారును కాలధర్మమునొందిరి. కావున వారిస్థానములఁ గూడ నితరుల నియమింపవలసియున్నది. ఇంతకన్న నీకార్యనిర్వాహక సభయందు మార్పు లేమియు జరిగియుండలేదు.

ఇఁక గతసంవత్సరమున జరిగిన కార్యముల నించుక నివేదించెదము.

పత్రికా ప్రకటనము.

వీనిలో పరిషత్పత్రికాప్రకటన మొకటి. సరస్వతీ విగ్రహము లాంఛనముగను, “దేశభాషలందుఁ దెలుఁగు లెస్స” యను శ్రీకృష్ణదేవరాయవాక్యము పరిషదుద్దేశ సూచక సంగ్రహవాక్యముగను “ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక” యను పేర నొక త్రైమాసిక పత్రిక భాద్రపదమాసమునుండి వెలువడుచున్నది. ఇందుఁ గేవల భాషావిషయకవ్యాసములుమాత్రమేగాక ప్రాచీనశాసనములును, ఆధునికశాస్త్రవిషయకవ్యాసములును గూడఁగలవు.

శాసనములు :— శాసనములు దేశచరిత్రనిర్ణయమున కెంతయు నుపకరించును. వానిలోఁ గొన్ని మహాకవికృతకావ్యములు. రాజనరేంద్రుఁడు నా

రాయణకవిశేఖరునకు గోదావరీతీరమున నందంపూఁడియను గ్రామము దానముచేసినట్లు తెలుపు నన్నయభట్టారకకృత నందంపూఁడిశాసనము ప్రథమసంచికయందుఁ బ్రకటింపఁబడినది. ఆంధ్రవాఙ్మయప్రపంచనిర్మాతలనఁదగు త్రిమూర్తులకు సంబంధముగల యీశాసన మాంధ్రసాహిత్య పరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడు శాసనావళికి ముఖమండనముగా నుండుట యుక్తమేకదా! రెండవ సంచికయందు రాజనరేంద్రునకుఁ బూర్వుఁడగు గుణగవిజయాదిత్యుని నాఁటిశాసనమొకటి ప్రకటింపఁబడినది ఇది వేమవరపు రామదాసుగారి సాహాయ్యమునదొరకినది. మూఁడవసంచికయందు కాశీఖండకృతిపతియగు వీరభద్రారెడ్డి నాఁటి శాసనమొకటి వెలువడుచున్నది. ఇది ముగ్గిరాల సూర్యప్రకాశరావుగారిమూలమున లభించినది. ఈశాసనములు సప్రతిబింబముగఁ బ్రకటింపఁబడుచున్నవి. ప్రతి సంచికయందు నొక్కశాసనమయినఁ బ్రకటింపవలయునని యుద్దేశము.

**ఆధునికశాస్త్రములు:**—ఆధునికశాస్త్రసారమును దచ్చరిత్రసంగ్రహమును దెలుపువ్యాసములు ప్రథమద్వితీయ సంచికలలోఁ బ్రకటింపఁ బడినవి. రెండవసంచికయందు "రంజనకిరణములు" అను నూతనయంత్రమును గుఱించిన వ్యాసమొకటికూడ సచిత్రముగ ముద్రింపఁబడినది. ఆధునికశాస్త్రజ్ఞానమాంధ్రలోకమునందు వ్యాపించుటకై యిట్టివ్యాసములు ముందుఁగూడ వీలుకొలఁది బ్రకటింపఁబడును.

కవిత్వము:—ప్రతిసంచికయందుఁ బద్యములుకూడఁ బ్రకటింపఁ బడుచున్నవి. రసవంతములగు చిన్న నూతనకృతు లీ పత్రికయం దప్పుడప్పుడు కనుపడుచుండును.

కృతివిమర్శనము:—కృతివిమర్శనములుకూడ నీపత్రికయందుఁ బ్రకటింపవలసియున్నది. గ్రంథవిమర్శనపద్ధతి మనదేశమునందింక మంచిదారిలోఁ బడలేదు. పరిషత్పత్రిక యీవిషయమున మార్గదర్శియగునుగాక.

**నానా విషయములు:**—దేశచరిత్రము, భాషాచరిత్రము, భాషాస్వరూపము మొదలగు విషయములంగూర్చిన వ్యాసములిందు వెలువడఁగలవు. ఆయా

విషయములందుఁ బరిశ్రమచేసిన విద్వాంసులు తామే యేపట్టిన యంశములంగూర్చి వ్యాసములు వ్రాసిపంపినచోఁ గృతజ్ఞతాపూర్వకముగ నీపత్రికలోఁ బ్రకటింపఁబడును. ఇంతదాఁకఁ బత్రికకు వ్యాసములనంపిన భాషాభిమానులకు వందనము లర్పించుచున్నారము.

మొదటి రెండు సంచికలుచూచి ఎచ్. వి. సి. జాండ స్యాస్ గారు పత్రిక లన్ని విధములఁ జక్కఁగానున్నవని యభిప్రాయపడి యున్నారు. పత్రికసంచికను వృద్ధిపఱుపవలెనని సంపూర్ణమయిన యాశతోనున్నారము. మూఁడవ సంచిక మొదటిరెండు సంచికలకంటె మేలయినకాగితములమీఁద ముద్రింపించుచున్నారము. ఈ కాగితములే ముందును ఉపయోగింపఁబడును. సాధారణముగా సంచిక నూఱుపుటలకుఁ దక్కువకాక యుండును. పత్రికబహుజన సాధ్యముకావలయునని చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలుగా నిర్ణయింపఁబడినది. పరిషత్ సభ్యులు చందానియ్యనక్కఱలేదు.

పుస్తకభాండాగారము.

205-ముద్రిత గ్రంథములును, 379-వ్రాఁతపుస్తకములును సంపాదింపఁబడినవి. ముద్రితగ్రంథములనేకములు వెలతుఁగొన్నవే. లిఖిత పుస్తకములలో 305 పుస్తకములు పరిషత్తుచే నియమింపఁబడిన వి. సేతురామయ్యగారిచే దక్షిణదేశమునందు సంగ్రహింపఁబడినవి. ఇందనేకములు తంజావూరు, తిరుచినాపల్లి, మధుర, ఈ దేశములఁ బాలించుచుండిన యాంధ్రనాయకులకాలమున నాయారాజ్యములకుఁ బోయి యందు నివసించియుండు తెలుఁగువారిచే రచింపఁబడినవి. ఈగ్రంథముల వివరమును దెలుపు వ్యాస మొకటి వర్తమానసంవత్సరాది పరిషత్పత్రికయందుఁగానన గు. ద్రావిడ దేశమునఁబుట్టిన యాంధ్ర గ్రంథములందుఁ గొన్నిటిలో శృంగారాతిరేకము కన్పట్టుచున్నది. చ్యుతసంస్కారదోషము లచ్చటచ్చటఁ గొన్ని గ్రంథములందుఁగనిపించును. ఏ దేశమునుండి యయినను బహుజనులు దేశాంతరములకుఁబోయి యచ్చట నివసించుట తటస్థించినప్పుడు వారి మాతృభాష క్రమక్రమముగా మాతృదేశభాషకంటె విలక్షణమగుట స్వాభావసిద్ధము. అమె

రికా దేశమునందు వ్యవహరింపఁబడు ఇంగ్లీషుభాషకును ఇంగ్లాండు దేశమునందలి ఇంగ్లీషుభాషకు చాల భేదముకలదు. ఆభేద మింగ్లీషు మాతృభాషగాఁగలవారలకుఁ దెలిసిన ట్లితరులకుఁ దెలియదు. ఆప్రకారమే ద్రావిడ కర్ణాటదేశములకు వెళ్లి యచ్చట స్థిరపడిన యాంధ్రులయొక్క భాష కేవలాంధ్రదేశాంధ్ర భాషకంటె విలక్షణమయినది. అన్యభాషాసాహచర్యముచే నీ వికారము కాలక్రమమున మఱింత హెచ్చినది. ఇది సకలాంధ్రలోకవిదితమే. దక్షిణదేశమందు సంపాదితములయిన పుస్తకములలో మఱియొక విశేషమున్నది. అందు గద్యగ్రంథములు ముప్పది వఱకునుగలవు. ఇంతవఱకును సాధారణముగా చిన్నయసూరికిఁ బూర్వము తెలుఁగునందు వచనగ్రంథములు పుట్టియుండలేదనియే లోకుల యభిప్రాయము. 16,17-వ క్రైస్తవ శతాబ్దములందు రచింపఁబడిన గ్రంథములనేకము లిప్పుడు మనకు దొరకినవి. వీనిలోఁ గొన్ని రాజకీయప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందుఁ గూడఁ గలవు. కొన్ని గ్రంథములు మిగుల రమ్యమగు శైలిని రచింపఁబడియున్నవి.

ఈ పుస్తకములన్నియు తత్తత్పుస్తకస్వాములు వెలతీసికొనకయే యిచ్చియున్నారు. వారలందఱు పరిషత్కృతజ్ఞతాపూర్వకాభినందనములకుఁ బాత్రులు. వారలలో ముఖ్యుల పేళ్లీ వ్యాసాంతమునఁ గననగు. చిత్తూరుజిల్లా మదనపల్లిలో న్యాయవాదియగు వేంకటస్వామినాయుఁడుగారును అగ్రామాధికారియగు సుబ్బారెడ్డిగారును పెక్కు ప్రాఁతపుస్తకములు పంపినారు. వీరల భాషాభిమానము శ్లాఘ్యము. ఈ పుస్తకములిప్పుడు పరీక్షింపఁబడుచున్నవి.

తాటియాకు పుస్తకములలో 24 మాత్రమే వెలయిచ్చితీసినవి. మిగిలినవన్నియు వెలలేక వచ్చినవే. ఈ సంవత్సరమున ఆంధ్రదేశమునందచ్చటచ్చటనుండు లిఖితగ్రంథములు సంపాదించుట కొకరిద్దఱ నియమింపవలసినట్లు తీర్మానమయినది. అచిరకాలములోనే యీపని జరుగును. భాషాభిమానులు తమయొద్దనుండు పుస్తకములఁ బరిషత్తునకిచ్చి బహుజనసాధ్యములుగా నొనర్తురను నాశతోనున్నారము.

పుస్తకసంపాదన విషయములో సేతురామయ్యగారు కష్టశ్రద్ధతోడను మాతృభాషాభిమానముతోడను పనిచేసినారని చెప్పఁగలిగినందులకు సంతసించుచున్నాము.

నిఘంటు నిర్మాణము.

నిఘంటు నిర్మాణ పద్ధతులఁగూర్చి జయంతి రామయ్యపంతులుగారు రచించిన వ్యాసమును అభిప్రాయమునకై యిత్తుము పండితుల కనేకుల కంపఁగా నందు 13 గురు తమ యభిప్రాయముల నిచ్చినారు. ఈ యభిప్రాయముల నన్నింటిని జూచి యొక పద్ధతి నిర్ణయించుటకై గడచిన ఫిబ్రవరినెల 23-వ తేదిని జరిగిన కార్యనిర్వాహక సభలో నీక్రింద నుదాహరింపఁబడిన వారొక్క యుపసంఘముగా నేర్పడునట్లు తీర్మానమయినది.

1 మ-రా-రా-శ్రీ, జయంతి. రామయ్యపంతులుగారు.
2 ,, కొమర్రాజు. లక్ష్మణరావుగారు.
3 ,, వేదము. వేంకటరాయశాస్త్రిలుగారు.
4 ,, వావిలికొలను. సుబ్బరావుగారు.
5 ,, రావుసాహేబు. గిడుగు. రామమూర్తిగారు.
6 ,, రావుబహద్దరు. కిలాంబి. రామానుజాచార్యులుగారు.

పండితాభిప్రాయములు అచ్చగుచున్నవి. కాఁగానే యీ యుపసంఘమువారు వానిని పరిశీలించి యచిరకాలముననే యేదోయొక సిద్ధాంతమునకు రాఁగలరు. ఆ పిదప గ్రంథనిర్మాణ మారంభమగును.

నిఘంటువు విషయమై "ఏమిపనియైనది. ఏమిపనియైనది ?" అని పలువు రాసక్తితో నడుగుచున్నారు. "అలస్యాదమృతం విషం" మ్మను నార్యోక్తి యన్నిపట్టుల వర్తింపదు. ఒక్కరో యిద్దఱో చేరి తమ యిష్ట ప్రకారము చేయుకార్యము శీఘ్రముగనే యారంభించి ముగింపవచ్చును గాని దేశమంతకును సంబంధించిన యిట్టి గొప్పకార్యము పదిమంది విద్యాధికులు చేరి సవిమర్శముగాఁ గార్యపద్ధతుల నేర్పఱచికొనియే ప్రారంభించుట యుక్తము కావునఁ గొ

లందిగనో గొప్పగనో యాలస్యము కాక మానదు. మన నిఘంటువురీతిగనే ద్రావిడభాషకొక్క నిఘంటువు రచించునటుల దొరతనమువారు కీనకము నాత్తరువుచేసి యీకార్యము నిర్వహించుటకొక సంఘము నేర్పఱచియున్నారు. ఈ సంఘమువారికిని దమనిఘంటు నిర్మాణమునకు పద్ధతుల నిరూపించుకొన్నట్లుతోఁపదు. ద్రావిడాంధ్రభాషలన్యోన్య సంబంధము కలవిగావున నీ రెండుసంఘము లప్పుడప్పు డొకటితో నొకటి సంప్రతించుకొనుచుండట మేలు

ఆంధ్రపండితసభ:— శృంగారము పచ్చిగా వర్ణించిన కొన్నిగ్రంథముల నచ్చు వేసి యమ్ముచున్నందుకు వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండు సన్నువారిపయి హిందూదేశపుదండనస్మృతి (Indian Penal Code) ననుసరించి యొక యభియోగము వచ్చినది. శృంగారరస వర్ణనము కావ్యములలో నెంతవఱకుండవచ్చునో యేహద్దుదాఁటిన నది నింద్యమగునోయనునది భాషాసేవకులు తమలోఁ దాము నిర్ణయించుకొనవలసిన యంశము కాని యభియోగముల మూలమున నిర్ణయింపవలసినదికాదనియు, న్యాయసభ లీవిషయమున సంబంధము కలుగఁజేసికొన్నచో భాషాభివృద్ధి కభ్యంతరములు కలుగుననియు నాంధ్రభాషాభిమానులు పలువురు సభచేరి దొరతనమువారి కొక విన్నపమును బంపుకొన్నారు. మఱియు:—ప్రకృతమునఁ బాఠశాలలందు వాడుకలోనున్న సలక్షణాంధ్రగ్రంథములు విద్యార్థులకు దురవగాహములుగా నున్నవనియు, ఇంతటినుండి యుత్తమజాతి స్త్రీపురుషు లన్యోన్య సంభాషణయందు సాధారణముగాఁ బ్రయోగించు భాషయందు రచింపఁబడు గ్రంథములే యిఁక ముఖ్యముగా దిగువతరగతులందుఁ జదివించుచుండవలయుననియుఁ గొందఱు బయలుదేఱి వాదింపసాగిరి. వీరివాదము దుర్బలమనియు, ఆవాదమే స్థిరపడినచో గ్రాంథికభాష యడుగంటి గ్రామ్యభాష పైకివచ్చుననియు, గ్రామ్యభాష యన్నిప్రదేశములందు నొక్కరీతిగా నుండకపోవుటచేత గ్రామ్యభాషాగ్రంథము లాంధ్రదేశమందెల్లెడల సుబోధములు కాఁజాలవనియు, సలక్షణభాషాజ్ఞాన మడఁగిపోయిన యెడల నిప్పుడుండు గ్రంథములకుఁ గ్రమక్రమముగాఁ బ్రచారముతగ్గిపోవుననియు, అందువలన

దేశమునకుఁ గీడువాటిల్లుననియు మఱికొందఱు వాదించుచుండిరి. ఈరెండువిషయములుకూడ నాంధ్రభాషాభివృద్ధి కత్యంతసంబంధము కలిగినవగుటవలన వానినిగుఱించి పండితాభిప్రాయములఁ దెలిసికొనుట యవశ్యమని తోఁచి శ్రీవేంకటగిరి మహారాజావారి ధనసాహాయ్యమూలమున నీ నెల 15, 16 తేదుల యందు చెన్నపురి పచ్చయప్పకాలేజి భవనమున నొక పండితసభ కావింపఁబడినది. ఆసభలో జరిగిన కార్యవృత్తాంతమంతయు పరిషత్పత్రిక ప్రథమసంచికలోఁ బ్రకటింపఁబడినది.

సభోద్దేశప్రకారము సభవారుచేసిన తీరుమానములను

1. ఆనరబిల్ మోచెర్ల. రామచంద్రరావుగారు.
2. ఆనరబిల్. రావుబహద్దరు బయ్యా నరసింహేశ్వరశర్మగారు.
3. పండిత దీవి. గోపాలాచార్యులుగారు.
4. తల్లాప్రగడ. సూర్యనారాయణరావుగారు.
5. గునుపాటి. ఏనాదిరెడ్డిగారు.
6. వేమవరపు. రామదాసుపంతులుగారు.
7. నెమలి. పట్టాభిరామరావుగారు.

ఈ యేడుగురును ఆగష్టునెల 7-న తేదిని అప్పుడు గవర్నరుగానుండిన సర్ మర్రే హామిక్కు-(Sir Murray Hammick)దొరవారికి సమర్పించి యాతీరుమానముల తాత్పర్యము విశదపఱచిరి. గ్రామ్యవాదవిషయములో దొరతనము వారు తటస్థముగా నుందురనియు, శృంగారవర్ణనమధికముగానున్న గ్రంథములనైతము ముద్రించి వెలయధికముచేసి పుస్తకభాండాగారములకును, పండితులకును అమ్ముట కాక్షేప ముండదనియు, సర్వసామాన్యముగా నందఱకు విక్రయించెడి పుస్తకములలో అశ్లీల శృంగారవర్ణన ముండఁగూడదనియు, శృంగారవర్ణన మశ్లీల మెప్పుడగునో యది ఇంగ్లాండులో న్యాయాధికారిగానుండిన Lord Cockburn గారుచెప్పినయొక తీర్పున వివరింపఁబడియున్నదనియు గవర్నరుగారుసెలవిచ్చిరి. పిదప వావిళ్లవారిపై వచ్చియుండిన యభియోగముతో సంబంధించిన గ్రంథములలో "రాధికాసాంత్వన" యొక్క-టితప్ప తక్కి-న పుస్తక

ములు వావిళ్లవారికి సాధారణముగా నందఱకు విక్రయించెడి ప్రతులలో నింద్య భాగములఁ దీసివేసెడు పద్ధతిని, ఇచ్చివేసి యభియోగమును వదలుకొనునట్లు దొరతనమువారి యుత్తరువయినట్లును ఆప్రకారమే జరిగినట్లును తెలియవచ్చినది.

కావ్యములందు శృంగారవర్ణన మెప్పుడు నింద్యమగు నను నంశమును తీర్మానించుటకు పరిషత్కార్యనిర్వాహకసభవారు

1 శ్రీ యార్లగడ్డ. అంకినీడుప్రసాదబహాద్దరుగారు

2 ,, పానుగంటి. రామారాయనింగారు.

3 ,, సి. తిరుమలయ్యనాయఁడుగారు.

4 ,, వావిలికొలను. సుబ్బరావుగారు.

5 ,, గురిజాడ. వేంకట అప్పారావుగారు.

ఈ యైదుగుర నొకయుపసంఘముగా నేర్పడవలయునని కోరఁగా వారు ఆభ్యంతరరతివర్ణనమును స్త్రీపురుషుల గుహ్యావయవముల (Genital Organs) వర్ణనమును నిషేధింపఁదగినవనియు, తదితరశృంగారవర్ణనములు కూడ నెంతమృదువుగానుండిన నంత సరసముగా నుండుననియు, స్త్రీపురుషుల యన్యోన్యానురాగమునకు దేహేంద్రియాదులు ముఖ్యకారణములయినను వాని వర్ణనము తగుమాత్రముగాఁ జేసి సర్వసైకవేద్యములగు ప్రౌఢవర్ణనోపాయములచే రసపోషణ మొనర్చుట యుచితమనియు తీర్మానించిరి. కార్యనిర్వాహక సభవా రంగీకరించిన యీతీర్మానము సహృదయులగు భాషాభిమానులకు సమ్మతమగు ననుటకు సందేహములేదు.

గ్రామ్యాగ్రామ్య వివాదము.

విద్యాధికారి (Director of Public Instruction)చే నేమింపఁబడిన School Leaving Certificate Boardఅనుసంఘమువారు School Final పరీక్షకుఁ బోవు విద్యార్థులు తెలుఁగుభాష ప్రాచీన పద్ధతి (Classical Style) నయినను నవీన పద్ధతి (Modern Style) నైనను అభ్యసింపవచ్చునని తీర్మానించిరి. ప్రాచీనశైలియనఁగా సలక్షణశైలి యఁట. నవీనశైలియనఁగా ఏనుగుల వీరాస్వామి అయ్యగారి కాశీయాత్రా

చరిత్ర, బ్రౌనుదొరగారు ప్రకటించిన పాఠపుస్తకము, ఆర్డను దొరగారి వ్యాకరణము, ఈ గ్రంథములవలన స్థిరపడిన శైలి యఁట! ఎవరి యిష్టము వచ్చిన పద్ధతిని వారవలంబింపవచ్చునఁట! ఇంతియకాదు. ఒక్కఁడే యొక్కపత్రమున కొక్కపద్ధతిని వేఱొక్క పత్రమునకు వేఱొక్కపద్ధతిని తన యిచ్ఛానుసారముగా నుత్తరములు వ్రాయవచ్చునఁట! ప్రాచీనపద్ధతి లేక నవీనపద్ధతి అనుమాట ప్రత్యుత్తరపత్రమునకు ముఖమండనముగా వ్రాసి యాపద్ధతి ననుసరించి యాపత్రమునంతయు వ్రాయవలయునఁట! ఇట్లు వారు తీర్మానించిరి. ఈ తీర్మానము దొరతనమువారి తటస్థభావమునకు విరుద్ధమనియు, గ్రామ్యమున కవకాశమిచ్చినచో నదియే ప్రబలి సలక్షణభాష యడుగంటుననియు, అందువలన దేశాభివృద్ధికి హానికలుగక మానదనియు పలువురభిప్రాయపడి గ్రామ్యమున కవకాశము కలుగకుండునట్లుత్తరువు చేయవలయునని దొరతనమువారికి విజ్ఞాపనపత్ర మంపనిశ్చయించుటకై పచ్చయప్పకాలేజీ భవనమునందు నవంబరునెల 24-వ తేదియందొక గొప్ప సభ కావించిరి. ఆ సభకు పలువురు జమీందారులును, విద్వాంసులును, ఇతరభాషాభిమానులనేకులు వచ్చియుండిరి. పాఠశాలలలో గ్రామ్యగ్రంథములు చదివింపకుండునట్లుత్తరువు చేయవలయునని దొరతనమువారికి విన్నవించుట యావశ్యమని సభికు లేకగ్రీవముగా నిశ్చయించిరి. విజ్ఞాపనపత్రము నొకదానిని తెలుఁగునను ఇంగ్లీషునను రచించి దానికనేక ప్రతులనచ్చువేయించి యాప్రతుల నాంధ్రదేశమునందనేకస్థలములకంపిన మీఁదట పదివేలమందికిపైఁగా నందునకామోదించి తమ సంతకములు చేసి యంపిరి. ఈ సంతకములు చేసినవారిలో ననేకులు జమీందారులు, విద్వాంసులును గలరు. సంతకములతోఁగూడ విజ్ఞాపనపత్రము శ్రీగవర్నరు దొరవారికి సమర్పింపఁబడినది. దానిపై యుత్తరువు లింకను బుట్టియుండలేదు. విజ్ఞాపనపత్ర మాంధ్రలోకము పేరఁబంపఁబడినదిగాని పరిషత్తు పేరఁగాదు. ప్రసంగవశమున నీసంగతి యీ పరిషత్కార్య నివేదనమునం దుదాహరించితిమి. ఏతద్విషయికమగు వృత్తాంతమును విజ్ఞాపన పత్రమును పరిషత్పత్రిక రెండవ సంచికయందుఁ జూడఁదగు.

ఈ విషయమునే విమర్శించి తమ నిశ్చితాభిప్రాయమును దెలుపుటకొక విశ్వవిద్యాలయ సంఘము పరిషత్కార్య నిర్వాహకసభవారిచే నియమింపఁబడినది. ఆసభ వారు తమమతమునింకను దెలిపియుండలేదు. శీఘ్రకాలములోనె తెలిపెదరుగాక.

దేశ భాషా సేవ.

దేశ భాషాభివృద్ధికి సంబంధించిన మఱియొకయంశ మిచ్చట తలపెట్టవలసి యున్నది. మొన్న మొన్నటివఱకు F·A, B·A., పరీక్షలకుఁ బోవు విద్యార్థులు ఇంగ్లీషుతోపాటు సంస్కృతమో లేక దేశ భాషలయందేదయిననొక్కటియో నిర్బంధముగాఁ జదువవలసి యుండెను. ఇటీవలఁబుట్టిన క్రొన్ని యూనివర్సిటీ నిబంధనఁబట్టి యానిర్బంధము పోయి ఇంగ్లీషుకాక వేఱొకభాష చదువుటయు చదువకపోవుటయు విద్యార్థుల యిచ్ఛాధీనముకాఁగా దేశభాషలఁజదువు వారలసంఖ్య యత్యల్పమయ్యెను. ఇది న్యాయముకాదనియు, దేశభాష లిందువలనఁ గ్రమక్రమముగానశించిపోవుననియు, దేశభాషాగ్రంథపఠనము తిరిగి నిర్బంధము చేయవలయుననియు యూనివర్సిటీ సభలో తత్సభ్యులలో నొకరగు ఆనరబిల్ టి.వి. శేషగిరిఅయ్యరుగారు వాదించిరి. వారితోఁబలువు రితరసభ్యు లేకీభవించిరి కాని ప్రతివాదుల సంఖ్యయధికమగుటచే ఫలమేమియు లేకపోయి యథాస్థితిగానుండునట్లు తీర్మానమయినది. ఈతీర్మాన మును రద్దుపఱుపవలయునని యూనివర్సిటీ సభ్యులలోనొక్కరగు మహారాజశ్రీ గుమ్మడూరు వేంకటరంగరావుగారు దొరతనమువారికి విజ్ఞాపన మొనర్చిరి. ఉత్తరువులింకను పుట్టలేదు. ఈలోఁగా దేశమందెల్లెడల నచ్చటచ్చట సభలు జరిపి జనులు శేషగిరిఅయ్యరుగారి వాదమునామోదించుచున్నారు. కొసకేమి తేలునో తెలియదు.

క్రింది తరగతులలో గ్రామ్యభాషారచితగ్రంథములు మాత్రమే చదువ వలయుననియు, పై తరగతులలో దేశభాషా గ్రంథములు నిర్బంధముగాఁ జదువ నక్కఱ లేనే లేదనియుఁ గొందఱ మతము. అట్లయినచో దేశభాషలడుగంటి దేశాభివృద్ధికిఁగూడ హాని జనించునని పలువురమతము. ఏవిధముననయిననేమి ప్రకృతమందు దేశభాషలవిషయమయి, అందులోముఖ్యముగా తెలుఁగు విష

యమయి, యుత్సాహక్రియాశక్తు లధికముగాఁ బొడమినని ఈశక్తుల సాధ్య మైనంతవఱకేకముఖముగాఁజేసి మంచిమార్గమునఁబెట్టుట మనపరిషత్తున కవశ్య కర్తవ్యముగానున్నది. పరిషత్ప్రయత్నమునకు దైవము తోడ్పడునుగాక.

సద్గ్రంథములనప్పుడప్పుడు ప్రకటించుట పరిషదుద్దేశములలో నొకటి. ఆంధ్రభాషా ప్రపంచమున కాధారమగు మహాభారతము

గ్రంథ ప్రకటనము.

నుత్తమరీతిని ముద్రింపించి ప్రకటించుట ముఖ్యమని సభ్యులలో పలువురయభిప్రాయము. ఉత్తమరీతి యనఁగా ననేకప్రదేశము లనుండి యనేకములైన వ్రాఁతప్రతుల సంపాదించి వానినన్నిటిని సంస్కృతాంధ్ర భాషాకోవిదులగు ముగ్గురు నలుగురు పండితులచేఁ బరిష్కరింపించి పాఠభేదముల నన్నింటిని జూపుచు మంచికాగితములపై మంచి లిపితో నిర్దుష్టముగ ముద్రిం పించుట. అనేక భారత ప్రతులు మనకు దొరకియున్నవి. మఱికొన్ని రాజకీయ లిఖిత పుస్తకమందిరమునఁ గలవు. ఇంక మఱికొన్ని ప్రయత్నసాధ్యములు. పరిష్కరించుటకు సమర్థులగు పండితులకు కొఱవులేదు. ద్రవ్యము మాత్రము చాలఁ గావలసియున్నది. అది సమకూడినచో నీపని శీఘ్రముగా నొనర్పఁ దగి నదే. మొదట పెట్టుబడి యెక్కువగాఁ బెట్టవలసియున్నది. కాని క్రమముగా నదియంతయు గ్రంథ విక్రయమూలమున రాక మానదు. వర్తమాన సంవ త్సరమందు బాలశిక్షయు గద్య పద్య గ్రంథములలో నథమ మొకొక్కటియైనను ప్రకటింపఁ దలఁచినారము.

అక్టోబరు 20-వ తేది నొకటియు, ఫిబ్రేవరినెల 15-వ తేది నొకటియు రెం డు సభలు జరిగినవి. మొదటిసభయందు వేటూరి ప్రభాకర

ఉపన్యాసనభలు.

శాస్త్రులుగారు ప్రాచీనాంధ్ర వచనరచనలఁగూర్చియు, రెండవ సభయందు శ్రీపాద. కృష్ణమూర్తిశాస్త్రులుగారు భారతాంధ్రీ కరణమునుగూర్చియు నుపన్యసించిరి. ఈ యుపన్యాసములు పత్రికలోఁ బ్రకటిం పఁబడుచున్నవి. ఈ రీతి నుపన్యాస సభ లప్పుడప్పుడు సమకూడుచుండును.

ఆంధ్రపత్రికలు. పరిషత్పత్రికకు బదులుగా నితరాంధ్రపత్రికాధిపతులు తమ తమ పత్రికల నసఁగా.

| | |
|---|---|
| 1 అభినవసరస్వతి. | 11 సుదర్శిని. |
| 2 ఆంధ్రభారతి. | 12 భారతమాత. |
| 3 దేశాభిమాని. | 13 జ్ఞానోదయము. |
| 4 మానవసేవ. | 14 సరస్వతి. |
| 5 హిందూసుందరి. | 15 దేశమాత. |
| 6 రవి. | 16 మనోరంజిని. |
| 7 సువర్ణలేఖ. | 17 కవిత. |
| 8 ఆంధ్రప్రకాశిక. | 18 ఆర్యమతబోధిని. |
| 9 ఆంధ్రపత్రిక. | 19 శశిలేఖ. |
| 10 కృష్ణాపత్రిక. | |

అను పత్రికలఁ బరిషత్కార్యస్థానమున కంపుచున్నారు. కావలసినవారు వచ్చి యీ పత్రికలఁ జదువుకొనుట కవకాశము కల్పింపఁ బడినది. కొంతమంది వచ్చి చదువుకొనుచున్నారు.

ఆయవ్యయములు :— పరిషత్కార్య స్థానమునందలి లెక్కలు లెక్కలపరీక్షయందారి తేరిన గుళ్లపల్లి నరసింహముగారు పరిశోధించి యాయవ్యయముల సరిగా నిర్ణయించి యొక్క లెక్కను వ్రాసి యున్నారు. ఆ లెక్క నీక్రింద నుదాహరించుచున్నారము.

## ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రథమ సంవత్సరాయవ్యయ సంగ్రహము.

| ఆయము | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| సంవత్సరాదిని బాంకులో నిలువ | 200 | 0 | 0 |
| చందాల మొత్తము | 3734 | 6 | 0 |
| పండిత సభకై జమ | 500 | 0 | 0 |
| చిల్లర ఆదాయములు | 6 | 2 | 0 |
| అడ్వాన్సు వసూలు | 40 | 10 | 3 |
| మొత్తము. రూ | 4481 | 2 | 3 |

| వ్యయము. | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| జీతములు | 924 | 14 | 0 |
| బాడుగ | 370 | 3 | 1 |
| కాగితములు, కలములు మొదలగునవి | 301 | 4 | 3. |
| అచ్చుకూలి | 375 | 1 | 0. |
| పత్రికకై చిత్తరువులకర్చు | 79 | 8 | 9. |
| పుస్తకభాండాగారము | 439 | 11 | 1. |
| అడ్వాన్సురిఫండు | 155 | 7 | 9. |
| ట్రావెలింగ్ ఏజంటు ప్రయాణాదివ్యయము | 176 | 6 | 9 |
| పండితుల ప్రయాణవ్యయము | 254 | 10 | 0 |
| పండితుల భోజనాదివ్యయము | 115 | 0 | 1 |
| టపాకర్చు | 126 | 2 | 3 |
| చిల్లరకర్చు | 96 | 12 | 3 |
| కుర్చీలు మొదలగు సామానులు | 157 | 14 | 0 |
| ప్రథమసాంవత్సరిక సభావ్యయము | 35 | 0 | 0 |
| మొత్తము ఖర్చు | 3609 | 15 | 3 |
| నిలవ:— | | | |
| బాంకులో రూ. | 660 | 4 | 0 |
| ఆఫీసులో రూ. | 210 | 15 | 0 |
| | 871 | 3 | 0 |
| మొత్తము రూ | 4481 | 2 | 3 |

చెన్నపురి,
6-వ తేది ఏప్రల్ నెల 1913.

(చేవ్రాలు) జి. నరసింహాం
యల్. ఎ. ఎ. యఫ్. సి. ఐ.
అసోసియేటెడ్ అక్కౌంటెంటు, ఆడిటరు.

స్వతంత్రులయ్యును చిట్టచివరవరకు పేరునకైనను తాము వీరికను కర్ణాటరాజుల భృత్యులమనియే భావించుకొనుచుండిన ట్లీ దానపత్రములవలనఁ దెలియుచున్నది. ఘనగిరి యనఁగా అనంతపురము జిల్లాయందలి పెనుగొండ. 1560 వ సంవత్సరములో జరిగిన తలికోట యుద్ధమందు మహమ్మదీయులచేఁ బరాజితులయిన పిమ్మట విజయనగరరాజులు పెనుగొండ రాజధాని చేసికొని కొంతకాలముండి, యనంతరము చంద్రగిరి, వేలూరు పట్టణములందుండి తిరిగి పెనుగొండకు వచ్చినట్లు కనపడుచున్నది. ఈపత్రములలో నుదాహరింపఁబడిన వేంకటపతిరాయలు సుప్రసిద్ధుఁడు కాఁడు.

జయంతి రామయ్య.

---

## I

శ్రీరామ.

స్వస్తి శ్రీ విజయాభ్యుదయ శాలీవాహన శకాబ్దం ౧౬౨౮ అగునేటి పార్థివనామ సంవత్సరం పుష్యశుద్ధ ౧౦ అశ్వనీనక్షత్రం శుభనామయోగం తైతులాకరణం మకరసంక్రాంతి పుణ్య (కాలమందు) శ్రీమద్రాజాధిరాజ మహారాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీర వెంక్కటదేవ మహారాయలయ్యవారు ఘనగిరినగరమందు రత్నసింహాసనాధ్యక్షులై యీపృథివీ సాంబ్రాజ్యం జేయుచుండగా కాశ్యప (సగోత్రం తిరుమలనాయనయ్యవారి పౌత్రు) లైన ముద్దువీరప్ప నాయనివారి పుత్రులైన విశ్వనాధనాయని చొక్కనాధనాయని పట్టమహిషి యైనట్టి మంగ్గమ్మగారు గార్గసగోత్రం ఆపస్తంబసూత్రం యజుశ్శాఖాధ్యాయులైన అనంత(శాస్త్రుల్ల వారి పౌత్రులైన రామకృష్ణశాస్త్రుల్ల) వారి పుత్రులైన శీతారామశాస్త్రిలవార్కి యీ మకర సంక్రాంతి పుణ్యకాలమందు సహిరణ్యోదక ధారాపూర్వకముగా యిచ్చిన భూదానశాసనక్రమ మెట్లంన్నను. రాయలయ్యవారు మధురరాజ్యంలో చేరిన దిండ్డికంట్టి శీమలో శాసిప్పట్టియల్ల

చతరశ్రమం తూర్పు పారపట్టి యెల్ల దక్షిణం కొట్టపట్టి మద్రిపూను - నిరుడు తిమరాల పుంగ్గం.గొళింపుంజ ... పడమర...పుర ఉత్తరం మీనాక్షినాయని పట్టి యెల్ల యీచతురశ్రమునకు చేరిన నంజపుంజ మాగాణి పడమర కోట త్రోవ నిధి నిక్షేప జల తరు పాషాణ ఆగామి సిద్ధ సాధ్యములనే అష్టభోగ స్వామ్యములుం...నుభవించుకొని ధర్మంచేసు ప్రాప్తముని యీమకర సంక్రాంతి పుణ్యకాలమందు సహిరణ్యోదక ధారాపూర్వకముగా యిచ్చినారు......

వుండ్డ గలవారు యిటుసమ్మతించ్చి కాశ్యపగోత్రం తిరుమలనాయనయ్యవారి పౌత్రులైన ముద్దువీరప్పనాయనిగారి పుత్రులైన విశ్వనాథనాయనిచొక్కనాథనాయనివారి (పట్టమహిషియైనట్టి మంగ్గమ్మగారు) గాగియసగోత్రం ఆపస్తంబసూత్రం యజుశ్శాఖాధ్యాయులైన అనంతశాస్త్రుల్లవారి పౌత్రులైన రామకృష్ణశాస్త్రుల్లవారి పుత్రులైన శీతారామ శాస్త్రుల్లవార్కి యిచ్చిన భూదాన ధర్మశాసనం దానపాలనయోర్మధ్యే దానా) చ్ఛ్రేయోనుపాలనం। దానాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతంపదం। స్వదత్తాద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం। పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్ ॥ యీమేర్కు.

## 2

శ్రీరామ.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకాబ్దంబులు ౧౬౩౪ అగునేటి ఖరనామ సంవత్సరం పుష్యశుద్ధ ౮ సోమవాసరం యీసుభదినమందు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప...రాయలయ్యవారు ఘనగిరి నగరమందు పృథ్వీ సాంమ్రాజ్యం శేయుచుంన్నుండ్డగా కాశ్యపగోత్రం విశ్వనాథనాయనిచొక్కనాథనాయనయ్యవారి పౌత్రులైన రంగ్గకృష్ణ ముద్దు (వీరప్పనాయనయ్యవారి) పుత్రులైన శ్రీవిజయరంగ్గచొక్క.నాథ నాయనయ్యవారు హారిదసగోత్రం ఆపస్తంబసూత్రం యజుశ్శాఖాధ్యాయులైన శ్రీధర లక్ష్మీనృసింహ్మశాస్త్రుల్లవారి పౌత్రులైన వెంకటాద్రి శాస్త్రుల్లవారి పుత్రులైన శ్రీధరవేంకటేశ్వర) శాస్త్రుల్లవార్కి భూదానధర్మశాసనం వ్రాయించియిచ్చిన క్రమమెట్లంన్నను. రాయలయ్యగారు మాఅమరనాయకాన్కు పాలించ్చిన పాండ్యమండ్డలముతో చేరిన దిండ్డిగంట్టికి తూర్పుపరకుడిగ్రామ * * * స్వామికోవిలకు శిలాశాసనం వేయించ్చి యిచ్చిన యల్ల చతురశ్రమ మధ్యమందు యుండ్డే నంజపుంజ

లున్న సహిరంణ్యోదక ధారాపూర్వకముగా కోవిల వేదవృత్తిపురాణవృత్తిస్థాయిగా పుత్రపౌత్ర పారంపర్యముగా......విక్రయములక్కు యోగ్యమానట్టుగాను అష్టభోగ్యస్వామ్యములున్ను అనుభవించుకోని సుఖానవుండ్ల (కాశ్యప) గోత్రం విశ్వనాధనాయని చొక్కనాథ నాయునయ్యవారిపౌత్రులైన రంగ్గకృష్ణ ముద్దువీరప్పనాయనయ్యవారి పుత్రులైన శ్రీవిజయరంగ్గ చొక్కనాథనాయన య్యవారు హారిదసగోత్రం (ఆపస్తంబసూత్రం యజుశ్శాఖా) ధ్యాయులైన శ్రీధరలక్ష్మీనృసింహ్మ శాస్తుల్లవారి పౌత్రులైన వెంకటాద్రిశాస్తుల్లవారి పుత్రులైన శ్రీధర వెంక్కటేశ్వరశాస్తుల్లవార్కి వ్రాయించియిచ్చిన భూదానధర్మశాసనం। దానపాలయోర్మధ్యే దా(నా త్ఛ్రే)యోనుపాలనం। దా)నాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతం పదం । నవిషం విషమిత్యాహుః బ్రంహ్మస్వంవిషముచ్యతే। విషమేకాకినం హంతి బ్రహ్మస్వం పుత్రపౌత్రకం ॥ యీధర్మశాసనం వ్రాశింద్ది సముఖం రాయసం గోవింద్దయ సంమ్మతిని తిరుకామేశ్వరయ్య వ్రాలు.

విజయరంగ్గ చొక్కనాధనాయనయ్య వ్రాలు.

# ఆంధ్రసాహిత్య పరిషద్ద్వితీయ వర్షోత్సవ వృత్తాంతము.



ఆంధ్రసాహిత్యపరిషత్తు ద్వితీయవార్షికోత్సవము రాజమహేంద్రవరమున జరుపవలయుననియు, దానికగు వ్యయమంతయుఁ దామే భరించెదమనియుఁ, జెప్పి సహజౌదార్యసంపన్నులును, అత్యంత మాతృభాషాభిమానులును, పీఠికాపుర ప్రభువులు నగు శ్రీశ్రీరాజారావు వేంకటమహీపతి కుమార సూర్యారావు బహద్దర్‌గారు పరిషత్తు నాహ్వానించిరి. పరిషత్తువారు దానికి సమ్మతించి యీసంవత్సరము ఏప్రెల్ నెల 19-20 తేదుల రాజమహేంద్రవరమునఁ బరిషత్తు ద్వితీయ వార్షికోత్సవము జరుపఁబడునని పత్రికలయందుఁ బ్రకటించి పరిషత్సభ్యులకును, పరిషత్సభ్యులుగాని మఱికొందఱాంధ్రభాషాభిమానులకు నాహ్వానపత్రికలనంపిరి. ఈ యాహ్వానము గౌరవించి చెన్నపురి, విజయనగరము, విశాఖపట్టణము, అనకాపల్లి, ఏలూరు, కాకినాడ, తుని, పిఠాపురము, బెజవాడ, బందరు, సికంద్రాబాదు, కాళహస్తి, అమలాపురము, నిడుదవోలు, కొవ్వూరులో నగు ప్రదేశములనుండి పండితులును మాతృభాషాభిమానులును బెక్కురు రాజమహేంద్రవరమునకు దయచేసిరి. పిఠాపురము రాజుగారిచే నేర్పఱుపఁబడిన యధికారులును, విద్యార్థిబృందసహాయులైన బ్ర॥శ్రీ॥చిలకమర్తి-లక్ష్మీనృసింహము పంతులవారు నభ్యాగతుల కెదురేగి యాదరించి రాజుగారిచేఁ దన్నిమిత్తముగ నేర్పఱుపఁబడి యన్నిసౌఖ్యముల కాకరములైన వారి బంగళాలయందు వారికి విడుదులు కుదిర్చిరి. ఉద్దేశించినప్రకారము 19-ది మధ్యాహ్నముమీఁద 3 గంటలకు హితకారిణీ పాఠశాలయందలి విశాల చంద్రశాలయందు సభగూడెను. ఆసభయం దధమపక్షము వేయిమందియుండిరనుట యతిశయోక్తిగాదు. ఆ సభ

యందు గౌరవనీయులును, పోలవరము జమీందారులునగు కొచ్చెర్లకోట రామచంద్రవేంకట కృష్ణారావు బహద్దరుగారు, కోటితివాడ జమీందారుగారగు తాడూరి జగన్నాధరావు పంతులుగారు, నెమలి పట్టాభి రామారావుగారు, దివానుబహద్దరు ముట్నూరి ఆదినారాయణయ్యగారు, జయంతి రామయ్యగారు, పిఠాపురము దివానుగారగు పప్పు సీతారామయ్యగారు, నెల్లూరి కలెక్టరువారగు రావుబహద్దరు దొడ్ల రాఘవయ్యగారు, గౌరవనీయులగు మోచెర్ల రామచంద్రరావుగారు, సబ్ జడ్జిగారగు వావిలాల వేంకటశివావధానులుగారు, డిస్ట్రిక్టు మునిసిబులగు గొల్లకోట గంగాధర సోమయాజులుగారు, తే నారాయణ పంతులుగారు, కోట నరసింహముగారు, రావుబహద్దరు చిత్రపు వేంకటాచలంగారు, నిడమర్తి దుర్గయ్యగారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు, [illegible]ంట-లక్ష్మీపతిగారు, మహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు, ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రులుగారు, శతావధాని దివాకర్ల తిరుపతిశాస్త్రులుగారు, వడ్డాది సుబ్బారాయుడుగారు, నావిలకొలను సుబ్బారావుగారు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారు లోనగు ప్రముఖులు, పండితులు విరాజిల్లుచుండిరి.

సభ్యులభ్యర్థింపఁగా మ-రా-రా-శ్రీ, కొక్కొండ-వేంకటరత్నము పంతులుగా రగ్రాసనమధిష్ఠించిరి. పిదపఁ గార్యారంభసమయమున బూర్వము బ్ర॥శ్రీ, వావిలాల-వేంకటశివావధానులుగారు మనోహరముగ సర్వసంతసములుగ రెండు ప్రార్థనా శ్లోకములఁ జదివిరి. పిదప బ్ర॥ శ్రీ, జయంతి-రామయ్యపంతులుగారు పరిషదుద్దేశముల వివరించి తెలిపిరి. ఈసమయమునఁ గొందఱు పరిషత్సభ్యులుగాఁ జేరిరి.

అనంతరము బ్ర॥ శ్రీ, చిలకమర్తి - లక్ష్మీనరసింహముగారు మృదుమధురగంభీరోక్తులతో, నిరాఘాటధాటితో స్వాగతోపన్యాస మొసంగిరి. అన్ని బలములకన్న నభిమాన బలమెక్కుడనియు, నది యొక్కటి జనులయందు నెలకొనియుండినచో నసాధ్యమగు కార్యమే లేదనియు, నాంధ్రభాష క్షీణించుచున్నదనియు, మృతభాషయనియుఁ జెప్పఁబడు కాలమునఁ గేవల మాతృభాషాభిమానముచేతనే చాల దూరదేశములనుండి యీ వచ్చెడు సండలకు

జడియక, ప్రవాసాయాసమునకు వెనుదీయక, యింత దూరము వచ్చుటయే మన భాషకు శుభోదర్కచిహ్నముగా నున్నదనియు నుపన్యసించిరి. ఆవల సభకు రాజాలని పెద్దమనుష్యులు కొందఱు తమ యభిమానమును వ్యక్తపఱచుచుఁ బంపిన లేఖలను, నుత్తరములను, గతసంవత్సరవృత్తాంతమును, కార్యదర్శిగారగు మ-రా-రా-శ్రీ, ఆచంట. లక్ష్మీపతిగారు చదివిరి. అవలఁ బిఠాపురముమహారాజుగారు దేహాస్వస్థతచే రాలేక వ్రాసిపంపిన ప్రారంభోపన్యాసమును మ-రా-రా-శ్రీ, వేమవరపు - పట్టాభిరామరావుగారు చదివిరి. అది యెట్లనఁగా:—

మహాజనులారా!

ఈ మన యాంధ్రసాహిత్యపరిషత్తు తెనుఁగుదేశమున నందులో ముఖ్యముగ రాజమహేంద్రవరమున సమావేశమగుటెంతయు సమంజసముగనున్నది. మన గ్రంథములలో నెల్ల నుత్తమమైనదని యెన్నఁబడు భారతముయొక్క రచనకు ముఖ్యకారకుఁడగు రాజరాజనరేంద్రునకును దాని నారంభించిన నన్నయభట్టునకు నునికిపట్టైనపట్టణమే ప్రస్తుతము గద్యతిక్కనయని వన్నెకెక్కిన వీరేశలింగం పంతులుగారికిని నవలల నాటకముల రచించుటయందుఁ బ్రవీణులైన చిలకమర్తి లక్ష్మీనరసింహముగారికిని నివాసస్థలమై వెలయుచున్నది. ఈ సభకు నేను వచ్చి యానందించు భాగ్యముకలుగమికి నెంతయుఁ జింతించుచున్నాను.

గత వత్సరమున గ్రంథరచన మించుమించుగఁ దత్పూర్వ సంవత్సరము నందువలెనేయున్నది. మంచి గ్రంథములుమాత్ర మెక్కువగ బయలుదేరినవి. భాషాభివృద్ధికై పాటుపడు సంఘములు, పుస్తక భాండాగారములు నధికము లగుచున్నవి. ఆంధ్రదినపత్రికలేనికొఱఁత యింకను దీరలేదు. ఆంధ్ర నిఘంటురచన త్వరలో నారంభించెదరుగాక యని కోరుచున్నాను. పరిషత్తు వారు చేయించినసభలో నొకరిద్దఱుతప్పఁ బండితులందఱేకగ్రీవముగ గ్రామ్యము వలదనియే నుడివిరి. పాఠశాలలో దీనినుపయోగింపఁగూడదని పెక్కుచోట్ల జనులు సభలుచేసి తీర్మానించిరి. అయినను మన ప్రభుత్వమువారు మన మనవిని మన్నింపకుండుటెంతయు వింతగనున్నది. గ్రామ్యభాషఁబాఠశాలలో

నేర్పుటవలన దేశమునకుం గీడు మూడుననని చెప్పక తప్పదు. ఇది యిటుండ మాతృ భాషా గ్రంథపఠన మావశ్యకము కాదని యూనివర్సిటీ సినేటువారనిరి. అప్పుడు జరిగినచర్యవలన గ్రామ్యవాదులకు మన భాషాభివృద్ధియందెంత యభిమాన మున్నదో వెల్లడియైనది. ఇట్టివారినిం బరీక్షకులుగాంగాని పఠనీయ గ్రంథ నిర్ణాయక సభ్యులుగాంగాని యుంచుట కానిపని. పాఠశాలలందు మాతృ భాషాపఠన మావశ్యకముగం జేయుటయు గ్రాంధిక భాష నేయుపయోగించునట్టు చేయుటయు దేశాభివృద్ధికి మూలములుగావునను, అట్లు చేయనిచో జనులకు గొప్ప యాపద తటస్థించును గావునను మన ప్రార్థనల నంగీకరింపుండని పై యధికారులం గోరవలసియున్నది. వారు దాని కంగీకరింపనియెడల మన యధీనములోనున్న పాఠశాలలయందట్టి పఠనము నిర్బంధముగం జేయవలయును. ఇంకొక సంగతిచెప్పి విరమించెద. మన భాషాభివృద్ధికై యనేక కష్టముల కోర్చి వేయివిధములం బాటుపడుచున్న జయంతి - రామయ్య పంతులుగారి ఋణము మనము తీర్చుకొనుట దుర్లభము. ఈ పరిషత్స్థాపనకుంగూడ వీరే ముఖ్యులుగనుండి పనిచేసిరి. ఈ రెండు కారణములంబట్టి వీరి కాంధ్రప్రపంచ మంతయుంజెప్పనలవికానంత కృతజ్ఞతతో వందనములర్పింపవలసియున్నది. మహాజనులారా! నన్నిదివఱకు రెండవసారి పరిషదధ్యక్షునిగ నెన్నికొని గౌరవించి మీ ప్రేమను జూపినందుల కివె యనేక వందనములర్పించుచున్నాను. ఈ యాంధ్రపరిషత్తునకు జయమును జిరస్థాయిత్వమును బ్రసాదించుటకు భగ వంతునిం బ్రార్థించుచు మీ సెలవుగైకొని నేనిదె యధ్యక్షపదవిని వదలుకొను చున్నాను. ”

తదనంతరము, ఇంటర్ మీడియేటు, బి. ఏ., పరీక్షలకుం జదువు విద్యార్థులు దేశభాషాగ్రంథములు విధిగంబఠింప నక్కఱలేదని యూనివర్సిటీ సినేటువారు చేసినతీర్మానము సరిగాలేదని తీరుమానించుటకై చర్చజరిగెను. దానిని మ-రా-రా-శ్రీ, వావిలాల - శివావధానులవారు యుక్తియుక్తముగ నుపపాదించిరి. ఈదేశమువారీదేశభాషలు చదువంబనిలేదనియు నన్యభాషలు

కిఛిగా చదువవలయుననియు అన్యదేశజులు సూచించినటుల మనవా రొందరు కారణాంతరములచే వారితోఁ జేరి వాదించుటయు చాల విచారకర మైన విషయమనియు, దేశభాషాగ్రంథపఠనము వలదను వాదము నావహిం చినవారు గ్రామ్యవాదులే యగుటచే వారి భాషాభిమానమెట్టిదో తెలియ బడెననియు, భాషా గ్రంథపఠనము మన బాలురకవశ్యమనియు నుపన్యసించి పిమ్మట మ-రా-రా-శ్రీ, పప్పు - సీతారామయ్య పంతులుగారు సముచితగతి బలపఱచిరి. ఈ తీరుమానము నేకగ్రీవముగ నెల్లరామోదించిరి.

పిమ్మట బ్ర॥ శ్రీ, వేదమూర్తులయిన మల్లాది సూర్యనారాయణ శాస్త్రులు వారు శృంగారరసమునుగుఱించి యొక యుపన్యాసము చదివిరి.

ఆపిమ్మట మ-రా-రా-శ్రీ, కొవ్వఁజ్ఞాజు లక్ష్మణరావుగారు ప్రకృతమైన మన దేశమందుఁ బ్రకృతిశాస్త్రజ్ఞాన వ్యాప్తి మిక్కిలి యవశ్యముగనున్నదని చక్కని యుపన్యాసమొకటి చదివిరి.

తరువాత బ్ర॥ శ్రీ, మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులవారిట్లుపన్యసించిరి.

“ఈ యాంధ్రసాహిత్యపరిషత్తు మొట్టమొదటఁ జెన్నపురియందు జనించెను. మొదటిసంవత్సరోత్సవ మందే జరుగఁగా నీరెండవ సంవత్సరోత్సవ మీ రాజమహేంద్రవరములో జరుపఁబడుచున్నది. ఇందువల్ల నీసభకుం బ్రధానులైన బ్ర॥ శ్రీ॥ మహారాజశ్రీ, జయంతి రామయ్యపంతులు బి. ఎ., బి. ఎల్., గారును, మఱి వీరితోఁ జేరిన యీ పరిషత్తు సభ్యులును సమధికాంధ్రభాషాభిమానుల నియు, సదౌచిత్యవిశారదులనియుం బ్రశంసింపఁబడుచున్నారు. ఎందువల్లననఁగా, నీపురవరము సామాన్యమయినదికాదు. ఆంధ్రభాషాయోషకు జన్మస్థానము. శ్రీమదాంధ్రభాషకు జనకులును శ్రీమత్సకల భాషావాగనుశాసనబిరుదాంచితు లును శ్రీమహాభారతాంధ్రీకరణ పరిణతులునునైన శ్రీమన్నన్నయభట్టారకులవారి కావాసస్థానము. ఇది యిపుడు రాజధానిగాకున్నను, ఆంధ్రదేశమునకు రాజ ధానియనియె యెన్నఁదగియున్నది. ఇట్టిచోట మునుపటివలె నాంధ్రభాషాసా

హాస్య పరిష్కృతకూడుట కనిపెట్టియున్నది. శ్రీమచ్ఛబ్దానుశాసను భక్తిననుస రించి యుండిన యాకవి యిప్పుడున్నా కవులనేకు లనేకగ్రంథములం బద్యగద్యాత్మకము లుగా రచియించిరి రచియించుచున్నారు మఱియు రచియింపఁగలరు. ఛందో విషయమున గణయతిప్రాస నియమమత్యావశ్యకమని గ్రహించి, పద్యకావ్య ములు చేయుచున్నారు మఱి పూర్వమందు లేని నాటకంబులనిప్పుడు వర్షించు చున్నారు. ఇట్లుండనీకాలమునఁ గొందఱు నవనాగరికులు యతిగణప్రాసము లక్కఱలేదనియు, భాషా సౌలభ్యము, పాత్రోచిత భాష యనునెపమున గద్య కావ్యములందు వ్యాకరణ మనావశ్యకమనియుఁ దుడుకుసంధిబంధము న్వాదని యును, వాదింపనారి మఱి ప్రాయసాగిరి. ఇద్దిచూడ, నాంధ్రభాషకు వినాశ కాలమే మోయని గోచరించుచున్నది "వినాశకాలే విపరీతబుద్ధి" యనులుప్రసి ద్ధమే కదా! కర్ణాటక భాషలోఁ బద్యములందు యతిలేదు అందువల్ల నాభాష లోనే "కన్నడక్కె యతి యిల్ల, కోతిక్కె మఱియిల్ల" (అనఁగా కన్నడమునకు యతిలేదు. దున్నపోతునకు మతిలేదు.) అని యుండే యొకసామెతకలిగెను అఱ వమునందు యతియునుఁ బ్రాసమునుగలవుగాని, ప్రాసమునందు నొక్కవర్ణమే యుండవలయుననుఁ నియమము లేదు. ఒక వర్గమునందు ననునాసికము తప్పఁద క్కిన వర్ణములలో నేదిగాని ప్రాసమునకుఁ జెల్లును. ఇందువల్ల విపరీతార్థము లెన్నియో యా భాషయందేపుట్టుచున్నవి. ఎట్టులన్న ? కాంచీపురమునందు నొకభిక్షుకుఁడు భిక్షార్థియై సంచరించుచు "కంచివరదప్పా" యనెను, కంచివర దప్పా (కంచివరదరాజస్వామీ) యనియర్థము. తరువాత వాని వెనుక నరుగు చున్న మఱియొకభిక్షుకుఁడు "కంచివరదప్పా," గంజివచ్చునప్పాయని యర్థము చేసికొని "యెంగెడా అప్పా" గంజియెక్కడవచ్చునప్పాయని యడిగెనఁట ! కాఁబట్టి ప్రాసాక్షరమొకటిగానుండక, ఒకవర్గములోని నాలుగక్షరములలో నేది గానియుండవచ్చునన్న నియమముచేత నాయఱవవారికె యర్థసందేహము గలుగు చున్నది. అట్టియిక్కట్టులు మనయాంధ్రులకు లేవుకదా ? ఇట్లుండ "వళి రాద్యమనంతరాక్షరంప్రాసః" "ప్రాసస్సర్వత్రచైక ఏవస్యాత్" అనునియమ ములఁగలిగి "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" అని ఘనతఁగాంచిన మన

యాంధ్రభాషయందు యతిప్రాసముల మానవలెనా? ఇది యటులుండె. సంస్కృతభాషయందు గణనియమము గలిగియు నుపజాతిక వృత్తములయందు గణనియమముంగూడ వదలుట తటస్థించెను మనలో [illegible] కేవలసంస్కృత కర్ణాట ద్రావిడ భాషలకంటె భిన్నయగు నొక్కదానిని. [illegible] ప్రముఖ మహాపండిత కవిశేఖరులుగల మన తెనుగు భాషయందు గణయతిప్రాసనియమముల మానవలెనా? మానరాదను సామాన్యముగా సామెతలుగూడ యతిప్రాసములతోడ గూడికొనియున్నవి. ఇట్టినియమానుసారముగా బద్ధనియమము చెప్పజాలనివారు [illegible] సిద్ధముగా దివ్యకావ్యముల వ్రాయవచ్చును. అంతేకాని వ్యాకరణవిరుద్ధముగా గ్రంథముల వ్రాయజనదు. వ్యాకరణములేని భాషలనాడు మన భాషకు వ్యాకరణముండవలయునని కోరుచుండగా, నున్నవారు దానిని బోగొట్టుకొనుట ధర్మమా? ఐన నదేమోకాని, మనపండితులు భాషావిషయమున నెంతయైనా నము గలవారుగానున్నారని చెప్పవలసినందులకు చింతింపవలసి యున్నది. వారు వ్యవహారసౌలభ్యార్థముగా మేము గ్రామ్యమున సంభాషించుచున్నామని చెప్పుదురు. ఇది సామాన్యముగా నన్యులతోనైన నట్లు నొప్పవచ్చును. పండితులు పండితులతో భాషించునప్పుడును దమవిద్యార్థులకు బోధించునప్పుడును సలక్షణభాషను భాషింపవచ్చుంగదా? అట్లయిన సముచితముగానుండును. అట్లుగాక యెల్లప్పుడేకరీతిగా వ్యాకరణవిరుద్ధమయిన గ్రామ్యభాషనే భాషించుట యయుక్తముగాదా? ఇట్లున్న సలక్షణభాష యెట్లు వర్ధిల్లును? కాంబట్టి మొట్టమొదటం బండితులు కృతకృత్యులు కావలయును. పిమ్మట విద్యార్థులు నట్లే కాంగలరు. శ్లో॥ "బోద్ధారో మత్సరగ్రస్తాః ప్రభవస్స్మయదూషితాః । అబోధోపహతాశ్చాన్యే జీర్ణమంగే సుభాషితమ్" అనునట్లిప్పుడొక విషయము [illegible]. చెప్పవచ్చునా? పండితులకుం గవులకుం బరస్పర మీర్ష్యాసూయలు వర్ధిల్లె. అయ్యో! కష్టపడి గురుముఖమున నేదో యొక శాస్త్రము నభ్యసించిన వారా శాస్త్రమునం బండితులగుదురు. కవులలో యట్టి కష్టమేమియు లేకయే కేవలదే

వత్తానుగ్రహముచేతను, అభ్యాసాధిక్యమునను గావ్యకర్తలవుదురు. కావునఁ బండితులు వేఱు. కవులు వేఱు. ఆరయఁగా నీయిరుదెగలవారును బూజ్యులే. పాండిత్యమును గవిత్వమును నీ రెండుఁగలవారు పూజ్యతరులు. వీరు సర్వోత్తములనుట సార్వజనీనము. కాన నీ రెండుతెగలవారలతో ద్వేషింపక కలసి మెలసియుండుట యుండవలయు నపేక్షణీయము. ఇక్కడికీ ప్రసంగము ముగింపవచ్చును. ముఖ్యాంశమింకొక్కటిగలదు. అదేమనఁ, గావ్యకర్తలు గ్రామ్యభాషం బొత్తిగఁ ద్యజించి గ్రాంధికభాషనే తమ గ్రంథములందు వాడవలయును. ఈనియమమును గాపాడుటచేతనే యీ యాంధ్రసాహిత్య పరిషత్తు సార్థకాభిధానసనాథమగుచు వర్ధిల్లవలయునని యభ్యర్థింపఁబడుచున్నది. మనల నందఱం దద్దయుదయతో నేలు శ్రీ జార్జి చక్రవర్తిగారు సదయులగుచు సర్వసుఖములనందుచుండ వలయునని మన మందఱమును భగవంతుం బ్రార్థించుచున్నాము.”

మఱునాఁడుదయమున శ్రీ పిఠాపురము రాజుగారి పెద్ద బంగాళాలోఁ బరిషత్సభ్యులుకూడి వర్తమాన సంవత్సరాదాయవ్యయ నిర్ణయమును, కర్తవ్యవిధాన నిశ్చయమును జేసిరి. ఈ సంవత్సరమునకు శ్రీ వేంకటగిరి మహారాజుగారు సభాపతిగానుండునట్లును, కార్యదర్శిత్వమును వదలుకొనిన వేదము వేంకటరాయ శాస్త్రిలుగారికి బదులు నెమలి-పట్టాభిరామరావుగారు కార్యదర్శిగానుండునట్లును నిర్ణయమయినది. చందాధనములో రూ. 15,000లు మూలధనముగా నుంచవలసినట్లును, పరిషత్తునకొక్కమాఱే యొక్కొక్క రూపాయవంతున నిచ్చినవారు పరిషదామోదకులుగా గ్రహింపఁబడవలసినట్లును, వర్తమాన సంవత్సరమునఁగూడ లిఖిత ముద్రితగ్రథసంపాదనము చేయవలసినట్లును, కొన్ని యముద్రితగ్రంథముల నీసంవత్సరము ముద్రింపవలసినట్లును, గతసంవత్సర కృతకార్యశేషమీసంవత్సరము జరుగవలసినట్లును నిర్ణయింపఁబడినది. మఱియుఁ గడచిన డిసంబరుమాసమున మనరాజప్రతినిధియగు హార్డింజ్ ప్రభువుగారు ధర్మపత్నీసహితముగా ఢిల్లీపురప్రవేశమొనర్చునపుడు దుర్మార్గులెవరో వారికిఁ బ్రాణహాని చేయఁదలంచి యొనర్చిన ప్రయత్నమును సభ్యులేకగ్రీవముగా గర్హించిరి.

ఆ మధ్యాహ్నము మరల రెండుగంటలకు మహాసభ ప్రాఙ్గణమును చేరిన భవనమందే సమకూడెను. ఈసభకు గౌరవ నీయులగు మ-రా-రా- శ్రీ, పానుగంటి రామారాయనింగారు, ఎం. ఏ, అగ్రాసనాధిపతిగానుండిరి. తొలిదివ మువచ్చినవారుగాక రావుబహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తిగారు, రావుబహద్దరు రఘుపతి వేంకటరత్నమునాయఁడుగారు, నాళం పద్మనాభముగారు మొదలగు సంపన్నులుకొందఱు వచ్చిరి. ఈదినమొక గొప్ప విషయము చర్చింపఁ బడెను. అది యేదియనఁగా ఇంటరుమీడియేటు పరీక్షకుఁ జదువు విద్యార్థులు వ్యాసలేఖనమం దవలంబింపవలసిన శైలివిధము నిర్ధారించుటకు సిండికేటువా రొక యుపసభ నేర్పఱిచిరి ఇందు నలువురు గ్రామ్యవాదులు నలువు రగ్రామ్య వాదులు నియమింపఁబడిరి. గ్రామ్యవాదులసంఖ్యయే వ్రేళ్ల నెన్నఁదగియున్నది. అట్లుండ నల్పసంఖ్యగలవారిపక్షమున నలువురిని, దక్షిణ నాంధ్రదేశమంతకుఁ గాను నలుగురిని నియమించుట యన్యాయమని దానిని సవరింపవలసినట్లు విశ్వ విద్యాలయవిచారణాధికారులఁ గోరవలయునని మ-రా-శ్రీ, తల్లాప్రెగడ సూర్య నారాయణరావుగారుపపాదించిరి మ-రా-రా-శ్రీ, చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు దానిని బలపఱిచిరి అనకాపల్లినుండి వచ్చిన మ-రా-రా-శ్రీ, బులుసు పాపయ్యశాస్త్రిగారి తీర్మానము నాదరింపవలసిన పనిలేదనియు, గుణాగుణములు బలాబలములు వాదమునందుండునుగాని సంఖ్యయందుండవనియుఁ జెప్పిరి. బ్ర॥ శ్రీ, తాడూరి లక్ష్మీనరసింహరావుగారు గ్రాంధికభాషాభిమానులయ్యు నీ తీర్మానమి పుడనావశ్యకమనిరి శ్రుతిమించి రాగమునఁబడ్డట్లు లీవాదమటుపోయి యిటుపోయి గ్రామ్యభాషయాదరణీయమా, యనాదరణీయమా యనుచర్చలోఁబరిణమించెను. గ్రామ్యముకూడదని బ్ర॥ శ్రీ, దివాకర్ల తిరుపతిశాస్త్రులవారును, వడ్డాది సుబ్బారాయఁడుగారును, కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారును, కల్లూరి వేంకట రామశాస్త్రిగారును, ఉమ్రే అలీషాగారును యుక్తియుక్తముగను, నిజమైనభాషాభిమానముతోను నుపన్యసించిరి. ఉమ్రేఅలీషాగారివాగ్ధాటి ఝరీవేగవంతమై వీరావేశముతోఁగూడియుండెను. గ్రామ్యభాషాపక్షమున బ్ర॥ శ్రీ, రావుసాహేబ్ గిడుగు రామమూర్తిగారు వారి వాడుకప్రకారము వీరావేశముతోఁ బ్రసంగిం

చిరి. వారి యుక్తులనన్నిటిని మ-రా-రా-శ్రీ, జయంతి రామయ్యపంతులుగారు యుక్తియుక్తముగను సప్రమాణముగను ఖండించిరి.

తరువాత దివాన్‌బహద్దర్ ముట్నూరి ఆదినారాయణయ్యగారు లేచి విద్యాధికారు లేర్పఱిచియుండు సభ సమంజసరీతి లేకుండుట నిక్కమనియు, సిండికేటులోఁ దెనుఁగక్షర మెట్టిదో తెలిసినవారెవ్వరు లేని కారణము చేతను వారి తీర్మాన మీప్రక్క నెందఱు చెప్పినారు, ఆప్రక్క నెందఱు చెప్పినారని సంఖ్య నెన్నుట చేతనే చేయఁబడియుండుట చేతను, ఇప్పటి సభ చక్కఁగ లేదని దానిని సవరించుటయావశ్యకమనియుఁ జెప్పి యాంధ్రము రానివారిఁ దొలఁగించి విద్యావంతుల నెక్కువగ వేయఁగోరుట బాగని తీర్మానమును గొంచెము సవరించిరి. ఈసవరణను అయ్యదేవర కాళేశ్వరరావుగారు బలపఱిచిరి పిమ్మట సభాధ్యక్షులు తీరుమానముపై సభ్యులయభిప్రాయముఁ దెలుపఁగోరఁగా వెయ్యిమందిలో నిరువురు దప్పఁ దక్కిన యందఱు సవరణ కాఁబడిన తీర్మానమునంగీకరించిరి. ఈచర్య ముగియునప్పటికి ౫ గంటలాయెను.

తర్వాత జయంతి రామయ్యగారు మాతృభాషాసేవ యవశ్యకర్తవ్యమని యుక్తియుక్తముగ సాధించుచు నొక వ్యాసమును జదివిరి. తరువాత తల్లాప్రెగడ సూర్యనారాయణరావుగారు ఆంధ్రనాటకములవిషయమున నొక వ్యాసమును వ్రాసికొనివచ్చిరి, కాని దానినంతయుఁ జదువ నవకాశము లేదని సారాంశము నుపన్యసించిరి. తుదకు మ-రా-రా-శ్రీ, పానుగంటి నరసింహరావుగారినాటకములు వర్తమానకాలమునఁ బయలు దేరుచున్న నాటకములలో నుత్తమనాటకములని వచించిరి. తరువాత కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులుగారు శ్లేషాలంకార ప్రాశస్త్యమునుగుఱించి యుక్తియుక్తముగ దృష్టాంతపూర్వకముగ రవివర్మపటముల యందలి చిత్రశ్లేషఁగనఁబఱిచి వసుచరిత్రయందలి శ్లేషయుత్తమోత్తమమని కొనియాడిరి. ఇప్పటికే చాలఁ బ్రొద్దుపోవుటచేఁ దక్కిన వ్యాసములు చదువవలను పడదయ్యె. తరువాత నగ్రాసనాధిపతిగారు సభయందుఁ జర్చింపఁబడిన యన్నివిషయములంగూర్చి తమయభిప్రాయము సమంజసోక్తులవక్కాణించిరి.

పిఠాపురము రాజుగారికిని సభవిషయమై శ్రమవహించి వచ్చేసిన చిన్న పెద్దలకును అభివాదనములతోను జయజయధ్వనులతోను సభముగిసెను

సభాంతమున రావుబహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడు వాళ్ళు పద్మనాభముగారును రాఁగల సంవత్సర మీసభ కాకినాడలోఁ గావింప వలసినదని యాహ్వానముచేసిరి. సభ యన్నివిధముల జయప్రదముగా జరిగినది. భాషాభిమానము పొంగి పొరలినదన్న నతిశయోక్తికాదు.

సభాంతమున తిరుపతిశాస్త్రిలుగారు, రామకృష్ణకవులు, మంగిపూడి వేంకటశర్మగారు, వేంకటపార్వతీశ్వరకవులు పద్యములు చదివిరి. కొన్నిపద్యము లీ దిగువ నుదాహరింపఁబడుచున్నవి.



సీ॥ కాలవైపమ్యముల్ ♦ కారణంబులుగాఁగ భూరిప్రదోషముల్ ♦ పొంగిపొరలఁ
దదనుగుణంబుగాఁ ♦ దప్పుదారులఁబట్టి దుడుకున ధాతువుల్ ♦ తడఁబడంగఁ
దదనుసారంబుగా ♦ దారుణగతిఁజిక్కి క్రమమఱి సంధిబం ♦ ధములుచెదరఁ
దన్మూలకంబుగాఁ ♦ దగులంబు నెడఁబాసి తలకెక్కి ప్రాణముల్ ♦ తల్లడిల్ల
గీ॥ నతిభయదదుష్టసన్నిపా ♦ తార్తివలన
నాంధ్రభారతి రూపుమా ♦ యంగ నుండ
భవ్యదివ్యౌషధమునఁ గా ♦ పాడుకొనుఁడు
పండితమహాభిషజ్మణి ♦ ప్రవరులార.

సీ॥ ఫలపుష్పభరితకో ♦ మలవనంబును గొట్టి పెనుగాలి చీకాకు ♦ పెట్టినట్లు
శ్యామసుందరసస్య ♦ సంతానమును బట్టి మిడుతగుంపడఁగింపఁ ♦ దొడఁగినట్లు
సమ్మదాకలితప్ర ♦ జాసంఘమునఁ బుట్టి విషవిశూచి కలంత ♦ వెట్టినట్లు
సంపత్సమృద్ధభూ ♦ జనపదంబుల ముట్టి యేటివెల్లువ ముంప ♦ నెగసినట్లు
గీ॥ సదమలాంధ్రభాషాక్షీర ♦ సాగరమున
గ్రామ్యహాలాహలము క్రమ్మి ♦ కలఁచుచుండె

దన్ని వారణోపాయంబుఁ • దలఁపుఁడయ్య
మహితమతులార కవిరాజ • మౌళులార.

సీ॥ సరిలేని దేశభా • షాపోషణంబునఁ బ్రథితాత్ము లగు మహీ • పాలురార
సకలభాషాప్రపం • చవిమర్శనంబున నెన్నికగన్న బు • ధేంద్రులార
మహితప్రబంధని • ర్మాణకౌశలమునఁ బ్రౌఢిఁ గాంచిన కవి • బ్రహ్మలార
అనయంబు సరసకా • వ్యరసామృతంబును జవిగాంచు పాఠక • ప్రవరులార

ఆ॥ మహితకీర్తులార • మహి "సంఘశక్తిః క
లౌయుగే" యఁటన్న • లలితసూక్తి
నరసి యంద ఱొక్క • రై పాటులకు నోర్చి
మాతృభాష నెట్లొ • మనుపుఁడయ్య

గీ॥ పండితులచేత సత్కవి • వరులచేత
సంఘములచేత నీరీతి • సభలచేత
నాంధ్రభాషాప్రపంచక • మన్ని యెడల
నీతిబాధలవిడనాడి • యెసఁగుఁగాత.

వేంకటపార్వతీశ్వరకవులు.

సీ॥ అష్టభాషలకు వా • గనుశాసనుండైన నన్నయకవి పెంచి • నాఁడుమున్ను
ప్రేమానుబంధంబు • తోముద్దుముచ్చటల్ తిక్కనకవి మున్ను • తీర్చినాఁడు
పరువుగాఁబల్లకీ • పై సర్వదేశముల్ శ్రీనాథకవి మున్ను • త్రిప్పినాఁడు
లలితశయ్యారసా • లంకారవస్తువుల్ పెద్దన్నగారు • పంపించినారు

గీ॥ ఆంధ్రభాషావధూటికో • యార్యులార
యిచ్చవచ్చినయట్లుమీ • నచ్చినట్లు
నగలు నాణెంబులునుబెట్టఁ • దగునుగాని
సూత్రములు త్రెంపకుం డాంధ్ర • శూరులార.

# ప్రకటన.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు, చెన్నపురి.

ప్రతిష్ఠాపకులు:—

శ్రీ పిఠాపురము రాజాగారగు శ్రీరాజా రావు కుమార వేంకటమహీపతి సూర్యారావు బహద్దరుగారు.

శ్రీ వేంకటగిరిరాజాగారగు మహారాజా సర్ వెలుగోటి శ్రీరాజగోపాల కృష్ణయాచేంద్రబహద్దరుగారు, కె. సి. ఐ. ఇ., పంచహజారీమన్సబ్దార్.

అగ్రాసనాధిపతి:—

శ్రీ వేంకటగిరి రాజాగారు.

కార్యనిర్వాహక సభాధ్యక్షుఁడు.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులుగారు. బి. ఏ., బి. ఎల్.

కార్యదర్శులు.

మ-రా-రా-శ్రీ పురాణం నాగభూషణంపంతులుగారు, ఎం. ఏ., బి. ఎల్.
,, ఆచంట లక్ష్మీపతిగారు, బి. ఏ., ఎం. బి., సి. ఎమ్.,
,, దివాన్ బహద్దర్ నెమలి పట్టాభిరామారావు పంతులుగారు బి. ఏ.

కోశాధ్యక్షులు (ట్రస్టీలు)

దివాన్ బహదూర్ కంచి కృష్ణస్వామిరావుగారు, సి. ఐ. ఇ.,
ది ఆనరబిల్ రావుబహదూర్ పిట్టి త్యాగరాజుసెట్టిగారు, బి. ఏ.

కార్యస్థానము.

192, ఎస్ప్లనేడు. చెన్నపురి.

చందానిర్ణయము.

పరిషదుద్దేశము:— ఆంధ్రశబ్దములకు సలక్ష్యవ్యుత్పత్తికముగ విపులనిఘంటువు రచించుట, తెలుఁగుభాష కితరభాషలతోఁగల సంబంధమును దెలుపుచు భాషాతత్త్వమును నిరూపించులక్షణ శాస్త్రమును రచించుట, ఆంధ్రదేశపూర్వవృత్తాంతమును ప్రమాణపూర్వకముగా నిరూపించుట, శాస్త్రపారిభాషికపదముల నిర్ణయించుట, నూతనగ్రంథరచనకు సాహాయ్యమొనర్చుట, భాషావిషయములఁ జర్చించుటకుఁ బత్రిక నొకదానిని బ్రకటించుట, సమగ్రమగు పుస్తకభాండాగారము నేర్పఱచుట, ఇత్యాదివిధముల నాంధ్రభాషావాఙ్మయాభివృద్ధికై యత్నించుట, పరిషత్తుయొక్క యుద్దేశము.

| | | |
|---|---|---|
| 1. ఉద్ధారకులకు | రు. | 5000. |
| 2. పోషకులకు | ,, | 1000. |
| 3. యావజ్జీవసభ్యులకు | ,, | 100. |
| 4. సాధారణసభ్యులకు సంవత్సరమునకు | ,, | 6. |

పరిషత్సభ్యులు పత్రికకు వేఱుగాఁ జందా నియ్యనక్కఱలేదు.

సభ్యులు కాఁగోరువారు కార్యదర్శుల పేర వ్రాసి పరిషన్నిబంధనలఁ దెప్పించుకొనవచ్చును.

# ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల.

నిడదవ్రోలు, కృష్ణాజిల్లా.

ఇందు చక్కని క్యాలికోబైండుగల నవలలు రెండుమాసముల కొక్కటిగా వెలువడును. ఈ నవలలు చరిత్రబోధకములును మనోహరకథాకల్పితములునై చదువరుల హృదయముల నాకర్షించుచుండును. ఈనవలలనుగూర్చియు, ప్రస్తుతకాలమున నాంధ్రభాషాభివృద్ధికి నవలలయొక్క యవసరమును గూర్చియు, ననేకు లనేకాభిప్రాయముల నిచ్చియున్నారు. ఆంధ్రభాషాభివృద్ధి కీనవలలు ప్రథమసోపానములని చెప్పవచ్చును. ఇందు శాశ్వతచందాదారులుగా చేరువారికి మంచి క్యాలికోబైండుచేయఁబడిన నవలలు డెమ్మీసైజున 100 పేజీలకు రు 0—6—0 చొ॥ వెలయేర్పఱచి వి. పి. గాఁ బంపుచుందుము. ఇతరులకు పోస్టేజిగాక 100 పేజీలకు రు 0—8—0 చొ॥ నిచ్చెదము.

ఏనవలయైనను ఒకరూపాయి వెలకు మించియుండదు.

చందాదారులుగా చేరువారు 0—2—0 అడ్మిషనుఫీజు నీయవలెను.

## ఈ గ్రంథమాలిక నుండి వెలువడిన నవలలు.

| | చందాదారులకు | ఇతరులకు |
|---|---|---|
| 1. దుర్గేశనందని. 231 పేజీలు | 0—12—0 | 1—0—0 |
| 2. వసుమతీవసంతము. 300 | 1— 0—0 | 1—8—0 |
| 3. లలితచంద్రహాసము. 166 పేజీలు | 0—10—0 | 0—14—0 |
| 4. మృణ్మయి. 256 పేజీలు | 1— 0—0 | 1—5—0 |
| 5. సీతారామ. 320 పేజీలు | 1— 0—0 | 1—8—0 |
| 6. నూర్జహాను. 340 పేజీలు | 1— 0—0 | 1—8—0 |
| 7. రాజసింహ. 280 పేజీలు | 1— 0—0 | 1—8—0 |
| 8. మాధవీలత 260 పేజీలు | 1— 0—0 | 1—5—0 |
| 9. మృణాళిని 247 పేజీలు | 1— 0—0 | 1—5—0 |
| 10. మనోరమ 255 పేజీలు | 1— 0—0 | 1—5—0 |

## అనుబంధ గ్రంథములు.

| | | |
|---|---|---|
| 1. రాధారాణి | 0—4—0 | 10. హారావళి |
| 2. యుగళాంగుళీయకము | 0—3—0 | 11. కోహినూరు |
| 3. రాజభక్తి | 0—2—0 | 12. నీరద |
| 4. లీల | 0—4—0 | 13. పరిమళ |
| 5. దుర్గేశనందని విమర్శనము | 0—3—0 | 14. అమృతపులినము |
| 6. మాలతి | | 15. సీతావనవాసము |
| 7. ప్రభావతి | | 16. లలిత |
| 8. సాధన | | 17. ఉన్మాదిని |
| 9. కమలాకాంతుఁడు | | |

వలయువారు:—

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము

నిడదవోలు, కృష్ణాజిల్లా.

అన్నివ్రాయవలయును.

# విజ్ఞానచంద్రికాగ్రంథమాల

ఆంధ్రులపౌరుషము! ఆంధ్రులయౌన్నత్యము!! ఆంధ్రులబుద్ధివైభవము!!!

# ఆంధ్రులచరిత్రము.

## రెండవభాగము

ఇందు క్రీ. శ 1100 నుండి 1350 వరకుంగల ఆంధ్రదేశచరిత్ర వర్ణింపఁబడినది.

పురాణములు, కావ్యములు, శాసనములు, విదేశీయుల వ్రాతలు, మొదలగువాని నన్నింటిని శోధించి తెలుంగుచోడులు, నాగవంశోద్భవులైన మహారాజులు, కాకతీయచక్రవర్తులు, పల్నాటివీరులు, కమ్మవారు, రెడ్లు, వెలమలు మొదలగువారి చరిత్రలు, ఈ యుద్గ్రంథమునందు క్రోడీకరింపఁబడినవి.

రామానుజుఁడు, బసవేశ్వరుఁడు, నన్నెచోడ కవిశిఖామణి, ఖడ్గతిక్కన, కవితిక్కన, గణపతిదేవచక్రవర్తి, ప్రతాపరుద్రమహారాజు, మహారాణి రుద్రమదేవి, మొదలగువారల పవిత్రజీవితములు శ్రద్ధతో వ్రాయఁబడినవి.

ఆయాకాలమందలి సాంఘిక, రాజకీయస్థితులు చక్కఁగ వివరింపఁబడినవి. ప్రదేశములయొక్కయు, కట్టడములయొక్కయు, పటములు కలవు.

పౌరుషమునందును, పాండిత్యాతిశయంబునందును రాష్ట్రపాలనయందును ఆంధ్రులు హిందూదేశములోని యితరదేశములవారికి తీసిపోవువారు కారని యీగ్రంథము సప్రమాణముగా సిద్ధాంతీకరించుచున్నది.

ఇట్టిగ్రంథము తెలుంగులోగాని మఱియే యన్యభాషలోఁగాని యెవ్వరును రచించియుండలేదు.

విఖ్యాతలేఖకులగు శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు పంతులుగారిచే నిది రచింపఁబడినది. 400 పేజీలుగలిగి మంచికాగితములమీఁద చిన్న యక్షరములతో ముద్రింపఁబడి చక్కని క్యాలికో బైండుచేయఁబడిన యీయముల్యగ్రంథము మాచందాదారులకు పోస్టేజితో రు 1-0-0 కును, చందాదారులు కానివారలకు పోస్టేజిగాక రు 1-8-0 లకును ఇయ్యఁబడును.

**☞ విజ్ఞానచంద్రికా బుక్కుడిపో యందు సంస్కృతాంధ్రగ్రంథము లనేకములు దొరకును. వలయువారికి క్యాటలాగులు పంపఁబడును.**

చిరునామా:—

ఆ. లక్ష్మీపతి, బి. ఏ. ఎం. బి. సి. ఎం.

మేనేజరు.—విజ్ఞానచంద్రిక,

చింతాద్రిపేట.—మద్రాసు.

# గ్రంథములు!



రు. అ. పై

1. పల్నాటి వీరచరిత్రము ... ... ... 1—0—0

మహాకవి శ్రీనాథవిరచితము. విపులోపోద్ఘాత సహితము.) క్యాలికో. 1—4—0

2. టిప్పుసుల్తా౯ ... ... ... 0—12—0

(నవల. విపులోపోద్ఘాతసహితము. గ్రంథకర్త అక్కిరాజు ఉమాకాంతం.)

క్యాలికో. 1—4—0

3. అరవ దేశమునందలి యాంధ్రవాఙ్మయము ... 0—4—0

4. శ్రుతిరంజని.—గీత గోవిందవ్యాఖ్యానమునకు వసుచరిత్ర కృతిపతికిని గల సంబంధమును, అప్పటి విజయనగర రాజ్యవ్యవస్థయుఁ దెలియఁజేయును. వాఙ్మయమునకును జరిత్రకును సంబంధించిన యొకచర్చ కడపటి రెండు పుస్తకములు పైగ్రంథకర్త చేతనే రచింపఁబడినవి. 0—2—

వలయువారు:—

అక్కిరాజు ఉమాకాంతం.

మేనేజరు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు,

192, ఎస్ప్లనేడు, చెన్నపురి.

అని వ్రాయవలయును.

# విషయసూచిక.


1. ఆన్ధ్రసాహిత్యపరిషద్విషయము ... ...

2. శ్లేషకవిత్వము ... ... 225-255

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిలుగారు

3. ప్రాఁదెనుఁగుఁగమ్మ ... ... 256-274

రావుసాహెబు గిడుగు వేంకటరామమూర్తిగారు బి. ఏ.

4. ఆంధ్రభాషాసంస్కరణము ... ... 275-285

మహామహోపాధ్యాయులైన తాతా సుబ్బారాయశాస్త్రిలుగారు

5. గ్రామ్యవాదుల భాషావాదము ... ... 286-300

పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు

6. కిరోసీనునూనె ... ... 301-30

తల్లాప్రగడ పానకాలరావుగారు బి. ఏ.

7. తొండమాన్ వంశావళి ... ... 304-31

మదురపాటి వేంకటార్యుఁడు

8. హిందువుల బీజగణితము ... ... 318-32

కపిస్థలము కృష్ణమాచార్యులుగారు బి. ఏ. యల్. టి.


## ప్రతిబింబములు.


1. గంగావతరణము.

2. బ్రిటీషుద్వీపముల పటము.

# ఆంధ్రసాహిత్య పరిషద్విషయము.

---

—*ఆంధ్రభారతప్రయోగానుక్రమణిక*—

పరిషదుద్దేశములలో విపులాంధ్రనిఘంటునిర్మాణ మొక్కటికదా. తదంగముగా నాంధ్రభారతమునందలి ప్రయోగము లన్నియుఁ గరతలామలకముగఁ దెలియునట్లు భారతప్రయోగానుక్రమణిక యొకటి రచింపవలసినట్లు నిర్ణయమయి యాపని జరుగుచున్నది. అయిదుగురు పండితులు ప్రస్తుతమాపనిఁ జేయుచున్నారు.

—*పారిభాషికపదసంపాదనము*—

నానావిధములగు వృత్తులలో వాడఁబడుచున్న పారిభాషికాంధ్రపదము లన్నియు నిదివఱలో సంగ్రహముగా నొక్కచోఁ గూర్పఁబడియుండలేదు. నిఘంటువులోఁ జేర్చుటకై యట్టిపదములను సంపాదించుట కొకరిని నియమించుట యైనది. ఆయన ప్రస్తుతము గంజాముజిల్లాలోఁ బనిచేయుచున్నాఁడు. ఈపనికిం కొకరుకూడ నియమింపఁబడుదురు.

—* లిఖితపుస్తకసంపాదనము *—

లిఖితపుస్తకముల సంపాదించుటకై యిద్దఱు నియమింపఁబడియున్నారు. ఒకరు గోదావరికృష్ణాజిల్లాలయందును, ఇంకొకరు కడపజిల్లాయందును శ్రద్ధగాఁ బనిచేయుచున్నారు.

—* పుస్తకప్రకటనము *—

భీమనఛందస్సను నామాంతరముగల కవిజనాశ్రయమను గ్రంథమొకటియుఁ, బల్నాటివీరచరిత్రమను ద్విపదకావ్యమొక్కటియు, రాయవాచకమను చిన్నపుస్తక మొకటియు నీసంవత్సరములోఁ బ్రకటించుటకుఁ దగినయత్నములు జరగుచున్నవి.

---

పరిషత్పత్రికా పాఠకోత్తములారా !

2 సంపుటము 2 సంచిక చిట్టచివర నాపద్యములలో

(1) "అష్టభాషలకు" అను సీసములో గీతి తక్కఁ దక్కినది శూన్యశతకమునుండి యనువదింపఁబడినదని యెఱుంగవలయు ననియు,

(2) "స్మయమాన" అను మత్తేభవృత్తములో 3 పాదములో "యావాలస్థితం బెంచి" అనునది "హృదయాశ్వాంతస్థితం బెంచి" యని దిద్దవలయు ననియుఁ బ్రార్థించుచున్నాఁడ.

ఇట్లు విద్వద్విధేయుఁడు

దివాకర్ల తిరుపతిశాస్త్రి,

శతావధా

---

శ్రీ.

# శ్లేషకవిత్వము.



* శ్లో॥ "వాగర్థా వివ సంపృక్తౌ॥ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే। పార్వతీపరమేశ్వరౌ"—రఘువంశము.

సారస్వతప్రక్రియ బహువిధంబుల విరాజిల్లుచున్నది. అందులో శ్లేషకవిత్వ మొక్కటి. కవిత్వ మనునది చిత్రకళలలోనిది. చిత్రకళలు హృదయానందైకప్రధానములు. కావుననే కళలను బాశ్చాత్యు లుపయోగకరకళ లనియుఁ (Useful arts) జిత్రకళలనియు (Fine arts) రెండు విధముల విభజించి కవిత్వము నుపయోగకరకళలలోఁబరిగణింపక చిత్రకళలలోఁ జేర్చియుండిరి. మనవారును గవిత్వమును గళలలో నుగ్గడించియుండిరి. మనవారును గావ్యము "సుఖవిశేషకృత్త"ని చెప్పిరి— "కావ్యంరసాదిమద్వాక్యం శ్రుతం సుఖవిశేషకృత్" అని యలంకార సూత్రకారుఁ డువ్రాసియున్నాఁడు.

హృదయ మెప్పుడును సామాన్యవిషయములతోఁ దృప్తినందియుండునది కాదు. ఏదో యొకవైలక్షణ్య మున్నతావును అది సదా కోరుచుండును. "రాముఁడు రావణునిఁ జంపెను" అనువాక్యముకంటె "రాముఁడు రావణుని యమసదనమునకు నతిథినిగాఁ బంపెను." అనువాక్యమును గాంచినప్పుడు హృదయము హెచ్చుగ హర్షించును. న్యాయముచే విషయమును దెలిసికొనుటకుఁ గావలసినభావము నిచ్చుసఁర్థములో రెండవవాక్యముకంటె మొదటివాక్యమే సరిగను సులభముగను భావమును స్ఫురింపఁజేయునదియై యున్నది. రెండవవాక్య మన్ననో సులభముగాఁ దక్కువ పదములతోఁ దేలవలసినభావము నెక్కుడుమాటలతోఁ జిక్కుమార్గమునఁ దెలుపునదియై యున్నది. అయినను లోకులు మొదటివాక్యముకంటె రెండవవాక్యమును గనినప్పుడే

* ఇందు "పార్వతీపరమేశ్వరౌ" అని యుండుటచేఁ బ్రాజ్ఞులు పార్వతీపరమేశ్వరుల (ఉమామహేశుల) పరముగాను, పార్వతీప, రమేశ్వరుల (శివకేశవుల) పరముగాను రెండర్థములు చేయుచున్నారు. పలువురు వ్యాఖ్యాతలే యిట్లు రెండర్థములు వ్రాసి యున్నారు.

హెచ్చుగా సంతోషింతురు. ఏమన హృదయము సదా వైలక్షణ్యము నభిలషించునది కావుననే. ఆవైలక్షణ్యమునకే యలంకార మని పేరు. కావుననే బెయినుదొర యిట్లు వ్రాసియున్నారు.

"A figure of speech is a deviation from the plain or ordinary mode of speaking, with a view to greater effect"—Bain.

అలంకారయుక్తము లగువాక్యములే కవిత్వ మనిపించుకొనును గాని కేవల భావసౌష్ఠవమును మాత్ర మిచ్చువాక్యములు కవిత్వము కానేరదని ప్రాచీనులు వచింతురు.

తొల్లి భోజుఁడు కవిత్వము నాదరించువాఁడై దానిం జెప్పువారల బహువిధముల బహూకరించుచు వచ్చుచుండెను. ఆహేతువుచే నప్పటివారలకెల్లరకును గవిత్వమునం దభిలాష వొడమెను. ఒకనాఁ డనాఘ్రాతకవితాగంధు లిద్దఱు కవిత్వమును జెప్పి భోజుని మెప్పించి తగుపారితోషికము నందనెంచి పద్యలక్షణముం దెలిసికొని పద్యమును వ్రాయఁ బ్రయత్నించి ప్రయత్నించి కొంతకాలమున కెట్లెట్లో క్రిందిరీతిగా నిద్దఱుం గలసి రెండుపాదములను విరచించిరి. ఒకఁడు "భోజనం దేహి రాజేంద్ర" అను పాదముం జేయ రెండవవాఁడు "ఘృతసూప సమన్వితమ్" అని రెండవపాదముం బూరించె. కావున "భోజనం దేహిరాజేంద్ర। ఘృతసూప సమన్వితమ్" అను రెండుపాదములు తేలినవి. తక్కిన రెండుపాదములును గుదురక వారు శ్రమపడుచుండఁగా దైవవశమునఁ గవికుల సార్వభౌముండగు కాళిదాసుఁ డాకడకు వచ్చి వారిపాట్లం గని కరుణించి, "మాహిషంచ శరచ్చంద్ర చంద్రికాధవళం దధి" అని పూర్తి చేసి తక్కిన రెండుపాదములను వారి కిచ్చెను. ఆహేతువుచే శ్లోక మీక్రింది రీతిని బూర్తి యైనది.

"శ్లో॥ భోజనం దేహి రాజేంద్ర ఘృతసూప సమన్వితమ్।
మాహిషంచ శరచ్చంద్ర చంద్రికాధవళం దధి॥"

ఈశ్లోకమును బట్టుకొని పోయి వారు రాజుకడఁ జదువఁగా విని యానందించి మొదటి రెండుపాదములను విడిచి తక్కిన రెండుపాదములకును నక్షరలక్ష లిచ్చెనట. ఛందస్సు నాల్గుపాదములందును సరిగ నుండినను భావము నాల్గుపాదములందును సరిగ నుండినను గవిత్వము మాత్రము తుదిరెండుపాదములందు మాత్రమే కల దని దీనిభావము. కావలసిన విషయమును జూచుకొనిన మొదటి రెండుపాదములందుననే హెచ్చుగాఁ గలదు. పప్పు నేయి గలభోజన మొసంగు మని మొదటి రెండుపాద

ము భావము. గేదెపెరుఁగుకూడ నని తక్కిన రెండుపాదముల భావము. వలయు కోరికిని దెలుపుటలో మొదటి రెండుపాదములే మెచ్చుకొనఁదగినవి. ఏలన:— (1) పప్పు (2) నేయి యుఁగల (3) భోజనము నిమ్మను భావము వానియందున్నది. తక్కిన రెండుపాదములు నొక్కపెరుఁగుకొఱకై వినియోగింపఁబడినవి. కాళిదాసుని కవిత్వమే వారికి న్యాయము కాకుండిన వాని మూఁడవపాదమునఁ జెఱకును నాలుగవ దానియందు మామిడిపండ్లను గోరికొని యుందురేమో. కాళిదాసుఁ డట్లుచేయక యొక్కపెరుఁగునకై పెద్దవాక్యాడంబరమును జూపియున్నాఁడు. తక్కువమాటలలో నెక్కువవిషయము పట్టి సులభబోధ్యముగా నున్న మొదటి రెండుపాదములును వ్యర్థములై పోయినవి. ఎక్కువమాటలతోఁ దక్కువవిషయమును దాంభికరీతి నొనరించిన వానికి బహూకారము వచ్చినది. దీనివలనఁ దేటతెల్లముగ భావమును దెలుపుటయే కవిత్వముపని కాదనియుఁ జమత్కారముగా భావమును వ్యక్తీకరించుట కవిత్వలక్షణ మనియుఁ దేలుచున్నది. అనఁగా గవిత్వ మలంకారయుక్తమై విలక్షణముగా నుండ వలయును గాని సులభముగా భావమును బోధించుట ప్రధానముగా నుండఁగూడదని తేలుచున్నది. కావుననే ప్రాచీనులు "అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్య" మ్మని నుడివి యుండిరి. కావ్యలక్షణముం గూర్చి ముచ్చటించు శాస్త్రమునకు "అలంకారశాస్త్ర" మని పేరు వచ్చుటకుఁ గల కారణ మిదియే. "కావ్యం గ్రాహ్య మలంకారాత్" అని వామనుఁడు వ్రాసి యున్నాఁడు.

అట్టి యలంకారములలో శ్లేషయొక్కటి. శ్లేషయనఁగాఁ గూడిక యని యర్థము. ఒక్కచో బహుభావములకూడికయం దిది రూఢము. ఒక్కమాటతో బహ్వర్థముల సాధించునది శ్లేష. ("అనేకార్థ శబ్దవిన్యాసశ్శ్లేషః") కావున నయ్యది ప్రౌఢైకసాధ్యము. లోకు లెప్పుడును బ్రౌఢత్వమును హెచ్చుగా మెచ్చుకొనుచుందురు. కాన శ్లేషయం దభిరుచి యాదినుండియు నన్ని దేశములందును గలదు. శ్లేష యుక్తిని సూచించు నని పాశ్చాత్య విద్వాంసులును దలంచుచున్నారు. కొన్ని యూహాల నీ క్రింద నిచ్చుచున్నాఁడను.

" This playing on words may be attributed to many causes or motives as either to an Exuberant activity of mind as in the higher Comedy of Shakespeare generally –" Coleridge.

'In a certain degree, play of words is the appropriate and most natural form of the comic in detail, as also it is unquestionably the most original vehicle of wit"

దీనిం బట్టిచూడ శ్లేషప్రౌఢతను దెల్పునని యన్ని దేశములవారును సంగీకరించి రని గ్రహించుకొనవచ్చును. పైనిం జెప్పం బడిన రీతిగ నిది ప్రౌఢులందు సహజముగం బుట్టినదియై యున్నది.

కాలాదికము.

ఇంక లోకు లెంతకాలమునుండి దీనిని వాడుచున్నారో కనుంగొందము. లోకమునం గల వాఙ్మయములో వేదములు మిక్కిలి పురాతనములు. అట్టి వేదములందు ననే యర్థశ్లేషలును శబ్దశ్లేషలును గూడం గాన్పించు చున్నవి.

వేదములందర్థశ్లేషకుదాహరణము.

"శ్లో. కోహఙ్గస్యా మిత్యబ్రవీత్ ఏతత్ ప్రదాయేతి।
ఏతత్ స్యా ఇత్యబ్రవీత్ యదేతద్వ్యాహృతి॥"

ఇది బ్రహ్మకును నింద్రునకును జరిగిన సంవాదము. ఇందు "కః" అను శబ్దము శ్లేషింపంబడినది. "కః" అన "ఎవండు" అని యొకయర్థము. బ్రహ్మ యని యింకనొక యర్థము. (మారుతే, వేధసి, బ్రధ్నే, పుంసి కః అని యమరము.)

ఇంద్రుండు బ్రహ్మను తనకు సర్వాధికారముల నొసంగవలసిన దని కోరుకొనంగా వారల కిద్దఱకును నీప్రసంగము జరిగినది.

"కోహఙ్గస్యామిత్యబ్రవీత్ । ఏతత్ ప్రదాయేతి॥"

ఈవాక్యములు బ్రహ్మభావముం దెలుపునవి. ఇది నీకిచ్చి నేనేమి కావలసినదో అని దీని భావము.

"ఏతత్ స్యా ఇత్యబ్రవీత్ । యదేతద్వ్యాహృతి॥"

ఇవి యింద్రుని భావముం దెల్పునవి. "నీవేది పలికితివో యదియే కావలసిన"దని దీనిభావము. బ్రహ్మ కశబ్దవాచ్యుండు గాన "కోహఙ్గస్యా" మని బ్రహ్మ పలుకంగా నింద్రుండు "కః"యే కావలసిన దని చమత్కరించినాండు. ఇది యర్థశ్లేష.

వేదములందు శబ్దశ్లేషకుదాహరణము.

"తేషాం త్వయాసనేనప్రశ్వసితవ్యమ్" అని వేదము ఘోషించుచున్నది. ఇందు రెండర్థములు కలవు. తేషాం త్వయాసనే, నప్రశ్వసితవ్యమ్మనునది యొక్కటి. (2) తేషాం త్వయాసనేన, ప్రశ్వసితవ్యమ్మనునది యొక్కటి.

సూత్రములందు.

వేదకాలము తరువాతిది సూత్రకాలము. సూత్రకాలములందును శ్లేషలు కలవు.

వ్యాకరణసూత్రములలో.

"విప్రతిషేధేపరం కార్య"మ్మని యొకపాణినీయసూత్రము కలదు. దీనికి (1) "విప్రతిషేధే, పరంకార్య"మ్మనియు (2) "విప్రతిషేధే అపరంకార్య"మ్మనియు రెండర్థములు మహాభాష్యమునందే కాన్పించుచున్నవి.

పురాణేతిహాసములందు.

సూత్రములతరువాతివి పురాణేతిహాసములు. వీనియందును శ్లేషలు కలవు.

ఆదికావ్యమగు రామాయణమున.

"శ్లో. మానిషాదప్రతిష్ఠాంత్వమగమశ్శాశ్వతీస్సమాః।
యత్ క్రౌంచమిథునాదేకమవధీః కామమోహితమ్." 1

"శ్లో. రామం దశరథం విద్ధి మాంవిద్ధి జనకాత్మజాం।
అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛతాత యథా సుఖమ్". 2

మున్నగు శ్లోకములకుఁ బండితు లనేకార్థములను దెలుపుచుందురు. కొందఱవి కవితలంచినవి కావన సాహసింపవచ్చును. కాని కవి యుద్దేశపూర్వకముగ శ్లేషను వాడినాఁడని చెప్పందగిన తావులును గలవు. ఒక యుదాహరణము నిచ్చుచున్నాఁడను.

"శ్లో. స్మృత్వా వియోగజం దుఃఖం త్యజన్స్నేహం ప్రియేజనే।
అతిస్నేహపరిష్వంగా ద్వర్తి రార్ద్రాపి దహ్యతే."

ఇందు "స్నేహ" శబ్దము శ్లేషింపఁబడినది. స్నేహమనఁ జమురనియుఁ జెలిమి యనియు రెండర్థములు కలవు. రెండిట నీపద మిచ్చటఁ గవిచే వాడఁబడినది.

శాస్త్రములందు.

శాస్త్రములందును శ్లేషలు గలవు. వైద్యశాస్త్రమగు రోలంబరాజీయము నుండి యీక్రింది శ్లోకము నుదాహరించుచున్నాఁడను.

---

(1) నిషాద = బోయవాఁడా, యత్ = ఏకారణముచేత, కామమోహితమ్ = కామక్రీడ యందుఁగల, క్రౌంచమిథునాత్ = క్రౌంచపక్షులజోటినుండి, ఏకం = మగపిట్టను, అవధీః = చంపితివో, (ఆకారణమున) శాశ్వతీస్సమాః = చాలవత్సరములు, ప్రతిష్ఠాం = ఉనికిని, త్వం = నీవు, మాగమః = పొందకుము, అని యొకయర్థము. (2) మానిషాద = లక్ష్మిని ధరించినవాఁడా, అనఁగా రామా, యత్ = ఏకారణముచేత, కామమోహితం = కామియైయుండు, క్రౌంచమిథునాదేకం = రాక్షసదంపతులలో మగవానిని, అనఁగా రావణుని, అవధీః = చంపితివో (ఆకారణముచేత) త్వం = నీవు, శాశ్వతీస్సమాః= బహువత్సరములు, ప్రతిష్ఠామగమః = ప్రతిష్ఠను బొందుమా. అని రెండవ యర్థము.

(2) రామం దశరథంవిద్ధి = రాముని దశరథునిఁగా భావించుకొమ్మనియొకయర్థము. దశరథుఁడు చనిపోయినవాఁడుగా నెంచుకొమ్మని యొకయర్థము. ఈయర్థము లంతటను వ్రాయఁబడియే యున్నవి కాన నిచట విడువఁబడినవి.

"శ్లో॥ నఖముఖ లాలనసుఖదా పామావామా నితంబవిస్తారా।
స్నేహకనకరసగంధైః గచ్ఛతి పూర్వాపరావశం యాతి॥"

పామ యన గజ్జి. ఇందుఁ బామ వామతో ననఁగా స్త్రీతోఁ బోల్పఁబడినది. (గంథకర్త పామును సరసముగా స్త్రీతోఁ బోల్చుచు నిందు నా రోగలక్షణములను నట్టి నివారించుమార్గమును గూడఁ దెల్పియున్నాఁడు. ఎట్లన:—

పామయు వామయు నఖముఖలాలన సుఖదలు. నఖముఖలాలనమున ననఁగా గొనగోళ్లతో గోఁకికొనిన సుఖమిచ్చునది పామ. నఖలాలన ముఖలాలనాదులచేత ననఁగా నఖక్షతాదులచేత సుఖము నిచ్చునది వామ [స్త్రీ]. ఉభయలు నితంబవిస్తారలు. (నితంబములయందు విస్తరించునది పామ, విస్తారము లగు నితంబములు కలది వామ, స్నేహ, కనక, రస, గంధములు (చమురు, ఉమ్మెత్త, పాదరసము, గంధకము, వీనిచేఁ బామ పోవును (గచ్ఛతి). వామ యీస్నేహ, కనక, రస, గంధములచేతనే (చెలిమి, బంగారు, రసములు గంధములు మున్నగువానిచే) వశ మగును (వశంయాతి.)

కావ్యములందు.

వేదాదులందె శ్లేష లున్నపుడు కావ్యములం దవి యుండునా యను సందేహముతోనే యవసరము లేదు. అయినను దాని వ్యాప్తి యెంతవఱకుఁ గలదో తెలుపుట ప్రస్తుతము మనపని గాన మిక్కిలి ప్రౌఢులగు మహాకవులు వ్రాసిన కావ్యరత్నములనుండి కొన్ని యుదాహరణములం దీసికొందము.

కాళిదాసుకవితలో.

హిందూదేశపు షేక్సుపియరగు కాళిదాసు కవిత్వములోను శ్లేషలు కలవు. రఘు వంశమునుండి యొక యుదాహరణము నిచ్చుచున్నాఁడను.

"శ్లో॥ నిర్విష్ట విషయస్నేహస్స దశాంత ముపేయివాన్।
ఆసీదాసన్న నిర్వాణః ప్రదీపార్చిరివోషసి॥"

ఇది దశరథుని నిర్వాణమును వర్ణించుశ్లోకము. ప్రాతఃకాలమున నాఱిపోవు దీపమువలెనే దశరథుఁడు దశాంతమునందె నని దీనిభావము. ఇందు దీపపరముగా నొకయర్థమును దశరథపరముగా నొకయర్థమును గలవు. ఎట్లన:—

అన్నిదశలు ననుభవించిన దశరథుఁడును నిర్విష్టవిషయస్నేహుఁడే. ప్రాతఃకాలమువఱకును వెలింగి యాఱిపోవుదీపమును నిర్విష్ట విషయస్నేహము కలదియే.

ప్రవాక్యమున కనుభవింపఁబడినవిషయానురాగము గలవాఁడని దశరథపర మగు నర్థము. విషయ మన మూఁకు డను నర్థమును గలదు. స్నేహశబ్దార్థము దీపపక్షకే త్రాయఁబడి యున్నవి. అనుభవింపఁబడిన యనఁగాఁ బీల్చివేయఁబడిన మూఁకుడు గోని చమురు కలది యని దీపపర మగునర్థము. "దశాంత ముపేయివాన్" అనఁగా బాల్య యౌవన వార్ధకాది దశల యంతమును బొందె నని దశరథపర మగునర్థము. దశయన వత్తి యను నర్థము గలదు, గాన వత్తియొక్క యంతముం బొందెన నని దీపపర మగునర్థము. "ఆసన్ననిర్వాణః" అనఁగా సమీపించిన ముక్తిగలవాఁ డని దశరథపర మగునర్థము. నిర్వాణశబ్దమునకు దీపము నిప్పులోనగునది చల్లాఱిపోవుట యనునర్థమును గలదు గానఁ జల్లాఱిపోవుట సమీపమునఁ గలది యని దీపపర మగు నర్థము. ఇటువలి కావ్యములందు శ్లేషలు మెండుగాఁ గలవు.

నాటకములందు.

కావ్యములలో నాటకములు రమ్యములును బ్రౌఢములునై యున్నవి. ఇట్టి నాటకములందుఁగూడ శ్లేషలు కాన్పించుచున్నవి. కవిరాజశేఖరుఁ డగు కాళిదాసుని కవితనుండి యొక్క యుదాహరణము నిచ్చుచున్నాఁడను. విక్రమోర్వశీయమునుండి,

శ్లో॥ "సర్వక్షితి భృతాంనాథ దృష్టా సర్వాంగసుందరీ।
రామా రమ్యేవనాంతేస్మిన్ మయావిరహితాత్వయా॥"

ఇది తప్పిపోయిన యూర్వశిని బురూరవుఁడు వెదకు సందర్భములోనిది. ఈమెను వెదకివెదకి విరహముచే వివేకము చెడి యెదుటఁ గాన్పించిన పర్వతముం గని నీవూర్వశిం గంటివా యని ప్రశ్నింపఁ జొచ్చె. ఇవి పర్వతముకడఁ బలికిన పలుకులు గాన మరలనాపలుకులే ప్రతిధ్వని యిచ్చె. ఆప్రతిధ్వనిని బర్వతము తనకిచ్చిన సమాధానముగాఁబురూరవుఁ డెంచుకొనియె. కానఁ బ్రశ్నపరముగా నొకయర్థమును సమాధానపరముగా నొకయర్థమును నిందుఁ గలవు. ఎట్లన:—

సర్వక్షితిభృతాంనాథ=పర్వతరాజమా. (క్షితిభృత్తనఁ బర్వతము) మయా విరహితా=నాచే నెడఁబాటునందిన,సర్వాంగసుందరీ=సమస్తాంగములయందును సౌందర్యముగల, రామా=కాంత, రమ్యే=మనోహరమగు, అస్మిన్వనాంతే=ఈవనమధ్యమందు, త్వయా=నీచేతను, దృష్టా (కిం)=చూడఁబడినదా? అని ప్రశ్న. ఇదియే ప్రతిధ్వనిలో సమాధానమైనది. ఎట్లన=సర్వక్షితిభృతాంనాథ=సమస్త ప్రభుతల్లఁ జూడా (ఇట క్షితిభృత్తనరాజు) త్వయావిరహితా=నీచే నెడఁబాయఁబడిన, సర్వాంగసుం

దరీరామా=సమస్తావయవ సౌందర్యముగల కాంత, రమ్యే=మనోహరమగు, అస్మిన్ వునాంతే=ఈ వనమధ్యమందు, మయా=నాచేతను, దృష్టా=చూడఁబడినది.

"తత్రైవ ప్రతిశబ్దం కరోతి (సహర్షం) కథం యథాక్రమం దృష్టేత్యాహ" అని గ్రంథమునందున్న వాక్యములంబట్టి కవి శ్లేషింప నెంచినట్లు స్పష్ట మగుచున్నది.

బహునాటకములందు శ్లేషలు మెండుగాఁ గాన్పించుచున్నవి.

### ప్రాస్తావిక గ్రంథములందు.

నీతులు మున్నగువానిని బోధించు ప్రాస్తావిక గ్రంథములందుఁ గూడ శ్లేషలు మెండుగా శోభిల్లుచున్నవి. కవిరాక్షసీయమునుండి యొక యుదాహరణము నిచ్చుచున్నాఁడను.

"శ్లో. దుర్భృత్యో దురుపానచ్చ ప్రాప్తోపి స్నేహసత్క్రియామ్।
స్వామినః పదభంగాయ స్వకాఠిన్యేన కల్పతే॥"

దుష్టభృత్యుఁడును దుష్టోపానహమును (చెప్పులు) స్నేహసత్క్రియ కలిగినప్పటికి స్వకాఠిన్యముచేఁ దమ్ము నవలంబించిన వానికిఁ బదభంగము కలిగించును. అని దీని భావము. స్నేహసత్క్రియ యనఁ జనవుతోఁగూడిన సత్కారము, అని భృత్యపరమగునర్థము. చమురు పెట్టఁబడుట యని చెప్పుల పరమగునర్థము. పదభంగమన స్థానభంగమని భృత్యపర మగునర్థము. పాదములహాని యని చెప్పుల పరమగునర్థము.

### సర్వశ్లేష.

శ్లేషగల కావ్యములు పుట్టుటయేగాక కావ్యమునం దంతటను శ్లేషప్రధానముగాఁ గల గ్రంథములుకూడఁ బుట్టినవి. రాఘవ పాండవీయము, రాఘవ నైషధీయము మున్నగునవి యుదాహరణములు.

అదిగాక యనులోమ విలోమకావ్యములు కూడఁ బుట్టి యున్నవి. వీనియందుఁ బద్య మొకపెడనుండి చదివిన నొక యర్థమును నితర నొక పెడనుండి చదివిన నొక యర్థమును గలుగుచుండును. రామకృష్ణ విలోమకావ్యము, హరిశ్చంద్ర నలోపాఖ్యానము మున్నగునవి యుదాహరణములు. ఇట్టి చమత్కృతులు పాశ్చాత్యులందును గలవు. వానిని వారు అనగ్రామ్సు(Anagrams) అందురు.

ఈ విధముగా గీర్వాణ వాణియందు శ్లేషకవిత్వము బీజాంకురన్యాయముగాఁ బెరిఁగినది. వేదకాలముననఁ గతిపయపదములందు మాత్రమే ప్రకాశించి సూత్రకాల

మున వాక్యములలోనికిం దిగి పురాణకాలమున శ్లోకముల వ్యాపించి కావ్యకాలమున మొదలుఁ గొన్ని ఘట్టముల నలమికొని పిమ్మట గ్రంధములనే లోఁగొనినది. తుదకు ద్వ్యర్థులుఁ ద్ర్యర్థులుఁ జతురర్థులు వ్యాపించినవి.

ఆంధ్రవాఙ్మయమున.

ఇఁక నాంధ్రవాఙ్మయమును విమర్శింతము. తెలుంగనునది కవిశిఖామణియగు మాదయ్యగారి మల్లన చెప్పినట్లుగా "సరససంస్కృత పుష్పగుచ్ఛప్రభూత మగు నెత్తావి," కావునఁ బైదాని రీతినే యిదియు నున్నది. అందు వేదము మొదటిదైన నిందుఁ బంచమవేదము మొదటిది. ఈపంచమ వేదమునందు వాగనుశాసనుఁడును శ్లేషను గౌరవించి యున్నాఁడు ఒక యుదాహరణము నిచ్చుచున్నాఁడను.

"వ. కరిమకరనికరకరాఘాత జాతవాతోద్ధూత తుంగతరంగాగ్రసముచ్ఛలజ్జలకణాసారచ్ఛటాచ్ఛాదితగగనతలం బైనదాని నుద్యానవనంబునుం బోలె బహువిద్రుమలతాలంకృతం బైనదాని నాటక ప్రయోగంబునుం బోలె ఘనరసపాత్ర శోభిత రంగరమ్యంబైనదాని దినంబునుంబోలె నహిమకరభరితంబైనదాని మఱియు."

తిక్కన కవిత్వములో.

"వ. చని వివేక రహితు హృదయంబునుంబోలెఁదమోదూషితంబును, విదగ్ధ వనితాప్రేమంబునుంబోలె దుర్నిరూపంబును, ఘోరాటవీభాగంబునుంబోలె నిర్మనుష్యంబును, గుపురుషలక్ష్మీవిలాసంబునుంబోలె ననుపయోగ్యంబును, నసభ్యశాస్త్రంబునుంబోలె దుర్గమంబును, స్వప్నలబ్ధపదార్థంబునుంబోలె నదృష్టిగోచరంబును, విషమకావ్యంబునుంబోలె నస్పష్టాలంకారంబును, బాలిశురాజ్యంబునుంబోలె జారచోరహృద్యంబును నైన యానర్తనాగారంబు ముఖభాగస్థలంబు సేరి"— విరాట పర్వము.

తెలుఁగు కావ్యము లన్నియుఁ జాలభాగము శ్లేషలతో నిండియున్నవి. మిక్కిలి పౌఢులగు నాచనసోముఁడు, శ్రీనాథుఁడు, రామరాజభూషణుఁడు, పింగళి సూరన, పెద్దన మున్నగువారు విశేషముగా శ్లేషకవిత్వము చెప్పియుండిరి. సూరనాది పౌఢకవులు శ్లేషను గౌరవించుట యన సామాన్యముగాఁ జూడఁ దగినది కాదు. సరస కవివరుఁడగు సూరన శ్లేషకు మిక్కిలి ప్రసిద్ధి కెక్కినాఁడు.

ఇంతయేల. ఇది సంస్కృతమున నెట్లభివృద్ధిఁ జెందినదో యట్లె యిందును

(గ్రాసుబు), ద్వ్యర్థికావ్యములు (హరిశ్చంద్రనలోపాఖ్యానము, రాఘవపాండవీయము మున్నగునవి). త్ర్యర్థికావ్యములు (రాఘవయాదవపాండవీయము), చతురర్థికావ్యములు (యాదవరాఘవపాండవీయము) బయలువెడలినవి. అనులోమవిలోమ కావ్యములు మాత్రము పుట్టలేదు. అది యొక్క సంస్కృతభాషకే సాధ్యముకాని యితరభాషకు సాధ్యము కాదు. కావ్యము నంతను ననులోమ విలోమ పద్ధతిమీఁద వ్రాయలేకపోయినను గొందఱు కవులు కొన్ని పద్దెములను విరచించి యున్నారు.

## శుద్ధాంధ్రంబున.

శుద్ధాంధ్రంబునను శ్లేషచేఁ బ్రాయికముగా నలకంకరింపఁ బడిన కావ్యములు గలవు. రసికజనమనోరంజనాదు లుదాహరణములు. ద్వ్యర్థికావ్యములును బుట్టినవి. ధర్మన్న వ్రాసిన హరిశ్చంద్ర నలోపాఖ్యానము.

## ఇంగ్లీషులో.

ఇంక మనకుఁ బ్రస్తుతము రాజభాషయై యున్న యింగ్లీషుంగూర్చి ముచ్చటించుకొందము. ఇంగ్లీషునందును నొకశబ్దముచే రెండర్థములు తెలుపుట కలదు. అట్టి తెలుపుటలను మనకవులవలెనె యింగ్లీషు కవులును నలంకారములలోఁ జేర్చియుంచిరి. వారియలంకారములలో "పెరనుమేషియా" "పన్" అనునవి యొకవిధముగా శ్లేషాలంకారములై యున్నవి. ఇవి శ్లేషాభాసములు. మనలో నున్న రీతిశ్లేష వారిలోలేదు. సరీతిది కలదో దానిని గూర్చియే ముచ్చటించుకొందము. మనలో వేదమునందువలెనే పాశ్చాత్త్యులభాషలలో మొదట బైబిలుభాషలో శ్లేష కాన్పించుచున్నది. ఈవిషయమై సెంచరీ డిక్షనరీలో నిట్లు వ్రాయఁబడి యున్నది:—

"It is very common in the original languages of the Bible especially in the old testament."

దీనిని మిల్టను లోనుగాఁగల కవులెల్లరు వాడియుండిరి. పాశ్చాత్యకాళిదాసుం డగు షేక్సుపియరు మహాకవి కవిత్వ మంతయు శ్లేషతో నిండి యున్నది. ఈతఁడు తననాటకములలో శ్లేషను హెచ్చుగా వాడియున్నాఁడు. సంతోషముతో ముగియు నాటకములందును దుఃఖముతో ముగియు నాటకములందును గూడ శ్లేషను వాడి యున్నాఁడు. పూర్వ కవులెల్ల దీనినిఁ దఱుచుగా వాడిరి. ఈవిషయమై బెయిను దొరవారు తమ యలంకార శాస్త్రమున నిట్లు వ్రాసి యుండిరి:—

" But in our old literature it was quite common. In shakspearian, it was abundant in tragic as well as in comic writing and even Milton occasitionally uses it."

(కాని మనపూర్వగ్రంథములలో నిది సర్వసాధారణమై యున్నది. షేక్స్పియర్ గ్రంథములలో నిది సంతోషములో మరియు గ్రంథములందును విచారములో మరియు గ్రంథములందును గూడ విస్తారముగా నున్నది మిల్టను గూడ దీని నక్కడక్కడ వాడియున్నాడు.)

పశ్చిమదేశములం దీ శ్లేషాలంకారాభాసము (Pun) అరిస్టోటలు కాలము నుండియు వ్యాప్తిలోనున్నట్లు "అడ్డిసన్" అనునతడు వ్రాసియున్నాడు. అరిస్టోటలు క్రీస్తుపుట్టుటకు బూర్వము 384-322లో నుండెడివాడు. గొప్ప విద్వాంసుడు. ఈవిషయమై నేషనల్ ఎన్సైక్లోపీడియా (National Encyclopedia) లో నిట్లు వ్రాయబడియున్నది:—

" A sketch of the history of puns has been given by Addison in the paper above referred to, inwhich he traces the existance of the practice from the time of Aristotle downward."

పరికించిచూడ అరిస్టోటలు కాలముకంటె ముందే పశ్చిమదేశమున శ్లేషకలదని తెలియవచ్చెడిని. ఆధునికులలో లోకోక్తులు మున్నగువానియందు గూడ నింగ్లీషు వారు తఱచుగా శ్లేషనుపయోగింతురు. కాలదోషముపట్టిన యొక యప్పుంగూర్చి తన యప్పులవానితో షెరిడన్ ఇట్లు పలికెనట:—

"It is not my interest to pay the principal. Nor is it my principle to pay the interest.

Interest (ఇంటరెస్టు) అనుపదమునకు వడ్డి యనియు, లాభమనియు రెండర్థములు కలవు. Principle (ప్రిన్సిపిల్) అనినప్పుడు ధర్మమర్థము దానినే యించుక మార్చి Principal అనిన మూలధనమర్థమగును. ఈరెండుపదములును నిందు శ్లేషింపబడినవి. (మూలధనమిచ్చిన నాకు లాభములేదు. వడ్డినిచ్చుట నాపనికాదు. అని దీని భావము.)

ఒక మనుజు డెంతకాలము జీవించు ననగా " It depends upon the liver" అని సమాధాన మీయబడెనట. ఇట Liver అనుపదమునకు రెండర్థములు కలవు. దీనికి బిత్తకోశమనియు జీవించువాడనియు రెండర్థములు కలవు. కావున మనుజు

డెంతకాలము జీవించునన నయ్యాది "లివరు" ననుసరించియుండునన, జీవించువాని జీవనపద్ధతి ననుసరించి యుండునని యొక యర్థమును, బిత్తకోశము ననుసరించి యనఁగా శరీరప్రకృతి ననుసరించి యుండునని యొక యర్థమును దెలుగుచున్నవి.

గోల్డుస్మిత్తు అను నింగ్లీషు కవి సభలో మాటలాడుటకు జంకుచుండెడువాఁడు. ఈతఁ డొక్కనాఁడు సభలో మాటలాడఁబోయి "I conceive, I conceive, I conceive" (ఐ కన్సీవు, ఐ కన్సీవు, ఐ కన్సీవు) అని మూఁడు మాటలు పలికి తుదకు నేమియుఁ దోఁపక యూరకుండెనఁట. అప్పుడు సమీపమున నున్న జాన్సనను కవి "He conceived thrice but brought forth nothing" అనియెనఁట. ఇటఁ గన్సీవు (Concsive) అను పదము శ్లేషింపఁబడినది. కన్సీవన నాలోచించుట యనియుఁ గడుపుతో నుండుట యనియు రెండర్థములు కలవు. అట్లే "బ్రింగుఫోర్తు" అనఁగాఁ బిల్లను గనుట యనియుఁ గలిగించుట యనియు రెండర్థములు కలవు. ఇంగ్లీషు వారికి శ్లేషయందుఁగల యభిరుచిని దెల్పుట కిట్టి యుదాహరణములు వేనవేలు కలవు.

దీనినంతను బట్టి చూచిన శ్లేష యనాదిగా సర్వదేశములందును శ్లాఘింపఁబడుచున్న దనియు సారస్వతప్రక్రియలో నిదియొక్కటి యనియు దీని నలక్ష్యము చేయుటకు వలనుగా దనియు బుద్ధిగలవారి కందఱికిని దోఁపకపోదని తలంచెదను.

హుడ్డు దొర వ్రాసిన పద్యములు, థియొడోర్ హుక్కు వ్రాసిననవలలు మున్నగు గ్రంథములం దిది లెస్సగాఁ గలదు. బర్చి (Birch) అను నతఁడు శ్లేషను గూర్చి మంచివ్యాసము వ్రాసియున్నాఁడు. బర్చిదొర వ్యాసము చాల వివేకయుక్తముగ నున్నదని నేషనల్ ఎన్సైక్లోపీడియాలో నిట్లు వ్రాయఁబడి యున్నది:—

"We may also refer to another very clever paper in the "Guardian" (No. 36) attributed to a writer of the name Birch which contains what is called "A modest apology for punning."

## ఇతరభాషలయందు.

ఇతరభాషలందును శ్లేష యలంకారముగాఁ బ్రకాశించుచున్నయది. అఱవమునందును సంస్కృతమునందు నాంధ్రమునందు వలెనె శ్లేషకావ్యములు గలవు. (సముద్రవిలాసాదు లిందు కుదాహరణములు). మహారాష్ట్రాదులు నిట్టివియే. లాటినును, గ్రీకు మున్నగు భాషలయందుఁ గూడ శ్లేష విశేషముగ శోభించుచున్నదఁట. ఈవిషయమై అడిసన్ దొర తనవ్యాసములో నిట్లు వ్రాసినాఁడు:—

"Aristotle in the Eleventh chapter of his Book of Rhetoric describes two or three kinds of Puns, which he calls Paragrams, among the Beauties of good writing and produces instances of them out of some of the greatest Authors in the Greek Tongue. Cicero has sprinkled several of his works with Puns."

తురుష్కభాషయందుఁ గూడ నిది లెస్సగాఁ గల దని వినవచ్చుచున్నది.

దీనిం బట్టి చూడ శ్లేషాభాసములు గ్రీక్కుభాషలో ఆరిస్టాటిలు కాలమునకుఁ బూర్వమునుండియుఁ గలవని తెలియవచ్చుచున్నవి.

దీనింగూర్చి యిటీవలఁగలుగుచున్నయనాదరము.

పూర్వు లెవ్వరును దీని ననాదరభావముతోఁ జూచియుండలేదు. సంస్కృత కవులు తాము శ్లేషయమకచక్రవర్తుల మని గర్వముతోఁ జెప్పుకొనిరి. అలంకార శాస్త్రకారు లెల్లరును శ్లేష నొక గుణముగను నలంకారముగను వర్ణించిరి. శ్లేషచే నుజ్జీవింపఁబడిన వసుచరిత్రము ననుసరింపని తెనుఁగుకవు లిప్పటికిని లేరని చెప్పవచ్చును. హూణ విద్యనునేర్చి తన్మార్గముల నవలంబింప నభిలాషను బొందు నాధునికులుకూడ వసుచరిత్రశ్లేషను బూర్తిగా ననుకరించుచున్నారు. ఇందునకు రసికజనమనోరంజన ముదాహరణము. ఇయ్యది వసుచరిత్రము యొక్క వికారమే కాని మఱియొకటి గాదు. "పింగళి సూరన కవివరు శ్లేష...నీకె కలదా" అని కవులు శ్లేష నొక్క విశేషముగా వ్రాసికొనిరి. కవులుగాని కావ్యములుగాని శ్లేషను నిందించుట లేదు. ఇది పూర్వులపద్ధతి.

ఆధునికులలోఁ గొందఱు శ్లేషపై నకారణవైరమును బూనుచున్నారు. హూణవిద్యాలేశ మంటిన వారికిఁ గొందఱకిటీవల శ్లేషయందు నరుచి కలుగుచున్నది. అది శ్లేషయొక్కదోషము కాదు. ఇప్పటి పాశ్చాత్త్యులు కొందఱు శ్లేషయం దనాదరభావము కలవారై యుండుటచే మనవారికిని ననాదరభావము కలుగుచున్నది. అంతకంటెఁ గారణము వేఱొండు లేదు. పాశ్చాత్త్యుల కిటీవల దీనియం దరుచి కలిగిన దని సెంచరీ డిక్షనరీలో నిట్లు చెప్పఁబడి యున్నది:—

"Modern taste excludes puns from serious writing and speaking"

(ఘనభావ ప్రకటనార్థమై వ్రాయు వ్రాఁతల నుండియుఁ బలుకు పలుకుల నుండియు శ్లేషను దప్పించుట కిప్పటివారి కభిరుచి కలదు.)

సిడ్నేస్మిత్తుకూడ శ్లేషను నిరసించియున్నాఁడు. అడిసనుకూడ నట్లే చేసినాఁడు.

పాశ్చాత్యులకుఁ గల యిట్టియూహను బుచ్చుకొని మనవారును గొందఱిప్పు డిప్పుడు శ్లేషపై ధ్వజమెత్తుచున్నారు. కాని పాశ్చాత్యుల కట్టిభావము కలుగుటకుఁ గలకారణ మేమో యది యాలోచించుకొనరైరి. ఇది కడుశోచనీయము.

పాశ్చాత్యులు నిరసించుటకుఁ గలకారణము.

ఒక్కొక్క భాషయందొక విషయమున నున్నసౌష్ఠవము వేఱొక దానియం దుండదు. సమాసఘటనమునకు సంస్కృత మక్కఱకు వచ్చినట్లు మఱి యేయితర భాషయును నక్కఱకురాదు. గానమునకుఁ దెనుఁగు ముఖ్యము. మాటలాడుటకు హిందీసొంపుగ నుండును. అట్లె సంస్కృతమున శ్లేష వచ్చినట్లుగ నితర భాషల యందురాదు. ఇంగ్లీషున బొత్తిగారాదు. ఏమన:—(1) ఆభాషయందు నానార్థములు గలపదములు మిక్కిలి తక్కువ. కానవారి శ్లేషలు చాలభాగము సరియైనవి కావు. "సన్" అను నుచ్చారణము గల పదమును వారు శ్లేషింతురు. ఆశ్లేష పుత్త్రుఁడనియు సూర్యుఁ డనియు నర్థము వచ్చుటకై వాఁడఁబడును గాని పుత్త్రుఁ డన్నప్పు డాపదమునందున్న వర్ణక్రమము వేఱు (Son). సూర్యుఁ డన్నపుడు వేఱు (Sun). కావున విమర్శించి చూచిన శ్లేషయుండనేరదు. జీవుఁడు, చెప్పుటట్టయను నర్థద్వయమునకై "సోల్" అను పదమును వాడుదురుగాని జీవుఁ డన్నప్పుడున్న (Soul) వర్ణక్రమము చెప్పట్ట (Sole) యన్నప్పుడు లేదు. ఇట్టి వనేకములు కలవు. వారు ధ్వనిని మాత్రమే ప్రధానము చేసికొని శ్లేషింతురు. మనభాషలం దట్లు కాదు. నానార్థములు గలపదము లనేకము లున్నవి. కాన శ్లేషమనభాషలలో శోభించినట్లు వారి భాషలలో శోభింపదు. (2) మఱియు మనభాషలందుఁ బదమునకును బదమునకును సంధియుండుటచేఁ జక్కని శ్లేషలు కుదురును (మంజులాస్యలనినట్లు). ఇంగ్లీషునందు సంధిలేకుండుటచే నిట్టిశ్లేషలు పుట్టవు. (3) మనభాషలలో సమాసములు కలవు. అందుమూలముగాఁ జక్కని శ్లేషలు పుట్టును (క్షితిభృత్తనినట్లు). ఇంగ్లీషునందు సమాసములు లేకపోవుటచే నిట్టివి పుట్టవు. కాఁబట్టి భావౌన్నత్యమును వ్యక్తీకరించుటకు నింగ్లీషులోని శ్లేష తగియుండదు. మూఁడుపంతులు వక్రోక్తికి శ్లేష యాభాషయందు వినియోగించును; తదితరమునకుఁ బనికిరాదు. కావుననే Pun (శ్లేష) అనఁగా హాస్యోక్తి యని వీరునిఘంటువులలో వ్రాసికొనియున్నారు.

"An expression in which two different applications of a word present an odd or ludicrous idea"— Webster.

వారిలో శ్లేష హేళనమునకు వాడంబడును గాన ఘనభావమును దెల్పునపుడు (In serious writing and speaking) దానిని వాడఁగూడ దని వారు నిశ్చయించుకొనిరి. పన్ అనునది విషయమును గ్రిందుపఱచుట కక్కఱకు వచ్చునది యని వారితలంపు. మనలో నట్లుకాదు. భావముయొక్క యౌన్నత్యమును దెల్పుటకును శ్లేష యక్కఱకు వచ్చును. కావుననే శాస్త్రములందుఁగూడ నిది కాన్పించుచున్నది. మనలో శ్లేష ప్రత్యేకముగా నొక్కయలంకారమై యుండుటయే గాక యితరాలంకారముల ననేకముల నిది ప్రకాశింపఁజేయునదియై యున్నది. ఇంగ్లీషులో వక్రోక్తికి మాత్రమే యిది యక్కఱకు వచ్చును గాని మనలో నుల్లేఖాలంకారము, సహోక్తి, వక్రోక్తి, విరోధాలంకారము, వ్యతిరేకాలంకారము, ఉపమాలంకారము మున్నగునవి శ్లేషచేఁ బోషింపఁబడునవియై యున్నవి. కానఁ బాశ్చాత్యులను జూచి మనము శ్లేషను నిందించుట శోచనీయము. వారైనను నిందింపలేదు. వారిలో నున్నతభావముం దెల్పు శ్లేషలులేవు కావున నట్టితావున శ్లేషపనికిరాదనుకొనిరి. మనవమేధావు లన్ననో దానిపై విరోధమునే పూనిరి. శ్లేషకలదు గాన వసుచరిత్ర నింద్య మని యిప్పటి నవమేధావుల తలంపు! శ్లేష ఘనమైనది కాదని తలకింపు! పాశ్చాత్యులలో బర్చి మున్నగు పండితులు శ్లేషను జక్కఁగఁ గాపాడిరని యిదివఱకు వ్రాసియే యుంటిని. మనభాషలో శ్లేష యుత్తమ భావ గౌరవమునుగూడఁ దెల్పునది కావుననే శ్లేషకు గర్భశత్రువులైన నవనాగరకులుకూడఁ దమ వ్రాఁతలందుఁ దెలిసియో తెలియకయో భావౌన్నత్యమును దెల్పుటకై శ్లేషను వాడుకొనియుండిరి. మ॥ రా॥ రా॥ వెన్నేటి రామచంద్రరావు పంతులుగారు శ్లేషను జాల నిరసించిరి గాని వీరు తమ మనువసుచరిత్రరచనావిమర్శనమున మొదటనే శ్లేషచేఁ దమ భావగభీరతను వెల్లడించిరి. విమర్శసముద్రమును దాము ధీవరుల సాహాయ్యముచే దాఁట నుద్యమించుచున్నామని వ్రాసికొనిరి. *ఇట ధీవరులనఁ బల్లెవాండ్రనియు విద్వాంసులనియు భావద్వయము కలుగుచున్నది. ఇది భావగభీరతను (Serious Writing) దెలుపునది కాదా? శ్రీరావుబహదురు కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమ రాజశేఖరచరిత్రమునకు మొదటనే యొక ఘట్టము నంతను శ్లేషచే నలంకరిం

---

*ఏతన్మహనీయకావ్యరత్నాకరముల విమర్శకు దొరకొనుట గంభీర తమంబగు నంభోధి లోఁతుఁ దెలియఁ దివురునట్టిద యైనను, ఆబాల్యముగ ధీవరులతోడి సాహసం గలిగిన చెలిమి కలిమి......నించుక దరియనన్నుఁ బురికొల్పినది.

చిరి. ఇదియు భావవిశేషమును దెలుపుటకే వ్రాయఁబడినది కాని హాస్యము కొఱకుఁ గాదు. కావున మనలో భావభిన్నతను దెల్పుటకు శ్లేషను జక్కఁగ వాడవచ్చునని దీనివలనఁ దెలియవచ్చుచున్నది. మనభాషలం దున్నట్టిశ్లేష యింగ్లీషులో లేకపోవుట దానిలోపముగాని మనలోపముగాదు.

## కళాసందర్భములో.

శ్లేష చమత్కారము గలది, రసికజనానందకర మైనది, లోకమున సహజ మైనది యని తెల్పుట కిం కొకమార్గము కలదు. కవిత్వమునకు బహువిధముల చిత్రలేఖనము సోదరకళ యై యున్నది. చిత్రలేఖనమును పాశ్చాత్యపండితులు మూకకవిత్వమని పలికియున్నారు. మనవారును నిట్టి భావమునే తెలిపియుండిరి. కానఁ జిత్రలేఖనమున శ్లేషయున్నదో లేదో విమర్శించుకొందము. పరికించిచూడఁ జిత్రలేఖనమందు శ్లేషలు కాన్పించుచున్నవి. కావ్యములందువలెనే యిందును సంపూర్ణశ్లేషలు, ఏకదేశశ్లేషలు, అనులోమవిలోమశ్లేషలు, ద్వ్యర్థులుఁ త్ర్యర్థులుఁ గాన్పించుచున్నయవి. ఈశ్లేషలు మిక్కిలి నాగరకు లగు పాశ్చాత్త్యులు వ్రాసినచిత్రములందును గానిపించు చున్నవి. ఇందుశ్లేష యనఁగా నొక బొమ్మచే రెండుమూఁడు రూపములు వ్యక్తమగుట యని తెలిసికొనవలయును. శ్లేషయనఁగూడిక యని కదా యర్థము. రెండు చిత్రములొక్కచో శ్లేషింపఁబడిన నది చిత్రశ్లేష (బొమ్మలశ్లేష) యగును. ఈప్రక్కపటమున సంపూర్ణశ్లేష యీఁబడినది. (చూడుడు. పటము I) ఇది యింగ్లాండు దీవిని నొక మానవుని నొక చిత్రముచేతనే బోధించుచున్నది. దీని నొక ద్విచక్రికల (Bicycles) విక్రయించువారు తమప్రకటన పత్రికలలోఁ బ్రకటించుకొనిరి. ఇట్టివారు ప్రకటించుట లోకము నాకర్షించుటకే కదా! వీరు లోకుల నందఱి నాకర్షించుటకై శ్లేషగల యీచిత్రపటమును బ్రకటించిరి. వీరు హామక్కు కంపెనీవారు. ఏకదేశశ్లేష కుదాహరణముగఁ జిత్రపటకారుఁడు నందితలను నేనుఁగుతలను గలపిన పటమును దీసికొనవచ్చును. దానికి హరిహరభేట యని పేరు. అందు నందియొక్కయుఁ గరియొక్కయు శిరస్సులకడ శ్లేషకలదు. మఱియు ననులోమ విలోమశ్లేషలకును జిత్రలేఖనములనుండి వేనవేలుదాహరణములు కలవు. పాశ్చాత్త్యులచే వ్రాయఁబడిన యొక పటమునం దొక పెడనుండి చూచిన వృద్ధునితలగాను, నింకొక పెడనుండి చూచిన బాలునితలగాను గాన్పించును. ఇవియే యనులోమ విలోమములు. మఱియును బ్రవీణులగు పాశ్చాత్త్యులు వ్రాయు చిత్రలేఖనములలో విశేషములు చాల


SCOTLAND.
IRELAND.
ENGLAND.
WALES.

కలవు. చెన్నపురియందుఁ గల శ్రీవిజయనగరము మహారాజుగారి మందిరమున నొకచిత్ర పటమున్నది. అది ప్రకృతిని (Nature) దెల్పుపటము. అదియొకపెడనుండి చూచిన వసంతకాలమును నింకొక పెడనుండి చూచిన గ్రీష్మకాలమును మఱియొక పెడనుండి చూచిన శిశిరమును దెల్పుచుండును. ఈవిధముగా మూఁగ కవిత్వములో శ్లేషలుండి యవి జనుల రంజింపఁజేయుచున్నవుకు కవిత్వములో నవి యేలరంజింపఁజేయవు.

## అక్షరశ్లేషలు.

అక్షరశ్లేషలు కూడఁ గలవు. అవి ప్రాజ్ఞులగువారి నెల్ల రంజింపఁజేయుచున్నవి. వాని కింగ్లీషున "మానోగ్రామ్సు" (Monograms) అందురు. ఇట్టి శ్లేషలెల్లఁ గోవిదులకు మోదమును గూర్చుచుండఁగాఁ గవిత్వమునందలి శ్లేషలు మాత్రము ప్రాజ్ఞుల కేల యానందముం గూర్పవు?

## శ్లేషయొక్క యౌచిత్యము.

లోకము శ్లేషలతో నిండి యున్నది. శ్లేష యానందదాయకమునై యున్నది. సమస్తభాషలందు నిది యలంకారముగాఁ దీసికొనఁబడినది. ఈవిషయమై అడిసన్ దొరవారే యిట్లు వ్రాసిరి:—

"All the writers of Rhetoric have treated of punning with very great respcet, and divided the several kinds of it into hard names, that are reckoned among the figures of speech, and recommended as ornaments in discourse."

శ్లేషలుండవలసినదే గాని యవి యుచితముగా నుండవలె నని కొందఱన వత్తురు. అది సత్యమే. ఔచిత్య మొకశ్లేషకే కాదు. సమస్తమునకు నుండఁ దగినదియే. ఔచిత్యమును దప్పిన సమస్తమును రసవిహీనమై పోవును. ఇంగ్లీషులో శ్లేష యల్పపాత్రములనోటఁ బెట్టఁబడు నని మనవారు కొందఱు తలంచుచున్నారు. అది తప్పు. మహాకవి యగు షేక్స్పియరు మిగుల వైదుష్యము కల హామ్లెట్టు నోట శ్లేషలు పెట్టియున్నాఁడు. షేక్స్పియరు తన వైదుష్యము నంతను హామ్లెట్టు ద్వారముగా వెల్లడించినాఁ డనియు హామ్లెట్టే షేక్స్పియర్, షేక్స్పియరే హామ్లెట్టనియు విమర్శకులు నుడువుచున్నారు. అట్టి ప్రౌఢుఁడగు హామ్లెట్టు నోటఁ దఱుచుగా శ్లేషలు పెట్టఁబడెను గాన శ్లేష సరసులు తృణీకరింపఁ దగినది కాదు.

షేక్స్పియరు మొదట వ్రాసిన గ్రంథములను మాత్రమే శ్లేషను వాడినాఁడనియుఁ దరువాత ప్రౌఢత్వము ముదిరిన పిమ్మట మానినాఁడనియుఁ గొందఱు వచింతురు. అదియు సరికాదు. అతఁడు తుదిని వ్రాసిననాటకములందును నిది కలదు. శ్లేష యెట్లుండినను శోభించును.

సర్వవాఙ్మయము లందును శ్లేషలు కలవు. వానిని ప్రౌఢులు వ్రాయుచున్నారు. ప్రౌఢులు మెచ్చుకొనుచున్నారు. కావున వాఙ్మయమున శ్లేష యుండఁ దగినదియే. కాన వాఙ్మయము నభివృద్ధిచేయఁదలఁచినవారు శ్లేషనే నిందించివేయక యది యెట్లుండిన సరసముగా నుండునో యెట్లుండిన సరసముగా నుండదో తెల్పఁ దగి యున్నది గాన నొకింత యీవిషయమై కూడ నిందు ముచ్చటించుకొందము.

కవులు కొందఱు శ్లేషలు వ్రాయుటయందలి యభిలాషచే సందర్భములేని శ్లేషలంగూడ వాడుచు వచ్చిరి. అయ్యవి యవలంబనీయములు కావు. బాణాదుల శ్లేషలం దిట్టివి కలవు. బాణమార్గము ననుసరించి నన్నయభట్టు, తిక్కన చెప్పిన యీక్రిందిశ్లేషలు రమ్యమైనవి కావు. సముద్రమును వర్ణించుచు నన్నయభట్టు "నాటకప్రయోగంబునుం బోలె ఘనరసపాత్ర శోభితరంగ రమ్యంబై" యని వర్ణించె. ఇది సరసమగుశ్లేష కాదు. ఏమన, సముద్రము నాటక ప్రయోగమువలె నున్నదనుటలో సారస్యములేదు. కేవలశబ్దములచేతనే యీపోల్కి గలిగినదిగాని నిజమైన పోల్కి యింతయు నుండి కాదు. శ్లేషవచ్చుట కయియే సముద్రము నాటకప్రయోగమువలె నున్నదని వర్ణింపఁబడినది. కాన నిది మంచి శ్లేష కాదు. అట్లనే తిక్కన నాట్యశాలను వర్ణించుచు "విషమకావ్యంబునుం బోలె నస్పష్టాలంకారంబును" నని చెప్పినది మంచిశ్లేషకాదు. ఉభయార్థములకును సందర్భమున్నదేదో యది మంచి శ్లేష. ఇందులకుఁ బైఁ జెప్పఁబడిన రఘువంశశ్లోక ముదాహరణముగాఁ దీసికొన వచ్చును.

ఆసన్న నిర్వాణుఁడైన జీవుఁడు (దశరథుఁడు) ఆసన్ననిర్వాణమైన దీపమువలె నున్నాఁడని కవి వర్ణించి యున్నాఁడు. ఇది సర్వవిధముల సరసముగా నున్నది. సాధారణముగా జీవమును దీపముతోఁడను వెలుఁగుతోఁడను బోల్చుచుందురు. నరుఁడు మృతినొందిన దీప మాఱిపోయిన దందురు. పల్వురు కవులు దీపముతోఁ బ్రాణమును బోల్చియున్నారు. కాళిదాసునివలెనే కవి రాక్షసుఁ డిట్లు వర్ణించి యున్నాఁడు:—

"శ్లో॥ క్షీణస్నేహా నిశాంతేషు ముంచన్ స్వాంజనసంహతీః।
ఆత్మనాశ్యాత్తరుచిర్యోగీ నిర్వాణం యాతిదీపవత్॥"

ఇట్టి యుదాహరణము లనేకములు కలవు.

ఇంగ్లీషు కవులును గ్రిందిరీతిగా దీపముతోఁ బోల్చియున్నారు:—

"To husband out life's taper at the close
And keep the flame from working by repose."—Goldsmith

"My anxious day to husband near the close and keep lifes' flame"—Goldsmith.

"One life–a little gleam of time between two sterinties"–Carlyle

"I warmed both hands against the fire of life;
It sinks, and I am ready to deport"—Seandor

"Tis the sun set of life gives me mystical lore."—Capmbell.

ఇంగ్లీషులో "A dying lamp" అందురు. చచ్చిపోవు దీపమని దీని యర్థము. జీవుని దీపముతోఁ బోల్చుటచేతనే కదా! దీనింబట్టి దీపముతో జీవమును బోల్చుట లోకులకు సహజ మని తెలియవచ్చుచున్నది. కానఁ గాళిదాసుఁడు దశరథ నిర్వాణమును దీపనిర్వాణముతోఁ బోల్చుచు శ్లేషించుట మిక్కిలి సరసముగా నున్నది. శ్లేష లెప్పుడు నిట్లుండవలెను. ప్రతివిషయమును దానియుపయోగమును దెలిసికొని తగురీతిని వాడుకొనిన నయ్యది బాగుగా శోభించును. లేకుండిన హాస్యాస్పద మగును. పద్యమునకుఁ జేయఁబోవు రెండుమూఁ డర్థములును నాపద్యమున్నతావునఁ దగి యుండిన నాశ్లేష శోభించును. అట్లుకాక యొకటి సందర్భించి యింకొకటి సందర్భశూన్యముగ నుండిన నయ్యది శోభింపదు. ఎట్లన:— ప్రౌఢకవితల్లజుం డగు రామరాజ భూషణుఁడు తన వసుచరిత్రములోఁ దిమ్మవిభుని వర్ణించుచు నిట్లు వ్రాసి యుండెను:-

"సీ. ధాత్రీశ్వరులుగాని ♦ ధాత్రీశ్వరులుగారు, పుడమి వారనుభూతి ♦ భూతిగతుల
మానవేంద్రులుగాని ♦ మానవేంద్రులుగారు, పోల్కి నయాభోగ ♦ భోగరుచుల
రాజహంసలుగాని ♦ రాజహంసలుగారు, సరి సత్కళాసార ♦ సారరుచుల
నరపుంగవులుగాని ♦ నరపుంగవులుగారు, తరమెన్న వరధర్మ ♦ ధర్మభృతుల
జగతి నీమేటి కని నృపుల్ ♦ వాగడ నెగడె, నేబిరుదరాయరాహుత్తా ♦ హితవధూభు
జంగబిరుదాంక పుంఖిత ♦ సమరవిజయు, కాహళుఁడు తిమ్మవిభుఁడాజి ♦ దోహళుండు."

ఇందు సందర్భము లేనిదేదియును లేదు. తిమ్మవిభుని విద్యను నైశ్వర్యమును దీసికొనిన నతనితో సమానులు భూమిపై నున్న రాజు లెవ్వరును లేరు. ఆబ్రహ్మయు రుద్రుడును గావలెను. అని మొదటి పాదముయొక్క భావము. కావున రెండును సందర్భించియే యున్నవి. అట్లనే తక్కిన మూడుపాదములును శోభించుచున్నవి. కాని యిట్టి పద్యములనుబట్టి తానును నిట్టి పద్యముల విరచింపనెంచి భానుమతీ పరిణయకారుడు పురమునంగల మేడల వర్ణించు సందర్భములో నిట్లు వ్రాసి యున్నాడు:-

"సీ. పద్మరాగ ప్రదీ ♦ ప్తంబు లైనవి గాని, పద్మరాగ ప్రదీ ♦ ప్తములు గావు
మంజులహారికదం ♦ బంబు లైనవిగాని, మంజులహారికదం♦బములు గావు
రాజీవనయనచి ♦ త్రంబు లైనవిగాని, రాజీవనయన చి ♦ త్రములు గావు
ఘనపుష్పవిభ్రమా ♦ కంబు లైనవిగాని, ఘనపుష్ప విభ్రమా♦కములుగావు
కనుగొనగ నద్భుతంబులు♦గాగ నిట్లు, విమల కనులాకరంబులై ♦వినుతిగాంచెఁ
గాంచనాచల శిఖర ప్ర♦కాశ సహిత, మహితహేమంబులైనధా♦మంబు లచట."

ఇందు మేడలు మేడలే కాని సరస్సులు కావని తేలుచున్నది. కాన నిందు సందర్భము లేదు. మేడలు సరస్సులు కావని చెప్ప నవసరము లేదు. మేడలు సరస్సులును గావు. అట్లు తలచు వెఱ్ఱులు లోకమున లేరు. కవి తన శబ్దచాతురిచే సంబంధమును గలపెనేగాని నిజముగా సంబంధము లేదు. గాన నిందలి శ్లేష విరసము. ఇట్టి శ్లేషలను జెప్పుట ప్రౌఢతకాదు. శబ్దసాదృశ్యముచే సందర్భము లేని వానికి సందర్భమును గలపుట హాసాదులందు శోభించును. అంతియకాని యితర విషయములలో శోభింపవు.

## శ్లేషయొక్క యుపయోగము.

తక్కువమాటలతో సరసముగా నెక్కుడు భావమును గలిగించుటకును, కవికల్పనలను స్వభావసిద్ధముచేసి మెఱుంగు దెచ్చుటకును జాల వినియోగించును. చదువరుల మనంబుల నద్భుతానందములఁ గూరుచును. శ్లేషతక్కువమాటలతో నెక్కుడర్థమును మనోహరముగాఁ జెప్పును గావుననె రామరాజభూషణుఁడు తాను ద్వ్యర్థికావ్యమును వ్రాయుటకుం గల కారణము నిట్లు చక్కఁగాఁ దెల్పియున్నాఁడు:—

"శా" కౌంతేయాగ్రజ యింతచింత మదిలోఁ ♦ గావింపఁగానేల మీ
సంతాపంబు లడంచు నాహరి, హరి♦శ్చంద్రుండు మున్నింతకు

స్వాంతంగుందఁడె, వైరసేనియు విప•ద్వారాశిలోఁ గ్రుంకఁడే
సంతుష్టాత్ములు గారె వారు పిదప• స్సంప్రాప్తసామ్రాజ్యులై.

కం. అనవిని యాయిరువుర కథలును దెలుపుము నాకు నఖిలలోకజ్ఞయన
న్మునిరాజు భానుసమధాముని రాజుంజూచి మోదము మది నొప్పఁదలఁక.

ఉ. వారిచరిత్రము ల్భువనవర్ణ్యములైనవి వేత్రపేర్కొన
న్నారె జపార్చనా సమయ•సంగతి తప్పెడుఁగాన నిప్పుడో
భూరివివేక యానృపుల•పుణ్యకథల్ బదశక్తి నొందుగాఁ
గూరిచి తెల్పెదఁక దెలిసికొమ్మని నేర్పడలిర్ప నిట్లనుక."

నిరోష్ఠ్యముగ వ్రాయుటకు దండి చమత్కారము గల కారణమును దెల్పినాఁడు. ద్వ్యర్థికావ్యమును వ్రాయుటకుఁ గల చక్కని కారణమును రామరాజభూషణుఁడు తెల్పినాఁడు. తక్కినవారు గ్రుడ్డిపాటగా శ్లేషను దెల్పుకొనిపోయిరి. రామరాజభూషణుఁడు తీసికొనిన కథ శ్లేషయుండిన మిక్కిలి రమ్యముగా నుండునదియై యున్నది. కాన నాతని శ్లేషకవిత్వము సర్వవిధములఁ దగియున్నది. శ్లేషయొక్క యుపయోగాదులును వానికుదాహరణములు నీక్రింద వివరింపఁబడి యున్నవి.

(1) అస్వాభావికముగాఁ గాన్పించు కథల స్వాభావికము చేయుటకు—(వసుచరిత్రము.)

(2) ఒక్కపోల్కిగల కథలఁ జమత్కారముగా నొక్కటఁ దెల్పుటకు—(రాఘవపాండవీయము.)

(3) *శత్రువుల గూఢముగాఁ దిరస్కరించుటకు—(లంకావిజయము, ఖలకర్ణవిషాయనము.)

---

* తిరస్కరించుటకు శ్లేషవినియోగించునని పాశ్చాత్యులును నుడివిరి. వారివాక్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

"Since it is not always permissible to degrade a person or thing by open vituperation or depreciatory adjuncts, some disguise or redeeming ingenuity is sought out, and the forms of wit are well adopted forthe purpose. An anecdote related by Bacon is anapt illustration. Mr. Popham (afterwards, Lord Chief Justice Popham,) when he was Speaker and the House of Commons had sat long and done in effect nothing, coming one day to Queen Elizabeth, she said to him, "Now, Mr. Speaker, what hath passed in the Commons' House"? He answered "If it please your majesty, *seven weeks*," Without this play upon words, the Speaker could not have dared to reproach the House for their proceedings.'

(4) విరుద్ధాంశములను నొక్కటిఁ బ్రౌఢముగాఁ దెల్పుటకు—(శృంగార వైరాగ్యములం గూర్చిన శతకము.)

(5) చదువ నింపుగా నుండని విషయములు మనోహరములుగాఁ దెల్పుటకు—(లోలంబరాజీయము.)

(6) మనోహరముగా నీతుల మనసున కెక్కించుటకు—(కవిరాక్షసీయము.)

(7) చమత్కారమునకు—(సుమనోభిరంజనాదులు)

మనలో గొప్పవారిం దిరస్కరించుటకుఁ బైనిఁ జూపినరీతి కావ్యములే కలవు.

## రసములు.

మనలోని శ్లేషకావ్యములచే నీక్రిందిరసములు వ్యక్తీకరింపఁబడుచున్నవి. పాశ్చాత్యులలో హాస్యము మాత్రమే యుండును.

(1) శృంగారరసమును వెలయించు శ్లేషకావ్యములు— వసుచరిత్రాదులు, అచలాత్మజాపరిణయాదులు.

(2) వీరరసమును ,, ,, రాఘవపాండవీయాదులు.

(3) కరుణారసమును ,, ,, హరిశ్చంద్రనలోపాఖ్యానాదులు.

(4) హాస్యరసమును ,, ,, ఖలకర్ణవిషాయనాదులు.

(5) శాంతరసమును ,, ,, వైరాగ్యమును శృంగారమును గలశతకము.

కవి యూహలు మిక్కిలి చిత్రములుగా నుండును. ఒకప్పుడు జడపదార్థములను జీవపదార్థములఁ జేయును. జీవపదార్థములను జడపదార్థములఁ జేయును. ఉన్నవానిని లేనివానినిగాఁ జేయును, లేనివాని నున్నవానిం జేయును. కావుననే మనవారు కవిని రెండవబ్రహ్మగా వర్ణించి యున్నారు. ఒక యుదాహరణము నిచ్చుచున్నాఁడను.

"శ్లో. నామరూపాత్మకం విశ్వం దృశ్యతే యదిదం ద్విధా
తత్రాద్యస్య కవిర్వేధా ద్వితీయస్య చతుర్ముఖః,"—సభారంజనశతకము.

కవిజ్ఞానము సర్వజ్ఞుని జ్ఞానమును గూడ మించినదని కవులిట్లు వర్ణించిరి:—

"శ్లో. జానాతేయం నచంద్రార్కౌ జానతేయం నయోగినః
జానీతేయం నభర్గోపి తజ్జానాతి కవిస్స్వయమ్."—సభారంజనశతకము.

షేక్స్పియరను మహాకవి కవి నిట్లు వర్ణించియున్నాఁడు:—

" The poet's eye in a fine frenzy rolling,
" Doth glance from heaven to earth, from earth to heaven;
" And as imagination bodies forth,
" The froms of things unknown, the poet's pen,
" Turns them to shapes and gives to airy nothing.
" A local habitation and a name."

ఇట్టి చమత్కృతిగల కవియొక్క యద్భుతకల్పనలను స్వాభావసిద్ధము చేయుటకు శ్లేష చాల వినియోగించును. ఇందుల కొక యుదాహరణము నిచ్చుచున్నాఁడను.

కవులు చేతనములేని నదులు పర్వతములు మున్నగువానిని స్త్రీలుగను బురుషులుగను వర్ణించి వానికి భార్యాభర్తృ సంబంధము కలిగించి యున్నారు. మన కవులు నదులను స్త్రీలనుగా వర్ణించియున్నారు. ఇంగ్లీషు కవులు వీనిని బురుషులుగను స్త్రీలుగను గూడ వర్ణించియుండిరి.

" Oh, Tiber! father Tiber!
To whom the Romans pray,
A Roman's life, a Roman's arms.
Take those in charge this day."—Macaulay's Horatius.

ఇట్లు వర్ణించుటలో మనకవులకు శ్లేష చాల సాయమొనరించినది. ఈ విచిత్ర కల్పన చేయుటలో వసుచరిత్రకారుఁడగు రామరాజభూషణుఁ డందఱను మించినాఁడు. ఈతనిచేతులలో శ్లేష పరిపూర్ణదశ నందినది. ఈతని శ్లేషకావ్యమువంటి శ్లేషకావ్యము లోకములో మఱియొకటి లేదు. ఈతని తరువాతి కవులెల్లఁ బ్రబంధరచనములో నీతని ననుకరించిరి.

చిత్రలేఖకులును వర్ణముల (రంగుల) నాధారము చేసికొని నదుల స్త్రీలఁగా వర్ణింపఁ బాటుపడిరి. కవులును వర్ణముల (అక్షరముల) నాధారము చేసికొని నదుల స్త్రీలనుగా వర్ణింపఁ బాటుపడిరి. కాని తమ యుద్యమములలోఁ గవులు నెగ్గినట్లు చిత్రకారులు తామెంత ప్రౌఢులైనను నెగ్గలేకపోయిరి. ఈయుద్యమములోఁ బూర్తిగా జయము నందిన కవి రామరాజభూషణుఁడు. ఈతని కీజయము నొసంగినది శ్లేష.

ఈతఁడు శుక్తిమతీనదిని స్త్రీగా వర్ణించినాఁడు. ఆవర్ణనము నదీపరముగాఁ దీసికొనిన సరిగ నదీపరమై చదువరుల కన్నులయెదుట నొకనదినిఁ దెచ్చిపెట్టుచున్నది. స్త్రీపరముగాఁ దీసికొనిన సరిగ స్త్రీపరమై పాఠకులయెదుట స్త్రీని దెచ్చిపెట్టుచున్నది. చూపఱకు నదిగాఁ జూచినపుడు నదీలక్షణములే కాన్పించుచున్నవి కాని స్త్రీలక్షణములు కాన్పించుట లేదు. స్త్రీగాఁ జూచినప్పుడు స్త్రీగానె కాన్పించుచున్నది గాని నదిగాఁ గాన్పించుట లేదు. నదిని స్త్రీగా వర్ణించుటలో, వరునిఁగూడుట, గర్భము ధరించుట, పిల్లనుగనుట మున్నగు చేష్టలన్నియు వర్ణింపఁబడి యున్నవి. ఇన్ని విషయములందును గూడ నదీపరమగు నర్థము తీసికొనిన సరిగ నదీపరమగు నర్థమే కలుగుచున్నది. స్త్రీపరమగు నర్థము తీసికొనిన సరిగా స్త్రీపరమే యగుచున్నది. కావున శ్లేషమూలమునఁ గథ యసందర్భముగాఁ గాన్పించుట లేదు. శుక్తిమతీకోలాహలుల శృంగారచేష్టావర్ణనము స్వభావసిద్ధముగానే కాన్పించుచున్నది. శ్లేష తగిన తావున నేప్పుమీఱ వ్రాసిన నెంతవిశేషము పుట్టునో కనుఁడు.

మనువసుచరిత్రరచనావిమర్శకాగ్రణులు తమ విమర్శనములో

"ఒకపర్వత మొకనదినిఁ జూచి మోహించి దానిఁ గౌఁగిలించుకొనెనని శృంగారకల్పన సేయునపుడు గాని, కవికిఁ గల శబ్దపాండిత్యముఁ జూచి మనము మెచ్చుకొనవలసినదే గాని, కావ్య ఫలమగు రసము మన మనోవీథులం బ్రమ్ముకొని తదనురూపావస్థలను మనమనస్సులకుఁ గల్గింపదుగదా?" అని యొక పిచ్చివ్రాఁత వాసిరి! రచన మనుజుఁడు వేయు వేషమువంటిది. వేషము రసమును బుట్టింపదేని నాటకరంగమునందుఁ బురుషుఁడు స్త్రీవేషము వేసికొని హావభావముల వ్యక్తీకరించుచున్నపుడు కావ్యఫలమగు రసము మనోవీథులఁ బ్రమ్ముకొని తదనురూపావస్థలను మన మనస్సులకుఁ గలిగింప కుండవలయును. అట్లు కలిగించుట లేదా? కలిగించుచున్నది. కావున నిదియుఁ గల్గించును, గల్గించుచున్నయది.

నవనాగరకులగు రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు వసుచరిత్రమును బాగుగాఁ జదువుకొనిరి. కోలాహలపర్వతము శుక్తిమతినిఁ జూచి మోహించి దానిఁ గౌఁగిలించుకొనెనని శృంగారకల్పన చేయఁబడియున్నదానిం బట్టి వారి మనస్సున రసము పుట్టినది. అది యెట్లు తెలియవచ్చిన దందురేని నాగరకత మీఱ వీరు వ్రాసిన రాజశేఖరచరిత్రములోఁ బ్రథమముననే వీరు గోదావరీనది

నాథుని వెదకి కొనుచు బయలు వెడలి సముద్రుఁడను నాథుని వరించి వానినిఁ దన శాఖారూప బాహువులతోఁ గౌఁగిలించుకొనినట్లు వర్ణించి యుండిరి. వసుచరిత్రము లోని పైవర్ణనము చదివినప్పుడు వీరి మనస్సున రసము పుట్టుటచేతనే కదా మరలఁ దాము దాని ననుకరించిరి. ఆవర్ణన మీక్రింద నీఁబడినది:—

“శ్రీనాసికాత్ర్యంబకము కడ కడుదూరమున నెక్కడనో పశ్చిమమున నొక్క యున్నత గోత్రమున(1) జనన మొంది, ఊర్మికాకంకణాదుల (2) మెఱుంగులు తుఱంగ లింపఁ దన జననమునకు స్థానమైన భూభృద్వర (3) పురోభాగముననే పల్లములంబడి జాఱుచు లేచుచుఁ గొంతకాలముండి......పిదప నవ్యక్తమధురస్వరంబులతో ముద్దులు గులుక శరవేగమునఁ (4) బరుగిడుచు, అటుపిమ్మట ఘనతరుల (5) చెంతఁజేరి...... వెలువడి విదర్భాది దేశములగుండఁ బ్రయాణములుచేసి......అంతకంతకుఁ దనగ భీరత (6) గానిపింప నాథుని వెదకి కొనుచు వచ్చి వచ్చి, యేగిరిని దూరమునుండి విలోకించి గోదావరి రసోత్తరంబుగా (7) ఘోషించుచు పాదమునం (8) బడి శిఖరంబున నధివసించు జనార్దనస్వామి దర్శనము చేసికొని తోడనే యచ్చటనుండి తనశాఖా రూపములయిన రెండు చేతులను జాచి సరసత (9) మీఱ నాథునిం గలియు భాగ్యము కాంచెనో యాధవళగిరి.”

కావున నదిని స్త్రీగా వర్ణించినపు డావర్ణనము ప్రౌఢముగా నుండునేని రసము పుట్టుననుటకు సందియములేదు. ఈవిషయమై బెయిను దొరగా రిట్లు వ్రాసిరి:—

“ Thus the powers of nature, as the **winds**— running streams, have been assimilated, in their operations, to living beings and fancifully endowed with will, purpose and feeling, so as to be recommended to our human sympathies.”

కానఁ జదువరుల మనోవీథుల రసము పుట్టుటకే నదులు పర్వతములు మున్నగు నవి నరులచర్యలవంటి చర్యలు కలవిగా వర్ణింపఁ బడునని బెయిను మున్నగు నింగ్లీషు ఆలంకారికులు కూడ నంగీకరించిరని తెలుచున్నది.

---

(1) పర్వతము, వంశము, (2) ఉంగరములు, కంకణములు, అలలు, జలబిందువులు, (3) రాజు, పర్వతము, (4) బాణవేగమున నీటి వేగము (5) పెద్దచెట్లు, గొప్పవారలు (6) గాంభీర్యము, లోతు (7) జలము, శృంగారాదిరసము. (8) ప్రత్యంతపర్వతము, పాదము. (9) సరసత్వము, రసముతోఁ గూడుకొని యుండుట.

చేతనము నచేతనముగాను నచేతనమును జేతనముగాను దిర్యక్కును మానవుని గాను మానవుని దిర్యక్కునుగాను వర్ణించిన రసమే పుట్టనియెడల రూపకాలంకారము, నుపమాలంకారము మున్నగునవి హాస్యాస్పదములై పోవును. ఏమన నీయలంకార ములు చేతనాచేతనాదుల కభేదత్వారోపాద్యాసులను సాదృశ్యాదులను గదా కల్పి గించును.

ఇక వసు చరిత్రకారు డెట్లు జనుప్రదముగా నదిని స్త్రీగా వర్ణించెనో బోధ పడుటకై వసుచరిత్రమునుండి యొక్క పద్యము నుదాహరించుచున్నాడను:—

"ఉ. వేణి చలింపఁ గంపితనవీన మృణాళ భుజాగ్ర కంకణ
శ్రేణినటింప లోలశఫరీనిబిరీసకటాక్షకాంతి వి
న్నాణము చూప హంసకగణక్వణనంబులు మీఱ సైకత
శ్రోణి వివర్తితాబ్జముఖశోభితయై కడుసంభ్రమించుచున్."

ఇందు రెండర్థములును సరిగను స్వభావ సిద్ధముగను వచ్చి యున్నవి. ఇట్లె గ్రంథమంతయుఁ జూచుకొనవలయును.

ఇఁకఁ జిత్రకార శేఖరుఁడగు రాజారవివర్మ యన్ననో గంగావతరణమును లిఖిం చుటలో గంగను స్త్రీగాఁ జిత్రింపఁబోయి తేలిపోయినాఁడు. ఏమన నీతని చిత్రపట ములో గంగలో నడుమ నొక్క స్త్రీయున్నటు లున్నది. కాని నదియే స్త్రీగా నున్న టుల లేదు. తీర్థమునకుఁ దీర్థముఁ బ్రసాదమునకుఁ బ్రసాదమునైనది. నది వేఱుగను స్త్రీ వేఱుగను గాన్పించుచున్నది. కాన రవివర్మ తేలిపోయె ననక తప్పదు. (చూ. పటము 2)

పై దాని నంతను బట్టిచూచినఁ బ్రౌఢులగువారు నేర్పుమీఱ నుచితస్థలమున శ్లేషను వాడిన నది యతిమనోహరముగా నుండి లోకము నానందమున ముంచునని తేలుచున్నది.

రామరాజభూషణుఁడు ప్రకృతియందుఁ గల యొక విచిత్రమును వర్ణింప నుద్య మించినాఁడు. అది యేదియన:—కోలాహలపర్వతము నంటి శుక్తిమతీనది ప్రవహించు చున్నది. ఈ ప్రవాహావేగముచేఁ గొంతకాలమునకుఁ గోలాహలగిరి కొంతయొఱఁగి శుక్తిమతిపైఁబడినది. ఆపడుటను శుక్తిమతిని మోహించి దానిపైఁ బడుటగా నిందుఁ గవి చాలమనోహరముగ వర్ణించినాఁడు. దీనినే ప్రౌఢులు మంచి కల్పన (Imagination) మందురు.

2 వ పటము. (250 పుట)



నుసలో శ్లేషపై (గల నిందలు రాసురాజభూషణుని కవిత్వమునం దసూయ కలవారిచేఁ గల్పింపఁబడిన కక్కిటి పురాణములు అవి సూకరింపఁ దగినవి కావు. పాశ్చాత్యులందలి యాక్షేపములును యుక్తిసమములు కావు. వారి శ్లేషలు నిజమైనవి కావనియు, వట్టి శ్లేషాభాసము లనియు నిరివఱకే వ్రాసియున్నాను. ఆశ్లేషాభాసముల నధిక్షేపించుటలోఁ గూడ విమర్శకులు తేలిపోయిరి. ఎట్లన:—

లోకములో జ్ఞానదేవతయొక్క యవతారమూర్తు లని చెప్పందగిన వివేకనిధులు (పాశ్చాత్యులందుఁ గూడ) శ్లేషల హెచ్చుగా వాడిరి. అంతటి జ్ఞానులు గౌరవించిన దాని నిందించుట యెట్లని ప్రశ్న వేసికొని అడిసనుదొర యిట్లు సమాధానము చెప్పియున్నాఁడు.

"After this short history of punning, one wonld wonder how it should be so entirely banished out of the Learned world, as it is at present, especially since it had found a place in the writings of the most ancient Polite Authors. To account for this, we must consider that the first race of Authors who were the great Heroes in writing, were destitute of all Rules & Arts of criticism ; and for that reason, though they excel later writers in Greatness of Genius, they fall short of them in Accuracy and Correction. The Moderns cannot reach their Beauties but can avoid their Imperfections."

దీనింబట్టి పశ్చిమదేశమున శ్లేషను వాడని యిప్పటి కవులకంటె శ్లేషనువాడిన పూర్వకవులు మిక్కిలి ఘనమగు మేధగలవారని అడిసనుదొర యంగీకరించినట్లు తేలుచున్నది. కాని మిక్కిలి ప్రాజ్ఞు లగు పూర్వులు విమర్శశాస్త్ర మెఱుఁగనివా రగుటచే వారు శ్లేషను వాడి రఁట! ఇప్పటివారు విమర్శ శాస్త్రజ్ఞులఁట! అందుమూలముచే శ్లేషను వాడరఁట! ఇది గొప్పవింత. ఏమన, విమర్శనములకు ధర్మము లెచ్చటినుండి వచ్చినవి. పూర్వకాలపు మహాకవులు వ్రాసిన వ్రాఁతలను బట్టియే కదా! అదిగాక యలంకారశాస్త్రము లన్నియు శ్లేషను గౌరవించిన వని అడిసను దొరవారే వ్రాసియున్నారు. అలంకారశాస్త్రకారు లెల్లరు మంచి విమర్శ జ్ఞానముకలవారు కారా? అట్లు కాకుండిన వారు శాస్త్రము నెట్లు నిర్మింపఁ గలిగిరి? మఱియును బశ్చిమదేశపు విమర్శకులలో ఆరిస్టోటలు ముఖ్యుఁడును ఘనుఁడునునై యున్నాఁడు గదా! అట్టి విమర్శకుఁడు గూడ శ్లేషను బహువిధముల నాదరించి యున్నాఁడే. దానికిఁ

గారణ మేమి? అదిగాక యాధునికులలోఁ గూడ బర్కి మున్నగు విమర్శకులు శ్లేషను గాపాడుచున్నారే. దీనిగతి యేమి? అదిగాక షేక్స్పియరు మున్నగు మహాజ్ఞానులు విమర్శ జ్ఞానము లేనివా రనుటయుఁ దప్పే. గొప్పవారికి మాత్రము ప్రమాదములు లేవా యందురేని నొకరిద్దఱికైనఁ బ్రమాద మగునుగాని లోకమునం గల ప్రాజ్ఞులెల్లరును వాడిన నది ప్రమాద మగునా? అదిగాక విమర్శకులు గౌరవించినపుడు ప్రమాదమెట్లు కాఁగలదు? విమర్శకులలోనె భిన్నాభిప్రాయములు గలవుగాన విమర్శజ్ఞానలోపముచే శ్లేషలు బయలు వెడలినవనఁ గూడదు. ఇప్పటి విమర్శకుల కొక విపరీతభావము కలిగిన దనవలెను. వీరిది విపరీత భావమననేల యందురేనిఁ, బ్రాజ్ఞుల హృదయ క్షేత్రమునందు శ్లేషసహజముగాఁ బుట్టునని అడిసను దొరయే యీ క్రిందిరీతి నంగీకరించినాఁడు:—

"It is indeed impossible to kill a weed which the soil has a natural disposition to produce. The seeds of punning are in the Mind of all Men and though they may be subdued by Reason, Reflection and good sense, they will be very apt to shoot up in the greatest genius that is not broken and cultivated by the rules of Art."

దీనిని బట్టి శ్లేషయందలి యభిరుచి మనుజునందు సహజముగా నుండునని అడిసనుగా రంగీకరించుచున్నట్లు స్పష్టమగుచున్నది. ఇఁక వీరు చేసిన ప్రయత్నమేమి? దానిని బలవంతముగాఁ దీసిపాఱవేయుట. ఇది మహాసాహసము. ఏమన. సమస్తదేశములందలి ప్రాజ్ఞులగు కవులును శ్లేషను గౌరవించిరి. మఱియు నలంకారశాస్త్రములను వ్రాసిన విమర్శకాగ్రణులును దీనిని గౌరవముతోఁ జూచిరి. ఇట్టి దానిని పట్టి కలు పనవచ్చునా? కవిహృదయక్షేత్రములందుఁ గలుపు పుట్టినను విమర్శకాగ్రణులు దాని ననుభవింతురా? ఎంతమంచి క్షేత్రమందైనఁ గలుపు పుట్టినఁ బుట్టవచ్చును గాని దానిని బ్రాజ్ఞు లనుభవించుచున్నారా? లేదు. ఇట, అరిస్టాటలు మున్నగాఁగల విమర్శకాగ్రణు లెల్లరును శ్లేషను మెచ్చి దాని ననుభవించిరి, గాన దానిని గలు పనఁ దగదు. కొందఱకు దానియందు రుచిలేక పోవచ్చును. అంతమాత్రముచే నది కలుపు కానేరదు. వరియన్నము భుజించువానికి గోధుమలు రుచింపక పోవుఁగాక. అంతమాత్రముచే నయ్యవి కలుపగునా! అట్లనే గోధుమలు తినువానికి వరియన్నము రుచింపక పోవచ్చును. దాన వరి కలుపగునా! కాదు. కాన శ్లేష

యందు రుచిలేనివారు దానిని స్వీకరింపకుందురుగాక. అది యనవసర మనియు నీచ మనియుఁ దలంచుట తప్పు.

ఇంకను బచ్చిక మున్నగు కలుపు ధాన్యాదులు పండు క్షేత్రములనుండి తొలఁగింపఁబడుఁగాక. మనస్సులకు వికాసముం గలిగించు నుద్యానములనుండి కూడ బొత్తిగాఁ దీసివేయఁబడునా? పచ్చిక పట్లెంత లోచన లోభనీయములుగా నుండునో యుద్యానములందు వానినెట్లు పెంచుదురో ప్రాజ్ఞులెల్ల రెఱింగిన విషయమేకదా! కానఁ గుక్షింభరిత్వ విషయములో శ్లేషలు కలుపే కావచ్చును. మనోమోదమును గూర్చు కళలవిషయములో నయ్యవి యుచితరీతి నుండఁ దగినవియే గాని వేఱుకాదు. కావుననే మిక్కిలి ప్రాజ్ఞులగు కవులు సమస్తదేశములందు వానిని మిక్కిలి ఘనతతోఁ జూచిరి. పశ్చిమమునం దొకకొందఱకు రుచింపకుండిన కారణమున శ్లేష నశింపవలసినది కాదు. కాన నాంధ్రలోకముచేఁ బ్రౌఢములగు శ్లేషకావ్యములు ప్రోత్సహింపఁబడుఁగాక! నీరసశ్లేష నిరసింపఁబడుఁగాక!! వసుచరిత్రమువంటి గ్రంథరాజము లనేకములు పుట్టుఁగాక.

ఓం తత్సత్.

కాశీభట్ట - బ్రహ్మయ్య.

---

## ఉత్తరలేఖ.

తురుష్కభాషలలోని శ్లేష:—ఈభాషలందుఁ బరిచయముగల తురుష్కమిత్రులొక్కరు చెప్పిన దానిని బట్టి యాభాషలందుఁ గల శ్లేషలఁగూర్చి యీక్రింది యంశములను వ్రాయుచున్నాను.

అరబ్బీ, పారసి, ఉరుదు భాషాలాక్షణికు లెల్లరును గూడ శ్లేష నొక్కప్రధానాలంకారముగాఁ జెప్పియున్నారు. మహమ్మదీయులు శ్లేషలేని కవిత్వముకంటె శ్లేషగల కవిత్వమునే హెచ్చుగా మెచ్చుకొందురు. తురుష్కుల పండితపరిషత్తునకు "ముషాయెరా" యని పేరు. మహమ్మదీయ ప్రభుత్వకాలమునందుఁ గవులెల్లరు నీసభలకుఁ బోయి తమ తమ కవిత్వ ప్రభావమును జూపుచుచుండెడువారు. ఆపరిషత్తులందు శ్లేషకవిత్వమే ప్రథమబహుమానార్హ మగుచుండెను. ద్వ్యర్థిప్రబం

ములు లేవు కాని కావ్యములందుఁ బెక్కురు కవులు శ్లేషనే నాయ్యమగునంతవఱకు గౌరవించుచు వచ్చిరి.

(1) చహార్ చమన్

(2) ఖజీనతుల్ వులూమ్.

(3) మెయారుల్ బలాగత్

(4) రిసాలయేసైఫీ.

మున్నగు లక్షణ గ్రంథములందు నీశ్లేషకవిత్వమునకు "సున్నతె అయోహాం" అనియు "జూమానీ" అనియు నామము నీఁబడియున్నవి. దీనియందు విశేష గౌరవమున్నట్లు "సున్నతే" అను పదమే తెలుపుచున్నది. శ్లేషకొక యుదాహరణ మీక్రింద నీఁబడియున్నది.

పద్యము. "బ ఆజేజర్ లిఖాహైబూ అలీనే
కె సోనేసే ముసాఫర్‌కు ఖతర్ హై"

(బూ అలీ యను కవి బంగారు నీటితో పాంథునకు "సోనేసే" అనఁగా (1) నిద్రవలన (2) బంగారమువలన) హాని యున్నది. అని (వ్రాసియున్నాఁడు.) అని దీని తాత్పర్యము. అనఁగా దారిని బోవువాఁడు నిద్రించినను ధనము వెంటఁగొని పోయినను హాని యున్నదని భావము. ఇందు "సోనేసే" అను పదము శ్లేషింపఁ బడినది. 'సోనేసే' నిద్రవలన అని యొక యర్థమును బంగారమువలన నని యింకొక యర్థమును గలవు. ఇట్టి యుదాహరణములు వేనవేలు గలవు.

అనులోమవిలోమకవిత్వముఁగూడ నిందుఁ గలదు. అది చార్ చమన్ మున్నగు లక్షణగ్రంథములందు "మఖలూబెముస్తవి" అని చెప్పఁబడి యున్నది.

పైదానివలనఁ దురుష్కభాషలందుఁ గూడ శ్లేష విశేష గౌరవమునందు చున్నట్లు తెలియవచ్చుచున్నది.

నాయుదాహరించిన వేదవాక్యముంగూర్చి.

వేదమునందు శ్లేషకలదనుటకై నేనొక వేదవాక్యము నుదాహరించి యున్నాఁడను. ఆవేదవాక్యమునకు నాచెప్పిన యర్థము కలదో లేదో యని యొకరు సందేహించిరంట. ఆహేతువుచే నావాక్యమునకు మాధవవిద్యారణ్య స్వాములవారు వ్రాసిన భాష్యము నీక్రింద నిచ్చుచున్నాఁడను.

"తత్తేజఉద్దిశ్య ఇంద్రవసనం ప్రజాపతి మబ్రవీత్ । హేప్రజాపతే ఏతత్తేజో మహ్యంప్రయచ్ఛ । అథాహం తేజస్వీసన్నేతేషాం దేవానామ ధిపతిర్భవిష్యామీతి । తతఃప్రజాపతి రిదమబ్రవీత్, ఏతత్తేజస్తుభ్యం ప్రదాయ కోహంస్యాం? అక్షమంమాం కోవాగణయే దిత్యభిప్రాయః । అథేంద్రఃప్రజాపతిం ప్రత్యబ్రవీత్ । కోహమిత్యత్ర "క" ఇత్యనేనశబ్దేన యదేతద్బ్రవీషీత్యేతదేవత్వం । అత్రయదేతదింద్రేణోక్తం తదేతద్వ్యక్తం । క ఇత్యేతస్య ప్రజాపతినామత్వాత్ । అత్రకింశబ్దః కశబ్దశ్చేతి మకారాంతాకారాన్తౌ ద్వౌశబ్దౌ తయోరుభయోరపి పుంలింగైక వచనం । క ఇత్యేవం రూపంవాబ్రూతే అకారాంతస్తు ప్రజాపతివాచకః । తత్ర మకారాంత మభిప్రేత్య ప్రజాపతిః ప్రాయుఙ్క్త । తేజోబలాదేవ ప్రాణినామపి గౌరవం । తస్మింశ్చతుభ్యం దత్తేసతి ప్రజాపతిత్వ గౌర వస్య గతత్వాత్కోనామాహంస్యా మితి ప్రజాపతిప్రశ్నః । నకోహంస్యామితి ప్రజాపతి త్వమేవ వినశ్యతీత్యాక్షేపః । ఇంద్రస్తు శబ్దచ్ఛలాదకారాన్తత్వ మాశ్రిత్య ప్రజాపతి రహంస్యామితి । యదేతద్బ్రూషే తదేతత్స్యాః ప్రజాపతిరేవ భవేత్యర్థః । నహితేజో నిమిత్తం తవప్రజాపతిత్వం ప్రజాజనకత్వం తేజసో అనుపాదానత్వాత్ । యతో అతేజ సోపి ప్రజాస్సృష్టత్వాత్ కింతుస్వాభావికం । అతస్తేజసిదత్తే తవస్వభావోనాపగచ్ఛతీ త్యబ్రవీత్ ॥"

ఇందు శబ్దచ్ఛలాత్ అనుటచేత శ్లేష యుద్దేశింపఁబడినట్లు స్పష్టమగు చున్నది. నేను జెప్పిన యర్థమే యావేదవాక్యమునకుఁ గలదని తెలియవచ్చు చున్నది.

కాశీభట్ట - బ్రహ్మయ్య.

---

# ప్రాఁ దెనుఁగుఁ గమ్మం *



సిరిఁదాల్చు ఱేఁడొగిఁ జిన్నిచూపుక్కులఁజూచు తెనుఁగుఁ జదువులరచ్చ తీర్పరులార!

గ్రిందనుగై వ్రాలు సేసిననేనయా! యఱఁగువ మెఱయుచు, నాయొప్పు కోలఁదిఁ, దెనుఁగుఁ జదువుల సుఱిచి, జానుమివులంగఁ, దొలి తెనుఁగు నుడులన, తేట తెల్లగను, విన్నపమొక్కంటు వినుపింతు మిమ్ము. మోడ్చియు నిరుచేయి, వ్రోఁకి రిలఁబడియు, నెఱఁగియుఁ గై వారమొనరంగఁజేసి, తద్దయు వేఁడుదు. నాలింపుడయ్యా. మీరపోలెను నేనుఁ బ్రాఁబొత్తములు సాలఁజదువులేన; యొకింత సదివితినేని, మీఁ పోలెను నేనుఁ బ్రాఁబల్కులను వ్రాయనేరనయితిన సామకోర్చి యెన్నడును. మీకుఁ బోలెన నాకు వ్రాయంగఁగాదేని, మీఱట్టులకు మాఱువల్కంగఁగాద, యని మీరు గడిఁదిగాఁ గట్టడిసేసితిరటె; యది నే వినియిదియల్లినాఁడఁ; గాకేను మీతోడ నెనసి తూఁగుదునె? మీరేడ? నేనేడ? జగజెట్టులరటె! నాయెఱిఁగినవి గొన్ని బ్రాఁబల్కు లేర్చి, యింబుగానిందిడితిఁ బాడిదప్పకయ. యట్లయ్యు, నేదేని, దప్పు మొగపడిన మన్నింపుఁడని మిమ్ముదుర పిల్లివేడ; వేఁడంగ నేటికి? నేలంటిరేని, నావ్రేళ్లు నులివెట్టి నానాల్కనరికట్టి, వ్రోఁచేత వ్రాయు, ముక్కునఁ బల్కుమన్నఁ, దిన్నంగ నాచొప్పు సేయ నోపుదునె? నిచ్చలు మిముఁబోలె మాటలాడెదను; మాటలాడిన పగిది వ్రాలు వ్రాయఁ గనేర్తు నించుక నేనుఁ బెక్కంద్రమాడ్కి. నట్లు వ్రాయగఁ బంపవ్రాయనునాను. బాపురె! మీవలెమరగాళ్లు లెక్కించిందులు ద్రొక్కంగనతఁగులకొనె? పడుచు లేచుచు బావమెలికలఁ దారినడుచుచు నవి సుఁడీ లెస్సయనిచూపి, యొజ్జలు మిమ్మొద్దిగఱపి దానిన మరగిమెత్తురు మీరలొల్ల రొండెద్ది. యాటపాటల నారితేఱినవారు దొమ్మర్ల నవధానులెందఱేఁ గలరు. బుఱ్ఱతో నేలపై వారు వాఱుదుసు; వీరు వింత వింతగ జదివి బెకబెకమంచు నార్తురు, మాటలు దలక్రిందు సేసి; బళిబళియని యెల్లరార్తురున మెచ్చి. యేరికిఁ దెలియదయా చదువుతీరు. దారయెఱుంగర తమమాట తెన్ను. విక్రి యట్టిది యొకటి గొండొకనేర్చి, కొలువులోఁగొనియాడ నియ్యసేయుదురె? యఁ

---

* ఇక్కమ్మనుడులను నాయిచ్చపై నేనుగూర్చితి, నానాల్కకమవగునట్లు; చదువరి వీను కించెడునట్లు. చద్దెంబు లివియని పేర్కొవ్వ నేను; బద్దెంబు లనిపల్కి బ్రాఁబడిఁ బరికించి కీడని దూఱఁగ దగదేరికేని. గద్దెకూర్పునకు నైకట్టడిలేద. గద్దెయకాదీని గడియింపనురదె? చుక్కలు గుఱుతులు నానేర్చి నట్లు చదువంగ నొనఁగూరుపాం టెనునిచితిని; దప్పేనిఁ బెద్దలవి యఱకయ చదువుండ.

వడమినిఁజేసి తడఁబడుదు మొక్కొ, తడబడ నల్ప్వైరుదు నగరెయని వెఱచి మిన్నకుండుదుగాక, తెగుదురె యేరు? విద్దెయనునది నెఱిగ నలవడవలయు; నేర్పు సక్కఁగ మెఱయ నోపఁగ వలయుఁ. గాని నాడోడకె వెలి వుచ్చి పఱప ? దుప్ప్వాల నేవుల లోట్టైనుఁగులను మావుల నెలుఁగులఁ గ్రోఁతులఁ బెంచి, వానిని డగ్గఱి యొడయన్ద్రు ద్రిక్కనేరాడఁగాఁజేయు వారలయ్య? వేఁగి నాటికి నేని, వేఁగికాటికి నేని, వేటకా వేఁటవో నేరి కగునయ్య? రాయలకగుఁ గాక, ఱేండ్లకగుఁగాక. మీమెచ్చు తెనుఁగది గడు గరిడిబిద్దె. మొదలేనిఁ దుది యేని మొగపడ దరయఁ; ద్రోవదెన్నులు నేకు నేర్పర్పలేరు; నిచ్చలు సాదనసేసి ననకాక, యొనఁగూడదేరికినిఁ దరిదాఁక వలను; బ్రదికెడు ప్రొద్దెల్లఁ జాలదది నేర్వ. నొజ్జల తఱచుగాఁ బొరపడుచుండ్రు; ననుఁబోని వారల మాటేటికయ్య? మీరచ్చ గండలయాన, నలవడని సాము సలిపెద; దాన దోసఁ గొదవేనేనిఁ దోసవు నాయదికాద; ననురేఁచు వార దెప్పునఁ దమపాలు దగుఁ దార కుడువ. సిగ్గరినేనియు సిగ్గఱి, నేను దెగియించితిని; దాని దోసముగ రోయఁదగునేని నది నాదు తప్పనఁగఁ జెల్లుఁ.

దెనుఁగు నాటను గలరు దొల్లింటి పెద్దలు నేలదయ్యాలు నా నాపాఱువారు. పాఱుల ప్రానుడులు దయ్యాలనుడుల. నాడునాఁటికి నవి నాటను మొఱఁగె; మొఱఁగినఁ బెద్దలు వొత్తమ్ములోనఁ దొల్లిఁటినుడులన గిచ్చి చదివెదరు. దెన్నాటి కాఁపులఁ గలియఁ బాఱులకు నలవడిన దానాఁటి తెనుఁగుల పలుకు. దయ్యాల మినుకులు, వడనాట్లనుడులు దెన్నాట్ల నుడిగమి నల్లనఁజేరఁ, దొలి తెనుఁగు బాఁపల బాసయ్యెఁ గావలయుఁ. బెద్దలదగుట నాపాఱుల బాసకలయుంపి మిహిఁగొని, కాఁపులు దనియ, దొడ్డదై నాటను మెప్పొందెఁ దాను. తొంటి పెద్దలు దారెవరైరివో, తమనాట తెల్లమా తెనుఁగు మాటలను బాఁపల ప్రాఁబలుకు లవి కొన్నిగూర్చి, పద్దెములుగా నల్లి కమ్మపై గివ్వఁ, దెనుగుఁ బొత్తముఁ జదువు వొడసూప నయ్యెఁ. బాఱులు దక్కంగ దయ్యాల బాస నొడ్డులు సదువంగ దోస వొందుఁగానఁ గాఁపుల బాసతో నొగి దీనిఁ బొదివి కలువుడు, (గావుని దాలుట కతనఁ, బ్రామిన్కు లయ్యును మయి లంది, యుని యు, గాఁపు మాటల మయివడి నొప్పెనాఁగ) నిడుమలు మఱి పొఱయ వనెడు నమ్మిగను బాఁపలు దమప్రాఁత కబ్బములలోని ప్రాదయ్యముల కతలు నేర్పుమైఁ దిగిచి, తెనుఁగుఁ గాఁపులకునుఁ బున్నెమ్ము పొంటెఁ దెనుఁగునఁ బద్దెంబు లల్లి వినుపించి, తెలి

యని సుకులను దెలియంగఁ జెప్పి, యెఱిగించి రిట్లుగాఁ బెద్దయు మేలు దెనుఁగుఁ గాఁపులకు నాగురువు లిడిరి. గాఁపులకున యన నేల? బాసకును వారు దీపారు కై సేఁత దీర్చిరి గాదె? నన్నయఁ దిక్కనింగేతనఁ దొట్టి తొలికయిత కాండ్రెల్ల రానాఁటఁ గోలెఁ దారును, దమవార లొండొరులతోడ నిచ్చలెయ్యయినుడులు నొడివెడు వార లానుడులఁ గయితంబు గూర్చుడు, నదియుఁ గమ్మగాఁ దనరెఁ గావలయుఁ జూరె. వారి కూర్పులు సూడఁ దోఁచును గాదె చాలఁగాఁ గాఁపులయ మాటచొప్పు? వారి పిదపటి వారలంత కంతకును గయితమ్ము గారడి బిడ్డగా దిద్ది, కయితంబు బాసను గకవికలు సేసి, సింగారమునకునై సిగ్గుడిగఁద్రావి, రోఁతయించుక లేక పాడిగడి మివిలి, బూతులు, అంకులు వొందించి చొన్పి, లంజెలమై జిగి మెఱమెచ్చఁ జూపి, రాజుల రెడ్లను బెల్లించి పుచ్చి, కూర్మియు నెయ్యమ్ముగలరట్లు తోఁతేర వేనవేల్ బొంకులు బొల్లి పాడియును నిచ్చకమ్ములు సెప్పి తమ కరువుఁగూడు గొనుటకు నొండెను గాసుకు నొండెఁ దమకయిత కన్నెల వారికిఁ దార్చి, బాసవెలందిని వెలయాలిఁ జేసి, వెలయాలి మఱుమాయ యాకెకు మరపి, మిఱుమిట్లు గొల్పఁగా గద్దెనెక్కించి, నేలకు సానిగా దాని నెలకొల్ప; అంకులాడియ మేటినాఁడెమగు మిన్నయని యుచ్చనుల్లిని నందొఱు గొల్వఁ, దొంటిబాస వెలంది గటకటా క్రుళ్లి తెవులు గదిరిన చివుకులంజెయయి క్రెళ్లెఁ.* క్రెళ్లినన్, సోఁకుడు దవిలినవాండ్రు వీనుఁగు నెక్కొల్పి మెఱుగులు పూసి, దానిఁ గౌఁగిటఁ జేర్చి ముద్దాడుచుండ్రు. చవిగ్రోలనడియాసఁ బంటను నొక్కెద [illegible]ండినవా తెఱ; దొండపండట్టె! రిమ్మత్తినట్టులు నాకుచుఁ గుడుచుచు రిత్తచవులకు మెచ్చియాఱ్చుచుండు రెల్ల వెంటకు గొఱంతించు కేనియు లేక, యెల్లెడ నెప్పుడుఁ గూర్చు నమ్మదియఁ గ్రేడింతురు అరయ్య గ్రేఁగంటనేని. జూడుడి తెనుఁగుల నెఱిలేని నడత! తనయాలు మొఱటని వెంగళి తేఁడొకఁడు లంజెనుఁ జేపట్టి తనసాని సేసి; పాటలు, సదువులు, నాఁడెమ్ము, సొబగు, గఱపించి, యెన్నియేన్ మెఱుఁగులు దిద్ది, తానింద్రుఁ డది రంభయని పాట పాడించి, తన కోర్కు లీడేరెనని త్రుళ్లుచుండ, నాయెడ్డెమయివడి లిబ్బికాండ్రందు బెక్కండ్రు రేమఱి, తెల్విదక్కి, తమయాండ్రురును మొఱటు లని తారు వగచి, కల్లమిసుముల వాడలంజెలనుఁ జేరి, మొఱటుఁదనమును దలఁగి నాఁడెమ్ము గ్రోలఁ గడఁగుదురయ్యారే యాయబ్బకాండ్రు! పెద్ద లీచొప్పున లంజెను నాఁడెంపు రాణిగా నెన్నుచు, మగనాలి

* మ - రా - శ్రీ, జయంతి రామయ్య పంతులు గారి

దెగడి, యెబ్బెరా సిది యని యేవగింప, నట్టిపెద్దల నడయ మేల్‌పాడిగాఁ దలచి పజలదియ కొనియాడ నయ్యెఁ గావలయు.

అట్లుండెనది; నిజము దలపోయుఁడయ్య. మగనాలు మొఱటయిన మగనాలు గదె కాన్పు కొలము పెంపొనఁ గూర్చు కొడుకుఁ గూఁతు? నాఁడెమ్ము గలదయిన నంటుకత్తియ నంతు గోర రయ్యెదపుగా, బాఁపలేని. మగనాలు మొఱటట్టె! యాకెలో నేటిమొఱటొక్కొ? మగనాలి తనమదియ మొఱటె? మాలతొత్తేనియు మగనాలకావలచు; మెచ్చదు లంజెలమైబొల్లి మెఱుఁగు. తొండి, కట్టి, ప్రూసినఁ లంజెఁ బెండ్లముగఁ జేపట్టనోడును జెంచువాఁడేని. నాఁడెమది యేటిది? లంజెలన కాని మొలకెత్తి యది గెరల నోపదొక్కొ? మగనాలి తనమున నాఁడెమ్ములేదె? మగనాలి పోఁడిమి, మగనాలిసిగ్గు, మగనాలిసౌరణ, మిసిమియు, సౌరు, మగనాలి పేరిమి, మగనాలిపొత్తు, మగనాలిసాజంపు మరియాదసొంపు, మగనాలి నిక్కంపుఁ బరువును, బెట్టు, నివియెల్లఁ గొఱగాని వని యాగడారి, మనువు తీరెల్లను బ్రతుకు తెన్నెల్లఁ గువలంగఁ ద్రోయరె కల్ల గొనియాడి? మన తెన్నుబాసయ కాదె మగనాలు? మొఱటేని మిన్నయేన్ మనుదలదానన. మొఱటేనిఁ దప్పు మనయదియ కాదె? మొఱటు మొఱటనిదాఁని దెగడుటయ కాని యేరు దిద్దిరి మెఱుగులు దానికయ్య? మరియాద దానికి గఱపంగఁగా కేమి? వాడవదినియ పాటి నేర దయ్యెడిదె? లంజెకున మరియాద నెక్కొన్నదొక్కొ! మగనాలి యిచ్చమై దిరుగునొక్కొ! మగనాలి నడతకు లంజియ నడతకుఁ గల వాసిగనలేని యెఱుకవాండ్ర సన్నపు తలపులన యిప్పాటులెల్లఁ బాటిల్లె మననాటఁ గను విచ్చిచుండు. నేటుసేయంగను నోపుదురేని, ముంగల వెనుకల నరసి కనుఁడు. యిచ్చమైఁదిరిగిన, నిలువాడు మగనాలు సాజంపుమేరలు మీఱ దెన్నడును. బొల్లిమరియాదల నెడ్డెల నేపుచ్చి లంజియ గదె దాటు మేర లెల్ల! లంజెల నాడెమ్ము సక్కటిగా వఱలు నాటను మనుదల యీచఁబోదె? యెయ్యేని నాటను మగనాండ్ర సాజపుంజొప్పు సక్కటిగాఁగ దిద్దిమెత్తు రానాట నాఁడెమై పజలమనుదలయుఁ బెంపునుఁ బేరొంది కడుఁదనరుఁగాదె?

అలుగకుఁడు నాతోడఁ గలరూపు నేను విన్నవింతును వినుఁడు చెవి యొడ్డి మీఱు. తొంటిపెద్దలబాస సాజంపుబాస. సొంపుమై నింపుమైఁ జదువనౌనఁగూడు. వారలబడిఁ దవిలి, చక్కఁగాఁ బోక, వెఱ్ఱివెంగళి వెడఁగు జట్టుల వెరవు నలవఱ్చికొని,

పెద్దకయితగాండ్రంచు, బెద్దలు వెక్కండ్రు వెక్కేండ్లు వ్రాని పెక్కుబాసలు సదివి, పెక్కుఁబొత్తములఁ జివికిన మాటలనోగిఁ బ్రోవుసేసి, పదనుగాఁ దడిపియుఁ బిసికియు రుబ్బి, సంధులాదేశాలు నాగమమ్ములును, ఱాలును, నెఱసున్న లరసున్నలునిచి యన్నియు నేర్పుమైఁ గలియంగదంచి, డంగినయాముద్ద సన్నెపై నూఱి, యుక్కుగుండులపోలె నుంటలు సేసి, వానినిఁ దడియాఱ నెండనుఁ బెట్టి, యేరుపిడకలు దెచ్చి యెర్రగా నేర్చి, పదిలముగఁ బెట్టియను గుడికలనుదాఁచి, తారునుఁ, దమతోడఁ జదివెడువారు పండుల తీపారఁ బఱపఁగొఱికి, చవిలేని వయ్యైను, నమలుచుండుదురు. ప్రాఁతగిల్లిన కొలఁదిఁ గప్పుఁ గల్లుల కవిగట్టి వయ్యైను; వాని నేఁడేరికేని నమలంగ నలవి గా దెంత గొఱికినను. ఇట్టివియ మీరలయు మీమువంటివారలయుఁ గడు మెచ్చి కొనియాడు నెక్కొన్న నుడులు. నెలకొన్నవియయేని, నుక్కులయేనిఁ జేవకట్టెలయేని నెల్లప్రాద్దున్నె? యుక్కేనిఁ దినునట్టి త్రుప్పుడు నూరె! సేగేనిఁ దినునట్టి ప్రువ్వునూరె! మిముఁబోని వారి కవియితమయిననయ్యె; మిముఁబోని వారలు వెక్కండ్రుడుండ్రె? నను వంటివారల యెల్లయుఁ బులను. మీకుఁబోలెను మాకు మెసవఁగాదు; గదిరెడు నేవంబు; గడుపులో నఱుగక, తెగులు వాటిల్లును; గాద యితకారి.

అట్లుండెనది; వినుఁడు నా విన్నునది యింక. మూఁడుకాళుల తనరుఁ దాఁబట్టినట్టి కుందేటుకనుమాడ్కిఁ బంతమ్ము విడిచి, కీడు మేలరయుఁడు గినుక దక్కి. బాసన్నదే ప్రొద్దు, నాలుకమీఁద నాడుచుఁ బాడుచు నలరును గాదె? ప్రాఁతకమ్మలఁ గ్రుయ్యు బాసయ బాసె? యేనాటినేనియును నున్నె యీనుద్ది? మననాట నీమాట సెల్లెఁగాక. పజలనాలుక దొఱఁగి, ప్రాఁబొత్తములయంద యునికి గలిగిన యట్టి నుడులవెల్ల నుసురు దొఱఁగిన యెండు డొక్కలు గావె? పొత్తములన్నియుఁ బ్రోవెత్తి యేర్చినఁ, గ్రొందెనుఁగు సావద. పసగల్గి పచ్చగా మిసమిసలాడుచు నివురించి విరియునుఁ, గాచును, బండు; విత్తులు వెదచల్లి కొలము పెంపొనఁ గూర్చుఁ దాన మాఱి. యుసురును, బసయును గల యట్టివెల్లను మాఱకుండఁగఁ బోవకుండఁగాద. “దేశభాష” యు “మాతృభాష” యటంచుఁ బొగడెదరూరక బూతులు పోలె. మీమెచ్చు ప్రాఁదెనుఁగె “దేశభాష”? మీమెచ్చు ప్రాఁదెనుఁగె “మాతృభాష”? యేదేశమున వారు మీమెచ్చు తెనుఁగును నోటను బల్కువార రసిచెపుఁడ. ఏదేశ్యని “దేశము”నఁ బజలు నుడువనిది “దేశభాష” యటంచు

బేర్కొనఁబడునె? ప్రాఁతకమ్మల నుడులు వాపనికి నుగ్గుతోనే "మాత"యునుఁ బోయఁ గని యెఱుగ మయ్యా. మాటన్నఁ, బలుకన్న, నుడియన్న, నేమి? సదువన్నఁ, బాటన్న, బాసన్న, నేమి? నాకు మీతలఁపులు దెలిపెడు నులివు; మీ వాత వెలలి నా వీనుల కెక్కుఁ. జేతులగివ్వంగఁ గన్నులనవడునది బాసయె? యది బాసజాడ గాక. యెయ్యేని నాటను నెయ్యేనిఁ బెద్ద లెయ్యేని చొప్పున మాటలాడెదరు, నలుగురికి నానాట నదియ చొప్పడును. బిడ్డలింటింటను దలిదండ్రులాడు మాటల నేర్తురు గూడి యుండుటను. దల్లియుఁ దండ్రియు మొఱటులయి రేని, బిడ్డలమాటలును మొఱటుల యగును. పెద్దల బిడ్డలతోఁగూడి యాడు పిన్నల బిడ్డలును మేల్నుడియ నేర్తురు. పెద్దలతోఁ గలసి పనులు సేయుడును, బిన్నలు నేర్తురు వారలయ నుడుల నొండొండ్ల తలఁపులు నొండొండ్లు నెఱుఁగంగ నిదియ యెల్లెడ మేటి పాడి గాదె! పలుఁగొలములను బుట్టు బిడ్డలు బడులలోఁ బెద్దల నుడి నేర్చి యలవర్చికొనరె? బడులలో నొజ్జలు పెద్దలతోఁ గూడి మెలఁగుడు, వారల యాడు బాస గఱతురు; నేర్తురును గఱపంగ నొడ్లకు. బాఁపలు గానిండు, వెఱలు గానిండు; చదువు నెఱుఁగులు గల్గు పెద్దలబాస వీరు వారును నాక యెల్లరికిఁ దెలియుఁ, గాఁపులకేనియు మాలలకేనిఁ. బెద్దలనుడులగుట మెత్తురెల్లరును; వలతురు నేర్వంగ నెల్లరువానిఁ; జుల్కఁగా నేర్వంగ నోపుదు రెల్ల, సాజంపు వరుఁనను, వీనులవినియు, నోటను బలుమఱుఁ బల్కిపల్కి. యిదియ కదె యెల్లెడలఁ బాడి బాసలకు? నిట్లుగాఁ బిన్నలు సన్నలెల్లరును బొందుగాఁ బెద్దల నుడుల నుడువంగఁ, బొందుగాఁ బెద్దలనుడుల వ్రాయంగ; నోటి మాటలు, సేతి వ్రాలును, గమ్మ చదువులు, నొక్కమెయి సమకూడియుండ; మఱి యేమి గల దయ్యా మనకుఁ జెప్ప? విద్దె యెల్లెడ నలమికొని యెసక మెసఁగు. నిదియ సుఁడి పెఱనాట్లఁ బాడి సదువులకు. వినరొకో యీమాట మీరలెన్నడును? బడియొజ్జ నాలుక వలికిన పలుకులు సెవి మెచ్చి సరియనఁ, గండ్లు దప్పనఁగఁ గన్నులు బొసకుఁ బెడనెల లొక్కొ? యీ తెనుఁగు నాటను ననువంటి వార యేడఁ జూచిన నుందు రొజ్జలనుపేరఁ. (బొట్టకూటి కనుండు, తప్పేమి దాన?) వీర కదె వేనవేల్ పిల్లలచేత బడులలోఁ జదువులు సదివించుచుంట? మీ మెచ్చు ప్రాఁతెనుఁగు నేర్వంగనగునె యీయయ్యవాండ్రకు నేరికి నేని? (నొకరిద్దఱుండ్రువో నేర్చినవారు; గడనయె వార లీ మొత్తమ్ములోన?) మన తెనుఁగు వారట్టె యిన్నాఱు "ఖచ్చ"లయ్యును, నూర్వురకెన మండ్రయేనిఁ దమపేరు

వ్రాయంగ నేరరయ్యెదరు. అక్కరాల్ నేర్చిన వారిలో నేని, వేయింటఁగాదువో, పది వేలలోనఁ బ్రాఁదెనుఁగుఁ జదువుఁగలఁ డొకఁడేని యున్నె? ప్రాఁదెను గేడనేన్ బలుక వినరాదు; ప్రాఁదెనుఁగు నేర్పువారరిది నాఁటఁ; బ్రాఁదెనుఁగుఁ బొత్తములు సదువంగ నేనియు నలవిగా దెల్లరకు నక్కరాల్ రామిఁ. నట్లయ్యుఁ, బ్రాఁదెనుఁగ! ప్రాఁదెనుఁగ! ప్రాఁదెనుఁగ! వలయుఁగా కొండెద్ది వలవదం డ్రీరు. మీమాట లేటివో యించు కేని యు నాకుఁ దెలియంగ రాదయ్యె పరికించి చూడ. నిక్కమ్ము సెప్పెదను వినుఁడొప్పి మీరు; నన్ను నలుగక, నాకుఁ దప్పు సైచుండు. నేలవేల్పులు నాఁగఁ బఱఁగు బాఁపలలోన చూడంగ సాఁబాలు సదువులేక, యోనమాలేని యుఁ గఱవంగ నోప కవధానినంచును దయ్యాలపాట వ్రాఁతది గడఁచుట్టఁ బాడంగ నేర్చునట్టేఁడు సిగ్గఱి కొఁపుకడ కేగి వేఁడును గమ్మొండు గివ్వుమని వాని. గిచ్చినదాని పైఁ గైవ్రాలు సేయనేనియు నేరండ మనపాఱుఁ బెద్ద! సీనారె పెఱవార లిది వినెడువారు? ఏల బాఁపలు పెద్దలని పాడుకొంట? ఏల తెనుఁగులు మిన్నలని పొగడుకొంట? ఏల బొంకులు పల్కి నిక్కి నీల్గుటలు? ఏల రిత్తలు సెప్పి విఱ్ఱవీగుటలు? బలెబలె! మన తెనుఁగు వారార్యులోటు! బలెబలె! మన తెనుఁగు వారాంధ్రులోటు! బలెబలె! యాంధ్రులు నార్యులోటు! అయ్యారె! తెనుఁగది యార్యులబాస! అయ్యారె! తెనుఁగది యాంధ్రులబాస! పెఱవార లెల్లరు హూణులు మ్లేచ్ఛులు, యవనులు, తురకలు, మాలవారట్టె! చూడుఁడి తెనుఁగులు! చూడుఁడి బాఁపలు! గనువిచ్చి కలయంగ నరసికొనుఁడు. నుడులను బట్టి యార్ మానిసి కొలముల నేర్పరించితిరేని మన తెనుఁగు వారిఁ గోయలతోడను నెఱుకుల తోడఁ దగఁగూర్చి మఱి చెప్పవలయుఁ జుండీ. యాంధ్రుల మ్లేచ్ఛులని యార్యుల పేర్కొనఁ దెనుఁగు లాంధ్రులయేని, మ్లేచ్ఛులకారె? హూణులు నాఁగ మీసెగ్గించువారు, మ్లేచ్ఛులు నాఁగ మీ యగడారువారు, యవనులు నాఁగ మీ పదరెడువారు మన నేల సానికి మగల కారె? వీఁకేల యిఁక మనకుఁ, ద్రుళ్లంగనేల! బలిమిమైఁ గలిమిమై మఱునాఁడు నాఁటికిఁ బెంపొంది పలునాళ్లు గండంద్రు గారె! హూణుల కానిండు, మ్లేచ్ఛుల కానిండు, నేలమ్మ మగలను నేలఁ బుట్టువులు దముఁ గన్నతండ్రిగాఁ దలపంగవలయు; వెన్నునివలె వారిఁ గొల్చుటయు పాడి. యట్లుగావుటఁ జేసి తెగడంగఁగాదు. వీరేడ? వారేడ దోమయేనికల! యేయూరికే తెరవేటి యుద్ది? మన చొప్పు దాతల పేరుల చెప్పి, మనమాడ్కిఁ దాతల చెయ్వులఱి చెప్పి, వేద

బింకమ్ముతో మిటిమిట్టి పడరు. దమ చేయు పనులచేఁ దాతలపేరు వెలుఁగొందఁ జెల యంగఁ జేయువారు. దఱియును వెన్నును దమ్మును నోరులను జొప్పు దప్పక యరసి మెలఁగువారు. దమయునుఁ బెఱవారి బ్రదుకు మేలగు పొంతె నదనున కనువగు మయివడి నరసి, క్రొత్తబైసులఁ బెంపు సనుకూర్చుకొందురు. గలకాల మొకపాడి, యెంత మేటిది యైన, నన్నిటఁ గూర్చునె పఱకు నొకచొప్ప? పలుజాడలను బట్టి మాఱేడుఁ బజనడ. నడయు మాఱఁగ నెఱియు మాఱకున్నె? నడవోలె నుడియును మాఱుటఁ జేసి, క్రొన్నుడియ మేలుగా మెచ్చి నుడివెదరు; క్రొన్నుడియ మేలుగా వ్రాసి చదివెదరు. వారి వంగడములోఁ జదువనివానిఁ గంటిలో నలుసట్టే దని యేవగించి, నాలిముచ్చుగఁ జూచి దఱియ నీ రేరుఁ; బనిగొన నట్టిని జీరర వేరును. గొడగవాఁడేనియుఁ, గటికవాఁడేని, వ్రాలు వ్రాయఁగ నేర్చుఁ; జదువంగ నేర్చు. బానిస మేనియు, బానసమేనిఁ, జేయంగఁ గాదువో యేయింటనేనిఁ జదువను వ్రాయను నేరని కుంక. వారు వీరననేల, యించుమించుగను జదువని మగువయుఁ జదువని మగఁడు గానంగ వచ్చుట గడునరిది సూరె. మనయట్ల వారలు సదువులు రాని కూళుల కాల్గడిగి నీరు ద్రావుదురె? మనయట్ల వారలు సదువులు రాని వెడగుల నెత్తిపై నెక్కించుకొందురె? మనయట్ల వారలు సదివిన మగనాండ్ర నగి, యాడిపోసికొని కేరడింత్రె? యేమ తెనుఁగుల కుద్ది బీరపుటలలోను, డంబుడాబులలోను, డాటోట్లలోను, డక్కుల, డెక్కుల, నిక్కులలోను? జాల్బాలు నిఁకనేని మిన్నకుండుదము: కొరమాలి కోఱడము పాలు గానేల? తెనుఁగు వారలలోన నిద్దఱు కొకఁడేనిఁ జదువకుండినఁ బోదు మొఱటుపేరు. మన తెన్గువారిలోఁ బాల్గెందరయ్యా? నూర్వురకు ముప్వురు! వారిలో నేనిఁ జదువుగలరరిది. వ్రాఁబల్కు నుండి కడుఁగడిది; గఱవంగఁ బట్టదండఱకు.

మనలోన మిన్నలు నోటనుఁ బల్కిన పల్కులు మొఱటనుట మన పిచ్చి గాదె? వారాడు మాటల మన మాడెదము కాదె? వారాడు మాటలు మనకు వ్రాయంగఁ గాదు గాకేమ వియుఁ గాఱు లోక్కొ? తొలుదొల్తఁ దెన్నాటి కాఁపుల పలుకులఁ గయితమ్ము గూర్పంగఁ దొడఁగిన యపుడు మొఱటులోకాక యవి సొక్కంపు నుడులో! యది మీకుఁ దోఁపదె? తలపోయుఁ డేల యీఱతాఱ తలంపుల బీఱువాఱ? బాఁపలు మున్నుగా మాటలు వుట్టించి కమ్మపై గివ్వఁగాఁ దెనుఁగయ్యె నయ్య? బాఁపల కంటెను ముందరఁ గాఁపులు వల్కరె వ్రాఁతలు దెనుఁగు నుడులు?

దొంటిపెద్దల కట్టి యరమర లున్నె? తొంటికాఁపుల పలుక కొనియాడ రైరె? యేనాఁటిపెద్దలనుడుల నానాఁడు మేలుగ నెన్నుటయు పాడి యెల్లెడల? నీనాఁటి తెనుగులలోనంకుఁ బెద్దలు గడువింత గదురంగఁ దమనుడులుఁ దార మొఱటని పూనిక వట్టి రట్టె! తమ బాస లెస్సయ యనుడుఁ, గడుఁగిన్క నదియేమొ కిడుగా మదిఁ జిత్తగించి కయ్యమ్మునకుఁ గాలుద్రవ్వుచున్నారు! నగుదునో, వగతునో, యోయమ్మచెల్ల! పేరోలగమ్మున రాజులు ప్రెగడలు మాటాడు మాటలును మొఱటు లగునె? రచ్చతిన్నియలలో నంగళ్లలోను దీర్పరుల మాటలును మొఱటుల యగునె? “బారత” కత నడిపి విప్పి వినుపించు నాయయ్య మాటలును మొఱటు లనఁ జన్నె? ప్రోలిపెద్దల మాట లవి మొఱటు లొక్కొ? బడియొజ్జమాటలును మొఱటు లయ్యె? మీరు నుడివెడు నుడుల మొఱటులయ్యె, తెనుఁగుఁ జదువుల రచ్చఁ దీర్పరులరె? యన్నిట మిన్నలు, నుడిన యదె మొఱటు! వా యోడు; నాఁగాడు; నాన గదురు! నరె, పెద్ద లెల్లర మాటలు మొరలేని, రచ్చగండల ముతకనుడి యాడు నంత నానగండల యేని, మఱి వంత యేలు? పొట్టగోసిన నొక్కయక్కరము లేని మొఱటుఁ దెనుఁగులు, (గాఁపులు, వాఱులెల్ల) వాని నేర్వంగఁ దప్పేమి సెప్పరయ్య? వలవదందురు నేటు వాటిల్లి నట్లు? యేటి దీ పిచ్చి? మీనుడివెడునవి దక్కి యేనాఁడో చచ్చినవారి నుడుల మేలంచుఁ దలఁతురు! నచ్చినవారివ మేల్నుడు లేని, బ్రామిన్కలన గివ్వరయ్యెద రే లవిగావె గడు మేలు? ప్రాఁదెనుఁగుఁ బొత్తములు దద్దయు నగ్గింత్రు; ప్రాఁదెనుఁగు బొత్తములఁ జదు వెల్లనున్నె? ప్రాఁదెనుఁగు నుడి పెద్ద మెత్తురు; దలఁపులెల్లను దానఁ దెలుప వలనె? క్రొత్తకోడలు వోలె నరగలి గొనరె లెస్సగ నలవడని బాస నుడువంగ? నడుగడుగునకు మాట దడఁబడఁ బలుకుట గలు గల ననిగల నేమక వ్రేఁచి, వ్రేఁవుల్లో నమలంగఁదొడరుట గాదె? ప్రాబాస వ్రాయు టది యేటి కెడు రీత. ప్రాబాస వెలలింపఁ బ్రానుడు లేదు: నీరు వెలలిన మొసడి నేపియ వట్టు. చెట్టుఁ దొఱఁగినఁ బూలు గంపులేవవు; వానఁ దేనె యివుర నీఁగ సొరదు నూరె; నుడులాడ, నోరూరకుండిననాఁడు, నీళులింకిన మడువు మీలట్ల నుడులు. నిచ్చమ్మె బొత్తూర రేలు గ్రుమ్మఱఁగఁ బ్రాతూర నను వగు నట్టులగునె? చిన్ననాఁటను గోలె మెలఁగెడు నింటిలోఁ గనుమూసికొని యేని వడిఁ దిరుగువచ్చు; నడిరేయి నేనియు, నడఁగూడు నలుగడల; నలవోకయును బోలె, నరవాయిగొనక,

పనులెల్లఁ జక్కఁగాఁ బచరింప వచ్చుఁ. బనివోలె నుడియును నలవడక యగపడద; యలవడక కడగండ్లు మెండుగాఁ గూరుఁ. గడగండ్లమాపులు గడగండ్లు వలసిన నెల్లరు వలతురె వానిఁ జెపుఁడ? వలచిరయేనియుఁ గడపంగ లావె? యోపువారల యేని నీర లిసుమునన జిడ్డుఁ, గండ్లుల నొలిచి తడియుఁ దివ్వ, నానుఁ డాపో బమ్మి యేపారుఁడయ్యా. ప్రాఁదెనుఁగు వలతురేన్ నేర్పుఁ డ డ్డెద్ది? మీకింబుగా జదివి కొంద్రుగాక; యెల్లర నరికట్టి యదియ చదివింత్రె? నేలను దొర్లుచుఁ గాసి ప్రయ గలకుఁ బోవంగ నియ్యయేన్ బొందు; గడ్డేది? వెఱల సంకిలివెట్టి, "యురలక పోఁగాదు; పొగబండి నెక్కినన్ బున్నెమ్ము లేద; పెద్దలనడ సెడు"నని బెట్టిదంపుఁగట్టడి సేయుమని చెనిఁ గొనకొల్పఁదగు నయ్య? యెల్లరు నోపరయ్యెదరు. దొలుతను బడులలో నొజ్జలు నేఁటివి పదువులు నవిపూవి కొండకలకు నేఁడు నాటను బజ బ్రదుకు మందలకు వలయు చదు వించుకయుఁ గఱపంగ నెగ్గ? కఱవుచే బసిగొని చానున్నవారికిఁ గూటి నీల్లించుక వోయఁ గీడె? "ఎంగిలి; వలవదు. కాఁడిగా దాన. బాఁపల పోలెను వలయును మెసఁగఁ. బ్రాలకుఁగా మీచు ఱానేల దునఁగ దొరఁ కొనుఁ డింతకుఁ బండు; మీరుఁ గుడుతురు; వాప్పుఁడ"ని పట్టువఱచుదురె? నేర్పు గలరరు; మీకుఁగాఁ బట్టుఁగాక; దాన నతఁగుల పసి యాఱునయ్య? కొలఁదియె వారికిఁ గడలిని ద్రచ్చి చపిఁ దిగిచి క్రోలంగ దయ్యాలపగిదిఁ? గొల్లొసదులకు నున్కి పట్టవు మడువును జొత్తెంచి నీళ్లాడ నెల్లర కగునె? తెనుఁగులలోనందుఁ జదువుఁ గడునెద్దడి గావుటఁ, బ్రాఁదెనుఁగు వలను గాద. యేలిక లిప్పుడు దయసేసి యూరూర బడు లుంచి యెల్లరకుఁ జదువుఁ గూడిడఁగ నున్నవారఁట; మీకుఁ బ్రాఁదెనుఁగు బెడ్డ లాకూటిలో వైవఁ బాడియె? యకట! యావంతయును లేద వంత యా దెస మీకు. మాలలు వలఁతులె మీచదువు గఱవఁ? బ్రాబాసఁ దగులఁ బడ నేరకేన్ లావె? ప్రాఁదెనుఁగు సదువంగ కొందఱు గలరేనిఁ, బ్రాఁదెనుఁగు వ్రాయంగ నేరి కగునయ్య? యిప్పటి యేల్బడి చొప్పును బట్టి, మనుదల యెల్లను వ్రాఁతనయ్యెడును. వ్రాయను జదువను నేరని వాఁడు సేయఁజాలఁడ యెట్టి పనియేని నేఁడు. ప్రాఁదెనుఁగు దొల్లిఁటి పెద్దల మాటేనిఁ, గ్రొందెనుఁగు నీనాఁటి పెద్దలమాట. యెప్పటిమాటలున యపుడ తెల్లముగఁ దెలియును. దెల్విఁకివలయు నమ్మాట యెల్లరకు నలవడిన మాట గావలయు. పెఱయవి యిప్పనికి వెరవు లేవు. వలయునది దెలివు గాకులి వౌనె? నుడులకెల్ల నులివు బొంది; దెల్వి నుఁడియునుఱ. యులివు సెవి గ్రువ్వఁగాఁ దలఁ దూఱుఁదెల్వి. పుట్టెనిండుఁగ దెల్వి వొంగారకున్నఁ జెవికి విందుగ వాత నుడి వెడలునొక్కొ? ప్రామిన్కు లేనియుఁ గ్రొమ్మి

న్కులేనిఁ, దేటగాఁ దలఁపులు దెలియరాకున్నఁ, బసలేనిమాటలు పదివేలవేల? డబడబ - ఢుబఢుబ - బడబడలు గావె? తెనుఁగు నాటను జదువు వెంపొందకుండఁ గీడెంత మూడెనో చుండి కనువిచ్చి. తెనుఁగునాటను బాస దికమకలాడి పాడయ్యె! బాసతోఁ జదువును బ్రదుకుఁ! గడుఁగీడుగా దోఁక్కొ చిత్తగింపఁ?

బ్రాఁతల మేలంద్రు పెద్దలు వల్కురు; మాటమాత్రమ; యేమనొల్లరు వాని; నూరువన్నెలవారుఁ బెద్దలు విన్నలు, నెల్లరుఁ గ్రొత్తల కోరుచుండెదరు. పూడ్చిన పాతులు ద్రవ్వి వెలివుచ్చ నలవియె యెల్లరకుఁ? బుచ్చినన్, వెగట! ప్రాఁతనాణెములు పెద్దల పేర్సెప్పి యమవస నేరు నీ, దీవింత్రె పార్లు? ప్రాఁతదుగ్గాణులు సాతునకేఁగ నుప్పగల్లెనియు దొరకొనఁబడునె? ప్రాఁతత్రోవల నేఁడు గాసికిఁ బోఁజన్నె, కాల్నడనేనియుఁ గమ్మిబంఢులనుఁ? బ్రాఁత తేపలఁ గడలిఁ గడవంగఁ జొత్రె? పొగబండి వాగయోడ నేఁడుజ్జగింత్రె? ప్రాఁతపొత్తాలలోఁ జేర్కొన్న ప్రోలుల తొల్లింటి వాసియు వన్నెయుఁ జెన్ను నేఁడు నూడఁగఁగాంత్రె యరసియు నేడఁ? బ్రాఁతకొత్తలఁ బడులఁ గొలిచియుఁ దూచి కోమట్లు బేరంబు సేయఁ గన్రె? ప్రాఁతాలఁ జెక్కిన యక్కరా లిపుడు సక్కంగఁ గాదుపో చదువంగనేని; వానిన నేఁడునున్ గివ్వఁబూనుదురె? తొంటిబిరుసులు నేఁడు వలతురె దొరలు? బంట్రౌతులని వారిఁ గొనియాడఁ దగునె? జగనొబ్బగండడన నేఁడేడు గులుకు? నెవఁడిప్పు డోయంచు బల్కుసుంకరియన, దళవాయి యనగను, జంగిలి యనఁ? పెట్టరె మొగమునఁ జప్పటులటు సీరఁ? దొంటి యట్లిప్పుడు సాని యందురె తల్లిఁ? దొంటిబాఁపల పగిదిఁ జియ్యదినఁ దగునె? తొంటిపాడినిఁ బట్టి తనయాలి నొడ్లకుఁ బున్నెమ్ముపొంటె నిపు డెరవీఁగఁ దగునె? పాపలు లేరని యేరేని యిపుడు బాఁపలకడ కంచి పుత్తురె యాంద్ర? తొంటిపోఁడిమిఁ గూడఁ గుడుములఁ గుడుతురె? ప్రాఁతమైవడిఁ దోడఁ బూయఁ జన్నె? ప్రాఁతమడువుల నిపుడు నీళ్లాడఁ దగునె? ప్రాఁచినీళుల నేరు గ్రోలరు నూరె! తొంటిపెద్దలు వోలె నేఁడు సీరలు దాత్రె నెత్తిపై, నొడలిపైఁ, దోలు, నారలును, గత్తళా లరికట్లు వావడాలు? ప్రాఁదొడవు వలతురె గోతు లీనాఁడు? తొంటియట్టుల పోటుబంటులు నేఁడు నుండసురియలు గొని పోరెదరయ్యొ? పగవారు మన నాటిపయిఁ దాఁకుదేరఁ దెనుఁగు బంటులు లేచి తెగియించి నేఁడు విండులకోలలయు గుదెలయుఁ దోడఁ బగవారి బారినిఁ బడకుండఁ జేసి చెట్టకు దొఱగించి, సేగి గూరకయ, నేర్తురె చెప్పఁడ నేలఁ గాఁపాడ? ముంగల వెనుకలఁ జూడంగ నేర్పుగలరని మీఁమెచ్చు ప్రాఁబార్లఁ పాడిఁ దవిలి తగవులు నేఁడుఁ దీర్పంగఁ దగునె? ప్రానుడులు గఱచిన పాఱుని మనుమలు వలుకరయి రది యేల ప్రామినుకు లిపుడు? దొంటిపెద్దలు గొల్చు వేల్పుల నేఁటి పెద్దలు గొల్వంగఁ గానంగరాద. కువలిన గుడు

లలోఁ గూడని పనులు బాఁపల సల్పుదురు పాడియ తక్కి. యేరుగడముల నల్లవో దచ్చి కడల! వీనను బొమ్మలు గైసేసి గొల్వర. తారకాణింపంగ నిది యొండ చాలుఁ బ్రాఁతల యెడఁగల గుఱి యెంత వట్టో! ప్రామిన్కు వల్కని దుగపుట్టుకయుఁ జిచ్చు నిచ్చువేల్పని గేస్తుఁ జెఋదురన్న పాడి యెల్లెడఁ దోఁచుఁ బ్రాఁబొత్తములఁగాక, యేరేసిఁ బాటింత్రె యాపాడి నేఁడు? వేల్పుల పెంకులు, వేల్పులకొల్పు, వేల్పుల బాసయు, వేల్పులయాన, బాపల బాసయు, బాపలపాడి, తొంటి పెద్దలబైసి, యివి యెల్ల మాసి పరియ, నించుకేనియు నుఱని పార్లబైఁ, పెలుకుఱు చీప్రొద్దు, గుదగుదలాడుచు, బురపురఁ బొక్కుచు, జాలిఁ గూయిడుచు, బడలు సాలఁగఁ బడి వనరుచు నుండ్రఁట! కట కటా! యేలొకో యరయుఁడయ్య! "తెన్నాటి కాఁపుల ప్రాఁదెన్గు ముత్తవ్వ ముదిసియుఁ జివికియుఁ బరిసెఁ గాన నెండు డొక్కను బూడ్చియిఁకఁ దన్పఁదగు దాని; నెల్లరు వలయుఁ గ్రొమ్ముద్దియఁ గొల్వ"నని తూఁటలనిరఁట చెవి సూఁడఁగాను! బెద్దయుం బ్రొద్దయ్యెఁ; బెద్దముత్తయిదువ. వాలాయమున కింతవగఁగుంద నేల? పలుకు ముత్తవ లెల్ల రనఁటులు వోలెఁ బిల్లలఁ గన లావు కాకువోరె?

తెనుఁగు నాటను గల పెక్కూరువల్లెలు వేరులు మాఱియుఁ దనకు నిప్పుడు. దొంటి పేరులు గొన్ని రాగి పట్టాల, ఱాలపైఁ గానంగ నయ్యెడుఁ గాదె? ప్రాఁత యక్కరములు సదువంగ నేర్చిన యయ్యలు సెప్పంగ వాని నేర్చి, యిపుడు వేర్కొన్నచోఁ దెలియఁ బడునె యా యూళ్లవారికేఁ? బొత్తములనున్న యిప్పటి పేళ్లవి గ్రొత్తవి గావునఁ దప్పని వానిని ద్రోచిపుచ్చి, ప్రాఁత పేరులు సేర్చి మగుడ నచ్చొత్తి, బడులఁ బిడ్డలచేతఁ జదివింపమేలె? యొకయూరి గామిడికిఁ గమ్మొండు గిచ్చి, కమ్మపైఁ బ్రొనుడియ వ్రాసి యంపెదరె? "యంచెల" వారది యంచిపుచ్చెదురె? లెంక నొక్కనిఁ జీరి, ప్రాఁత పేరది సెప్పి, యొక యూరికేగంగఁ బనుచుడు, వాఁడు "నేనెఱుఁగ నదియేటి దేడనున్న"నఁడె? క్రొన్నుడి ముతకని నేఁటి పేర్వ్రాలుక మీఁనాల్క యీకొనమి, మొదల మేల్ నుడియ పల్కి, వెంబడి మీరు పని సక్క నెఱవేఱఁ గ్రొన్నుడియుఁ దెల్లముగ వ్రాకువ్వవలయుఁ; బ్రొనుడి పద్దెంబు మున్నుగాఁ జదివి, పదపడిఁ దేటగాఁ గ్రొందెల్గు వల్కునయ్య వారట్టుల; మేలు సూరె! సుంకరు 'లంచెల' యెకి మీఁడు, రచ్చతీర్పర్లఁ, గాపర్లు, బడియయ్యవాండ్రు సుద్దిగా నూళ్ల ప్రాఁతపేరులను నేర్వంగఁ గట్టడి సేయుమని ఱేని వేఁడంగ వలయును జుండి తడయకయ. ప్రాఁబొత్తములు మీకు దొర కొన్నవటె గొన్ని. యందుల ప్రానుడులు మన మెఱుగనవి యున్నవియును దివిచి ప్రో

వెత్తి, బడులఁ బిల్లలచే ముందుఁ జదివింప నురును! వానికిఁ గానొకఁడు గట్టడి సేయుండ దొరలకు మీరలు సెప్పి పుచ్చి. ప్రాఁత పట్టాలలోఁ గొన్నిటియందు నూళులెల్లలతోడ నేర్పడి యున్నవెన్నియో; యవి యిపుడు దెలియఁగఁగాద. యట్టి యందొక కొన్ని నల్లిండ్లుగాఁ జేసి యొడయను మనరచ్చఁగ, వాని నేమి సేతుము రిత్తపేరులు నట్టి? ప్రాఁత పొత్తములందు నుండుల ప్రమాకులఁ బేర్లున్న వానిని బేర్కొని మనము బోయ వానిని జీరి వానిఁ దెమ్మన్నఁ దేగంగ నగునె? తేఁ, దెలియఁ జన్నె? ప్రాఁతపురాణాలఁ బేర్కొన్న నాడులు, ప్రోలులు, పీడులు సరి పోల్పనగునె? ప్రాఁజిత్తపుఁ బట్టి చెన్నపురి నిపుడు పీటులు, నిండులు, నంగళులు, బడులు, రచ్చలు, సావళ్లఁ గొలువు కూటములు నరసి క్రుమ్మర నగునె కాఁపులయట్ల? తొంటి పడగలనెత్తఁ దొంటి పజలట్ల పోరికిఁ బఱతెంచ్రె నేటి పజలు? దొంటి యట్టుల నేఁడుఁ జిందమ్ములొత్త మాఱొత్తుదురె యేరు నుద్దిగాఁ బోరఁ? దొంటియట్లిప్పుడుఁ గై వారములు సేయ, నగరె యెల్లరు నన్ను వెఱ్ఱి వెడఁగనుచు? బాసలు నిట్టివ, ప్రాఁతలుఁ గ్రొత్తలుఁ; జేతి గీఁతలు, నోటిపలుకులు నుండి; సైగల. యవి వేనికై యమరి చెల్లు నాగుట్టు ముందరఁ దెలియ రాకున్న, రిత్త సైగలఁ గోర్కులుప్పతిలునె? ప్రాఁతపురాణాల నేఁటి పజ బ్రదుకు గానంగ రాదవు గడముట్ట నెల్లఁ; గ్రొన్నుడు లీరలు గొఱగాని వండ్రు; ప్రాఁబొత్తముల వలయు నుడులెల్ల లేవ; నేఁటి బ్రతుకును జెప్పు నుడులెవ్వి సెల్లుఁ? బ్రాఁత పొత్తములలో లేనివి యయ్యెనేని క్రొత్తలు గూడునని యొకొంటి రేని, నేడు గొలఁదులు సెప్పుఁడ ప్రానుడి ప్రోవు గెలగించి వలయు నుడి ద్రవ్వి తివ్వ? బడులలో బిడ్డలునుఁ బ్రానుడి ప్రోవులు వరికించి రోసి మఱి మొగపడకున్న న నేఁటి మాటలు గివ్వవలయు నండ్రె? బాపురె! బమ్మకేనలవియె యటు సేయఁ? జదువర్లు నూర్వురఁ జాలించి మీరలు ప్రాఁబొత్తముల నుడులు వెడలవైవింప నవి నేర్చి బాసాడఁగలఁడె యల నలువ? వేయేఁడు లగుదెంచె నన్నయ యేగి. నన్నయనుడులెల్ల మాఱకయ యున్నె? ఈ కమ్మలో నున్న వెన్నియో మాటలు నన్నయనుడులేనిఁ దెలియఁగఁ బడునె యిప్పు డీ రాజేంద్రవరమున వారు? మీరు వోలెనుఁ గాద యెల్ల రవి నేర్వఁ. బ్రానుడి నేగని వారితో మీకు మనఁబోవక పోవరాద కాదె? పెఱవారి నిచ్చలు మాటాడు నుడుల నాడకుండగఁ బోవకుండ నగునె? వారాఁగవలఁతులు వాకు మాఱక యుండ నే రాఁగి కట్టుదు రెల్లర నాల్కలీతోఁపు మీకెవుడుఁ దోఁప దొక్కొ! నుడి మాఱునని మీరు నొగిలెద రేల? మీరు మాఱక ఱాలువోలె నుండెదరె?

ఇంకను వినుఁ డయ్యా విన్నవించెదను మార్పులు దెనుఁగుల మనుగడలోను. మనికిపట్టులు దొంటి యట్టివి గావు. కొఱముట్లు గ్రొత్తల యెడఁ జూచితిను. బ్రోయాలు గుండలుఁ గట్టెయుగపలును గ్రైఁబట్టనోడను గూడు వండఁగను. నెల్లి కొయ్యలఁ దచ్చి నిప్పొదవఁజేసి ప్రోయిని గుంపటినిఁ జిచ్చు వెట్టెదరె? ఇంటను వెలపల రేవు దోడంగి క్రొత్తల కదె కందు నుత్తములు దనుకఁ? గాఁపుల పనులిపుడు బాఁపలు సేయఁ గాఁపులు నడతురు బాఁపల యట్లు. క్రింది కొలముల వారు వల్వార నేఁడు గొలువులఁ బెద్దలయి కుదురు కొనఁగ, బడులలోఁ జదువులు సెప్పుచునుండ, రచ్చలఁ దగవులు దిద్దుచునుండ, బాఁపలు వారల యండఁ జేరెదరు. తొలి నేల దయ్యాల గుఱుకొని చేసిన కట్టడి మిన్నులంగ నడచినయట్టి కాఁపుల బాఁపల సంకలియ నునిచి వారిచే దండువుఁ గొనఁగ వలదె? కటకటా మాటలు మాఱిన కతనన కడలేని వంతను గుందెదు మీకు గుండెలు వ్రక్కలు గాకుండఁ బోకుండ నగు చెట్టులయ్యా, మీకట్టెదుటఁ ద్రెల్లె వేల్పులు బాఁపలు సేసిన బైసి? యిమ్మెయిఁ బ్రాఁతలు వరిపరి తెఱఁగుల నెన్నియో మాఱియు మాసియుండంగ, నాప్రాఁతలకుఁ బేర్లుగానున్న ప్రానుడులు నవియును మాఱియు మాసియుఁ బోయెఁ. బ్రాఁత సరకుల పోవ, సరకుల పేరు మఱచుట వింతేటి? యిది వింతగాక: నీ మార్పు వాలాయమని యెఱుగ రామి వలనొండె వెడఁ గొండె నరయుఁడయ్యా. అలగొంతి తొలిపట్టి యేపిని దోకొని మింటికి నేఁగువాఁ డాలితోడఁ దమ్ములుఁ గూలుఁడు, నుఱకయ వారల డొక్కలు డిగవిడువ, వేల్పులదొరయుఁ బాడియె నావుడు, జముబిడ్డ నాఁడె మిక్కిలి మనుకుక్క వారి డొక్కలకని? పాడివలనన పుట్టి, పాడికి నెలవయి, పాడితేఁడనఁ బేరు గ్రువ్వఁబడియు, మిన్నేటి మగనికి ముని మనుమఁడయి వెలిఁగి, మిన్నేటి పట్టిచేఁ బాడి గఱచి, పాడి గనఁజాలఁ డొకో? కని సలుపఁ డొక్కొ?

ప్రాఁత చదువులు గొన్ని వెక్కెండ్లు వూచి పాతుడు వడుడును బరిపోయి యున్నా. గుద్దళ్లు గొని మీరు నేఁడు బ్రొక్కలు సేసి యెలుకల మెట్టలఁ ద్రవ్వి, తడవి, దొరకొన్న యెమ్ములు గొన్ని వెలిపుచ్చి, యిదిగో తొల్లిఁటి బాస వెలఁది నా నాకె యుసురంది తకతక నేల నాటాడి యెల్లర నాల్కల నెక్కి నెకొన్ననె? ప్రాఁతనుడులకు నున్నె పస యెన్నఁడున్నెని? యుడుగరయ్యా దరింక ప్రాఁతలగడన. ప్రాఁత పల్కుల దూఱఁ, గినిసెదరె యేరు? నేఁటి మాటలఁ దెగడ, నో వాదవుఁ గాక. ప్రానుడి నగ్గింపఁ నుబ్బుదురె యేరు? నేఁటి మాటల మెచ్చు నాదట పుట్టుఁ. బ్రానుడుఁ

నెఱిఁగించి పుత్తురె యేరుఁ బనులు సక్కఁగఁ గాఁగఁగోరు వారు? ప్రాసుడుల గిత్తురె కయికోళ్ల నిపుడు తీర్పుల యొడఁబళ్ల కమ్మలయు మీఁద? దెవులు గదిరిన యట్టి గాదిలి పట్టి సానున్న యపు డొక్కమందులవాఁడు బ్రాఁబల్కులను మందు నది యిడు చొప్పుఁ జెప్పంగఁ దల్లికి నెటులుండు వగవుఁ, డే దయ్యోనేనియు నొడ్లకుఁ జక్కఁగాఁ దెలియంగ వలతురేన్, దేటగాన తెలిసెడి యన్నుడియ వలయుఁ గాదె? యొడ్డులతో మీకుఁ బనిలేని నాఁడు మీకు వలచిన యట్లు చేయుంగఁ జనును. బోడులు దక్కంగ నేరట్టి రుండ్రె? నేఁడుగాఁ బుట్టెనె యీపాడి నేల? వాలాయమే తీరు నుడువుదు రెల్లరు వరికించి తెలియుఁడు రిత్తవంతేల? నివ్వెఱ గొందిన నార్తురే ప్రాసుడి? నాలితో నెవ్వండు బ్రాఁబల్కులాడుఁ గాఁగిటఁ దాఁబట్టి ముద్దాడు నాఁడు? నెయ్యంపు నెచ్చెలులు గూడి యున్నెడలఁ బ్రాఁబల్కులాడంగ మురిపె మొదవెడునె? యుల్లమున మొల్లముగ వేడ్క వైకొనునె? యలయు నెడ డయ్యునెడ నాఁకొన్న యెడల నొచ్చునెడఁ గినియు నెడ జాలి గొన్నెడలఁ బ్రాఁబల్కు దనకుఁ దా వెడలి రానగునే? యెగ్గు సేసిన పగఱ నెడ లేక పీకమైఁ బెల్చనఁ బ్రబ్బుచు నుగ్గడించుడును, వెల్వెడవె నిక్కంపుఁ గ్రొందెనుఁగు నుడులు, గన్నుల యు మిసెడు నెరగళ్ల యట్లు, తోలుఁ దొఱంగిన చిల్వ రాయని తోఁకఁ ద్రొక్కఁగ వెసనూర్చు చిలుముఁ బొవలట్లు? యలరునెడఁ దనియునెడ వేడ్కగొన్నెడలఁ గులుకునెడ, ముఱియునెడ, నుబ్బియున్నెడల వెలి నొలుకు వాతను సాజంపు నుడుల; క్రొమ్మెఱుఁగుఁ దీవలవి; యెద కొలిమి నేరు తళతళ మనుపయిఁడి పలుకులు; కూర్మివెల్లువ యల లవి; గ్రొవ్విరి తావులు; వలుకుల సాని దా వీణియ గోట మీటినఁ జెలఁగెడు మ్రోఁత వోలె హారవు మొల్లముగాఁగఁ జేయునుడులు; వంటనూఁదఁగ దగు; వాచవి పుట్టించు; లేనగవు లేమ వాతెఱ దొండ పండ్లు. యిటువంటి సాజంపు మాటలఁ దొఱఁగి, ప్రాఁబల్కులను గుంతు జాలనుఁ గప్పి, మీతలఁపు నొడ్లకు నెఱిఁగించి పుచ్చఁదొడఁగుట కన్నను మిన్నకుండుటయె మేలని తోఁచదె వగవఁగ మీకు?

నెఱవుమైఁ జూడుఁడు: మిమ్ము నరికట్టి, నిచ్చలు మీనుడువు నుడువులవి విడిచి ప్రాఁబల్కులన కాని పలుకంగఁ గాద, ప్రాఁబల్కులన కాని చెవి సొన్పఁ గాద; యని యానవెట్టిన, మీరు రెన్నాళ్లీ యాపగిది సేయుడును, వినువాదవకున్నె? "నోరారఁ దీపారు తెలితెల్గుఁ బల్కులు వలుకంగ నేనాఁడు గాంతు మొక్కొ? యిచ్చమై మానాల్క సాజంపు సొంపునఁ దలఁపులఁ దెలుపను వలను గనునె? యాలియు బిడ్డయు నెయ్యునియుఁ దోడ నిచ్చమై మేమెపుడు ముద్దులు గులుక నరమర

లేకుండ మాటాడఁ గలుగు? వీనుల విందుగా మఱియెన్నఁడున్నేనిఁ జిన్నారి పొన్నారి నేటి తెలితెల్గు వినఁగఁ గాంతుమొ లేదొ," యని కుంది కుంది, యాచెట్ట కట్టడి ద్రెవ్వఁ ద్రోఁద్రోవఁ గడఁగుదు. రంతియ కాదు; మగుడ నేరును నటుల పెడఁగుఁ గట్టళ్లఁ జేయవలవద యని చెప్పుదర మీరు. గాదు వో, బయిసుక వట్టి మీరదియు మెత్తుమందురుగాక; యందురె మీరు విన్న వెద్దలు నాక, పాల్లు గాఁపులు నాక, యెల్లర కట్టివి లగ్గ; వలయునని? దయ్యాలయును ఱేండ్ల ప్రాఁడెంకు లిపుసు మేటు లయి సొబగులయి యుండెనేనిఁ, దగునె మనకెల్లరకు నిచ్చమై మనఁగ? యరిసెలు వడియాలు లెస్సలు గానిండు; దగునె నిచ్చలు బిడ్డలవి యారగింప? వంకాయ వ్రేఁచిన చిఱి కందిప్రప్పు సచ్చిన పెద్దలు దినరట్టె పో, నిలిచిన పెద్దలు బోసేయుచుం డంగ, నిచ్చలు వానిసె నేమమ్ము వట్టి యెరుజ్జగింతురు దోసగొందు ననుచు? నేమమ్ము నందఱు కనువైన మాద్రి నుండని నాఁడేరు వాటింతురయ్య? "లచ్చ" కొక్కరు లేర ప్రాఁబాసమేర మీఱక కట్టుమై నడచు వారు.

'నన్నియగట్టిన కట్లుద్రెంపెదరె? చదువుసానిని బోడిగావింత్రె' యంచు డెప్పెద రీరలు నిజమునుఱక. ప్రాఁతకట్లవి గొన్ని పెద్దయుం బ్రొద్దొడుఁ, గ్రొత్త పోకులు లేమిఁ, బ్రిదిలెఁ దామ. యిఁకఁ గొన్ని సిక్కువడఁ ద్రెళ్ళంగఁ బీకిరి తెలియమిఁ బెద్దల; యేమి సెప్పఁ? బ్రాఁద్రోవ వారాట్పఁ బాటించరైరి. మీకుఁ జిక్కుయినవి మీరు వెఱికితిరేని, మాకుఁ జిక్కుయినవి మేమూడ్తుమయ్య. బాసకట్లెల్లను బంటి కాట్లకులోఁగి, నాల్కదెబ్బలు వడియు నుమ్మిఁదడిసి, చివికితునకలుగావె వుటుకు మనచు? గ్రొందెనుఁగు నెల్లరకుఁ దెలియఁగాదట్టె! యూరూరినుడులవి వేలువేలట్టె! యట్లేని, వేనవేల్ తెనుఁగు లెల్లెడలఁ ద్రిమ్మరుచుండు వారెటుల నొండొరుల నెఱిఁగి కొని పనులను నవరించువారో? చుట్టలు నెయ్యరులు వెక్కాళ్లలందుఁ గల వారు సెప్పంగ నాలించితయ్య. కొలువునకుఁ బలుచోట్లఁ గ్రుమ్మఱు వారలు సెప్పంగఁ జెవులార నే వినితి నయ్య. నేనును గొందఱఁ బెఱచోట్ల తెనుఁగులఁ బల్కరించితి నించు మించుగ నెల్లెడఁ బెద్దలెల్లరు నొక్క చొప్పు నుడివెదర. యించుక యెడమున్నదని యొప్పికొన్నఁ, బెఱబాసవలె నెఱుఁగరామి లేద. కబ్బములన కల్గు ప్రాఁదెనుఁ గన్ననో, పలుఁదెఱఁగులయి తోఁచుఁ బరికించి చూడఁ; బరిసెను మాటలు వెక్కు లందులవి; యేడను వినరామిఁ దెలియరే రిపుసు. ప్రాబాస కట్టడిఁదుదముట్టఁ గన లేక యెవరికెట్టులు దోఁచెనట్లు వ్రాయ, వ్రాసిన వారేనిఁ దమవ్రాల మఱునాఁడు

దెలియ రయ్యెదరట్లు బాస సివికెఁ నూటిలో నొకటికేన్ బ్రాఁతమాటలకుఁ గట్టడి సెప్పంగ నేరయ్యెలావు? గ్రాందెనుఁగుఁ గిట్టడి గడవఁ గాదే లేని వెన్నతోఁ బాలతోఁ గ్రోలినవారు. గడుపులోఁ గూడఱుగునట్టు లుండుఁ. గూడఱుగు చక్కటి దెలియ రాకున్నఁ గూడఱుగక పోవఁగాద చుంతు. పుట్టుగు గోలెను మన మాడు బాస సక్కటి దెలియకయ నేర్వనయ్యె. లాఁతుల బాసను నేర్వంగ దాని చక్కటి నెఱుఁగుట దోడుగానుండుఁ. బ్రాఁదెనుఁగు వెఱబాస యట్టిది గాన దాని చక్కటి నెఱుఁగఁ గోరుదు రెల్లఁ. బ్రాఁదెనుఁగు నేరుసు మాటాడకునికి, మాటాడి నేర్వఁగాఁ గాదు దానిఁ. దెనుఁగుఁ గబ్బములెల్ల నొక యూరఁబుట్టెనె? కయితగాండ్లెల్లరకు నొకయూరి నుడియె? తిక్కఁడు పెద్దన లొక్క బాసాడిరె? పాఱుచుఁ జదివినను వాసి యగ పడున; కలయంగఁ జూచినఁ నన్నయ తిక్కల నుడులను నొక్కింతగాన నగున. తెనుఁగు నాటను గల నూళ్ళులనెల్ల నుడిగములు సమకూర్చి ప్రోవులు వైవకయ, యీనాటి పెద్దల నుడులను నేర్చి కతయేనిఁ గమ్మెని గివ్వరాదట్టె! నన్నయ, దిక్కండు, పెద్దనంబోని తొలికైతకాండ్రకుఁ దొలి చదువరులకు వెన్నాన గా నేరు నుడిగముల పొత్తాలు వెంకన, రంగన, సూరన వోలెఁ జేసిరె? యేనాట నీ కట్టుఁ గలదె? నుడి కుప్పఁ గెలగించి నుడులేఱి కూర్చి కయితమ్ము సెప్పిరే కమ్మగా నేడు? పెద్దల కబ్బాలు గాలించికాదె వెంకన రంగనలు ప్రోవిడ నోపిరి? బాసను బరికించి బాసకట్టడి గనిరి గాక, గట్టడి మున్న చేసి మఱి వ్రాసిరె? ముందెద్ది విద పెద్ది సూడక కడఁకఁ దబ్బిబ్బు సేయ మీపేర్మికిఁ దగునె? పొత్తాల పుట్టువు నెఱినెఱుక గలరు! మీయట్టి రిట్టులన నేమి నాఁ గలదు.

పెద్దలచే విన్నదించుక నేనుఁ బేర్కొంటి నిచ్చోటఁ దెలియంగఁ బడఁగ. నీ కమ్మలో నేను గడుఁబూన్కి వూని కూర్చితిఁ బెక్కులు వ్రాఁతనుడులు నాయొప్పు నంతకుఁ బ్రావరువడి వట్టి. ప్రాఁబాన సదువర్లు మెప్పు వచ్చి పసదన మిత్తురని యాస సేసి దొరకొన్న పనియని తోఁతెంచుఁగాని "ప్రానుడి పిఱుఁ దన తవిలి పోవఁగఁగాద. యిట ముంద రేమయిన నయ్యె; నిటమున్న దొలి చొప్పు సొప్పడద" నుచుఁ గనుపించి చాటి చెప్పఁగ నిట్లు వ్రాసితినయ్య. నాకది సూడంగ మేలసఁగ రాద. చచ్చి క్రుళ్ళిన డొక్కులా నుడులు ద్రవ్వి పిన్నబిడ్డలవాత వైవంగఁ జనదు. బూచులని పాఱుదురు వీఁగి తలడిల్లి. తొలుత మీరలు సదువురచ్చ గూర్పంగఁ, జదువుఁ

తెంపునను నైచాలు జతనాలు సక్కఁజేయఁగలార యని యాసనేసి యుంటను, మీ పన్ను పన్నుగడలెల్లఁ బనుపడక గుఱికి నవి దప్పులసగుట, వగఁగూరి నాతొఁవు మిమ్ము వినిచితిని. దగు చొప్పు మదినరసి నేఁటి యదనునను నొనరెడువడు వాకఁకు వాడిగాఁ జేసి, పాఱులు గాఁపులు నాక, యెల్లరును జదువులు నేర్వంగ నియ్యకొనుఁడు. నేఁటి పెద్దల నుసుల తిన్నగాఁ గూర్చి వ్రాఁతలు నేర్వంగ నియ్యకొనుఁడు. నిక్కంపు నాఁడెమ్ము దెల్పిచేఁ బొసగు; రిత్తనుడికారములఁ బొరయదయ్య. యిప్పటి మన యేలికల బాస గాఁపులు మాలలు సులుకఁగాఁ జదువంగ, నుడువ నెట్లయ్యొ? మన బాస వెలలకున కాద మనకేనిఁ గడుఁగొడివె యెట్లయ్యొ? నదియుఁ దలపోయఁ, గదురదె నాన మది మీకుఁ? బ్రాఁదెనుఁగ తగులఁ బడి, క్రొందెనుఁగు మీఁగసాలించ కునికిన చదువు కొఱయయ్యొ. మాట మాటకు గుటక వైవక మీరేని మాటాడ నేరరీమేటిబాస. మాట మాటకు మేర మీరితి మేమెకో యని కట్టుఁ బొత్తాలు సూచి వ్రాసెదరు. ఎంత మేటిదియయి న నేసుయ్యెనయ్య? తలఁపుతో వాతికేన్, జేతికేన్, రాద. కాసికిఁ దా తేఁగి మోఁచి తెచ్చినవేని, మిన్నేటి నీళ్లులేక, మేటివేని, దప్పివోఁ ద్రావంగ నగునె యెల్లరకు? మైలవోఁగలయంపి సిలుకుట కగునేమొ. బెఱనాళ్ల చదువులపాడిని మీరు వాడిగాఁ జేకొన మెయికొనరేనిఁ, దెనుఁగులు ముతకలయి వెనుకఁ జిక్కుదురు. వెఱవారు దెలివొంది నాఁడెమ్ము మివిలి, మించి పోదురు సుండి డిగ ద్రొబ్బి మనల. నతంకంతకు వన్నెవాసియుఁ దఱఁగి, రూపఱి, లావేది, యెత్తువడి, క్రుంది, తెనుఁగుఁ బలుకుల వెలఁది సిందఱవోయి, లాఁతి బాసల సాన్లు నాఁడెమై క్రేడింపఁ, జింపిఱిగొట్టవు నేపొందదింక: నమ్ముఁడ, నమ్ముఁడ, నమ్ముఁడ, నిజము. నాతలఁపు గీడేనిఁ, జెప్పి దూఱుండు; పెద్దలు; మీయెదుట రిత్తవల్క. నాయితమ్ము సకునై యారివేరమును బూనంగ లేదయ్య; బూమియ సెప్పఁ; బాడికినై తగవు; వాలి చుట్టలమె? యొడ్డారమునకు వాదూనంగ లేద. ముఱకటించు కొనకుండి మోములు మీరు. నెయ్యమ్ము సెదరంగ నియ్యకుఁడయ్య. నాచెప్పు మాటలు దప్పుగాఁ దడవక, నాఁడెమ్ము సక్కగా నరసి కొనుఁడు. కడుఁగూర్మి సదువు నెడఁగలరేని మీరలెల్ల వారికి లగ్గు నింపెట్లు గూరునటులన చేయుండి పట్టు విడిచి. నాచెప్పఁగల యది సెప్పితయ్య. యీవిట్టులంటి నావలవదు మీకు; తరుసంటి పలుకంటి వని కసరఁగాదు. తప్పులు గనిపించి దయసేయుఁ డయ్య. కలరూపుఁ దెలిసి యవుఁగాదనుఁడ మీరు. ' గేలెత్తి మ్రొక్కెదఁ గినియకుఁ డయ్య.

యెలమి నాయెడ మీకు నలరెను నయ్యా. వరవుడమును నిచ్చు పస్సుఁగలాఁడ; నాడిగము వడవుఁడ. యూదవ్రానకుఁడ. యించెను నానుమ లెల్లను మీకుఁ! గండయ్యా, విండయ్యా, కొండయ్యా మేల. మనరచ్చ దయ్యమ్ము మనచును గాత! అక్కన సిగలోనఁ జొక్కన మోమున సానుల నెలకొల్పు మాను దొరలు సిరి, సేవ, నుడిమెఱుఁగు సమకూర్చి మంత్రము తెనుఁగుఁ జదవుల రచ్చతీర్పరుల నెల్ల. భళిరె! భళి! భళిరె! భళి! భళిరె భళి! భళిరె!

పర్లాకిమిడినుండి,
యొకవేయిఁ దొమ్మిదినూఱులుఁ
బదమూఁడు నగునేఁట, నాలు
వవు నెల తుదినాఁటనంచిపుచ్చినది.

ఇట్లు, మీయడియరి,
నీడ నేనిడితిఁ గ్రైవాలు
గిడుగు వేంకటరామమూర్తి.



(ఈవ్యాసము సలక్షణాంధ్రభాషపైఁ గత్తిగట్టిపోరుచున్న రావుసాహేబు గిడుగు రామమూర్తి పంతులుగారిచే రచింపఁబడినది. సలక్షణభాష దుర్గ్రాహ్యమని స్థాపించుటకై యాభాషకు మాదిరిగ నీవ్యాసమును పంతులుగారు రచించినట్లు తోఁచుచున్నది. కాని మాఱుమూల పదములను, మాఱుమూల రూపములను, ఏఱిగుదిగ్రుచ్చి యెవ్వరికిఁ దెలియకుండుటయే పరమార్థముగా వ్రాయఁబడిన యీ వ్యాసము సుగ్రాహ్యమై, సరసమై, నిరర్గళముగా వ్యవహరింపఁబడుచున్న సలక్షణభాష కుదాహరణముగా సహృదయులగు నాంధ్రభాషాభిజ్ఞులు గ్రహింపరు. ఇట్టి యపూర్వకావ్యరచనశబరవాగనుశాసనులగు రామమూర్తిపంతులుగారికే చెల్లినది గాని యితరుల కలవడుట కష్టము. అచ్చతెనుఁగు కావ్యముల రచించిన మహాకవులకుఁగూడ నలవడియుండలేదు. మఱియుఁ బ్రతిపక్షదూషణవాక్యములు వ్యాసమందచ్చటచ్చట నున్నవి గ్రామ్యవాదరీతి చదువరులకుఁ దెలియుఁగాక యని వానిం దొలఁగింపలేదు.)



శ్రీ

# ఆంధ్రభాషాసంస్కరణము.

ప్రకృతమునం దాంగ్లభాషాభివృద్ధిని జూడఁ గొంతవఱకు నూతనసంస్కరణములచేత నభివృద్ధినొందింపక పూర్వస్థితనిబంధనలచేత సాకల్యముగ నిర్బంధించినచో దేశభాష లభివృద్ధి నొందఁజాల వని కొందఱుపండితులు దలంచుచున్నారు. మఱికొందఱు ప్రాచీననిబంధనముల నతిక్రమించినచో నపభ్రంశసాంకర్యముచేత దేశభాషల గౌరవము నశించు నని తలంచుచున్నారు. ఇట్టిసందేహమున భాషకు నూతనసంస్కారము లావశ్యకములా ? అనావశ్యకములా ? ఆవశ్యకములైనచో నెంతవఱకు నూతన సంస్కారము చేయవలసియున్నది యనువిషయములు ప్రకృతమున విమర్శనీయములై యున్నవి. ఈ విషయములో నా బుద్ధికొలఁదిఁ గొంత విమర్శించెదను.

వ్యవహారములో నుండెడి ప్రతిభాషయుఁ గాలక్రమమున మారుచుండెడి స్వభావముకలది. కొంతకాలము సంస్కృతభాష వ్యవహారములో నుండె నని కొన్ని కారణములచేత నిశ్చయముగాఁ జెప్పవచ్చును. అది యెట్లనఁగా మహాభాష్యములోఁ బతంజలి శబ్దప్రపంచవిషయమును జూపునపుడు, "మహాన్‌శబ్దస్య ప్రయోగవిషయః, సప్తద్వీపా వసుమతీ, త్రయోలోకాః, చత్వారోవేదాః," అని చెప్పెడి గ్రంథసందర్భముచేత వేదేతిహాసపురాణాది గ్రంథరూపప్రపంచము కంటె సప్తద్వీపవసుమతిని, లోకత్రయమునువేరుగఁ బ్రదర్శించెను. అది వ్యావహారికభాషను గూర్చి యని యతని యభిప్రాయ మని చెప్పకతీరదు. మఱియు సకలశాస్త్రకర్తలును, శక్తిగ్రాహకమూర్ధన్యముగ వ్యవహారము నంగీకరించిరి. ఈభాష వ్యవహారములో లేకుండినచో వ్యవహారము సంస్కృతభాషలో శక్తిగ్రాహక మని చెప్పుట కవకాశ ముండదు. పాణినిసూత్రములలో "ప్రాచాం" "ఉదీచాం" అను పదములును నీ భాషయొక్క వ్యావహారికతను, స్పష్టపఱుచుచున్నవి. అనేకవ్యాకరణములచేత బోధింపఁబడు సాధుత్వభేదము భాషయొక్క మార్పుచేత లభించినరూపభేదములను సూచించుచున్నది. ఇంతయేల ? ఏకవ్యాకరణము ననుసరించిన పాణినిపతంజలుల కాలములో "త్వత్కపితృకః, త్వకత్పితృకః", అని భిన్నరూపము లున్నట్లు లనుభవ మున్నది. పాణినికాలమునకు వెనుకఁ గొంతశబ్దప్రపంచము మార్పు నొందుటచే దానిని సంస్కరించుటకై వార్తిక

కారుఁడు ప్రయత్నించినటులు గానవచ్చుచున్నది. వేదమునందును, కాలక్రమమునఁ గాని దేశభేదముచేతఁ గాని యుచ్చారణభేద మున్నటులు గన్పించుచున్నది. ఇందుల కుదాహరణము. ప్రకృతకాలమునందుఁ గృష్ణయజుర్వేదతైత్తిరీయశాఖలో "ఏష్టః, రాయః", అను రెండుపదములను సంహితగా నుచ్చరించునప్పుడు "ఏష్టారాయః" అని పాఠమున్నట్టు కనిపించుచున్నది. దీనిసాధుత్వము తైత్తిరీయప్రాతిశాఖ్యయం దెనిమిదవయధ్యాయమున, ౧౨ వ సూత్ర మగు "ఏష్టశ్చ" అనుదానిచే బోధింపఁబడు చున్నది. ప్రకృతమున నది యిష్టరూపము. ఇచ్చట "నైకేషామ్" అను సూత్రము చేత "ఏష్టోరాయః" అనియు, "ద్వావుత్తమో త్తరీయస్యరేఫమ్" అను సూత్రము నకు వారరుచవ్యాఖ్యారీతినిబట్టి "ఏష్టరాయః" అనియు, మాహిషేయవ్యాఖ్యా రీతినిబట్టి "ఏష్టర్ రాయః" అనియు "ఉఖ్యస్యస పూర్వః" అనుసూత్రమునకు మాహిషేయ వ్యాఖ్యమునుబట్టి "ఏష్టురాయః" అనియు, వారరుచవ్యాఖ్యనుబట్టి "ఏష్టారియః" అనియు రూపభేదము లున్నట్టు గన్పట్టుచున్నవి. ఇందులో "ఏష్టారాయః" అను రూపము దక్క మిగిలినరూపము లనిష్టములని చరమ సూత్రవ్యాఖ్యలో స్పష్టపఱుపఁబడినది. ఇట్లే తైత్తిరీయ కృష్ణయజుర్వేద భాషలో "సయ్యత్తా ఆసన్" "సువర్గల్లోకమ్" "సవ్వత్సరః" అనులక్ష్యములలోని మకారమునకు య, ల, వ, లు పరమగునప్పు డనునాసిక తత్తద్వర్ణము లాదేశములుగా నున్నటులు "అంతస్థాపరశ్చ సవర్ణ మనునాసికమ్" అను ప్రాతిశాఖ్య సూత్రముచేతఁ స్పష్టమగు చున్నది. "యవకారపర శ్చైకేషా మాచార్యాణామ్" అను సూత్రముచే బూర్వో క్తాదేశము నిషేధింపఁబడుటచేత "సంయత్తా" సంవత్సరః" అనురూపము లగునని యు, "ఉత్తమలభావా త్పూర్వో౽నునాసిక ఇత్యాత్రేయః" అను సూత్రముచేత "సువర్గ ల్లోకమ్" అనుచోటఁ బూర్వోక్తలకారాదేశమునకుఁ బూర్వస్వరముగూడ ననునాసిక యగుననియు స్పష్టమగుచున్నది. ఇచటఁ బ్రకృతకాలమునఁ బ్రథమసూత్ర ప్రవృత్తి మాత్ర మిష్టమైనట్లును, మిగిలినరూపము లనిష్టము లైనట్లును, తత్సూత్రవ్యాఖ్యానము వలన స్పష్టమగుచున్నది. ఇట్లే "స్పర్శపూర్వ శ్శకార శ్ఛకారమ్" అనుసూత్రము చేత "అనుష్టుప్ భారతీ" అనులక్ష్యమందు శకారమునకు ఛకారాదేశము సాధు వని కన్పట్టుచున్నది. ఈ కారాదేశ మసాధు వని "పకారపూర్వశ్చ వాల్మీకేః" అను సూత్రముచేత బోధింపఁ బడినది. ఛకారఘటిత రూపమాత్ర మిష్టమైనట్లు తత్సూత్ర వ్యాఖ్యవలన స్పష్టపడుచున్నది. అర్వాఙ్ఘ్వేనమ్" అనులక్ష్యములో "ప్రథమపూర్వో హకారశ్చతుర్థం తస్యసస్థానం ప్లాక్షికౌండిన్య గౌతమ పౌష్కరసాదీనామ్" అను

సూత్రముచేత హకారమునకు ఘకారాదేశము విధింపబడినది. "అవికృత ఏకేషామ్" అను సూత్రముచేత నీఘకారాదేశమున కసాధుత్వము బోధింపఁబడినది. ఈ సూత్రము చేత "అర్వాగ్ హ్వాసమ్" అనునది సాధువుగాఁ గన్పించుచున్నది. "చతుర్థాంతశ్శైత్యాయనాదీనామ్" మీమాంసకానాంచ మీమాం సకానామ్" అను సూత్ర ద్వయమునుబట్టి చూడ హకారమునకు బూర్వపందు ఘకార మాగమముగా వచ్చుచున్నట్లనఁగా "అర్వాగ్ఘ్వాసమ్" అనునది సాధువైనట్లు గనవచ్చుచున్నది. ఇందుఁ బ్రథమసూత్ర బోధితమే సాధువైనట్లు వ్యాఖ్యానముచే స్పష్టపఱుప బడినది. దేశభేదమునఁగాని కాలభేదమునఁగాని యీలోపము లుండకుండినచో నాయామత కర్తల కజ్ఞానకల్పన చేయవలసి వచ్చును. ఇట్లే యాయా ప్రాతిశాఖ్యలను జూచినచో వేదభాషయందును ననేకము లగుమార్పు లున్నట్లు తెలియవచ్చు చున్నది.

పైనున్న యంశములఁబట్టి చూడఁగా భాషయొక్క మార్పు ననుసరించి యా యాకాలములలో సంస్కరణము జరుగుచున్నట్లు నిశ్చయింపవచ్చును. ఇంతియకాక భాషను బూర్ణముగ సంస్కరించుటయును దుష్కరము. అన్ని వ్యాకరణములకంటె విపుల మగుపాణిని వ్యాకరణముగూడఁ బూర్ణముగను నసందిగ్ధముగను, భాషను సంస్కరింప సమర్థము కాకపోయెను. ఈవిషయ మాకృతిగణములు చెప్పుట వలనను, "పృషోదరాదీని యథోపదిష్ట" మ్మనెడి సూత్రమువలనను, దత్సూత్ర భాష్యము వలనను, స్పష్టమగుచున్నది. అచ్చటి భాష్యసందర్భమును గొంతచూపెదను. అచ్చటఁ బృషోదరాదిగణ పఠితములు శిష్టులచేత నుచ్చరింపఁ బడినట్లైన సాధువు లగునని యర్థమువ్రాసి శిష్టప్రయోగముచేతనే సాధుత్వనిర్ణయము చేసినచో వ్యాకరణము నిరర్థకమని శంకించి, శిష్టులెవ్వరో తెలిసికొనుటకై వ్యాకరణ ముపయోగించునని పతంజలిచెప్పె. వ్యాకరణముచేత నసందిగ్ధముగ నిర్ణయింపఁబడిన శబ్దముల నస్ఖలితముగ వ్యవహరించువారు శిష్టులని తెలిసికొని సందిగ్ధాంశములలో నట్టిశిష్టుల వ్యవహారమును బట్టి సందేహ నివృత్తిచేసి కొనవలయునని భాష్యతాత్పర్యము. ఈ సందర్భమును బట్టి యోజింపఁ బాణిని వ్యాకరణముగూడ నసమగ్రమని స్పష్టమగు చున్నది. ఇందువలన శిష్టోచ్చారితము సాధువనియుఁ దదితరోచ్చారితమసాధువనియు, విభాగ మేర్పడినది. పండిత సంఘముకంటెఁ బామరసంఘ మెక్కుడగుటచే నపభ్రంశములు ప్రబలినవి. దానిని "ఏకస్య గౌరిత్యస్య బహవోపభ్రంశాః గావీ, గోణీ, గోతా, గోపోతలికేత్యేవ మాదయః' అను భాష్యోక్తివలన గ్రహించునది.

ఈయపభ్రంశములు ప్రాకృతభాషలో సాధువులుగ వ్యవహరింపఁ బడినవి. ఇట్టి యపభ్రంశములు ప్రబలుటలో నొక్కొక్క దేశమున నొక్కొక్కవిధమున వ్యాపించినవి. సాధుశబ్దము లన్ని దేశములందు విదితములై యున్నవి. సంస్కర్త లదివఱకు గ్రంథములలో వాడుక చేయఁబడు శబ్దములను, సర్వదేశములందును శిష్టులచే వాడుకచేయఁబడు శబ్దములను వేరుగాఁదీసి వానికి లక్షణములు చేసినట్లుతోఁచుచున్నది. ఈయంశము "సప్తద్వీపావసుమతీ" అను పూర్వోక్తభాష్య గ్రంథమువలన ను, "యద్యపి గావ్యాదయోపి లోకే విదితాః। తథాపి తేన సర్వలోకవిదితాః। ప్రతిదేశం భిన్నత్వా దపశబ్దానాం। లోకశబ్దశ్చాయం సర్వస్మిన్లోకే వర్తతే। సంకోచకాభావాత్। అత స్సర్వలోకప్రసిద్ధానాం గవాదీనాం మిత్యర్థః" అను హరదత్త గ్రంథమువలనను, స్పష్ట మగుచున్నది. కాలక్రమమున సంస్కృతభాష వ్యవహారములో నష్టమైనది. అపభ్రంశభాషలు దేశభేదముచేత భిన్నభిన్నములైనవి. శిష్టులును, యజ్ఞాదికర్మకాలములం దప్పఁ దదితరకాలములలో నీయపభ్రంశభాషలను వాడుకచేయుచుండిరి. అప్పటి ప్రాజ్ఞులు ప్రచురముగా వ్యాపించిన యాదేశభాషలను సంస్కరించి యాభాషలలోను గ్రంథములను వ్రాయఁదొడంగిరి. అప్పుడు ప్రాకృత గ్రంథము లనేకములు వ్యాపించినవి. ప్రస్తుతము బంగాళా భాషను సంస్కరించి యందు నూతనగ్రంథములు వ్రాయుట యెల్లరకుం దెలిసినవిషయమే. ఇట్లే ప్రాచీన కర్ణాటమనియు నూతనకర్ణాటమనియు విభాగము గలిగినది. ప్రకృత మగునాంధ్రభాషలోను "దేశ్యము" "గ్రామ్యము" అని విభాగించిరి. ఈ విభాగమునకుఁ దాత్పర్యమాలోచింపఁగా నాంధ్రదేశమునం దంతటను వాడుకలోనుండు పదములు దేశ్యములనియుఁ, గొన్నికొన్ని గ్రామములలో మాత్రము వాడుకచేయఁబడు పదములు గ్రామ్యములనియు, గ్రామ్యపదములను గ్రంథములలో వ్యవహరించినచో నాగ్రంథములాంధ్రదేశమునం దంతటను విదితములుకావు గనుక వానిని విడిచి దేశమం దంతటను దెలిసికొనఁదగు దేశ్యపదములను వ్యవహరించుట సకలాంధ్రదేశోపకారమనియుఁ, బ్రాచీనుల యభిప్రాయ మని నిశ్చయింప నవకాశముకలదు. నగరములందును, నగరప్రాంతగ్రామములందును, వాడుకచేయఁబడుభాష దేశ్యమనునట్టి కేతన కిదియే యభిప్రాయ మని చెప్పవచ్చును. ఎట్లనఁగాఁ బట్టణములలో నుండుజనులకుఁ బరస్పరసంబంధముండినట్లు పల్లెలలోనుండువారి కుండదు. పరస్పరసంబంధమున్నప్పుడు భాష యేకీభవించుట కవకాశము గలదు గాన నట్టిభాష దేశవిదిత మని కేతనయూహించినట్లు చెప్పవచ్చు. అట్లు కాని

చో దేశ్యశబ్దసారస్యమునకు భంగముకలుగును. ప్రస్తుతకాలమునం దాంగ్లభాష ప్రచురముగావ్యాపించుటచే నుద్దేశము లేకీభవించుచున్నవి. దేశములోఁ బరస్పరసంబంధములుప్రబలుచున్నవి. అందువలన గ్రంథస్థము లగు దేశ్యములకన్న దేశమందంతటను విదితమైన వ్యావహారికభాషాప్రపంచము పెరిఁగినది. ఇంతకుమున్ను గ్రామ్యములని నిరాకరింపఁబడిన శబ్దములలో ననేకశబ్దములు సకలదేశవిదితములై దేశ్యములని వ్యవహరింపఁదగియున్నవి. ఇట్టియవస్థలోఁ బూర్వులయుద్దేశముల నాలోచింపక వారు చెప్పినమాటలను యథాశ్రుతముగఁ బరిగ్రహించి ప్రస్తుతము దేశ్యములుగానున్నను, బూర్వులట్లు వ్యవహరింపలే దనుకారణమున వానిని నిరాకరించినచోఁ గాలస్వభావము చేత మారుచుండెడి భాషలోఁ గొంతకాలమున కీభాషాప్రపంచమంతయు, గ్రంథములలోఁ జేరకుండుటచే నశించి నిరుపయోగమగును. ఇట్టి భాషాప్రపంచమును నిరుపయుక్తముగఁ జేయుటయుచితమా యనునంశము ప్రాజ్ఞు లాలోచింతురుగాక, సంస్కృతభారతాదిగ్రంథముల నాంధ్రీకరించిన యాదికవులయుద్దేశము నాలోచింపుఁడు, సంస్కృతభాష యందఱకుం దెలియుట కష్టముకాన దానినాంధ్రీకరించినచో భారతాదులలోని విషయము లాంధ్రదేశస్థుల కందఱకును సుగ్రహము లగుననియేకదా ! వారియుద్దేశము. ప్రకృత కాలమునఁ బ్రసిద్ధము లగుశబ్దములను విడిచి పూర్వకాల ప్రసిద్ధము లగుపదములను మాత్రము వాడుక చేయుచుండినచోఁ గొంతకాలమునకు సంస్కృతభాషాగ్రంథములను బోలి యాంధ్రభాషాగ్రంథములును దుర్బోధము లై సర్వసామాన్యముగా నుపయోగింపఁ బడకుండుటచేతఁ గ్రమముగాఁ బూర్వులయుద్దేశములు నిష్ఫలము లగును, భాష యభివృద్ధిచెంద నవకాశముండదు. అసంస్కృతముగా నీవ్యావహారికభాషతో గ్రంథములు వ్రాసినచో నియమములేక భాషాగౌరవము చెడునని శంకింపవచ్చును. కాని వ్యావహారికభాష నారీతిగనే యుపయోగించి నప్పుడే యట్టిదోషము ప్రకృత వ్యావహారికభాషలో సకలదేశ విదితములును, కర్ణసుఖకరములును నగుశబ్దముల నుపయోగించి క్రమముగ సంస్కరణము గావించినచో నట్టిదోషమున కవకాశముండదు. ఇట్టి సంస్కరణము సంస్కృతభాషయందును గానవచ్చుచున్నది. అదెట్లన, "తనుగాత్ర" యనుశబ్దము స్త్రీబోధకమైనప్పుడు "తనుగాత్రా"యని యుండవలయునని మునిత్రయమతము. కాలక్రమమునఁ గాళిదాసాది మహాకవులు "తపతి తనుగాత్రి మదనః" అని యిట్టులీకారాంతముగాఁ బ్రయోగింప వాని ననుసరించి వామనుఁడు "అంగగాత్ర కంఠేభ్య ఇతి వక్తవ్య"

మ్మని తత్సాధుతాబోధక మగువార్త్తికమును రచించెను. ఇట్లే "సుభ్రు" అను హ్రస్వాంత సంబోధనాంతము మునిత్రయాభిప్రేత మైనను "హాపితః క్వాసి హేసుభ్రు" అనుభట్టిప్రయోగాదుల ననుసరించి ముగ్ధబోధము మొదలగు వ్యాకరణములలోఁ దత్సంస్కార మొనరించిరి. ఇట్లనేక ప్రయోగములు నిటీవల మహాకవులు వ్యవహరింప వాని ననుసరించి సంస్కరణములు జరిగినట్లు తత్తద్గ్రంథపరిశీలనకాలులకు స్పష్టమగును. ఆంధ్రభాషయందును నాయాకాలములందలి నూతనమహాకవిప్రయోగముల ననుసరించి నూతనసంస్కరణములు జరిగినట్లు నిదర్శనములు కలవు. ఇప్పటికిని వ్యాకరణనిబంధనములకు మీఱినమహాకవిప్రయోగము లనేకములు కలవు. గ్రామ్యంబు లైనను నార్యులచేఁ బ్రయుక్తము లయినచో గ్రాహ్యంబు లని పల్కుచిన్నయసూరి యట్టి ప్రయోగములకు సాధుత్వము నంగీకరించెను. ప్రస్తుతకాలమునందు మహాకవులు రసానుగుణముగ గొన్ని శబ్దములను వ్యవహరించినచో నవియునునార్యప్రయుక్తములై సాధువులు కాకపోవునా? ప్రాచీనకవుల కట్టిస్వాతంత్ర్య మ్ముండుటకును, ప్రకృతకవులకు లేకుండుటకును, గారణ ముండునా? గ్రంథకర్త్తలు కాకుండినను బ్రాజ్ఞులగు నాగరకు లార్యులు కాకుందురా? వారి వ్యవహారము గూడ నేలగ్రాహ్యము కాఁగూడదు? కాన నాంధ్రభాషాభివృద్ధియం దుత్సాహముగల మహాకవు లావశ్యకమైన ప్రాచీననిబంధనముల మీఱక యిదివఱకు గ్రంథములలోఁ బ్రయోగములు లేకపోయినను ప్రకృతమందాంధ్రదేశమం దంతటను నాగరకవ్యవహారప్రసిద్ధములును, శ్రవణసుఖకరములును, రసానుగుణములును, నైననూతనప్రయోగములను జేర్చి రసవత్తరములైన కావ్యములు రచించినచోఁ గాలక్రమమున నవియును మహాకవిప్రయోగములై సంస్కరణార్హము లగును. అట్లయిన భాషయభివృద్ధిచెందును. "పురాణమిత్యేవ నసాధుసర్వం నవీనమిత్యేవ నచాప్యవద్య" మ్మనెడి సూక్తిని స్మరింపుఁడు. సామాన్యజ్ఞానముతో గ్రంథములం జెప్పఁబూని కావ్యగుణముల గమనింపక యుచ్ఛృంఖలత నవలంబించి నూతనప్రయోగముల నుపయోగించుచుఁ గోశముల నుండి పదములను సంగ్రహించి యర్థముండినను, లేకపోయినను, రసముండినను లేకపోయినను, భాషను ఛందస్సులో నిముడ్చుటయే కవితాధర్మమని యెంచి గ్రంథములువ్రాయుటయే కవితకు వైరూప్యమును దెచ్చునుగాని రసపుష్టియుండినచో నితరములేవియును గవితావైరూప్యసంపాదకములు కావు. నూతన శబ్దముల నుపయోగించినచో నప్రయుక్తదోషము వచ్చునని శంకింపఁగూడదు. అప్రయుక్తము లవిదితములై

యర్థోపస్థితివిలంబమును గల్గించిన రసస్ఫూర్తి ప్రతిబంధకము లగుననియే యప్రయుక్తత్వదోష మనువారియభిప్రాయము గాని యవి ప్రత్యవాయహేతువు లని కాదు. నూతనప్రయుక్తములు శీఘ్రార్థోపస్థితిజనకము లైనచో నచట దోషమున కవకాశ ముండదు. కాన గ్రామ్యము లని యిదివఱకు నిరాకరింపఁబడెనను భయమును విడిచి సర్వజనవిదితములును నాగరకవ్యవహృతంబులును, రసానుగుణంబులును నగునూతనశబ్దములను జేర్చి మహాకవులు గ్రంథముల వ్రాయుట ప్రకృతకాలోచితమును, భాషాభివృద్ధికరమును నగును. ఆగ్రంథములు రసికాహ్లాదకరములగునప్పుడు గ్రామ్యములు కాకమానవు. ప్రాచీననిబంధనములకన్నిటికి లోఁబడి వ్రాసినను, రసికజనాహ్లాదకములు కానిచో నవి గ్రామ్యము లని ఘోషించినను, గ్రామ్యములుకావు. గ్రామ్యాగ్రామ్యత్వములకు రసతదభావములే ముఖ్యకారణములు "అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్య" మ్మను ప్రాచీనకావ్యలక్షణమును నిరసించి "వాక్యం రసాత్మకం కావ్య" మ్మనెడికావ్యలక్షణమును బరిష్కరించిన విశ్వనాథపంచాననున కిదియే యభిప్రాయ మని నిశ్చయింపవచ్చును.

## — అసభ్యవర్ణనములు —

శృంగారరసప్రధానము లగు ప్రబంధములు కలవు. వ్యంగ్యమర్యాద ననుసరించినంతవఱ కవి సరసములగును. వ్యంగ్యమర్యాద నుల్లంఘించి వాచ్యవృత్తికి సన్నిహితములైనప్పు డవి వైరస్యమును బుట్టించును. కాలభేదముచేత నొక్కొకయంశము తత్కాలమునం దాహ్లాదకమైనను గాలాంతరమున జుగుప్సాకర మగును. కొన్ని కాలములలోఁ గొందఱు ప్రధానపురుషు లతికాముకులై యుండఁ దదనుయాయులు వారిప్రీతికై యౌచిత్యమును విడిచి యాప్రధానపురుషుల యుద్దేశానుకూలముగఁ బ్రవర్తించి వారియుల్లాసానుసారముగ మార్దవమును మించిన శృంగావర్ణనలను జేయుచు వచ్చిరి. క్రమముగా నిదియే కవితాధర్మ మని యెంచి రహస్యమునఁ గులాంగనలు దమభర్తలను గూడునపుడు నేయంశములను ముచ్చటించిన లజ్జను జుగుప్సను బొందుదురో యట్టియంశములను గ్రంథములలో వర్ణింపఁదొడఁగిరి. అట్టియంశములు విటవేశ్యాసంఘములలో సొంపుగనుండును గాని నాగరకులయొక్కయు గులాంగనలయొక్కయు, సంఘములలో జుగుప్సాకరములును, లజ్జాకరములును గాకమానవు. ప్రకృతకాలమున స్త్రీవిద్య క్రమమున నభివృద్ధిఁ గాంచుచున్నది. ఇట్టిసమయమున నాగరకతగలవారి కేయంశములు

వర్ణ్యము లగునప్పుడు లజ్జాజుగుప్సాదులు కలుగకయుండునో యట్టివర్ణనలతో నుండుట యుచితము. కాని విటవేశ్యాదిసంఘములలో మాత్రము ముచ్చటింపఁ దగిన వర్ణనములతోఁ గూడియుండుట యుచితముకాదు. ఆలంకారికు లట్టియంశ ముల నర్థగ్రామ్యములుగాఁ బరిగణించి నిరాకరించిరి. అర్థగ్రామ్యతయుఁ గాలభేదము చేత మారుచుండును. ఆలంకారికులకాలముకంటెఁ బ్రకృతకాలమున నాగర కతవృద్ధి నొందుచుండుటచే మఱికొన్నిటి నర్థగ్రామ్యములలోఁ జేర్చి గ్రంథము లందు నిరాకరించుటవలన నాగరకత యభివృద్ధినొందఁగల దని తలంచెదను.

## —అర్ధానుస్వారశకటరేఫములు—

భాషయనఁగా స్వాభిప్రేతార్థమును నితరులకు వ్యక్తపఱుచుటకై యుచ్చారితవర్ణసమూహము కాని వర్ణానురూపక రేఖాసముదయము కాదు. ఈనిర్వచనమును, మహాభాష్యమునందుఁ బతంజలి "యే నోచ్చారితేన సాస్నాదిమానర్థః ప్రతీయతే సశబ్దః" అనుగ్రంథముచే స్పష్టపరిచెను. "ఉచ్చారితఏవశబ్దః ప్రత్యాయకో నానుచ్చారితః" అను భాష్యగ్రంథముగూడ నీనిర్వచనమునె సూచించుచున్నది. పూర్వకాలమునఁ గొన్నిభాషలు లిపిలేక కొంతకాల ముండినవి. మఱి కొంతకాలమునకు లిపికల్పింపఁబడినది" యను చరిత్రాభిజ్ఞులవ్యవహారమును నీయంశమునే పోషించుచున్నది. ప్రస్తుతకాలమునఁ గొన్నియారణ్యభాషలకు లిపి లేదనునట్టి యనుభవము పైవిషయమును దృఢపఱుచుచున్నది. ఈనిర్వచనమును బట్టి చూడఁగా నుచ్చారణభేదము లేనిచో లిపిభేదము శబ్దభేదప్రయోజకము కానేరదు. అట్లుకానిచో సంస్కృతాంధ్రద్రావిడాది లిపులచేత ననుమితమగు నొక్కసంస్కృతశబ్దమునకు లిపిభేదముచే భేద ముండవలయును. అట్లు భేద ముండుట యనుభవసిద్ధము కాదు. ప్రకృతకాలమున నర్ధానుస్వారరేఖ యుచ్చారణభేదజ్ఞాపకము కాకుండుటచే నిది యనావశ్యకము. విమర్శింపఁ గొన్నిచోట్ల నీయర్ధానుస్వార మర్థవిశేషప్రతీతికి సహకారియగుచున్నది. పుస్తకము చూచువాని కట్లుపయోగకరమైనను, నోరుచ్చరించుదానిఁ వినెడువారికీయర్ధానుస్వార రేఖ యేమియు నుపయోగింపలేదు. "ఉచ్చారితఏవ శబ్దః ప్రత్యాయకో నానుచ్చారితః" అనుభాష్యమున కర్థపర్యాలోచనముచేసినచోఁ బుస్తకమును జూచు వానికిని నుచ్చారణము లేనపుడర్థప్రతీతి యుండదు గాన యుచ్చారణములో భేదగ్రాహకము కానియీయర్ధానుస్వారానుమాపక రేఖ యుండుటకు నుపయోగ

శూన్య మని చెప్పవచ్చును. ఈయర్ధానుస్వార రేఖ పూర్వాచ్చు ననునాసికగా నుచ్చరించుటలో సాయపడును. దానిని బట్టి యనునాసికగా నుచ్చరింపఁబడిన యచ్చు విశేషార్థప్రతీతిలో సహకారి యగును. అందువలన దీనియుపయోగము స్పష్టమని శంకించిన శంకింపవచ్చును. కాని యట్లుస్పష్టోచ్చారణ ముండినకాలమున నదిసార్థకమైయే యుండెను. అట్టియుచ్చారణము లేనియిక్కాలమం దది నిరర్థక మని చెప్పుటకు సందేహముండదు. అనునాసికపాఠపరిభ్రంశ మాంధ్రభాషలోనేకాక సంస్కృతభాషలోఁగూడ నున్నట్లు కానవచ్చుచున్నది. కనుకనే "చక్రింస్త్రాయస్వ" "హరాంస్తారాః" "సంస్కృతమ్" మొదలగు లక్ష్యములలోఁ బ్రథమవిహితమైన యనునాసికనువిడిచి యనునాసికాభావపక్షమున విధింపఁబడిన యనుస్వారఘటితరూపములు మాత్రమే కవులచేత వ్యవహరింపఁబడుచున్నవి. అనునాసికపాఠము భ్రష్టమైనట్లు "ప్రతిజ్ఞానునాసిక్యాః పాణినీయాః" అను సిద్ధాంతకౌముదీవ్యాఖ్యానావసరమున లఘుశబ్దేందుశేఖరమున నాగేశోపాధ్యాయునిచే వ్రాయఁబడియున్నది. ఇట్లేయర్థవిశేషప్రత్యాయకమైనను ద్విస్వరపాఠము లౌకికసంస్కృతభాషలో భ్రష్టమైనట్లు సర్వానుభవసిద్ధమైయున్నది. అనునాసికపాఠపరిభ్రంశము లోకమందునేకాక వేదమందుసైతము కానవచ్చుచున్నది. తైత్తిరీయప్రాతిశాఖ్యలోఁ బదునేనవయధ్యాయమున 1, 2 సూత్రములందును, దదితరస్థలంబులందును, బెక్కుచోట్లఁ గనబడుచున్నది. ఇట్లుచ్చారణభ్రంశమగుటచే నుచ్చారణములో భేదములేనప్పుడర్ధానుస్వారానుమాపకరేఖ శ్రమమాత్రఫలకమని పండితులకు గోచరింపకపోదు. ఇఁకనీయర్ధానుస్వారము శాస్త్రబోధితమగుటచే దీనిఁబరిత్యజించుట యుచితము కాదని కొందఱు శంకింపవచ్చు. కాని యార్యులచే మూర్ధన్యభాషగా నంగీకరింపఁబడిన సంస్కృతభాషలో వర్ణద్విత్వమును బోధించు పాణిన్యాదిమునివిరచితశాస్త్రములకు "నహి వ్యంజనాత్పరస్యైకస్యానేకస్యవా ఉచ్చారణే విశేషః" అనుమహాభాష్యకారప్రత్యాఖ్యానమువలన నుచ్చారణవిశేషము లేనపు డట్టివర్ణలేఖనము కాని యట్టివర్ణములబోధించుశాస్త్రముకాని పరిత్యాజ్య మని సూచింపఁబడియున్నందున నట్టిపరిత్యాగము దోషము కాదని సమాధానము చెప్పవచ్చు. ఇఁక నర్ధానుస్వారమువలనఁ గలుగువిశేషార్థనిర్ణయ మెట్లుగలుగు నని యందురేని నానార్థకశబ్దప్రయోగములలో విశేషార్థనిర్ణాయకము లగుప్రకరణాదులచేత గలుగునని గ్రహించునది. ఇట్లే శకటరేఫ మనావశ్యకమని యూహించునది. ఆలోచింప నీశకటరేఫార్ధాను

స్వారములు భాషాచరిత్రమును దెలిసికొనుటకుఁ గొంతసహాకారు లగుచున్నవి. కాని యాయుపయోగము ప్రస్తుతమున నుండెడి యాంధ్రవ్యాకరణాదులవలన సిద్ధించును. అట్లుసిద్ధింపనివిషయములలోఁ బ్రకృతకాలమం దెవరైన విద్వాంసులు శకటరేఫార్ధానుస్వారములవలనఁ దెలియఁదగిన భాషాచరిత్రగ్రంథము నొకదానిఁ వ్రాసి మిగిలినవారికీనిరర్థకశ్రమను దగ్గించినచో వారియుపకారము సర్వజనశ్లాఘనీయ మని తలంచెదను.

## — సంధి —

ఇఁకను సంధినిగురించి విమర్శించి చూతము "సంహితైకపదే నిత్యా నిత్యా ధాతూపసర్గయోః। నిత్యాసమాసే వాక్యేతు సా వివక్షా మపేక్షతే" యనునభియుక్తోక్తివలన సంధి వాక్యమునం దైచ్ఛికమని లభించుచున్నది. అయినను సంధి లేకుండుట కావ్యదోష మని యాలంకారికులు వక్కాణించిరి. దోషమనఁగా రసభంజకమని వారి నిర్వచనము. ఈనిర్వచనమును బట్టి చూడ రసభంజకము కానిచో విసంధి దోషము కాదని లభించుచున్నది. కనుకనే ఖేదాశ్చర్యాదికము ద్యోత్యముకావలసినచోట విసంధి దోషము కాక గుణమగు ననియు వక్కాణించిరి. కొన్నిచోట్ల విసంధి రసపోషకమగునని యాలంకారికుల ముఖ్యాభిప్రాయమైయున్నప్పు డనియమముగా విసంధిని వాడుకచేసినచో విసంధివలన గలుగు రసపుష్టికిఁ గొన్నిచోట్ల భంగముగలుగును. కనుక నిట్టి వ్యవస్థకై సంధి యావశ్యకము. ఇంతియకాక సంధి ప్రస్తుతవ్యవహారములో నుండఁగా దానిఁబరిత్యజించుట యుచితముకాదు. దీర్ఘవాక్యములలో నూపిరి చాలనప్పుడు విసంధి సహజమగుటచే దానిఁ బరిత్యజించుట శక్యముకాదు. వాక్యాంతమున విసంధి దోషము కాదనెడి వారికి దీర్ఘవాక్యము లుండఁగూడదని యభిప్రాయమని యూహింపవచ్చును. అట్టిదీర్ఘవాక్యములు విలంబముగా నర్థోపస్థాపకము లగుటచే రసస్ఫోరకములును గావు. కావ్యము రసజీవిత మని యెల్లరకుం దెలిసినవిషయమే. వాక్యమధ్యమున నన్నిగ్రంథములందును, గుళికస్థలములలో విసంధి యంగీకరింపఁబడినది. కుళికము షష్ఠ్యంతములలోఁ గవులచేత వాడుకచేయఁబడినది. కాని నన్నయభట్టు వాడుకచేసినట్లు కానరాదు. ఈకుళికము రసానుకూలము కాదు. కుళికము వాక్యరూపవిశేషణగతిలో నుండినచో రసాపకర్షకముకాదు. సమాసములో సంహిత నిత్యమనుటవలన దీర్ఘసమాసము లుండఁగూడదని స్పష్టమగుచున్నది. అట్టిదీర్ఘసమాసములను వాడుకచేసినచోట నూపిరిచాలనప్పుడు విసంధి సహజముగా రాక

మానదు. అది ప్రాచీనులయుద్దేశమునకు విరుద్ధమును, రసభంజకమును గాన దీర్ఘసమాసము లుండుట మంచిది కాదు. మఱియు నచ్చులు లేకుండ హల్లుల నుచ్చరించుటలో నెంతకష్టమో హల్లులు లేకుండ నచ్చుల నుచ్చరించుటలో నంతకష్టమున్నట్లనుభవసిద్ధమైయున్నది. సంధి లేకుండఁ గొన్ని యజాదిపదముల నొకయూపిరితోఁ బలుకునప్పు డట్టికష్టము సంభవింపక మానదు. పదములను భిన్నభిన్న శ్వాసములతో నుచ్చరించినచో శాబ్దబోధసామగ్రీఘటక మగు సన్నిధి లేకుండుటచే బోధము కలుగక పోవును. సాన్నిధ్యానుసంధానముచేఁ గలుగునని యందురేని యా సాన్నిధ్యానుసంధానము చేసికొనుటయే క్లేశమని చెప్పవచ్చును. సంధిచేయకుండ నుచ్చరించినచోఁ బదము లసందిగ్ధముగ సాధారణజనులకును గ్రహింపఁదగియుండును గనుక సంధిని విడుచుట యుచితమని కొందఱయభిప్రాయము కాని యది బాగుగా నాలోచింప నప్రశస్తమని స్పష్టమగును. ఎట్లన శక్తిగ్రాహకమూర్ధన్య మగు వ్యవహారమువలనఁ బ్రథమమున వాక్యములందే శక్తిగ్రహము గలుగును. పిమ్మట బోద్ధల కావాపోద్వాపములచేఁ బదములందు శక్తిగ్రహము గలుగును. పదశక్తిగ్రాహకము లగు నావాపోద్వాపములే పదముల నసందిగ్ధముగ బోధించును. కనుక విసంధి పదములయసందిగ్ధత కసాధారణకారణము కాదు. మఱియును సంధి యనేకస్థలములలో శ్లేష కుపజీవ్యమై యున్నది కావున సంధి యనేకోపయోగములు కలదగుటచేతను, సంధి విడుచుటలో లాభము విశేషించి కనుపింపక పోవుటచేతను, సంధిని త్యజించుట యుచితము కాదని తలంచెదను.

తాతా-సుబ్బారాయశాస్త్రి.

# గ్రామ్యవాదుల భాషాపవాదము.

హరిహరీ! మన గ్రాంధికాంధ్రభాష మరణించినదా? ఎప్పుడు? ఎవ్వరును వినలేదే? ఈయాకస్మికోపద్రవ మేల కలిగినది? ఈనడుమ భాష కస్వస్థతయని కూడ వినలేదే. ఆరోగ్యముగనే యున్నదని యందఱుఁ జెప్పుకొనుచుండిరి కాదా! అందులో నలువది యేఁబది సంవత్సరములనుండి మఱింత నీరోగస్థితిచే విరాజిల్లుచున్నదే! దేహదార్ఢ్యము కలిగి హృదయోల్లాసము కలిగి చకచకలాడుచు నెక్కడఁజూచినఁ దానయై ప్రకాశించుచున్నది కదా! మునుపటి తట్టరాగిడులతో, బుట్టకొప్పులతో వెఱ్ఱిగ సింగారించుకొనుట మాని నూతననాగరకతకర్హములైన యొకటిరెండు భూషణములు మాత్రమే ధరించి ముసిముసి నగవుల మిసమిసలతో బుగ్గగులాబుల బుగబుగలతోఁ గన్నులపండువు సేయుచున్నదే! ప్రస్తుతకాలానుసారముగఁ బ్రస్తుతజనచిత్తరంజకముగఁ బ్రాచీనబడబడాయనూన శబ్దాడంబరములు, సందిగ్ధసంభాషణములు వివిధాభిప్రాయప్రకాశకవచోవైఖరులు నాంతరంగకాఠిన్యము వదలుకొని పువ్వులవలె నవ్వులవలె మృదులములైన లలితములైన ముద్దుముద్దుపలుకులతో—స్పష్టములై స్వచ్ఛములైన దాఁపఱికములేని విడివిడిపలుకులతో నేకాభిప్రాయబోధకము లగు టకుటక్కుమను నూటిపలుకులతో—నవఁటిపండొలిచి చేతఁబెట్టినట్లు కులుకుచుఁ గులుకుచుఁ బలుకుచున్నది కదా! కొందఱను దనచుట్టుఁ గూర్చుండఁబెట్టుకొని వారికిఁ జిత్రచిత్రకల్పనలు గలస్వకపోలకల్పితకథలను—నేదేని పరభాషాకథలను—సరసముగ సమంజసముగ సందర్భముగఁ జెప్పి హృదయరంజన మొనర్చుచున్నదే! మఱియొకచో నాటకరంగములఁజేరి బంగరుగజ్జెలు గట్టుకొని తాండవమాడుచు ద్రష్టలను గూడఁ దెయితక్కలాడించుచున్నదే! మునుపటి టెక్కు, మునుపటి బిగింపు, మునుపటి "నన్నుముట్టికొనకుఁడనము" విడిచి యాంగ్లేయభాషలో నున్న ప్రకృత్యాదిశాస్త్రములలోని విలువగల పదార్థముల నొడిలో వైచికొని తెచ్చి మనకుఁ గాసంత కాసంతగఁ గోరుముద్దలక్రిందఁ బెట్టి నోరూరఁజేయుచున్నదే! ఎక్కడఁ జూచినఁ దానయై సభాముఖముల నీతినిగూర్చి, రాజభక్తిని గూర్చి, తనసేవనుగూర్చి సింహఘోషమున నుపన్యసించుచున్నదే! లోకవార్తాబోధనమున జనులకు లౌకికజ్ఞానసంపద నీయఁదలఁచి యిటు బ్రహ్మపురము మొదలు

కొని యటుబొంబాయివఱకు నొక్కచోమ్రోఁతగఁ బ్రతిధ్వనులిచ్చునట్లుగఁ బలుకుచున్నదికదా! తననివాసముకొఱకుఁ బట్టనమనక, పల్లెయనక యవకాశమున్నంతవఱకుఁ గొన్ని స్థలములందు మందిరములను గట్టినదే! కొన్నిచోటులఁ గట్టుచున్నదే — మఱి కొన్నిచోటుల శంకుస్థాపనమునకు యత్నించుచున్నదే! బ్రదుకఁదలఁచి—చిరకాలము బ్రదుకఁదలఁచి—శాశ్వతముగ బ్రదుకఁదలఁచి, బ్రదుకనఁగ నింతపామరత్వమునఁ బ్రాఁకులాడుభాష మరణించిన దని గ్రామ్యవాదులు కఠోరముగఁ బలికిరా! పాపము శాంతించునుగాక !!

శత్రుత్వమున్నయెడల సాధించురీతిని సాధింపవలయును గాని చావు వార్తలు వైతురా? నోటి కంకదని, వెగటని, కటువని, కొఱుకఁబడదని, పాషాణమని భాష ననేకవిధముల దుర్భాషలాడినారు. ఈవాగ్ద్రోషము చాలదా? భాషను సేవించి, పూజించి, దానిసాన్నిధ్యముననే నిల్చి, దానికిఁ బామరజనస్పర్శముచే నపవిత్రత గలుగకుండఁ గాపాడుచు, దానికి శక్తివంచనము లేకుండ సర్వోపచారములు సేయుచు, దానికటాక్షమువలననే జీవయాత్ర నడపుకొనుచు, దానికై తమతనువులను బ్రాణముల నర్పింపఁదలఁచి పాటుపడుచుండు పండితోత్తములను బుంఖానుపుంఖముగఁ దిట్టినారు. ఈపండితద్వేషము చాలదా? భాష చచ్చిన దని నోరారఁ బలికినఁ గాని పగ తీఱలేదా ?

పేరు లేని సామాన్యజనుని యథార్థమృతివార్తనే జనులు వెల్లడిసేయుట కిష్టపడరు కదా! మనజాతిలోని భూతభవిష్యద్వర్తమానప్రాణముల కన్నిటికిఁ బ్రాణమైన మన తెనుఁగుభాస చచ్చిన దనునసత్యవార్త వీరెట్లు నోటఁ బలుకుటకు సాహసించిరో! అంతటితో నూరకుండక యీవార్తను గ్రంథస్థము సేయుటకు వీరిగుండె లెట్లుతాళెనో? గ్రామ్యవాదులు విద్యావంతులు బుద్ధిమంతులు గాని వేఱుకారు. వారు బుద్ధిపూర్వకముగ నసత్య మాడువారు కారు. అందులో నిట్టిలోకోపద్రవకరమైన యసత్య మాడుదురా? ఈమాయ యేమో బోధపడకున్నది. భాషలోనే యీయింద్రజాలము నీకనుకట్టు నీద్విముఖత్వము నున్నదేమో? మనకందఱకు జీవకళలను గనఁబఱిచి వారికందఱకుఁ బ్రేతకళలు గనఁబఱుచుచున్నదేమో? ఇంకొకచిత్రము! మ. రా. సెట్టి లక్ష్మీనరసింహముగారు, రావుసాహేబు గిడుగురామమూర్తిపంతులుగారు నొక్క యయ్యవారులయొద్ద విద్య నేర్చినవారే కద! ఒక్కతీరుపలు కాడువారేకద! ఒక్కదారిని బోవువారే కద! రామమూర్తిపంతులుగారికనులకు భాష మొద్దువలె నున్నది. లక్ష్మీనరసిం

హాముగారికనులయెదుట మిలమిలలాడుచున్నది. అందుచేతనే కదా! "Every living language is in a state of continuous growth and development, it is only when it becomes dead, that it becomes stationary Telugu is not a dead language." అని శ్రీలక్ష్మీనరసింహముగారు భాషకు జీవపత్రికను దయచేసియున్నారు. అన్యోన్యవిరుద్ధముగఁ బల్కు నీగ్రామ్యవాదులలో మన కు సూత్రకారు లెవ్వరు? "గ్రీకుమిత్సు, బొప్పుహుపా" ఔత్యాద్యలౌకికగ్రంథ సంధానధురంధరు లగు లక్ష్మీనరసింహముగారా! వారికంటె వయోవృద్ధులుఁ బ్రాపంచికజ్ఞానవృద్ధులు నగురామమూర్తిపంతులుగారా? వీరిమాటలు నమ్మి భాష కుత్తరక్రియ లారంభింపవలసినదా? వారిమాటలు నమ్మి యుపచారక్రియ లారంభింపవలసినదా? కాని వీ రిట్టి చావు బ్రదు కెఱుఁగని మాటలు మాట లాడుచున్నా రేమి? రామమూర్తి పంతులుగా రీడిగువవాక్యములలో భాషామృతిని స్పష్టపఱిచినారు. వారి "A memorandum on modern Telugu" లో "I understand that some of the educated men in the Telugu country are desirous of reforming the modern language and the old grammar and modern vocabulary. This is, in my opinion, unscientific, unnatural and impracticable. This is simply a quixotic method of reforming a language. It is like putting into the skull of a mummy the brains and eyeballs of a living body and hoping to make it think and see" మఱియొకచో నాగ్రంథమందె "The dead language of his poetry which he has substituted Etc.,Etc." మఱియొక చోట "Latin the old literary language of Italy has been dead and unintellegeble to the people (old literary Telugu is now like Latin)." మఱియొక చోట "The Pandit who has no sense of the correct usage of old words naturally commits serious blunders when he attempts to write in a dead languge". గ్రాంథిక భాష మృతభాష కాదని మాయభిప్రాయము. ఏలయన గ్రాంథికభాషాపదములనే కొన్నికొన్ని మార్పులతో మనము మాటలం దుపయోగించుకొనుచున్నాము. మాటలలోని యీమార్పులనునవి వ్యాకరణజ్ఞానశూన్యత్వముచేతను, బలుకుబడిలోని తొందరచేతను, నిజమైన యుచ్చారణము తెలియకపోవుటచేతను, మఱికొన్ని యితరకారణములచేతను గలుగుచున్నవి. శబ్దములలోని యీదోషములు మనదోషమువలననే కలిగినవి. ఇట్టిదోషము లుత్తమవచనగ్రంథములలో వర్జింపవలసిన దని యూనివర్సిటీ వారు ద్రావిడభాషాసంధర్భమున నిట్లు తీర్మానించియుండిరి. "That slang and

other similar irregular forms of expression which are either the result of violation of accepted rules of grammar or are produced by means of contractions or other modifications due to hurry, indifference and ignorance be declared to be unacceptable in dignified prose composition". ఇట్టి దుష్టరూపములు పదములకుఁ బూర్వోదాహృత కారణములవలన వచ్చియున్నంతమాత్రముచేత నీశబ్దములు పూర్వశబ్దములకంటె భిన్నము లని చెప్పఁదగదు. అట్లు చెప్పుట మిక్కిలి యప్రాజ్ఞత. కుష్ఠరోగముచే నొకని కోడ లంతయు వికృతరూప మొందియున్నను నాతఁడు మనుష్యుఁడేకాఁడా? నల్లనియాతఁడు శ్వేతరోగముచే వర్ణవ్యత్యాస మొందినంతమాత్రమున నాతఁడు మఱియొకఁ డగునా? కాలును దెగఁ గొట్టించుకొనినంతమాత్రమున నరుఁడు క్రొత్తయాతఁ డగునా? వీపుపైఁ బెద్దకంతి నూతనముగఁ గలిగిన నరుఁడు కంతికారణమున మఱియొకమానిసి యగునా? అటులే శబ్దము పైఁ జెప్పిన కారణములచే నడిమినడిమివర్ణములలో వ్యత్యాసదశ గలిగినఁగాని, రూపమునఁ గొంతహ్రాస మొందినఁగాని, లేక కొంతయాధిక్య మొందినఁగాని యదియే శబ్దముకాని వేఱుకానేరదు. కావున సంభాషణములోని శబ్దములన్నియు గ్రాంథికశబ్దములే యని యొప్పికొనక తీరదు. కాని యవి కొందఱ మనుజుల దంతములక్రిందఁ బడి నలఁగినవి; తెగినవి; సాఁగినవి; చప్పఁబడినవి. కానిండు! ఎటులైన నవి గ్రాంథికశబ్దములే. ఇట్టిదుర్దశ నందినయట్టి గ్రాంథికభాషనే మనము సంభాషణములో నుపయోగించుకొనుచున్నాము. ఏదీ? ఒక్క తెలుఁగుపదము—గ్రాంథికభాషలో లేనిది, గ్రామ్యభాషలో నున్నది, మీరు చెప్పఁగలరేమో యోజించుకొనుఁడు. అట్లుండుటకు సాధ్య మెట్లున్నది? కావున సంభాషణములో నుపయోగించుకొనుచున్న భాష గ్రాంథికభాష—చెడిన గ్రాంథికభాష—మారవస్థ నొందిన గ్రాంథికభాష యైయున్నది.

అట్టి గ్రాంథికభాషను సంభాషణములో వాడుక చేసికొనుచు "గ్రాంథికభాష మాటలలో నుపయోగింపఁబడునది కాదు, కావున నది చచ్చిన" దని వాదించుట ప్రాజ్ఞలక్షణమా? అది మననోటఁ బడకపోవుటచేతఁ జచ్చిన దనుట కంటె నోటఁ బడుటచేతనే చావునకు సిద్ధమైయున్న దని యనుట యథార్థముగ నుండును గాదా?

బొబ్బిలిపాట బజారులో విని మాయింటిప్రక్కనుండి వారియిండ్లకుఁ బోవు నిద్ద ఱిట్లనుకొనుచుండిరి. "ఇజానగరం రాజు మామోసం చేసాడ్రా. బూసీతో

యాకమై పంపింటిబొబ్బిలోరిని పాడుచేసాఁడా." యని యొక్కఁడనఁగ "బొబ్బిలోరు బొబ్బిలోరంటే నాకు బోదపల్లెదెవర్రా" యని యింకొక్కఁడనెను. అంత మొదటివాఁడు "రామేణ మంతాయిని రావుడికి చీత యావాద్దన్నట్టుందిరా! బొబ్బిలోరనఁగ మఱిగత్తే మనపూరెలమోరేరా! శెన్నపట్ణమాయన్ని మనపెద్దరాజుగారు దత్తుచేసుకొన్నట్టే బొబ్బిలిరాజుగారు మనరాజుగారి తాతగారినిగంబోల్రా దత్తుచేసుకొన్నారు. ఇది తాతల్నాటి కత" యనిపలికెను. ఈసంభాషణములోని పదములు గ్రాంథికపదములు కావా? పరమమూఢులు సహితము గ్రాంథికభాషాపదములనే యుపయోగపఱచుకొనుచున్నారు. తప్పుగ నుపయోగపఱచుకొనుటకు వారిమౌఢ్యమే కారణము. తప్పుగనో యొప్పుగనో పండితులు పామరులు నందఱును గూడ గ్రాంథికభాషాపదములనే యుపయోగించుకొనక తప్పదు. గ్రామ్యభాషలో నతిసులభముగ గ్రంథము వ్రాయసంకల్పించుకొనిన మ. రా. శ్రీ. సెట్టి లక్ష్మీనరసింహముగారు తమ "Greek myths" అనుగ్రంథము రెండవభాగమున 82 వపేజీలో 22పంక్తులలో 29 సంస్కృతపుమాట లుపయోగించిరి. "రాజకీయవ్యవహారము, హాస్యాంగుఁ" డను మొదలగు సమాసముల సహితమొక్క మాటగనే గణించితిమి. మనమనసులోని గంభీరాభిప్రాయములను వెల్లడింపవలయు నని గ్రాంథికభాషకంటె మఱియొక దారి లేదు. ఏల? మాటలాడుకొనుభాషలో ననఁగ—గ్రామ్యభాషలో నేమంతపదజాల మున్నది! ఆహారనిద్రాసంగమ విషయికాభిప్రాయముల వెల్లడించుటకుఁ దగినకొన్నిమాటలేకాని యంతకంటె నెక్కుడు మాట లెక్కడివి? రాజసేవార్థములైన మాటలేవి? సభాసమర్థములైన మాటలేవి! దేవప్రార్థనాది కార్యార్థము లగుమాటలేవి? మతవిషయికము లగుమాటలేవి! నీతిప్రతిపాదకము లగుమాటలేవి! బహిఃప్రాపంచిక బోధకము లగుమాటలేవి! ఆంతరప్రాపంచిక జ్ఞానబోధకము లగుమాటలేవి! "రాజు"నకు గ్రామ్యమున నేమున్నది? "ఏలిక" యని యున్న దందురేమో? కాని "యేలిక" యని మాటలలో వాడుకొనుచుంటిమా? "మంత్రి" కేమున్నది? "మనుష్యు"న కేమున్నది? "ప్రాణము"న కేమున్నది? మనస్సు, దేహము, ధ్యానము, నీతి, వీథి, పుస్తకము, దయ, దానము, ధర్మము, సత్రము, వ్యవసాయము, (కృషియనునర్థమున) వేదము, పురాణము, ప్రపంచము, నీరము మొదలగు పదములకు గ్రామ్యమున నేమున్నవి? కూటిగుడ్డమాటలతో గుడుగుడు గుంచములాడఁ దగిన గ్రామ్య భాషలో వేల

కొలఁది యిట్టి గ్రాంథిక భాషాపదములను వ్రాసుకొనుచు గ్రాంథిక భాష వ్రాయుటలో లేదని యనుటకు నో రెట్లు వచ్చినదో వింతగనున్నది! గ్రాంథిక భాష నంతబహుళముగ నుపయోగించుకొనుచు నది లేకుండిన యెడల నొకని యభిప్రాయ మొకనికి వెల్లడికాకపోవుటచే మనమే చావవలసి యున్నప్పు డది చచ్చె నని పలుకుట భాషయెడలఁ బూర్ణమైన విశ్వాసఘాతుకత సూచించుచున్న దని మాయభిప్రాయము. నిత్యోపయోగములో నున్న భాష చచ్చిన దని చెప్పుటయు సూర్యుఁడు కాంతిహీనుఁ డని చెప్పుటయు నొక్కటియే. భాష చచ్చిన దనుమాట కేవలమసందర్భము. అహేతుకము.

సంస్కృతభాష మృతభాష యని సామాన్యాభిప్రాయమై యున్నది. కాని సంస్కృతభాషాపరిచయము పూర్ణముగ సంపాదించియున్న పాశ్చాత్యులలో మహనీయుఁ డగు (Max Muller) దొరగారు వేఱుగ నభిప్రాయ పడుచున్నారు. వారిమాటలను గ్రిందనుదహరింతును.

"Sanskrit, therefore, as a language spoken by the people at large had ceased to exist in the third century B. C. Yet, such is the marvellous continuity between the past and the present in India, that in spite of repeated social convulsions, religious reforms and foreign invasions, Sanskrit may be said to be still the only language that is spoken over the whole extent of that vast country." అని చెప్పియున్నారు. భరతఖండమునం దంతట నిప్పటి వఱకు సంస్కృత మొక్కటే సంభాషణమున కుపయోగింపఁబడుచున్న భాష యని కంఠోక్తిగఁ జెప్పినారు. సంభాషణార్హమైన భాష చచ్చిన దని గ్రామ్యవాదు లనఁగలరు; కాని గ్రాంథికభాషాపండితుఁ డగు (Max Muller) గా రనుటకు సాహసింతురా? అంతేకాక దాదాపుగ నన్నివిధము లగు వ్రాఁతలు నప్పటికి (1892) సంస్కృతముననే వ్రాయఁబడుచున్న వని యిట్లు వారు చెప్పుచున్నారు.

"Though the Buddhist sovereigns published their edicts in the vernaculars, public inscrptions and private official documents are composed in Sanskrit to the present day ........ the literature of India never ceased to be written in Paninean Sanskrit ...... .. Even at the present moment after a century of English rule and English Teaching, I believe that Sanskrit is more widely understood in India than Latin was in Europe at the time of Dante.

Whenever I receive a letter from a learned man in India it is written in Sanskrit Whenever there is a controversy on questions of law and religion the pamphlets published in India are written in Sanskrit There are Journals written in Sanskrit which must entirely depend for their support on readers who prefer that classical language to the vulgar dialects. There is the "Pandit" published at Benares containing not only editions of ancient texts but treatises on modern subjects, reviews of books published in England and controversial articles all in Sanskrit.

* * * *

Still more extraordinary is the number of Sanskrit texts issuing from native presses for which there seems to be a large demand, for if we write for copies to be sent to England, We often find that after a year or two, all the copies have been bought up in India itself. That would not be the case with Anglo Saxon texts in England or with Latin texts in Italy. But more than this we are told that the ancient epic poems of Mahabharata and Ramayana are still recited in the Temples for the benefit of visitors." (అడుగునగీంతలు మావి) ఇటులే (Max Muller) గారు సంస్కృత భాషావ్యాప్తినిగూర్చి మఱికొన్ని యంశములు వ్రాసిరి. సంస్కృతభాషలో 1892 సంవత్సరమువఱకనేక గ్రంథములు పుట్టుచున్న వనియును, ననేకపత్రికలు ప్రకటింపఁబడుచున్న వనియుఁ, బురాణాదులు సంస్కృతమునఁ బఠింపఁబడుచున్న వనియుఁ, దనకుత్తరములు సంస్కృతమున వచ్చుచున్న వనియు, శాస్త్రవాదములు సంస్కృతమున జరుపఁబడుచున్న వనియు నెన్ని సంస్కృతగ్రంథములైనను గాలాతీత మగునెడల నింగ్లాండువారికి మిగులకుండ హిందూదేశముననే పాఠకులు కొనుచున్నారనియు, భాషాజ్ఞానము భరతఖండమునందంతవ్యాపించియున్నదనియు, సంస్కృతభాషను ధారాళముగ మాటలాడ సమర్థులగుపండితులు గలరనియు, నది (Anglo Saxon, Latin)వంటి మృతభాష కాదనియు, నొక్కసంస్కృతభాషయే భరతఖండమునందంత సంభాషణములో నున్నభాష యని చెప్పవచ్చు ననియు వారు వెల్లడించిరి. అందుచే నొకవిధముగ సంస్కృతభాష చావలేదనియే వారియభిప్రాయమైనట్లు స్పష్టమగుచున్నది. "India - what it teaches" అను వారి గ్రంథములో మూఁడవ యుపన్యాసమును భాషాభిమానులందఱుఁ జదివి సంతసింపవలసిన దని మాప్రార్థనము.

సంస్కృతభాషయే మృతభాష కాదని స్పష్టముగఁ గనఁబడుచుండఁగ నిఁక నాంధ్రభాష మృతభాష యని చెప్పనొప్పునా? ఊరెగిరిపోవునట్లు మాటలాడుచున్న యుపన్యాసకర్త మూఁగవాఁడని చెప్పుటకుఁ జెవిటివాఁడైన సాహసించునా? నిరంకుశముగ నాకసమున నెగురుపక్షికి ఱెక్కలు లేవని వాదింపవచ్చునా? సంవత్సరమున కొక్కపిల్లను గనునిల్లాలు గొడ్డా లని పలుకఁ దగునా? ఉన్నవాఁడు లేనివాఁడని యనవచ్చునా? ఆంధ్రభాషలో సంవత్సరమున కెన్నియో గ్రంథములు పుట్టుచుండఁగా, జిల్లాకు మూఁడేసి నాలుగేసి యాంధ్రపత్రికలు ప్రచురింపఁబడుచుండఁగా, నెల కెన్నియో యుపన్యాసము లాంధ్రమున బయలువెడలుచుండఁగా, నుదయమున లేచినదిమొదలు తిరుగఁ బండుకొనువఱకు నాంధ్రభాషలోఁ దఱుచుగ మనము మాటలాడుకొనుచుండఁగా, నిద్రలో—సన్నిపాతరోగావస్థలోఁ గూడ నాంధ్రమునే మన ముచ్చరించుచుండఁగా నాంధ్రభాష చచ్చినదా!! మనకు భాషాభిమానము చచ్చినదిగాని భాషచావలేదే! మనకు భాషాజ్ఞానము చచ్చినది కాని భాషచావలేదే! భాషను వృద్ధిపఱుచుకొను నేర్పు మనకుఁ జచ్చినది కాని భాషచావలేదే! మనసంబంధమైన దేదైనఁ జచ్చియుండును, జావవచ్చును గాని మనభాషమాత్రము చావలేదు; చావదు.

గ్రాంథికభాష మృతభాష యనునంశమే గ్రామ్యవాదులవాదమున కాయువుపట్టు. ఇది నిలువఁబడినఁ గాని వారివాదము నిలువఁబడదు. అది యాయుర్గ్రంథి యన్నమాటయే కాని యాముడి ముట్టుకొనుసరికే వీడిపోవుచున్నది. శ్రీశంకరాచార్యులవారు బౌద్ధమతఖండనప్రశంసలో బౌద్ధవాద మిసుకనూయివలె నున్న దని సెలవిచ్చి రని వింటిమి. ప్రయత్నమునఁ బూడ్చ నక్కఱలేకుండఁ దనంతఁ దాను బూడిపోవుచున్నదఁట. గ్రామ్యవాదుల భాషామృతివాదము కూడ నట్లేయున్న దని మాయభిప్రాయము. దీనినిగూర్చి విశేషచర్చ యావశ్యకము కాదు. అయినను వారిరాకడ గుటిసెయొకటియున్న నుండునేమో యదియుఁ గూడ యోజింతము.

గ్రామ్యవాదు లిట్లందు రని యూహించుకొందము. "గ్రాంథికభాషలోని శబ్దములే దాదాపుగా సంభాషణములో వాడుకొనుచున్నమాట సత్యమే; కాని గ్రాంథికభాషలోని యనేకశబ్దములను యథారూపములతో వాడుకొనుచుండుట లేదు. క్రియలకు భూతాదికాలములలోను, ప్రథమాదిపురుషములలోను గ్రాంథిక

భాషలోఁ గలుగుమార్పులను వాడుకలో మన ముపయోగించుచుండుటలేదు. ఆమార్పులు శాస్త్రీయములైనవి కావు. వైయాకరణుఁ డిష్టానుసారముగ శాసించి నవి. అందుచే నవి సహజమైన గ్రామ్యభాషలో నిలువఁబడలేదు. వేఱురూపము లొందినవి. ఇట్టివేఱురూపములు Phonetics అనుశాస్త్రము ననుసరించి కలిగి యున్నవి. ఇవి స్వభావసిద్ధము లగురూపములు. "వచ్చుచున్నాఁడు" అనునది గ్రాంథికభాషలో "వచ్చు" క్రియకుఁ బ్రథమైకవచనము. ఇది "Natural laws' వలన వస్తున్నాడుగా మాఱినది. గ్రాంథికభాష చచ్చినదనఁగ శబ్దాంతములందలి యాప్రత్యయాదిరూపములు చచ్చిన వని మాయభిప్రాయము. వాడుకలో లేని హేతువుచే నవి చచ్చె ననుట తప్పులేదు." ఇది గ్రామ్యవాదులవాద మని యను కొందము. మనము దీనింగూర్చి యీయఁదగిన ప్రత్యుత్తర మిాక్రింద నుద హరింతుము.

Natural laws వలనఁ గలిగినశాస్త్రీయస్వరూపము లని గ్రామ్యవాదులు చెప్పునవేవ్వో యవి యజ్ఞతాదిదోషములవలనఁ గలిగిన తప్పు లని మేముచెప్పు దుము. "Natural laws" అనుపదము మిగుల స్థూలమైనది. అవి రెండువిధములు. బాహ్యప్రపంచముతోఁ జేరినవి. ఆంతరప్రపంచముతోఁ జేరినవి. గ్రహాదుల యా కర్షణశక్తి మొదలగునవి బాహ్యప్రపంచముతోఁ జేరినవి. స్వరక్షణాశక్తి మొద లగునవి యాంతరప్రపంచముతోఁ జేరినవి. మొదటివానిని గూర్చి విచారణము మన కిప్పు డక్కఱలేదు. ఆంతరప్రపంచతత్త్వమును బాగుగఁ బరిశీలించినయెడలఁ గేవల మన్యోన్యవిరోధముగల రెండువిధము లగుశక్తులు దానిలో నగపడుచున్నవి. Emotion (హృదయానుభవము) సంబంధ మగుశక్తి యొకటి; Intellect (జ్ఞాన) సంబంధ మగుశక్తి యొక్కటి. మొదటివానికి సంబంధించిన Natural laws (స్వాభావికశాసనములు) కొన్ని యున్నవి. రెండవదానికి సంబంధించినవి గొన్ని యున్నవి. Emotion తో సంబంధించిన శాసనములు మనుజుని యా ముష్మికసుఖమున కెగలాగుచుండును. రూపవతి యగుపరకాంతను జూచి నపుడు మనుజునికి దానిపై నపేక్షపుట్టించునది Emotion తో సంబంధించిన శాసనమైయున్నది. పరస్త్రీవాంఛ పాపమనియు నింద్రియనిగ్రోధ మొనర్చినఁ గాని యాత్మ కుత్తమగతి కలుగ దనియు బోధించి మనసున నైహికవైరాగ్య మిచ్చునది Intellect తోఁ జేరిన శాసన మైయున్నది. మొదటిది మనపూర్వతత్త్వ మగుపశుత్వమునకై పడలాగుచుండఁగ రెండవది మనపరతత్త్వ మగుదైవత్వ

మునకు నెగ్గ్రోయు మందును. రెండునుగూడ స్వాభావిక శాసనములే. (Natural laws.) మనుజుడు వేశ్యాదాసాధముడగుటయు వేదాంతశిఖామణి యగుటయు Natural laws ప్రకారమే. న్యాయాధిపతి యగుటయు Natural laws ప్రకారమే; వానిచే మరణదండనము నొందు మనుజఘాతుకుడగుటయు Natural laws ప్రకారమే. వితరణపరాయణుడగుటయు Natural laws ప్రకారమే; తస్కరాధముడగుటయు Natural laws ప్రకారమే. పరబ్రహ్మమగుటయు Natural laws ప్రకారమే; పశుహంత యగుటయు Natural laws ప్రకారమే. కాని వేశ్యాదాసుని జనులు తిట్టుచున్నారు; వేదాంతిని స్తుతించుచున్నారు. త్యాగిని గౌరవించుచున్నారు; తస్కరుని శిక్షించుచున్నారు. న్యాయకర్తను మన్నించుచున్నారు; నరహంతను బూతులు తిట్టుచున్నారు. అటులే Natural laws వలనగలిగినశబ్దములలో నుత్తమము లగువానిని గ్రంథార్హము లని గ్రంథకర్తలు గ్రహించుచున్నారు; కొన్నిటిని నిందార్హము లని పరిత్యజించుచున్నారు. కావున Natural laws వలనగలిగినవనుకారణముచే నన్ని శబ్దములు శాస్త్రీయము లని దోషరహితము లని గ్రాంథికభాషాపరిగ్రహణయోగ్యము లని వాదించు గ్రామ్యవాదులవాదము హాస్యాస్పదము.

దీనికి గ్రామ్యవాదు లిట్లు ప్రత్యుత్తర మిచ్చెద రనుకొందము. "మీరు తెచ్చిన సామ్యము దీనికి సరిపోదు. స్వరశాస్త్రసంబంధమగు స్వాభావిక శాసనములలోగొన్ని శబ్దములను బాడుచేయునవి కొన్ని బాగుచేయునవి లేవు. శాసనానుసార్యముగ శబ్దములలో వచ్చుమార్పు లన్నియు సహజములే. అందుచే నన్ని శబ్దములు గ్రాహ్యములుకాదగును." సరే. వీరివాద మసమంజస మయ్యును వాదార్థమై సమంజసమని కొంత సేపంగీకరింతము. Natural laws చే మార్పులు గలుగు సమస్త శబ్దములుగూడ గ్రాంథికభాషాపరిగ్రహణయోగ్యములని వీరిసిద్ధాంతము. "చూచినాను" అనునది గ్రాంథికశబ్దము. "చూచాను. చూశినాను; చూశాను; చూచా; చూశా" అనునవి Natural laws ననుసరించి వచ్చినమార్పులు. కావున నివి యన్నియు గ్రంథములలో నుపయోగింపదగినవే యగును. కాని గ్రామ్యవాది "చూచాను" అనురూపమునే గ్రంథస్థము చేయుట కంగీకరించును గాని మిగిలినవి నిరాకరించును. ఎందుచేత? మిగిలినవి కేవలము పామరులు మాటలాడు కొనుమాట లగుటచేత వానిని నిరాకరించును. Natural laws యొక్క యములునకు శబ్ధముతోనే కాని పండితపామరభేదముతో నిమిత్తమేమున్నది? "చూ

చాను"అ నురూపముకంటె Natural laws యొక్క పనిచే "చూశాను" అను రూపము మిక్కిలి నిగ్గు. సాఫుకలది. దానికంటె "చూశా" యనురూపము సంశ్లేషపుఁగట్టుదిట్టముచే మఱింత ప్రశస్తమైనరూపము. ఇట్లు Natural laws యొక్క చేతులక్రిందఁ గాళ్లక్రిందఁ బడి నలఁగినలఁగి శబ్దము లింకను నుకలుతీరి - నున్నఁబడి - గుండ్రఁబడి - నిగనిగలాడి - ప్రశస్తతమములు కానున్నవి కావా? అందుచే గ్రామ్యవాదుల వాదప్రకారము మాదిగవాండ్రలో నధమాధముఁడు మాటలాడుమాటలు మహాప్రశస్తములు. మహోద్గ్రంథవినియోగార్హములు. వీరి వింతవాదముచే జాతిప్రపంచము శబ్దప్రపంచముఁగూడఁ దలక్రిందైనవి.

కాని గ్రామ్యవాదులు సూక్ష్మబుద్ధి కలవారు. తెలియక తెచ్చుకొనిన "Natural laws"ను నమ్ముకొన్నయెడల నీబాధ యున్నదని యెఱిఁగియుండియే, "Natural laws" అను పెద్దమాటను బండితులు గడగడలాడునటుకై పైడాబునకై కల్పించి తదనిష్టనివారణార్థముగ "Upper classes" (ఉత్తమజాతులవా)రుపయోగించు శిష్టగ్రామ్యమే పరిగ్రహణయోగ్య మని బందుకట్టొకటి నిర్మించికొనిరి. శబ్దప్రయోగమున శిష్టుల కెంతస్వేచ్ఛయో యశిష్టుల కంతస్వేచ్ఛయే కద! శిష్టులు నశిష్టులు ననుభేదము గ్రామ్యవాదులు చేయఁగలరు గాని Natural laws అట్టిభేదమును జేయునా? పామరులమాటలు కేవలము నింద్యము లని వారు శాసించుటకుఁ బామరులు చేసికొన్న పాప మేమి? అదిగాక వారిమాటలను నిందించుట Natural laws యొక్క పనిని దిరుగఁద్రోయుట, పాడుచేయుట కాదా? అట్టి యసహజమైనపనికి గ్రామ్యవాదు లేలపూనుకొననలయును? గ్రామ్యవాదులారా! అధమజాతులవారిమాట లెందునకు నింద్యములయ్యె నని మీరాలోచించితిరో? మనస్ఫూర్తిగఁ జెప్పుఁడు. Natural laws నేచురల్ లాస్ అని యనర్థము లగుమాటలను జెప్పకుఁడు. వాండ్రు కేవలము విద్యాశూన్యులు, నాగరికత లేనివారు, సత్సహవాసము లేనివారు, మంచిచెడ్డ లెఱుఁగనివారు కావున వారిమాటలు తప్పు లని— కేవలము తప్పులని— వట్టితప్పులని మీయభిప్రాయము. ఆంతరంగికాభిప్రాయమై యుండును లెండు. దాని కేమి? యథార్థముకూడ నదియే. అందుచేతనే "Upper classes" అనునపురూపపుఁగల్పన యొక్కటి మీకుఁ గావలసివచ్చినది. శిష్టులమాటలుమాత్రమే పరిగ్రహణయోగ్యము లని హంసపాదము పెట్టవలసివచ్చినది. అధమజాతులవారికంటె శిష్టులు విద్యాబుద్ధిసత్సహవాసనాగరకతాసదసద్వివేచనములు కొంచెము హెచ్చుగఁ గలవారు. అందుచే

వారికంటె వీరిమాటలలోఁ దప్పులు కొంచెము తక్కువగా నుండును. మిక్కిలి తప్పులున్న యధమజాతిమాటలను వదలి తక్కువతప్పు లున్నశిష్టులమాటలను దీసికొనవలసివచ్చినది. తప్పులు తక్కువ యని మాటవరుస కనుటగాని వీరికి మాత్రము తప్పు లేమంతతక్కువ? బ్రాహ్మణులలోనే, నూటి కఱువదిమంది కేవల పంచములవలె విద్యాశూన్యు లని శ్రీ॥ రా॥ పంతులుగారే సెలవిచ్చియుండఁగ నిట్టివిద్యాహీను లెట్టితప్పులతడకలుగ మాటలాడుదురో వేఱె చెప్పవలయునా? కేవలపంచములకంటె వీరొక్క రేఖామాత్రమైన మెఱుఁగుగ నుందురు కావున వారిమాటలనే గ్రంథార్హములు సేయవలసివచ్చినది. మడికట్టుకొని మఱి తేఁగలు ఫలాహార మెందునకు? కృష్ణాజినపుసంచిని దాఁచిపెట్టిన జగన్నాథప్రసాదమునే కన్నుల కద్దికొని స్వీకరింపరాదా? తప్పులతడక లనుకారణమున నధమజాతివారి మాటలు వదలుకొన్నప్పుడు స్వచ్ఛమై-పవిత్రమై-పూజనీయ మైనగ్రాంథికభాష లోని పదములనే యంగీకరింపక, యటు లిటులు కాని మతిలేని మాధ్యమికమార్గ మెందునకు?

మేము Natural laws ను నిందించువారము కాము; కాని, వానివలనఁ గలుగురూపము లన్నియు మంచి వని చెప్పఁగలవారము కాము. మంచిరూప ములు మాత్రమే పరిగ్రహింపఁదగును. అట్లు పూర్వవ్యాకరణవేత్తలు, పూర్వ గ్రాంథికులు పరిగ్రహించియేయున్నారు. వారు Natural laws నెఱుఁగనివారు కారు. కాని Phonetics అని స్వాభావికశాసనము లని బెదరుపుట్టుమాటలు వారు మనవారివలె మాత్రము పైకనలేదు. కాని కవిత్రయప్రయోగములకు భిన్నము లగుప్రయోగము లుండఁగూడ దని చల్లఁగ నిమ్మళముగ నొక్కశాసన మును వారు చేసినారు. దీనిని బట్టియే వారిస్వాభావికశాసనజ్ఞానమును మీరు తెలిసికొనవచ్చును. స్వాభావికశాసనములపని నదేపనిగ హద్దులేకుండ వెట్టికొ ట్టుగఁ బోనిచ్చినయెడల భాష ధ్వంసమై పోవు ననియు నొకనిమాట యొకనికిఁ దెలియకుండఁ దలలు పగులఁగొట్టికొని జనులు సంఘమరణముల నొందుదు రనియు వారిట్టియమూల్యమగుశాసనమును జేసిరి. ఈశాసనమునకు మాత్రము వారు కారణము చెప్పలేదు. ప్రాతస్స్నానము చేయవలసిన దని చెప్పినపెద్దలు దానికిఁ గారణమును జెప్పిరా? అటులే దీనికిఁ గూడ వారు కారణమును జెప్ప లేదు. అందుచే వారియభిప్రాయమును మన మెఱుఁగలేక వారుభాషాభివృద్ధి నెఱుఁగనివా రని—స్వాభావికశాసనజ్ఞానశూన్యు లని—వారిని మనము నోటికిరాని

మాటలాడుచున్నాము. యథార్థముగ భాషాభివృద్ధి నెఱుఁగనివారము మనము. స్వాభావికశాసనజ్ఞానశూన్యులము మనము. మనకుఁ దగినబిరుదములను మన ముంచుకొనవలసినదే కాని యన్యుల నెత్తిఁ గట్టనేల?

స్వాభావికశాసనములఁ బట్టి కలిగినప్రత్యయాదిరూపములలో సుష్ఠుగ నున్న వేవో శబ్దశాస్త్రజ్ఞులు గ్రంథకర్తలు నిదివఱకే పరిగ్రహించిరి కావున మిగిలిన యన్నిరూపములు నింద్యములు—అనఁగ వట్టితప్పు—లని స్పష్టము. తప్పులను—దప్పు లని యెఱిఁగియుండి గ్రంథస్థములు సేయుమను గ్రామ్యవాదుల వాదము మఱెంత తప్పు.

ప్రత్యయాంతములలో దాదాపుగఁ బూర్వవిభక్తిప్రత్యయము లన్నియు నిప్పు డెట్టిమార్పును లేకుండ వాడుకొనుచున్నాము. క్రియల కుండుపూర్వప్రత్యయాదులలోఁ గొన్నిమాత్రము మాటలలో వాడుక చేయుట లేదు. ఏల? బుద్ధి లేక—ఔచిత్యము లేక—కొందఱకు విద్య లేక—స్పష్టముగఁ బలుకుట కోపిక లేక—సంగ్రహముగఁ బలుకు నపేక్షచేత—తొందరచేత—నింక ననేకకారణములచేత నట్లు వాడుకచేయుట లేదు. "చూచినాను, వచ్చినాను" అనురూపములు "చూశా, వచ్చా" యనురూపములకంటె నాబ్రాహ్మణపంచమపర్యంత మొక్కనికైనఁ దక్కువగఁ దెలియునెడల నప్పుడు పూర్వప్రత్యయరూపములు చచ్చిన వనుఁడు. అంతవఱ కనఁగూడదు. ఆప్రత్యయరూపములు సత్యములు. "అసత్య మాడితి వేమిరా" యని యొకనిని మనమడుగ "నిప్పుడు సత్యము వాడుకలోనే లేదండి" యని వాఁడు ప్రత్యుత్తరమిచ్చెననుకొందము. అంతమాత్రముచే సత్యము చచ్చిన దని చెప్పుట తప్పు. సత్యము చెప్పు మని శాసించువేదమును దిద్దు మని చెప్పుట వెఱ్ఱి. అదిగాక జను లిప్పటికిని సభలయం దుపన్యాసము లిచ్చునపుడు గాని, విద్యావంతులతో సంభాషించునపుడు గాని యింటియొద్ద మాటలాడినట్లు మాటలాడక గ్రాంథికప్రత్యయరూపములను గమనించుచునే యున్నారు. "Even we, in this literary age and at a distance of thousand years from those early fathers of languages, do not speak at home as we speak in public"—Max Muller. కొంచెము జాగ్రత్తతో మాటలాడు నెడల భాషాల్పపరిచయముగలవాఁడైనను—తుదకు—విభక్తిచంద్రికలోఁ గ్రియలఁ గూర్చినపదిపత్రములు చదివిన రెండవతరగతి (Form) పిల్లవాఁడైనను—చచ్చిన వని చెప్పఁబడిన పూర్వప్రత్యయరూపములు తప్పకుండ మాటలాడఁగలఁడు. అంతవఱ కెందుకు? ఆంధ

భాష నాలుమాసములు నేర్చికొనిన యాంగ్లేయుఁడు శుద్ధగ్రాంథికభాషను సులభముగ మాటలాడఁగలఁడు. అట్టివా డనేకులు మాటలాడుచున్నారు. ఈ నడుమ పాఠశాలాపరీక్షాధికారియగు నొకయాంగ్లేయుఁడు గ్రామ్యభాషకంటెఁ దనకు గ్రాంథికభాష సులభతరముగఁ దెలియునని చెప్పినట్లు వినియుంటిమి. చచ్చిన ప్రత్యయము లిన్ని జీవకళలు కనఁబఱచునా ?

ప్రతిదేశమందుఁ బ్రతిజాతియందుఁగూడ వ్యావహారికభాషకును గ్రాంథికభాషకును భేదమున్నది. వ్యావహారికభాషలో వ్యాకరణనియమము లంతగాఁ బరిగణింపఁబడవు. శబ్దముల యుచ్చారణము లంతస్పష్టముగ నుండవు. ఇట్టిలోపములు విద్యవచ్చినవాఁడు విద్యరానివాఁడుఁ గూడఁ జేయును. గ్రాంథికభాష యీలోపములకు లోనుగాక పరిశుద్ధముగ నుండును. గ్రాంథికభాషాప్రయోగములు వ్యావహారికభాషలో సరులందఱుఁ గూడ నుపయోగింపకున్నను, గ్రాంథికప్రయోగములు చచ్చె నని చెప్పుట కెంతమాత్ర మవకాశము లేదు. వ్యావహారికభాషకు గ్రాంథికభాషకు విశేషభేద మున్న దని Wyld దొరగా రిట్లు చెప్పుచున్నారు. "The differences betwen written and spoken English are deeper than those produced merely by a pronunciation which has far outstripped its symboilcal expression and includes also differences of style, of idioms, of choice of words and <u>grammatical</u> forms. (ఇందులోని యడుగు గీఁత మేము గీచితిమి.)

కావున గ్రాంథికభాషలోని క్రియాప్రత్యయములు మనమందఱము నాగరకభాషలో నుపయోగింపకున్నను నవి చచ్చె నని చెప్పుట తప్పు! గ్రాంథికభాషలో మాటలాడుపండితు లనేకులున్నారు. అంతవఱ కెందుకు ? క్రైస్తవమతబోధకాలమున స్వచ్ఛమగు నాంధ్రభాషలో మాటలాడుమాలవాండ్ర నేకులున్నారు. అది యొకవిశేషము కాదు.

కావున గ్రాంథికభాషలోనిశబ్దములు చావలేదు. ప్రత్యయములు చావలేదు. గ్రాంథికభాష మృతభాష కాదు. Natural laws వలనఁ గలిగిన ప్రత్యయరూపములలో శుద్ధములైనవే గ్రాంథికప్రత్యయరూపములు. ''వచ్చు + చుక్ + ఉన్న + వాఁడు.''— ''వచ్చుచునున్నవాఁడు'' మొదటిరూపము. ఇది పిదప '' వచ్చుచున్నవాఁడు '' అయ్యెను. తరువాత ''వచ్చుచున్నాఁడు'' అయ్యెను. ఈరెండురూపములుఁ బరిశుద్ధము లగురూపము లనివ్యాకరణవేత్తలు పరి

గ్రహించిరి. ఈరూపములు Natural laws వలన సిద్ధించినవే. ఇంతమట్టుకే పూర్వులు పరిగ్రహించిరి. Natural laws మఱికొన్నిరూపములు "వస్తున్నాఁడు, వస్తుండాడు, వొస్తున్నాఁడు, వొస్తుండాడు, వస్తిడు, వొస్తిడు" అనునవి కలిగించినవి. ఇవి కేవలము నియమశూన్యములుగ గ్రహించి వీనిని గ్రాంథికులు పరిత్యజించిరి. "వారు పరిగ్రహించినదెల్లఁ బూజ్యము ; వారు పరిత్యజించినదెల్ల నింద్యము నని యెచ్చటనున్నది; వారిమాట మాకేమి శాసనమా?" యని గ్రామ్యవాదులు నియమశూన్యులు కావున ననవచ్చును. ఎవనికిఁ దోఁచినట్లు వాఁడు చేయవచ్చు నని వారిసిద్ధాంతము. అట్లేయగునెడలఁ బ్రపంచమంతయు నొక్క దినములోఁ బ్రళయదశకు రాఁగలదు. ఇందునుగూర్చి వారికిఁ బూర్ణప్రమాణవాది యగు Wyld దొరగారిట్లు చెప్పుచున్నారు. "A preliminary question meets us. Whence are the laws of style derived? To whom or what are we to refer on difficult or disputed points? Most rhetoricians ancient and modern have answered that."

పానుగంటి - లక్ష్మీనరసింహారావు.

# కిరోసీనునూనె.

# (Kerosine Oil)

మనము దీపములకై యుపయోగించు కిరోసీనునూనె సహజతైలములలో నొకటి. గానుఁగులయం దాడుటచేఁ దీయఁబడు ప్రత్తినూనె నువ్వులునూనె మొదలగు తైలములవలెఁ గాక పురుషప్రయత్నము లేకయే నైజభావమున ద్రవస్థితిని లభించు తైలములు సహజతైలములు. ఈయవి భూగర్భమందు సెలయేళ్లవలెఁ బ్రవహించుచు నచ్చటచ్చట నూటలు వెల్వడి బావులుగను జెఱువులుగ నేర్పడును. వీనినుండి యుదకముతోడున ట్లీతైలమును దోడఁబడును. సహజముగ దొరకునీనూనె ప్రథమమున మన మనుదినమును వాడుకొనునూనెవలె శుద్ధముగా నుండదు. దీనియం దంగారవాయుపు లమితముగా నుండుటచే స్వల్పమగు వేఁడిమికి నిప్పంటుకొనుటయేకాక మండునపుడు విశేషముగా ధూమము వెల్వడుచుండును. కావున నిది నిత్యగృహకృత్యముల కంతగా నుపయోగముకాదు. కాని యుష్ణముమాత్రమే కావలసిన తైలయంత్రములయందుమాత్ర మెక్కుడుపయోగింపఁబడుచున్నది. ఈతైల ముష్ణదర్శినియందు 60, 70, డిగ్రీల యుష్ణమునకే నిప్పంటుకొనును. ఇట్టి యీ యపరిశుద్ధతైలమును మూఁతవేయఁబడిన పాత్రలయందు వెచ్చగించి యావిరిరూపమునకు మార్చి తిరిగి యీయావిరిని శీతలముచే ద్రవస్థితికిఁ దెచ్చి లోని యంగారవాయువులఁ బాఱఁదోలుటచేఁ బరిశుద్ధము చేయుదురు. ఈశుద్ధతైలమే మన మనుదిన ముపయోగించుకొను కిరోసిను చమురు. ఇది సామాన్యోదకమువలెఁ బలుచగను స్వచ్ఛముగను నుండి యంగారవాయువు లేమిచే 110 డిగ్రీలవఱకు నిప్పంటుకొనును. మండునప్పుడుకూడ ధూమమంతవిస్తారముగ నుండదు. కావున నిది యెక్కుడు భద్రము నుపయోగమునై యున్నది. ఇంతకంటెఁ బరిశుద్ధమైన దనఁగా నంగారవాయు వింకను స్వల్పముగ నుండుతైలమును 'పెట్రోల్' అందురు. అది మండునపుడు పొగ యనునదియె యుండదు, 150, 160 డిగ్రీలవఱకును నిప్పంటుకొనదు. ఇది మండునప్పుడమితోష్ణము వెల్వడును. ఈచమురు బండ్లయందును, నాకాశవిమానముల యందును వాడఁబడు. మోటరులందును మేలగు తైలయంత్రములయందు నుపయోగింపఁబడును.

ఇంక దీనియుత్పత్తింగూర్చి వివరింతము. సామాన్యముగ నరణ్యములందును, మన్నెపుఁబ్రదేశములందును, అనఁగా వృక్షము లమితముగా నుండి సూర్యకిరణములు చొరని ప్రదేశములయందుండునీటిదొరువులు వాడుకలో నుండక కొంతకాల మట్లే నిలిచి యుండిన నందలినీటి యుపరిభాగమున నూనెవలెఁ జిడ్డుపదార్థము కొంత తేలియుండు ననుట యెల్లరకుఁ దెలిసినవిషయమే. ఈప్రదేశములందుండు వృక్షసముదాయమందలి చమురు క్రిందదొరువులలోఁ బడెడు నాకులు క్రుళ్లుటచే నీటిలోఁ గలసి, యుదకముకంటెఁ జమురు తేలికయగుటచే నీటిపైఁ దేలియుండును. ఇట్టి పెక్కుదొరువుల నుండుచము రంతయు నీటితోఁ గూడ ననంతరమే కారణముననైనఁ గలుగువఱదలకుఁ గొట్టుకొని పోఁబడి తుదకంతయు నేనదీముఖముననో యీవఱదలవలనఁ గొనిపోఁబడు మన్నుమొదలైన వానితోఁ గలసి నిక్షేపింపఁబడును. మనము నీటిలోఁ గొంచెము చమురువేసి బాగుగఁ గలపినయెడల యీనూనె చిన్నిచిన్ని భాగములుగ విభజింపఁబడి బుద్బుదములుగ నుంటయుఁ దిరిగి యట్లే కొంతకాల ముంచఁబడిన నూనె యంతయుఁ దిరిగి కూడుటయు సంభవించుచున్నదికదా ? అట్లే యీవఱద ప్రవాహకల్లోలమున కీచము రల్పభాగములుగ విభాజ్యమై మెత్తనిమన్నుతోఁ గూడియుండును. ఇట్టిమేళనము తేఁబడిన మట్టియొక్క యతిశయమువలనఁ గాని, లేక భూచలనమువలనఁ గాని, మెఱకయగును; గాని యీచమురుయొక్క ప్రత్యల్పభాగము మధ్యను మెత్తని యీమంటియొక్కయణువు నిలిచియుండుటచే నీచమురు తిరిగికూడుకొనుటకువీలు లేనిస్థితియందుండును. ఈమేళనము మెఱక యగుటకుఁ బూర్వమే యనఁగా నీటిలో నున్నతఱినే వెనుక నేర్పడు నిక్షేపములచేఁ గప్పఁబడి యుండును. అందుచే మృణ్మయతైలఫలక మేర్పడును. ఇంకఁ గొంతకాలమునకుఁ బైనుండునిక్షేపముల బరువుచేతను భూగర్భమందుండు నమితశక్తివల్లను గ్రిందిఫలకములయందు నెఱియ లేర్పడును.

ఈశక్తివలననే క్రిందిఫలకములయందలి తైలములు గూడ నొత్తఁబడి యంతకుఁబూర్వము విడిగానుండు తైలాణువు లన్నియుఁ గూడి యాఫలకములందలి నెఱియలద్వారమున గూడఁబాఱి కాలువలవలె భూగర్భమునఁ బ్రవహించుచుండును. ఈప్రవాహపుబలిమిచేతను, నింకఁ జుట్టుప్రక్కలనున్న నీటి యొత్తిడివలనను, అమితశక్తినిగ్రహించి తఱియైనచో నదనగుపట్ల నూటలుగ వెల్వడుచుండును. వానినే యుపయోగించుకొని బావులును జెఱువులును ద్రవ్వుదురు. ఈ

కిరోసినునూనె బావులు బర్మాయందు విశేషముగఁ గలవు. ఉత్తరహిందూస్థానమునఁ బంజాబునఁ బశ్చిమోత్తరపరగణాలయందును గూడఁగలవు. అమెరికాలోని సంయుక్తరాష్ట్రములయందలి బావులు తైలప్రమాణమునఁ గడుఁబెద్దవి. మనహిందూదేశమున భూగర్భశాస్త్ర మింకను బాల్యావస్థయం దున్నది. కృషి చేయవలసిన భాగము లింకను జాలఁ గలవు. ఎక్కుడుశ్రద్ధతోఁ బరిశీలించిన ముందింక నెన్నిసహజతైలములు లభించుస్థలములు కనిపెట్టఁబడి హిందూదేశ భాగ్యమున కంకురము లేర్పడనున్నవో!

తల్లాప్రగడ పానకాలరావు బి. ఏ.

# తొండమాన్ వంశావళి.

నుదురుపాటి వేంకనార్యవిరచితము.

(ఈ తొండమాన్ వంశావళి పుదుకోటరాజుల వంశావతారమును వర్ణించుచున్నది. పుదుకోటరాజులకు నేటికిని "దొండమాన్" అనుబిరుదు గలదు. గ్రంథకర్త యాంధ్రభాషార్ణవాద్యనేకగ్రంథముల రచించి కీర్తిని వహించిన నుదురుపాటి వేంకటకవి. ఈకవిరచించిన గ్రంథములలో నాంధ్రభాషార్ణవము మాత్రమచ్చుపడియున్నది. ముద్రితములు కాకయున్న మల్లపురాణమును ఈ కవికుమారుఁడు మనుమఁడును రచించిన గ్రంథములును దక్షిణదేశమున సంగ్రహింపఁబడి పరిషత్పుస్తకభాండారమునందున్నవి. ఈకవి వెలనాటిబ్రాహ్మణుఁడు. రఘునాథతొండమాన్ కడ నాస్థానకవిగా నుండెను. ఆయనవంశమువా రిప్పటికిని బుదుకోటలో నున్నారు.

ఈ వంశావళిని ప్రస్తుతపు నుదురుపాటివారిబంధువు లగు హరిసేతు రామయ్యగారు పరిషత్తునకొసంగిన స్వహస్తలిఖితమగు కాకితపుఁబ్రతి ననుసరించి ముద్రించితిమి. ప్రత్యంతరము చిక్కలేదు.)

---

శ్రీబృహదంబికాయైనమః.

సీసమాలిక.

శ్రీజానకీదరస్మితనిదానీకృతభాషణుం డాశ్రితపోషణుండు
ప్రస్తరాయితమానిపంకజలోచనోజ్జీవనుం డాజన్మపావనుండు
శర్వరీచరగర్వనిర్వాపణోగ్రసాయకుం డఖిలార్థదాయకుండు
వార్షికాంభోధరవర్ణనీయకదివ్యవిగ్రహుం డతులితానుగ్రహుండు
స్థిరగుణసాంద్రుండు శ్రీరామచంద్రుండు సంతతకరుణారసార్ద్రదృష్టి
సర్వసర్వంసహాచక్రపాలనశక్తి వరకవిభవ్యకావ్యానురక్తి
పుత్రపౌత్రసమృద్ధి పుణ్యైకకృతబుద్ధి రవిసమదీప్తి దీర్ఘాయురాప్తి
నిచ్చలు దయచేయ హెచ్చుచు నానాఁట విదియచందురురీతి వెలసి తౌర
కాంచనాచలధీర కవిజనమందార దానధౌరేయ విద్వద్విధేయ
కోటికులాంభోధికువలయినీజార రణరంగధీర వీరాధివీర

రఘునాథభూపాల రమణీయగుణశీల భవదన్వయంబును బ్రస్తుతింప
నాహ్లాదము జనించె నమలత వర్ణింతు విరహిణీజనమానభేదకుష్య
దసమాస్త్రకరసరోజాకృష్టపుండ్రేక్షుకోదండనిర్ముక్తకుసుమవిశిఖ
బృందనిష్యందమరందధారాపూరమాధురీమద్వచస్సాధురీతి
వీనులవిందుగా వినుము పరాకులేకయె యొకించుకసేపు క్రమముగాను
నాఖండలుఁడు భవదన్వయమునకును గర్తయై చెలఁగు నాఖచరనాథుఁ
డమరావతిని సుధర్మాంతరాళంబున గరుడగంధర్వకిన్నరులు నిల్వ
సకలదైవతపతు ల్సముఖంబున నె కొల్వ నచ్చరల్ సేసి నాట్యంబు లాడ
శూరదీక్షితవరు లోఁగోరికలను వేఁడఁ బేరోలగంబుండి సారివెడలి
పృథ్వీస్థలికిఁ జేరి వేడుక ల్పచరింప వలరాజుదంతో చెంగలువబంతో
పన్నీటివాఁకో క్రొంబసిఁడిహర్మ్యసలాకో మరువంపుమొలకో కార్మెఱుఁగుతళుకో
చిలుకలకొలికో నాఁ జెలఁగుమానవకన్య సజ్జనమాన్య సౌజన్యధన్యఁ
బరికించి మారుండు చెఱకువిల్లును వంచి యటు నిటుపొంచి కోయంచు మించి
విరితూపులఁగదించి వేయునంతఁ జలించి యాత్మలోన భ్రమించి యాసమించి
తరుణి రప్పించి గాంధర్వంబున వరించి రతిఁ దనియించి గౌరవము నుంచి
లాలించి తేలించి పాలించి మేలించి కొన్నిదినంబులు గూడియుండఁ
దనయులు పెక్కండ్రుదయమొంది రందఱు జలధిగంభీరులు సమరశూరు
లతిబలసంపన్ను లమితప్రసన్నులు దానచింతామణు ల్తరణిఘృణులు
వారిలోనొక్కరుండు వారిధివేష్టితక్ష్మాచక్రమునకు రాజై చెలంగెఁ
దత్సంతతి ధరిత్రిఁ దనరంగ నందునఁ దిరుమభూమీంద్రుండు గరిమ సెంది
యహితగోత్రమ్ముల నచ్చుటచ్చుటఁ గొట్టి విశ్వబుధావన విశ్రుతిఁ గనె
నతనిపుత్త్రుండు నమనావనీశుఁడు వైరిపురశిక్షఁ దగి దివ్యభూతిఁ గాంచె
రాజశేఖరుఁడన రాజ్యంబుఁ బాలించె నతనిసుతుఁడు పచ్చయాఖ్యఘనుఁడు
రాజహంసాళిగర్వముల నెల్ల నడంచి స్వర్ణస్ఫురద్దానశక్తిమీఱి
కవిసంఘములఁ జూచి కామితార్థము లిచ్చెఁ దత్తనూజుం డగు తండకనృప
రత్నంబు తేజోవిరాజమానుండయి సకలజనంబుకోరికల నొసఁగ
భూపకిరీటాగ్రముల వెలుంగుచునుండె నతనిగర్భంబునం దవతరించి
యమునాచలాధిపుం డమితసారముఁ జెంది కల్యాణరూపవిఖ్యాతిఁ గాంచి
భూభృద్వతంసమై పొలుపొందెఁ దత్తనూభవుఁడగు తిరుమన్నృపాలచంద్రుఁ

డరిగర్వభేదనం బలరించి కువలయరక్షకుం డనఁగను బ్రబలసాగె
సర్వజ్ఞమౌళినా సత్కీర్తిని వహించెఁ దత్కుమారుండనుగాఁ దనరుసమున
శౌరి చక్రాబ్జాంకశయుఁడుగా విలసిల్లి సకలరక్షోపకారకతఁ జెలఁగి
లక్ష్మీకటాక్షలీలాలక్షితుండయ్యె నతనికి జనియించినట్టి పచ్చ
నరపాలసింహుండు గురుతరశౌర్యుండు కుంభినీవరతతి క్రొవ్వడంచి
సతతమహావనీసామ్రాజ్యమును జెందెఁ దస్సూతి నమనగోత్రారమణుఁడు
పరవాహినీభూరితరవారు లానుచు సద్విభాసిఘృణాతాశయత మెలఁగె
నతనికిఁ బట్టియైనట్టి పచ్చిమహీశుఁ డరు లుగ్రకరుఁడు నీఁ డనఁగఁ బొల్చి
మండలాధిపుఁ డన మహిమచేఁ జెన్నొందెఁ దద్గర్భశుక్తిముక్తాఫలంబు
కింకిణిభూపతి కీర్తిచేఁ జెన్నొందె శుచివృత్తిమూర్తినా క్షోణినెగడెఁ
దద్గర్భజలధిమందారభూజంబగు తండకనృపతి చిత్రమగుచర్యఁ
గలికాలసక్తి లేక సుమనశ్శ్రీభియై దళములవలనను ఫలము వడసె
నతనికిఁ గల్గె ధర్మాయత్తచిత్తుఁడై యరికర్ణశల్యమచ్చరిత ముడఁచి
తిరుమభూపకిరీటి ధరణీస్థలిని మీఱె నతనిసూనుండు పద్మాప్తుఁడగుచు
దానసంతోషితదీనాళియై పచ్చధరణీపకుంజరం బరుదుఁ గాంచె
నతనికిఁ బొడమె రాయప్రభుతిలకంబు చందనం బనుచును గొంద ఱనఁగఁ
నగ్నిశిఖాకార మనుచుఁ గొందఱు వల్కఁ శారదాకృతిగ నెంచఁగను గొంద
ఱఖిలలలాటరేఖానుగతి వెలసి క్షోణీతలం బేలుచున్నయపుడు
శ్రీరంగరాయధాత్రీశమత్తగజంబు విడివడి దిక్కులువెదలి కడఁగి
కోటలు పడఁద్రుమ్మి పేటలువడఁజిమ్మి పురములను జెఱిచి తరులు విఱిచి
సకలదేశంబుల సంచరించుచురాఁగ ధరణీపతులు సూచి తల్లడిల్ల
నాటలవలెఁ బట్టి యామత్తగజమును శ్రీరంగరాయలఁ జేరిమొసఁగ
నాతండు మదిమెచ్చి యయ్యారె నీవంటిశూరోత్తముని నేను జూడలేదు
నీదెరా శౌర్యంబు నీదెరా ధైర్యంబు నీదె వాఁడిమిహద్దు నీదెపద్దు
మన్నీల వజ్రీల నెన్నికవట్టినఁ గోట్లసంఖ్యలు వారిఁ గొనిపనేమి
నాపేరు చెల్లించు నరవరేణ్యునిఁ గాన నీవె యోధనటంచు నెమ్మితోడ
వెండందలంబును గండపెండారంబుఁ బంచెవన్నెల వేఁగుపావడలును
భూచక్రగొడుగును బొడ్డుగంటహయంబు నేనుఁగుమీఁదట నిడినభేరి
ధవళశంఖంబును దార్క్ష్యకేసరిమత్స్యహనుమత్స్వరూపమహాధ్వజములు

సంగీతమేళంబు జతబజంత్రీలును వనజమిత్రామిత్రవాద్యములును సాంబ్రాణిధూపవాసనఁగొను నెఱసీవి పస్నీటిసోన ధూమ్రముంపుఁదిత్తి సురుమాయిజల్లుల తురగోత్తమంబును మకరబజ్జీలు నల్వన్నెగొడుగు కత్తికిఁ బచ్చపూల్కుల్కికలితురాయి ముత్యాలకుచ్చు పెన్మొగ్గలక్క సింహాలలాటంబుఁ జేర్చినపల్లకి బంగారునిగళంబు పాదసరము వెండిహార్వాలఁ బవళ్వోలుఁగు దీవట్లును జోడ్గోలువెట్టినసమదగజము నుభయవింజామర లున్మత్తశాత్రవనారీమణీనయనాట్యశాల జంటబట్లును బ్రౌఢసత్కవికృతి మొదల్ తగుతవబిరుదు లన్నియు(1)నొసంగి రాయరాహుత్తని రాయమన్నీఁడని రాయవజ్రీఁడని రాయ లనుచుఁ బ్రేమతోడుతఁ గొన్నిపేరులు దయచేసి మఱిమఱి యతని సచ్చరిత మెచ్చి యీదొర కేబిరుదెక్కుపెన్బిరుదంబు చెల్లు నీకు నటంచు సెలవొసంగ రాజప్రసాదవిభ్రాజమానుండయి జయభేరి మొఱయఁగ సాగివచ్చి స్వపురంబునను జేరి సామంతనృపతులు నిచ్చలు గొలువంగ హెచ్చుచుండె నతనికి శంభుకటాక్షవీక్షణమున నాత్మజుండయ్యె నత్యద్భుతుండు రఘునాథనృపతిలలాముఁ డేమనవచ్చు నతనిసత్కథ విచిత్రతర మొన్న నమన, పచ్చె, పెరమనామధేయంబులతమ్ములు మువ్వురుఁ దను భజింపఁ బుణ్యజనంబులఁ బ్రోవఁగా మదిఁగోరి చక్రసంరక్షణశక్తి మీఱి సార్థవిశ్వామిత్రనవనస్థలిఁ గదల్చి సారస్వతరసంబు మీఱఁ బొల్చి పూర్ణశౌర్యాకృతిస్ఫురితత్వముననుండ నతనిగుణంబుల నాలకించి తంజాపురీధరాధ్యక్షుఁడై తగునట్టి విజయరాఘవమహీవిభుఁడు మెచ్చి ప్రియమునఁ బిలిపించి బిగికౌఁగిటఁ గదించి సరిబేటిగావించి గరిమనుంచి కొలువుండు మంచని పలుకరించినయంత నేమనునోయని హెచ్చరికగ ననువైనదళమును నలదళంబునకును దగునట్టిసరదారుఁ దనకులేమిఁ దెలియఁజేసినయంతఁ గలగల యనినవ్వి తద్భావ మెల్లఁజిత్తమునఁ దెలిసి పదివేలయాళ్లున్న బంట్రౌతు బంట్రౌతె పదిపల్లె లున్నను బ్రభువు ప్రభువె యడిదంబువట్టి కొల్చెడివార మేగాని కొలుచుటవలనఁ దక్కువలు లేవు కొలుచువారలకుఁ దక్కువయేమి యనిలోనఁ దనదొరవిడిచి పాఱునది యొకటె మమ్ము మాఫౌఁజును మర్యాదల నెఱింగి కొలిపింపఁగలరేని గొలుతుమనిన

(1) లందగ.

నాలాగె నడపింప నచ్చటఁ గొలువుండి స్వామికార్యమున విశ్వాసమొప్ప
వేటల గడుసుపోట్లాటలయందును భూదారశార్దూలములను ద్రుంప
శ్రీరామమూడను జేర్చినపతకంబుఁ బెదరాముబాణమన్నేరికత్తి
దివ్యాంబరంబులు దివ్యభూషణములు జనసహాయంబులు సమదకరులు
పట్టాధికారియైనట్టి పుత్త్రునిచేత బహుమతిగానిచ్చి పంపఁ దీసి
యారీతిఁ గొన్నినాళ్లచట వాసముచేసె వైష్ణవస్వీకారవార్తఁ జేసి
యతనికొల్వును ద్రోసి యవలపాళెముదీసి తనసీమదౌరతనంబున నె చేయఁ
బెద్దసేతుపతి యీసుద్దులన్నియు విని వస్తువాహనము లవారి దెచ్చి
యిచ్చి స్నేహముచేసి యిదియేల యని తనదుపకారిగావచ్చి యుండుమనిన
నట్లకానిమ్మని యతని నెంచకయుండు పాళెగాండ్రను గొట్టి భంగపఱచి
చెంతనే తంటలుసేయుచున్నట్టి తేవమార్లను బట్టి కావలినిడి
నిశ్శాత్రవము సేసి నెమ్మది పుట్టించి యాయూరఁ గొన్నినాళ్లిటులనుండ
నొకనాఁడు వేడుక నుబుసుపోకకు బైటి చవురునఁ గొలువుండు సమయమునను
సమదభద్రగజంబు సంకెలల్వీడ్చుక విడివడి యతఁడుండు వీధిరాఁగ
ననుజుఁ డౌనమనధరాధీశు వీక్షింప నతఁడు బుద్ధియటంచు నవుడ లేచి
జముదాడిపరుఁజిచ్చి సరసకు నెదురెక్కి యదలింప మదగజం బట్టెతూఱఁ
దొలఁగక యొకమొనఁ దొండముకడఁజూపఁ జుఱుకుస నదిగొని చుట్టియొత్త
సద్దువైచి బిగింప శ్వాసము విడలేక ధరణికిఁ బడఁద్రోసి గిఱికొనంగ (1)
ఘుజిఘుజిక్కసి పోట్లఁ గనుగవ ద్రిప్పియుఁ (2) గొమ్ములు ధరఁ బూడి దుమ్మురేఁచ
నమరఁగఁ బరుఁజిచ్చి చిమటావఱుసనంట జముదాడి నిగురునఁ జూఁచినంత
మదము జల్లునఁ దీసి యెదిరి ఘీమనికూసి పాఱి హజారము సేరఁజూచి
యన్నకు మ్రొక్కి యత్యంతభక్తిని నిల్వ నానందభరితుఁడై యాతఁడొప్ప
నావలఁ గొన్నినాళ్ళచ్చట వసియింపఁ బాండ్యసింహాసనపట్టభద్రుఁ
డలరంగఁ గృష్ణముద్దులవీరనరపతి దక్షిణసీమ సాధ్యంబుగాక
నాగలాపురమును నగరికోటను దీయఁ దమచేతఁగాక చింతను వహించి
పలుమాఱు దళపతు ల్పాళెముల్ దిగియుండి డాబాలునడపి బేడానఁ దూఱి
లగ్గలువట్టుచో నుగ్గునుగ్గైనారు మఱిసురంగముతోడి దౌరవసేయ

---

(1) గిరిబడఁగ.

(2) పొట్లకనుగలితప్పింప.

ముందుసిద్దెలు పూడ్చి మూఁటఁబసపాగిన విఱుగుఁబడి వెలి కుడికనాఁడు
ఊడెముల్ప్రైచుచో నొకవేళ దాఁగిన బలుపిరంగులు నైచి పాఱినాఁడు
కార్యంబుగా దివి కమడఁదాఁకి జనంబు చుఱుకు సేయునె యిది నరలనఁబ
నెన్వఁగ బంపుదు నేమిసేతు నటంచు సామాజికులతో యోజనలు సేయ
నింతయోజన సేయ నేటికి రఘునాథరాయమహీపుని రమ్మటంచుఁ
బిలిపించి యిచ్చటఁ గొలువున్నంచుకొంటిమా కలనికి నుచను నక్కజులు లేప్ర
గిరివరధైర్యుండు కేసరిశౌర్యుండు సమరదిలీపుఁ డుజ్జ్వలప్రతాపుఁ
డలఘుం డమేయుఁ డత్యంతబాహుబలాఢ్యుఁ డసమానగుణశాలి యుడియుఁగాక
పద్దు పంతము పాడి పౌరుషంబును బుద్ధి నిలుకడ కడఁక లన్నియును గలవు
పదియైదుశౌర్యాలఁ బనికి వచ్చినవాఁడు పొలముగాఁ బోఁకకుఁ బోఁకుపెట్టు
విఱిగినమూఁకలఁ బురికొల్పఁగనునేర్చు నతనిఁ గొల్చినవార లంతకన్న
నాఁకొన్నసింగంబు లలుగులబోనులు బెబ్బులిగంబులుఁ బిడుగుచివర
లగ్గిమూటలు ఱెక్కలల్లార్చు పాములు వసులప్రాంతఅలు దబ్బనపుఁజఱులు
కిఱుదుర్ల తెట్టలు గాలపునంజుళ్లు చిగురుకజ్జాయిలు చెప్పరాదు
వారిగుణంబు లావసుధాధిపుఁడు తక్క నాప్రజఁ గొలిపింప నలవి యగునె
యని వారు వల్కిన నప్పుడ పిలిపింపఁ దిరిచినాపలికోట కరుగుదేఱ
దళపతి మంత్రి ప్రధానవర్గంబును దన కెదురై కొంత దవ్వురాఁగ
వారితో నేలినస్వామి బేటికిఁ బోవ నాశ్చర్యచిత్తుఁడై యతఁడు నూచి
సామాజికోక్తి నిశ్చయ మని మది మెచ్చి తాంబూలజాంబూనదాంబరమణి
భూషణావళితోడఁ బుత్త్రపౌత్త్రాదిసంతతి వరుసగఁ బ్రభుత్వంబు సేయ
నాఱులక్షుల రాజ్య మప్పుడ దయచేసి యది నీకుఁ గాణాచి యనుచుఁ బలికి
పదిరెండువేలతుపాకుల వేయింటికిని గయిజీతమందుసనగంబు
రౌతు లటంచని లావణంబులు పెట్టి బొక్కసంబున వేతెరొక్క మిచ్చి
యధికసంప్రీతిచే నాదరించుచు వచ్చి క్రమముగాఁ గార్యభాగములఁ దెలుప
రణభేరికాధణంధణధణధ్వనులు పర్వతగుహావళిఁ బ్రతిధ్వనులనీన
వాతూలసంచరత్కేతనపటలికాపటపటత్పటలు దిక్ప్రతతి నిండ
కంఖాణరింఖావిసృంఖలసంఘాతధరణీరజంబు లంబరముగప్ప
భటసముత్కటపదోద్భవమహాబ్భాద్ధతికిని ఫణిఫణామణులు కంపమును జెంద
దక్షిణసీమకు దళమును నడపించి ముందుగా నాగలాపురముఁదాఁకి

గొప్పపిరంగులగుండ్లకు వెలినిల్చి కోటమర్మంబు గన్గొనఁగఁ జొట్టి
యెప్పటిపౌఁజుగా విడి యేమొ వింతని యచ్చటిమూఁకల కళుకువోడను
దళములఁబంచి నల్లట్టులకునుబంచి మరము సేయంగ నుత్తరువొసంగ
నేకరంజకముగా నెనఁగుపిరంగుల గడగిడగడగడగడగడలును
గుండుఁద్రోవుల గుభగుభగుభగుభగుభల్ బెడిదంపు రేకలాల్ బెడబెడలును
జబురుజఁగుల జరజరజరజరజరల్ పెనుతుపాకుల ఫెళఫెళఫెళలును
జక్రాల గిరగిరల్ శరముల బిసబిసల్ చుఱుకైన బాణాల చురచురలును
చిచ్చువానలచిటచిటచిటల్ కత్తుల చకచకల్ చివ్వాల టకటకలును
గదనశూరుల కహాకహాకహా లేకమై భూనభోంతరము కప్పుకొని రాఁగ
ముమ్మరమ్ముగ నొక్కమూలపోటును బెట్టి యామూలకోట వారందరాని
యట్టె బెడాలున నవలిప్రక్కలనుండి జముదాడిని నగర్త సమరఁ బూడ్చి
నిచ్చెన లొక్కటకు నిలిపి గొల్లు మటంచు సురతాణిలగ్గను జూపినంత
నేమఱుపాటౌట నెండ్రకాయలమూట విచ్చినబారి వేర్వేఱఁ బాఱి
బైరిడేగలఁ గన్న బకము తానని యెన్నఁ దన్నుక పడి కూలి తడపుసోలి
యఢిదము ల్దిగవైచి యంబరమ్ములు వీచి కావుకా వని కూసి కలను బాసి
శరణాగతికిఁ జొచ్చి చరణమ్ములను గ్రుచ్చిపట్టిన దయవచ్చి పాఱనిచ్చి
యచట ఠాణెము కొంద ఱమరఁ గాఱులఁ బెట్టి తక్కుపాళెముల పైఁ దాఁకముట్టి
వన్నియమోమున వన్నియఁ దొరఁగించి పూలియత్తేవునిపొంగణఁచి
శిన్నణంజాత్రేవుఁ జింతచే నొప్పించి యట్టప్పనాయనిఁ గొట్టి చించి
కట్టబొమ్మప్పను గర్వంబు సడలించి వరకామిసని దోర్బలము ద్రుంచి
ఘుంటమనాయని నింటిప ట్టడలించి తుంబిచ్చినాయనిఁ దొలఁగఁ బంచి
చిల్లరపాళ్యాల నెల్లను భర్జించి చేసినశౌర్యంబుఁ జెప్ప నేల
పాళెమువచ్చినవార్త లూఁకొనుదాఁక భేరీనినాదంబు విన్నదాఁకఁ
గాదన్నపౌఁజును గనులారఁ గనుదాఁక నిలుచుటగాక మున్నిలువ లేక
యఖిలనృపాలకు లళికి కప్పముగట్ట జయమునఁ దిరిగెడు సమయమునను
దమపైనఁ దాఁకునో తాఁకఁడోయని యంచు మణపారెపాళ్యాలమట్టు వినుము
బూచినాయఁడిఁ కెందుఁబోద మంచును గుండె లక్కినాయఁడు కొండ లెక్కసాగెఁ
జామినాయఁడు బొక్కసంబు లావలఁ జేర్చెఁ గమ్మినాయఁడు జాతకంబుఁజూచె
ముద్దన్న సుతులకు బుద్ధులనెఱిఁగించె లింగన్న జపము సేయంగఁ దొడఁగె

నాకబురంతయు నపుడు చారులు పల్కఁ జిఱునవ్వుతో నంతఁ దఱలి వచ్చి
తద్దత్తమత్తమాతంగఘోటకరత్నభూషణా లేలికముందు వెట్టి
స్వామిభృత్యన్యాయసరణిని దెల్పుచు నదియెల్ల తం డిచ్చినదియుఁగాక
తనబిరుదమ్ములఁ గొనుమని దయచేసి సీమకుఁ బొమ్మని సెలవొసంగ
బృహదంబికాదయావీక్షణమ్మునుగాంచి నవసాలపుర మనునగరుఁ గట్టి
శాశ్వతసామ్రాజ్యశక్తిసంపన్నుఁడై బహుపుత్త్రలాభంబు వడసి యందుఁ
గదనవీరావేశుఁ బెదరాయధాత్రీశు విజయప్రకృతి ముద్దువిజయనృపతి
ధీరగుణాధారుఁ దిరుమలహంవీరు రవిసమప్రభుఁ జిన్నరాయవిభునిఁ
జదువుల సాముల సకలసంపదలను దనకు సమానులం చన నొనర్చి
విజయగుణాఢ్యులై వెలయుచువా రుండఁ గ్రమ్మరఁ ద్రిశిరఃపురమ్ముఁ జేరి
దానైక నిస్తంద్రు దళవాయి నరసేంద్రుఁ గలనికి సాక్షిగా నిలువఁబనిచి
కేరళదేశంబు సారి బయ్యద్దేటి కంభము గూడలూర్ కైక్కోళంబు
మొదలైనసంస్థానములను జయించుచుఁ గంచుపిరంగులు గజఘటలును
గావలసినవెల్లఁ గైవసం బొనరించి యేలికసామికి నిచ్చి పంచి
మైసూరుదళముల మార్కొని సరదల గడులెల్ల నగరికిఁ గట్టి యిచ్చి
తంజాపురీంద్రుని దళము తల్లడమందఁ దిరుకాటుపళ్ళిఁ దీసి దొరకునిచ్చి
తొరుయూరురెడ్డిని దుమ్ముదుమ్ముగఁ గొట్టి యరియాపురమువారి నడవి కనిచి
యొడయారుపాళెము నొకగడెలోఁ దీసి వాలికొండపురిఁ గైవసముసేసి
మఱియు నావలనుండు మన్నీల కెల్లను మనమున నొకభీతి దనర నిల్చి
ప్రభువును మెప్పించి బహుమతులను గాంచి తనపురంబును జేరి ఘనత నుండ
బైరి కొంగలపైనఁ దూఱుచోఁ బిట్టలు కిచకిచయని పొదల్ కినియుచాఁడిఁ
బండార మనువాఁడుఁ బల్లికొండంపును సింగప్పలియు మఱి చిన్నదొరలు
వెఱపున డాఁగుచో వెఱవఁగఁ దగ దని బాళోజిపంతులపైని దూఱి
రెండువేల్గుఱ్ఱంబు లుండియుఁ బరువారఁ బట్టుకోటను లగ్గవెట్టి దుముకి
తత్సతీవేణి మాత్రము కేలఁగైకొని గుఱుతుగా సీమకుఁ గొంచువచ్చి
తంజాపురీంద్రుని దత్తఱింపఁగఁజేయ నాతఁడు మదినొచ్చి యాగ్రహమునఁ
బెద్దసేతుపతికిఁ బిమ్మటఁ బట్టాన నడవిమానిసి యొక్కఁ డాని యుండ
వానితో స్నేహించి వగపు లెల్లను దెల్పి నాలుగువేలగుఱ్ఱాలఁ గూర్చి
కలనుసేయు మటంచుఁ బలుమాఱు వల్కినఁ దనకుఁగా బుద్ధొకింతయును లేని

కాల్బల మొకలక్షఁ గాకులనలెఁ గూర్చి తంజాపురీంద్రుఁ డుద్దత్తు ఫౌజుఁ
గూడుక తిరుమయింకోటకు నరుదెంచి యదె భద్రమనుచుఁ దానస్త్రై యాని
పెద్దసేతుపతికి బిడ్డ యైతగునట్టి హిందురావును నని కేగ మనినఁ
బోదనున్న బెబ్బులి సదలింపఁ బోవుట గారా దనిన వాఁడు గనలి చూడ
నాఫౌజుఁ దోడ్కొని యాఱూరపట్యంబు జేరన సముద్రము లాఁగినట్లు
పేరెయూర్ లోపలఁ బెద్దపాళెము డించి ముందుగా నూఁడెము లొడ్డుపఱిచి
కవినాటి చెఱువాని కడయుక్కుడిం దాఁక మఱవలపూన్చి మున్నురము సేయు
వేగరుల్ ఫౌజదె వెడలె ననంగను నెవ్వారి దని కిను లెట్టఁజేయఁ
బసిఁడి కాఁకరకాయ పనిహార్వ్వపోఁగులజోళ్లు ఱొమ్మునద్రేలు ఖోళ్లచెవులుఁ
బొట్టెలుకొమ్ములపోలిక మెలిపడు జంపుగాఁ బెరుఁగు మీసాలకట్టుఁ
గొండెలు మూయించి కొనలు గుదుల్కొఁక జాలుగానిడిన రుమాలసాగు
బల్లకట్టెలనుంచి యెల్లి మోఁకాళ్లపైఁ బడఁగఁ గైసేయు దుప్పట్లకట్లు
గుఱుతు లటంచని వెఱచుచుఁ బలికిన మరనపౌఁజు లటంచు మదినిఁ దెలిసి
కలకల మని నవ్వి కడుమీసము దువ్వి కేల దిండును దట్టి కేక వైచి
వాసిగా వెన్నకుఁ బండ్లువచ్చినవార్త కానీ యటంచు నాగ్రహము సేసి
యాఁటలికై సింగ మడవిఁ బారాడంగఁ బెట్టయేనుఁగులు గన్పట్టినట్లు
విందురాఁ గూరకై వేఁటవ్రాపఁ దలంప పంటింటఁ గుందేళ్లు వచ్చినట్లు
వచ్చినా రని కిన్క హెచ్చఁ బల్కుచునుండ నాలోనఁ బోఁట్లాట లనుచుఁ బొంగి
జీరాలఁ దగళాలఁ జిలుతాలనుక్కావైచి బెడిదంపు బేడిల సమముగట్టి
డాపునవాఁడినిడ్డ సురెలు రెండిడి నలకేలను బదంగు వహిఁగఁ బూని
డాకేలఁ దఘకుఁ గేడపుబిళ్ళ నెక్కించి సింగాణితరకస మంగసగఁ గొని
తాజికచ్ఛిహరబ్బి తేజీలపైనెక్కి ఫౌఁజుఁ దోడ్కొనివచ్చి శౌరు సిలుచు
పుత్తూలనుం గస పోరికి మీరేల పొండని పల్కునఁ బోమటంచుఁ
గొంచ గువ్వలను ద్రొక్కుజసియఁగా నస సికిలీల గురుజులఁ బీఁచమణఁచుఁ
గావున నీఫౌఁజు కలనినిగొట్టిన మఱివెన్క నీఫౌఁజు పఱసఁగాదు
పచ్చిగోఁడలనుండి ప్రతిదినంబు నరళ్ల ఖండాలఁగొనమె యట్లుండ నేమి
యనుచు మిక్కిలి వేఁడనైనఁగానిమ్మని ఫౌఁజుఁ బొట్లముగ నేర్పడఁగ నడఁచి
ప్రళయవేళావిజృంభణస్మరాంబోధరగంభీరనిర్ఘోషకరసభూరి
భేరీవిరావనిర్భిన్నపద్మభవాండభాండతండంబుగా బయలువెడలి

కవినాడిచెఱువల్లుకడనుండి మెల్లఁగ నెలగోలుజగడం బాకింత నడువ
నొకటిరెండగుచు నట్లుండి పదైదయి వెన్క నూఱాయి యంతవేలసంఖ్య
ఫెళఫెళఫెళఫెళఫెళఫెళఫెళ యనినాదు నాదాఱకనాల్గుగడలుఁ
బలుతెఱంగుల పిరంగులు జజాయులుఁ దుపాకులు సరగోప్పులుఁ గలసివాఁగఁ
గలసియొక్కుమ్మడిఁ గాలమేఘంబులు కుప్పలువడ ఱాళ్ళు గురిసినట్లు
లుచితకాయలఁ జేటనుంచి చల్లినరీతి గచ్చుతెల్లులు గాజెగార్చినట్లు
గుండులు వెల్వడి తండోపతండమై ప్రక్కలఁ బిక్కల బండ్ల రొండ్లఁ
గరముల శిరములఁ గనులను జనులను గాళ్లను గీళ్లను ప్రేళ్ల నోళ్ళ
పెళ్లన విఱుచుచుఁ గొల్లగాఁ బదినూఱువేలవంతునఁ దాఁకి తూలఁ జేయ
నిలుచున్నమానిసి నిలుచున్నయట్లాఁగెఁ దగ్గియున్నభటుండు తగ్గినట్ల
త్రొమ్ము కెత్తుతుపాకి త్రొమ్ము కెత్తినయట్ల దించుతుపాకుల దించునట్ల
బుఱ్ఱమందును జేతఁ బోయుచునున్నట్ల చెవినిరంజకమును జిలుకునట్ల
గట్టనకైసలాకను దీయుచున్నట్ల త్రాటినిప్పుననిగుక్ తట్టినట్ల
బిగువుగుండ్లను గోఁకి పెట్టియాడ్చిన యట్ల గొప్పైనచోఁ జెక్కి కొఱుకునట్ల
యెదుటి ప్రక్కలనుండు నెలగోలుమూఁకల నేకముహూర్తాన నించుకంత
కనిపించి పొగక్రమ్మ గాఢాంధకారమై దిక్కు విదిక్కులుఁ దెలియకున్నఁ
గరులపై కరుగు సింగముల వితానఁ గొఁజులఁజూచినంత జిస్సుమని తూఱుఁ
జావడమ్ములరీతి సన్న మీఁలనుగొనఁ బొదలికలిడు లకుముకులదారి
ధేధేయటంచని తేజీలదాఁటించి కోయనియార్చి కైకొన్న బేడు
మాల్ పిరంగులమూసి మార్తురఁగనిడాసి కలనుసేయఁగఁ గూసి ఘాతసేసి
ఖంగుకతిల్ పెతిల్ ఘుఃలు ఘుల్లు ఖజిక్కురన జంటజీరాల నంటిమంట
భగ్గుభగ్గుననగ్గిఁ బడిమిణుంగుఱుగమి మింటికినెగయుచు మెఱయనుఱికి
దగళాలపై కప్పు తెగిదూదులెగయుచు శరదభ్రములచాయసనఁగవిసరి
చిలుతాలు లాలువచిప్పలు చిద్రుపలై కుప్పలువడఁగఁ జేకొద్దిఁ గొట్టి
తలదప్పఁ గేడెము నిలుప మండీలుండి తొడలురెండును దెగిపడఁగ మొత్తఁ
గాళ్లక్రువేయంగ గమకించి యదితప్పఁ దలవీడ ధారశుద్ధముగవైచి
చినిగినచిలుతాలు తునిగినయడిదముల్ విచ్చుచేదస్తులు విఱుగుసురెలు
పగిలినకేడెముల్ నొగిలినపేటీలు గుట్టలవలెను గన్పట్టఁబెట్టి
మీసముల్ వడివేసి డూసితీర్చినయట్ల భుజమప్పళింపఁ గేల్ మూసినట్లు

వెడ కేకకై నోరు వెడలుపించినయట్లు కఱకఱిచే నౌదు గఱచినట్లు
తరకసకట్టెలఁ బెఱుకుచున్నట్లు బిగువుసింగాణులఁ దిగియునట్లు
అసి సాఁచుకొని చూచి హయము మీటినయట్లు డాపసురెకుఁ గేల్ డాఁచినట్లు
బరిచీలవెసనెత్తి నైవఁబూనినయట్లు పరహతికై యూర్పుపట్టినట్లు
యొకప్రక్కముందు వేఱొకప్రక్కయందలి గిరివడినట్లాఁగి పౌరలుకరులఁ
గరులపైహరులును హరులపైదొరలును దొరలపైసురపురితరులవిరులు
నన్యస్థలంబున నాఘాల మానేత్ర మాగ్రీవ మావత్స మానితంబ
మాగుల్భముగఁ గాననై యున్న ఖండంబు లితరస్థలంబున నేకకర్ణ
దృక్కర స్తనపద దేహ భాగములుగ హాబిసీపఠాణి సయ్యాన్కరాటి
సిలెదార్ల జమెదార్లఁ జేకొద్దిఁ బెగడార్చి నధ్యులెవ్వారని పౌఁజుఁజూడ
గై జీత మొకవంకఁ గనిపింపఁ గావునఁ గలనిగొల్లునకుఁ జందులనుద్రొక్క
బారాహజారిరాణ్వాకరా తేజీల గుప్పనవైవ నెగ్గుఁబడిసూట
టొకటొకమనిచివ్వ టొకటొకమనిదాఁగి వంచసీయకయె యాప్రక్కవ్రాల
ధరణిపైఁబడువారి గొరిసెలద్రొక్కించి యంతలోనడ్డమై యవలఁజేరి
పులకరింతైన నేఁదులవలెఁ జివ్వలవంచి కమ్మొక యుండువారిఁ జూచి
యొఱలఁ గత్తులు వైచి తరకసల్కొద్దిని గట్టెల బిగువు సింగాండ్లఁ జెంది
పలపల ఫిచ్చినఁ బొత్తడునంతలో సోకైన గుజ్జాల నూకి సురెలఁ
బండుగు వేటలఁ బందెపుఁ జెఱకులు వడదోసపిందెల వలెను వైచి
దాయాది పాల్వంచు దారినిఁ గూరకై తఱిగినరీతి బద్దలుగఁ జేయ
నుదుటున నొకఁడొక్కఁ డెదిరి చివ్వనుబూని కమ్మి సూర్యుని సూర్యకాంతమట్టు
లేచెంత వచ్చిన నేచెంతఁగాచిన నదలించి చివ్వను బదరి మొత్త
దట్టిగుఱ్ఱము నడికట్టులోఁ బడమీటి మార్చికొట్టిన భూప్రమాణ మెఱఁగి
తొలఁగించి వాగున దూసి డావంకరా హయమునుద్రిప్పి హస్తాభరణము
విష్ణుచక్రమ్మును విస్సందు రామబాణ మ్మలిమత్తును నఱకువరుస
నొరయక నఱకుచు నఱకు దప్పినఁ బోటుఁ బోటు దప్పిన మీటు మీటు దప్ప
నుసి యుసి దప్పిన విసరు విసరుదప్ప మఱియొక్కగమన మేమఱక నడుప
సాదన మెఱవడి సాహసంబును జూచి యింద్రదేవ్రుఁడు మది నింపుపుట్టి
యీలాగు ననిసేయ నెవ్వారితర మని బహుమతు లిచ్చినవహి దలిర్ప
ఛత్రచామర కేతు సామజాందోళికాతురగ దుందుభులను దుంగపాసంగ

మంచివాఁ డితఁ డని మదిమెచ్చినట్లాగె నింద్రపట్టము వాని కిచ్చిపంప
నన్వర్థసంజ్ఞుఁడై యాతండు విలసిల్లెఁ దమకీనలుకదారి తరలిపాఱి
గాలికన్నను మంచి కాళ్లవేగము మించి మఱుఁగుఁదావులఁ జూచి మరలనాచి
దైవాలఁ బ్రార్థించి తప్పఁగా మదినెంచి తప్పత్రోవలఁ బట్టి దగను దొట్టి
యడవులలోఁబడి యంఘ్రులు దడఁబడి పుట్టలపైనెక్కి పూరిమెక్కి
పొదలఁదూఱెడువాని పదములఁ బట్టీడ్చి దూరానవైచి తాఁ దూఱుకొనుచుఁ
దానున్నచోటికి మూసిసివేతెరా గుంపుసేయకుమంచుఁ గూఁతలిడుచు
జీనువపిట్టలఁ జెంతనే కనుఁగొని యఱపఁ బేఱుఁ దలఁచి యవలఁ జనుచుఁ
బైఁడికంటియు బల్లి పలికినఁ దెలియక యిదియేమొ కీడని యెంచికొనుచు
నీచివ్వ యేవన నీకటా రేదన సరిసరి యంచని సరసుకొనుచుఁ
బెద్దకూఁతునకింటఁ బెండ్లి వొచ్చేనెల నెఱవేఱియుండిన విఱుగననుచు
నిలువంటిదొరకొలు వేమైనఁగారాద టంచని దొరలదూషించికొనుచు
దొరపైని దప్పేమి సరదారు లనువైన వాఁ డొక్కఁ డనియుఁ గావలయు ననియు
సరదార్లు మిమ్మిట్లు చనుఁడంచు వక్కాకు లిచ్చిరే యీకూఁత లేలయనుచుఁ
జివ్వమీఁదట నేను జేయి సేర్చెడువేళ వెనుకొంటితుమ్మును వింటినంచుఁ
బాళ్యానకును నేను బైనమైనడుచుచో నొంటిబాఁపఁడు రాఁగఁ గంటి ననుచు
నేను బెంచిన వేఁపి నిలువక పలుమాఱు నెడమనుండి కుడికి నేగె ననుచు
నాచార్లనుచు వచ్చి యఱపబాఁపం డేమొ చెవిఁ జెప్పినందునఁ జెడితినంచు
నమవసయొక్కప్రొద్దయిరా దనియెఱింగి పట్టితి నేను నాఫల మటంచు
నెందుకు వేర్వేఱ నెంచేరు మనబైసి యావట్టుదెలియరా యరు లటంచు
మరవమరాటీలు విఱిగిరా బహుప్రజ లడవులఁ గొండల నంతఁదావు
దొరకదు ఘాక ముందరఁ బోద మన్నట్లు కైజీతములు ముందుగానె విఱుగ
మరవమరాటీల కరయ రా సాకశాట గ్రహచారదోష మేకముగఁ దాఁకఁ
పేదవానికిఁ బుట్టు బిడ్డలకై వడి నప్పచ్చి యప్పచ్చి యనెడువారు
పనిసేయుపని చక్కనాయెనే యనుదారి నాయనే యంచని కూయువారుఁ
దన్ని విడిచి రంచుఁ దగవు దెల్పెడి రీతిఁ దన్నితన్ని యటంచుఁ దాఱువారు
వైరిపాణికృపాణి బలుచుఱు కనురీతిఁ బాణిపాణి యటంచుఁ బాఱువారు
మాఁబ్రతుకేఁకఁ బాఱుమాఱాయె ననుమాడ్కి మా రేయటంచని మరలువారు
నథిపుఁ డిచ్చినరూక యనిని నిల్పక పాఱి నప్పనఁబడినట్లు లప్పనఁబడి

తడిచేతఁ దమమేను గడగడ వడఁకఁగాఁ దరిఁ జేరికొని నిజోద్యత్ప్రతాప
శిఖిశిఖాపటలంబు సెగఁ గాఁచికొనుచును వలసినయట్టి దిక్కులనుగూర్చి
విఱుగఁటఁ గనులారఁ బరికించి జయభేరి మొఱయంగ నగరికి మరలివచ్చి
మజ్జనకాది(1)ధీమజ్జనవిరచితబిరుదప్రబంధము ల్వినుచు మెచ్చి
యఖిలవస్తువుల వాంఛాతీతముగ నిచ్చి యానందభరితుఁడై యాతఁడొప్పె
నతనిపుత్త్రిలలోన నత్యంతగుణశాలి నిజమహఃకిరణాళి విజితహేళి
తిరుమలప్రభుమౌళి ధృతవైరిరాణ్మౌళి సకలదిగ్విజయంబు సాలఁగాంచి
శేషభోగాప్తి విశేషమేమనుచు నశేషభోగాప్తి సుస్థితి వహించెఁ
దత్తపంబట్టిదో తద్ధర్మమెట్టిదో యతనికి శ్రీవిజయరఘునాథ
ధాత్రీశ్వరుండు పుత్త్రాగ్రణియై మీఱి యాదివిష్ణుండైన యల్లకృష్ణు
నిఖిలసంతతవీక్షణీయదోర్యుగమట్ల రాజగోపాల తిర్మలనృపాలు
రనుజులునై భృత్యులట్లు సేవను జేయ భవ్యసామ్రాజ్యవైభవముగాంచి
శౌర్యంబును బ్రతిజ్ఞ శాస్త్రపాండిత్యంబు భక్తిగుణమును బరఁగఁ బూని
పదివేలగుఱ్ఱపుఁబౌఁజుఁ దోడుకవచ్చు నానందరాయని ననిని గెల్చి
పదియాఱువేల వార్వపుమూఁకతో వచ్చు చందఖానుని గొట్టి జయము గాంచి
లక్షలకోట్లదళంబులతో వచ్చు నల్లపత్తేసింగు నలతుఖోజిఁ
గొనియాడునట్లుగాఁ గోట్టలలో నాఁగి బిరుదుసజ్జేఁడనుపేరుఁ జెంది
రెండవపాఛా యితం డన నుతికెక్కి నలనిజాముగుడారు గరుసు దాఁక
నపహత్తు ధణధణంధణధణయని మ్రోయ బేటిమై కొన్ని పోట్లాటలందు
నాదొర మెప్పించి హంవీర్లు వజీలు సరదార్లు మొరసు మన్నెఱక మెన్నఁ
దమతండ్రి తాతముత్తాత లార్జించిన బిరుదు లన్నింటిని మెఱయఁజేసి
పాండ్యసింహాసనపట్టభద్రులు తమప్రాణపదం బని ప్రస్తుతింప
నామహీరాచలం బాపటీరనగంబు సత్కీర్తికన్యక సంచరింప
నినుఁ బుత్త్రిగాఁ గని నీముర్వు నీహర్వు నీరీతి నీఖ్యాతి నీహసితి
నీరూపు నీవైపు నీయేపు నీయొర్పు నీముద్దు నీపద్దు నీదుహద్దు
వీక్షించి యంబుధివేష్టితావని యువరాజ్యపట్టం బొసరంగఁ గట్టి
యలరుచునుండఁగ నట్టి యౌవనకీర్తి హాయని మదిఁ గోరి హసాసుదేకి
యంబరోద్ఘుష్ఠరభవ్యతరదుర్గోరోజ స్వారామసుమశోభితాళికబరి

(1) కవిజనమఁడగు సీతారామయ్య.

శ్రీకర సుగుణరత్నాకరమేఖల యబ్జాకరవిహారి హంసయాన
సంతత నాదేయజలముగ స్రవు లొప్ప మానితసస్యరోమాంచ యగుచు
శ్రోణీవరారోహ శోభనాంగి నటంచు వద్దఁ జేరిన భుజపాళిఁ జేర్చి
తద్రతిసుఖ మొంది తర్వాత యాచమఖానుని గడెలోనఁ గలనఁ దఱిమి
విజయలక్ష్మి వరించి వేడుకగా నుండ నావలఁ బుత్త్రేచ్ఛ ననఘకులజ
కాంతలఁ గొందఱఁ గల్యాణ మొనరించి యందఱుఁ బుత్త్రభాగ్యంబుఁ జెంద
వారిలో నగ్రజు బాలవిజయరఘునాథేంద్రు రమ్యగుణమ్ముఁ జూచి
నీవు పొంగుట కేమి నిఖిలజనంబులు హృదయాబ్జమునను సమ్మదముపూను
నాజన్మముగ భవదాత్మజుచరితంబు వినవలె వినిపింతు వేడ్కతోడ
క్ష్మాపతుల్ దనుఁగని కాపుమం చనునొడి ననుకరించె ననంగనట్టు లనుచు
నాదిరాజయశంబు లన్ని లోఁగొనురీతి వాలాయమున నుగ్గుఁబాలుఁ గ్రోలి
యుర్విభరింపంగ నురగరాట్త్వముఁ జెంది చెలువుమీఱఁగఁ బొట్టచేతనడచి
తనకీర్తికిని సాటి యనఁగఁ జూచెద రమ్ము పృథివి కన్నట్లు జాబిల్లిఁ బిలిచి
సంతతద్విజసంఘసంయుక్తుఁ డౌదున న్వలె మెల్లమెల్ల పల్వరుస మెఱసి
బాల్యంబునను నిట్లు ప్రబలుచు రా నింక విదియచందురుమాడ్కి వెలయు ననుచు
వంశావళి యొనర్చి భవదీయసంతతి యాచంద్రమస్తార కాబ్జమిత్ర
కులపర్వతంబుగా వెలయంగఁ జేసితి మత్కృతాశీర్వాదమహిమవలన
జలనిధివలయితసకలమహీతలపరివృఢసుమకుటపటలఘటిత
గుణయుతమణిగణఘృణిసముదయవిలసితపదయుగసరసిజుఁడ వగుచు

గీ. కోటికులదీప! కామినీకుసుమచాప!, యమితసచ్చర్య ! రాయపదాంకధుర్య !
ఆర్యజనగేయ ! తొండమానాభిధేయ, రాయరఘునాథనృపచంద్ర ! రణమృ
గేంద్ర ! ధరణివర్ధిల్లు మాచంద్రతారకముగ.

సమాప్తము.

---

# హిందువుల బీజగణితము.



కొన్ని నెలల క్రింద నీపత్త్రికయందు హిందువుల గణితశాస్త్రమును గుఱించి విచారించుచుఁ బ్రసక్తానుప్రసక్తముగ బీజగణితవిషయమును మనయార్యులజ్ఞానభాగమును దిఙ్మాత్రముగఁ బ్రదర్శించితిని. విస్తరభీతిచే ననేకవిషయములను సవిస్తారముగ నిరూపించలేదు. ప్రస్తుత మీ వ్యాసమున శూన్యషడ్విధనిరూపణము (The operations as applied to zero), కరణీప్రకరణము (The irrational quantities), ఏకవర్ణసమీకరణము (The Simple equation), అనేకవర్ణసమీకరణము (The Simultaneous equations), అవ్యక్తవర్గ సమీకరణము (The quadratic equation), కుట్టకవ్యవహారము (The indeterminate equations) వీనికరణసూత్రములను, ఉదాహరణములను క్రమముగ విశదీకరించెదను. ఇచ్చటి శ్లోకములన్నియును భాస్కరాచార్యుల బీజగణితములోనివి. అందఱికి నర్వాచీను లగుటచే వీరన్ని విషయములను వ్రాసియున్నారు.

శూన్యపరికర్మములు.

శ్లో॥ ఖయోగే వియోగే ధనర్ణం తథైవ ।
చ్యుతం శూన్యత స్తద్విపర్యాస మేతి ॥

ధనఋణసంఖ్యలతో శూన్యమును జేర్చినఁ గాని, వానినుండి శూన్యమును దీసినఁ గాని, యాసంఖ్యలు మార్పులేకయే యుండును. శూన్యమునుండి ధనఋణసంఖ్యలఁ దీసినమాత్ర మవి ఋణధనము లగును. అనగా $a+0=a$ అనియు, $0-(\pm a)=\mp a$ అనియు నర్థము.

శ్లో॥ వధాదౌ వియత్ ఖస్య, ఖం ఖేన ఘాతే,
ఖహారో భవేత్ ఖేన భక్తశ్చ రాశిః ॥

శూన్యమును ఏసంఖ్యతోనైన గుణించినను, శూన్యముతో నేసంఖ్యనైన గుణించినను శూన్య మగును. ఏరాశినైన శూన్యముతో భాగించిన నది "ఖహార" మగును. ఇచ్చట "ఖహార" మన శూన్యముతో భాగింపఁబడిన రాశియని యర్థము. ఈ "ఖహార"మును దెలియఁజేయు సంకేతాక్షరము లెవ్వియు మనవార లుపయోగించినటులఁ దెలియలేదు. రాశియు, విభజనసంకేతమును, శూన్యాంకమును జేర్చి వ్రాయుచుండినటులఁ దెలియుచున్నది. అనగా $a \div 0=$

a÷0 అని మాత్రమే వ్రాయుచుండిరి. దీనిభావమును మాత్రము భాస్కరాచార్యుఁడు స్పష్టముగ నీరీతిని దెలుపుచున్నాఁడు.

శ్లో॥ అస్మిన్ వికారః ఖహరేనరాశా వపిప్రవిష్టే ష్వపి నిస్సృతేషు। బహుష్వపిస్యా ల్లయసృష్టికాలేఽనంతేఽచ్యుతే భూతగణేషు యద్వత్.॥

ప్రళయకాలమునఁ బరమాత్మునియం దెన్ని భూతగణములు ప్రవేశించినను, సృష్టికాలమున నాతనినుండి యెన్ని భూతగణములు వెలువడిన నాతనియందు వికారములు తోఁపనిరీతిగ శూన్యాంకముచే విభజింపఁబడిన రాశితో నెన్ని రాసులఁ జేర్చినను, దానినుండి యెన్ని రాసులఁ దీసినను వికారము లెన్వియుఁ గలుగవు. ఇటుల వికారములులేని రాశి యనంత (infinity) మనఁబడును. శ్లోకములోని "అనంతే" అనుపదము పరమాత్మునిపరముగాను "ఖహర"రాశిపరముగాను నున్నది.

[నాకు లభించిన పుస్తకములోఁ గొన్ని చోటుల మూలవ్యాఖ్యానంబులకు భేదము తెలియక ముద్రించి యుండుటచే నీశ్లోకమును వ్యాఖ్యానగత వాక్యమని భ్రమించి పూర్వవ్యాసమునఁ బొరపాటుగా వ్యాఖ్యాతలకు మాత్రము "ఖహర"రాశి స్వరూపము తెలిసియుండినదని వ్రాసితిని. ఈవిషయమును జదువరులు గమనింపఁ బ్రార్థితులు.]

## కరణీవ్యవహారము.

కరణీసంకలనవ్యవకలనము లొకేసూత్రమున నిట్లు నిరూపింపఁబడి యున్నవి.

శ్లో॥ యోగం కరణ్యో ర్మహతీం ప్రకల్ప్య ఘాతస్యమూలం ద్విగుణం లఘుంచ। యోగా న్తరే రూపవ దేతయోః స్తః॥

కరణీయోగవిధానము:— కరణీసంఖ్యల యోగముతో నాసంఖ్యల గుణనమూల ద్విగుణమును జేర్చవలయు.

కరణ్యంతరవిధానము:— కరణీసంఖ్యల యోగమునుండి యాసంఖ్యల గుణనమూలద్విగుణముఁ దీయవలయు. అనఁగా

$\sqrt{8}+\sqrt{2}$ అను గణితములోఁ గరణీసంఖ్యలు 8, 2. వీని యోగము = 10; వీనిగుణనమూల ద్విగుణము$=2\sqrt{8\times 2}=8$.

కావున $\sqrt{8}$, $\sqrt{2}$ కరణుల యోగము$=\sqrt{10+8}=\sqrt{18}$ ఈరీతినే యంతరము $\sqrt{8}-\sqrt{2}=\sqrt{10-8}=\sqrt{2}.$ అని సూత్రఫలితార్థము. ఇదియే ఆధునిక విధానమున

$$\sqrt{8} \pm \sqrt{2} = \sqrt{(\sqrt{8} \pm \sqrt{2})^2}$$
$$= \sqrt{8+2 \pm 2\sqrt{8 \times 2}}$$
$$= \sqrt{10 \pm 8} = \sqrt{18} \text{ or } \sqrt{2}.$$

## కరణీవర్గమున మూలవిధానము.

శ్లో॥ వర్గే కరణ్యాయదివా కరణ్యో స్తుల్యాని రూపాణ్యథవాబహూనాం।
విశోధయేద్రూపకృతేః పదేన శేషస్యరూపాణి యుతోనితాని।
పృథక్తదర్థే కరణీద్వయంస్యా న్మూలే,...

రెండు మూఁడు మొదలగు కరణుల వర్గమున కరణీసంఖ్యలును రూపసంఖ్యలును (integers) గలవు. ఈవిధ మగుగణితముల మూలవిధానమునఁ గరణీసంఖ్యలకు సమమగు రూపసంఖ్యలను వర్గాంతర్గతరూపసంఖ్యావర్గమునుండి శోధించి, యవ శిష్టసంఖ్యయొక్క మూలముతో వర్గాంతర్గతరూపసంఖ్యను జేర్చియు, నీమూల మునుండి వర్గాంతర్గతరూపసంఖ్యను దీసియు ద్వైధీకరించిన నాగణితమూలము లగును.

అనఁగా $\sqrt{24}+5$ అను గణితమునకు మూలవిధానమున రూపసంఖ్య వర్గము$=5^2=25$

దీనినుండి కరణీసంఖ్యకు సమమయిన రూపమును శోధించినయెడల

$$25-24=1$$

అవశిష్టము $= 1$

మూలము $= \sqrt{1} = 1$

ఈమూలముతో వర్గాంతర్గతరూపమును జేర్చిన $1+5$ అగును.

ఈమూలమునకును వర్గాంతర్గతరూపమునకు నంతరము $5-1$ అగును.

వీనిని ద్వైధీకరించిన $\frac{1+5}{2}$, $\frac{5-1}{2}$ లేక 3, 2 అగును.

ఇవియే మూలకరణులు.

అనఁగా $\sqrt{24}+5$ అను గణితమూలము $\sqrt{3}+\sqrt{2}$ అనుట. ఈవిధాన మాధునికగణితములో నీక్రిందిసూత్రముల ననుసరించినది.

(1) $(\sqrt{x}+\sqrt{y})^2=x+y+\sqrt{4xy}.$

(2) $(x \times y)^2-4xy=(x-y)^2.$

ఇచ్చట $x+y$ అనురూపమును, $4xy$ అనుకరణియును మనకుఁ దెలియును. అందుచే రెండవసూత్రమునుండి $x-y$ తెలియును. కావున $x, y$ ప్రత్యేకముగాఁ గనుఁగొన నగును.

ఏకవర్ణ సమీకరణము:—కరణసూత్రము.

శ్లో. యావత్తావత్కల్ప్య మవ్యక్తరాశే ర్మానం తస్మిన్ కుర్వతోద్దిష్ట మేవ। తుల్యౌపక్షౌ సాధనీయౌ ప్రయత్నాత్ త్యక్త్వా క్షిప్త్వా వాపి సంగుణ్య భక్త్వా। ఏకావ్యక్తం శోధయే దన్యపక్షాత్ రూపాణ్యన్య స్యేతరస్మాచ్చపక్షాత్। శేషావ్యక్తే నోద్ధరే ద్రూపశేషం వ్యక్తం మానం జాయతే ఽవ్యక్తరాశేః

అవ్యక్తరాశికి (the unknown quantity) 'యావత్తావత్' కల్పించి (assuming it to be x) ప్రశ్నలో నుద్దేశించిన వన్నియు నీయావత్తావత్తున కారోపింపవలయు. ఇటుల నిరుపక్షములకును తుల్యత్వముఁ గల్పించిన పిదప సంకలన, వ్యవకలన, గుణక, భాగాదులచే నొకపక్షమున నవ్యక్తమును, మఱియొక పక్షమున రూపమును శోధించవలయును(Eleminating the unknown quantity from one side of the equation and the known quantity from the other). తదనంతరము అవ్యక్తశేషముచే నవశిష్టరూపము నుద్ధరించిన నవ్యక్తమానము లభించును. ఆధునికగణితముననిదియే విధానము.

ఉదాహరణము:— శ్లో. కః పంచగుణితో రాశి స్త్రయోదశవిభాజితః।
యల్లబ్ధం రాశినాయుక్తం త్రింశజ్జాతంవదాశుతమ్॥

ఒకరాశిని 5 తో గుణించి, 13 తో భాగించిన లబ్ధము నారాశితోఁ జేర్చిన 30 అగును. ఆరాశిసంఖ్యను గనుఁగొనుడి.

అనఁగా $x+\frac{5x}{13}=30$ అయిన, $x$ అనునవ్యక్తరాశిసంఖ్యను గనుఁగొనుట.

అనేకవర్ణసమీకరణమున పక్షములనుండి సమవర్ణములను శోధించి, యేకవర్ణసమీకరణమున వలెఁ గ్రమముగ వర్ణమానములను గనుఁగొనవలయును. ఇందున కుదాహరణములలో నీక్రిందిపద్య మొకటి.

శ్లో. మాణిక్యాష్టక మింద్రనీలదశకం ముక్తాఫలానాంశతం
యత్తేకంఠవిభూషణే సమధనం క్రీతం త్వదర్థే మయా।
తద్రత్న త్రయమౌల్యసంయుతిమితిః త్ర్యూనం శతార్థంప్రియే
మౌల్యం బ్రూహి పృథక్ యదీహ గణితే కల్యాసి కల్యాణిని.

(ఈప్రశ్నము భర్త భార్యను గుఱించి చెప్పురీతిగ నున్నది.) నీకంఠభూషణముననుండు 8 మాణిక్యములు, 10 ఇంద్రనీలశిలలు, 100 ముక్తాఫల

ములు నెు కేవెలకుఁ దీయఁ బడినవి. ఒకమాణిక్యము, ఒకఇంద్రనీలము, ఒకముక్తికమును జేరి 47 రూప్యములయినవి. నీకు గణితమున సామర్థ్య ముండెనేని ప్రతిరత్నముయొక్క వెలను గనుఁగొనుము.

[ఇతఃపూర్వపుసంచికలో నవ్యక్తరాసులు యావత్తావత్, కాలక, నీలక, ఇత్యాదిపదములఁ బూర్వాక్షరములచేఁ దెలియఁబఱుపఁబడునని చెప్పియుంటిమి]

ఈప్రశ్నమును గణితసంకేతములతోఁ దెలిపిన నీమాదిరి యగును.

ప్రతిమాణిక్య క్రయము = యావత్తావత్ (యా)

,, ఇంద్రనీల ,, = కాలకము (కా)

,, ముక్తాఫల ,, = నీలకము (నీ)

అయిన,

యా 8 = కా 10 = నీ 100...(ఒకకల్పము)

యా 1 కా 1 నీ 1 = 47 రూప్యములు... (మఱియొకటి) ఆధునికగణిత సంకేతాక్షరములతో నివియే

$$8x = 10y = 100z$$

$$x + y + z = 47$$

అనియు నగును.

(ఈ ప్రశ్నములయందు సమీకరణసంకేతము (=) ఆధునికగణితములోనిది. ప్రాచీనులు "సమ" అనుపదమునే వ్రాయుచుండినటులఁ దెలియుచున్నది.)

అవ్యక్తవర్గసమీకరణమున సూత్రము.

శ్లో. అవ్యక్తవర్గాది యదావశేషం పక్షౌతదేష్టేననిహత్య కించిత్
క్షేప్యం తయో ర్యేన పదప్రదస్స్యా దవ్యక్తపక్షస్యపదేన భూయః।
వ్యక్తస్యపక్షస్య సమక్రియైవ మవ్యక్తమానం ఖలులభ్యతే తత్
ఋణం ధనం తచ్చవిధాయసాధ్య మవ్యక్తమానం ద్వివిధం క్వచిత్స్యాత్॥

అవ్యక్తవర్గాదు లుండుపక్షము మూలప్రద మగునట్లు( in order that the side contianing the terms $x^2, x$ may be a perfect square) ఆపక్షము నేసంఖ్యతోనైన గుణించి దానిమూలమును గనుఁగొనవలయు వ్యక్తపక్షమునకు నీ సంస్కారములనే చేయనలయు. ఇట్లుచేసిన నవ్యక్తమానము లభించును.

ఇట్లు లభించిన యవ్యక్తమానము కొన్నిచోటుల ఋణము, ధనము, అని ద్వివిధముగ నుండును. ఇచ్చటఁ బ్రాచీనులు సాధారణముగ ధనమానము

నే(positive root) స్వీకరించు చుండిరి. ఋణమూన ముండునది కూడ వారలకుఁ దెలియదు. భాస్కరాచార్యుఁడే దీనిని గనుఁగొనెనని పాశ్చాత్యగణితజ్ఞు లొకరు వ్రాయుచున్నారు.

ఉదాహరణము.—

శ్లో. చక్రక్రౌంచాకులితసలిలే క్వాపి దృష్టంతడాగే
తోయాదూర్ధ్వం కమలకలికాగ్రం వితస్తి ప్రమాణమ్।
మందం మందం చలిత మనిలే నాహతం హస్తయుగ్మే
తస్మిన్మగ్నం గణక గణయ క్షిప్ర మంబుప్రమాణమ్॥

ఒకతటాకమునఁ దామరసపుష్పము నీటిపై జేనెఁడు ప్రమాణమున నుండెను. గాలిచే చలితమయి మెల్లగ నది రెండుమూరల దూరమున మునిగెను. తటాకమున నీటిప్రమాణమెంత ?

శ్లో॥ కోరాశి ర్ద్విశతీక్షుణ్ణో రాశివర్గయుతోహతః।
ద్వాభ్యాం తేనోనితో రాశివర్గవర్గోఽయుతం భవేత్।
రూపోనం వదతం రాశిం వేత్సి బీజక్రియాం యది॥

ఒకరాశిని 200 తో గుణించి, దీనిని రాశివర్గముతోఁ జేర్చిన ఫలద్విగుణమును రాశివర్గవర్గమునుండి దీసిన నయుతముకంటె నొకటితక్కువయునగును. ఆరాశిసంఖ్యయెంత?

| అనఁగా నాధునిక సంకేతములో | ప్రాచీనసంకేతములో |
|---|---|
| $x^4-2x^2-400x=9999$ | యావవ 1 యావ $\dot{2}$ యా 4$\dot{0}$0=రూ9999 |
| | పక్షద్వయమునకు |
| Adding $4x^2+1$ to both | యావ 4 రూ 1 ని జేర్చి. |
| $x^4+2x^2+1=4x^2+400x+10000$ | యావవ 1 యావ 2 రూ 1=యావ4 యా 400రూ 10000. |
| Extracting the root | మూలమునుకనుఁగొని, |
| $x^2+1=2x+100$ | యావ 1 రూ 1=యా 2 రూ 100 |
| Removing $2x$ to this side | పక్షమునుండి యా 2 ను మార్చి, |
| $x^2-2x+1=100$ | యావ 1 యా $\dot{2}$ రూ 1 = రూ 100 |
| Extracting the root | మూలమునుకనుఁగొని, |
| $x-1=10$ | యా 1 రూ $\dot{1}$ =రూ 10 |
| $\therefore x=11$ | అనఁగా యా 1=రూ 11. |

(యావ = యావద్వర్గము, యావవ=యావద్వర్గవర్గము, రూ=రూపము, యావ $\dot{2}$ ఋణయావద్వర్గములు రెండు, అని చదువవలయును).

కుట్టకవ్యవహారము.—

ఇచ్చట ననేకవిధకుట్టకములును వానికరణసూత్రములును విశదముగాఁ జర్చింపఁబడియున్నవి. వాని నన్నిటిని నిరూపించుట యనావశ్యకము. రెండు మూఁడువిధముల నుదహరించి వానియుపలబ్ధి పద్ధతిని విశదీకరించి యీవ్యాసమును ముగించువాఁడను.

శ్లో॥ కోరాశి ర్ద్విగుణో రాశివర్గై ష్షడ్భిః సమన్వితః।
మూలదో జాయతే బీజగణితజ్ఞవదాశుతమ్ ॥

ఒకరాశిని ద్విగుణించి, యారాశివర్గషట్కమునకుఁ జేర్చిన మొత్తము మూలప్రద (a perfect square) మయిన నారాశిసంఖ్యయెంత ?

| అనఁగా నాధునిక సంకేతములో | ప్రాచీనసంకేతములో |
|---|---|
| $2x+6x^2=y^2$ | యా 2 యావ 6=కావ |
| Multiplying by 6 & adding 1 to both sides | ఇరుపక్షముల నారింటితో గుణించి యొకటిచేర్చిన |
| $36x^2+12x+1=6y^2+1$ | యావ 36 యా 12 రూ 1=కావ6రూ1 |
| Extracting the square root | మూలము |
| $6x+1=\sqrt{6y^2}+1$ | యా 6 రూ 1=కావ 6 రూ 1 యొక్క మూలము |
| Ascribing the values to $y$ so that $6y^2+1$ is a square we get the value of $x$. | ఇచ్చట "కావ6రూ1" మూలప్రద మగునట్లు "కాలక" మితి సంఖ్యలను కనుఁగొనిన "యావత్" సంఖ్య తెలియును. |
| Now when $y=2$; $x=\frac{2}{3}$ is one of the solutions. | కాలకమితి 2 అయిన యావత్ $\frac{2}{3}$ |

(పూర్వమువలె "కావ" = కాలకవర్గము అని పైప్రశ్నములోఁ జదువవలయు.)

అవ్యక్తభావితముకూడ ప్రశ్నలోనుండినఁ గరణసూత్రము (భావితము= Product of two or more unknown quantities of different natures),

శ్లో. భావితం పక్షతోఽభీష్టాత్ త్యక్త్వా వర్ణాసరూపకౌ।
అన్యతో, భావితాంకేన తతః పక్షౌ విభజ్యచ।
వర్ణాంకాహతిరూపైక్యం భక్తేష్టేనేష్టతత్ఫలే।
ఏతాభ్యాం సంయుతావూనౌ కర్తవ్యౌ స్వేచ్ఛయాచ తౌ।
వర్ణాంకౌ వర్ణయోర్మానే జ్ఞాతవ్యే తే విపర్యయాత్॥

ఒకప్రశ్నములో భావితముండిన నాభావితము నొకపక్షమునను, రూపముతోడ వర్ణములను (The unknown quantites with the absolute term) మఱియొకపక్షమునను మార్చవలయును. భావితాంకముచే నిరుపక్షములను భాగించవలయును. వర్ణాంకగుణనమును (The product of the coefficients of the unknown quantities) రూపముతోఁ జేర్చి, యిష్టానుసారము రెండు భాగములుగ విభజించి (Splitting it into any two factors) వీనిని వర్ణాంకములతోఁ జేర్చిన మొత్తములు వ్యత్యస్తముగా వర్ణాంకమానములగును. (ఉదాహరణముచే నీసూత్రముస్పష్టమగును)

ఉదాహరణము.

శ్లో. చతుస్త్రిగుణయో రాశ్యోః సంయుతిర్ద్వియుతా తయోః।
రాశిఘాతేన తుల్యాస్యాత్తౌరాశీ వేత్సిచే ద్వద॥
(అర్థము స్పష్టము)
అనఁగా $4x + 3y + 2 = xy$.

ఇచ్చట భావితము ($xy$) ఒక పక్షమునను వర్ణరూపాదులు మఱియొక్క పక్షమునను బ్రశ్నములోనే యున్నవి.

భావితాంకము (1) తో పక్షములను విభజించి,

$$4x + 3y + 2 = xy.$$

వర్ణాంకగుణనము $4 \times 3 = 12$, రూపముతోఁ జేర్చిన, $12+2 = 14$ అగును.

దీని నిష్టానుసారముగ విభజించిన,

$$2,7$$

వీనిని వర్ణాంకములతోఁ జేర్చిన

$$2+4=6, 7+3=10$$

ఇచ్చట $x$ వర్ణాంకముతోఁ జేర్చిన ఫలము$=6$

$y$ వర్ణాంకముతోఁ జేర్చిన ఫలము $= 10$

వ్యత్యాసముచే $x, y$ వర్ణములమానము 10, 6 అగును.

ఆధునికగణితమున నీయంశము మఱియొకవిధమున నిరూపింపఁబడును.

Solve for integral values $4x+3y+2 = xy$.

Now $4x+3y+2=xy$

$\therefore 4x-xy=-2-3y$.

or $x(y-4)=2+3y$

$$\therefore x = \frac{2+3y}{y-4} = 3+\frac{14}{y-4}$$

Here $3+\frac{14}{y-4}$ must be an integer.

$\therefore y-4=\pm 14, \pm 1, \pm 2, \pm 7$

$\therefore x$ can be determined

ఈవిధమున భిన్నములు (fractional values)దుర్లభములు. ప్రాచీనపద్ధతిలో భిన్నములు కూడ సులభములు.

కుట్టకవ్యవహారమునఁ బ్రతిప్రశ్నమును బహుచమత్కారముతోఁ గల్పింపఁబడియున్నది. ఒక్కొక్కటియు నొకజాతిని దెలియఁబఱచును. చదువరులు స్వయముగ నీవిషయములఁ బరిశీలింపవచ్చును.

మనయార్యు లన్నిగణితశాస్త్రములలో బీజశాస్త్రమును బలపఱచినందున నీవిషయమై ప్రత్యేకముగ వ్రాయవలసి వచ్చినది.

తిరుపతి. కపిస్థళం - కృష్ణమాచార్యులు.

# విజ్ఞానచంద్రికాగ్రంథమాల.

ఆంధ్రులపౌరుషము! ఆంధ్రులయౌన్నత్యము!! ఆంధ్రులబుద్ధివైభవము!!

# ఆంధ్రులచరిత్రము.

## రెండవభాగము.

ఇందు క్రీ.శ.1100నుండి 1350 వరకుఁగల ఆంధ్రదేశచరిత్ర వర్ణింపఁబడినది.

పురాణములు, కావ్యములు, శాసనములు, విదేశీయులవ్రాతలు, మొదలగువాని నన్నింటిని శోధించి తెలుఁగుచోడులు, నాగవంశోద్భవులైన మహారాజులు, కాకతీయచక్రవర్తులు, పల్నాటివీరులు, కమ్మవారు, రెడ్లు, వెలమలు మొదలగువారి చరిత్రలు, ఈ యుద్గ్రంథమునందు క్రోడీకరింపఁబడినవి.

రామానుజుఁడు, బసవేశ్వరుఁడు, నన్నెచోడ కవిశిఖామణి, ఖడ్గతిక్కన, కవితిక్కన, గణపతిదేవచక్రవర్తి, ప్రతాపరుద్రమహారాజు, మహారాణి రుద్రమదేవి, మొదలగువారల పవిత్రజీవితములు శ్రద్ధతో వ్రాయఁబడినవి.

ఆయాకాలమందలి సాంఘిక, రాజకీయస్థితులు చక్కఁగ వివరింపఁబడినవి. ప్రదేశములయొక్కయు, కట్టడములయొక్కయు, పటములుకలవు.

పౌరుషమునందును, పాండిత్యాతిశయంబునందును రాష్ట్రపాలనయందును ఆంధ్రులు హిందూదేశములోని యితరదేశములవారికి తీసిపోవువారు కారని యీగ్రంథము సప్రమాణముగా సిద్ధాంతీకరించుచున్నది.

ఇట్టిగ్రంథము తెలుఁగులోగాని మఱేయన్యభాషలోఁగాని యెవ్వరును రచించియుండలేదు.

విఖ్యాత లేఖకులగు శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు పంతులుగారిచే నిది రచింపఁబడినది. 400 పేజీలుగలిగి మంచికాగితములమీఁద చిన్న యక్షరములతో ముద్రింపఁబడి చక్కనిక్యాలికోబైండుచేయఁబడిన యీయమూల్యగ్రంథము మాచందాదారులకు పోస్టేజితో రు 1-0-0 లకును, చందాదారులు కానివారలకు పోస్టేజిగాక రు 1-8-0 లకును ఇయ్యఁబడును.

☞ విజ్ఞానచంద్రికా బుక్కుడిపో యందు సంస్కృతాంధ్రగ్రంథము లనేకములు దొరకును. వలయువారికి క్యాటలాగులు పంపఁబడును.

చిరునామా:—

ఆ. లక్ష్మీపతి, బి. ఏ. ఎం. బి. సి. ఎం.

మేనేజరు.—విజ్ఞానచంద్రిక,

చింతాద్రిపేట.—మద్రాసు.

# ప్ర క ట న

---

## ఆంధ్రసాహిత్య పరిషత్తు, చెన్నపురి.

ప్రతిష్ఠాపకులు:—

శ్రీపిఠాపురము రాజాగారగు శ్రీరాజా రావు కుమార వేంకటమహీపతి సూర్యారావు బహద్దరుగారు.

శ్రీవేంకటగిరిరాజాగారగు మహారాజా సర్ - వెలుగోటి శ్రీరాజగోపాల కృష్ణయాచేంద్రబహద్దరుగారు, కె. సి. ఐ ఇ., పంచహజారీమన్సబ్దార్.

అగ్రాసనాధిపతి:—

శ్రీవేంకటగిరి రాజాగారు.

కార్యనిర్వాహక సభాధ్యక్షుఁడు.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులుగారు. బి. ఏ., బి. ఎల్.

కార్యదర్శులు.

మ-రా-రా-శ్రీ పురాణం నాగభూషణంపంతులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

,, ఆచంట లక్ష్మీపతిగారు, బి. ఏ., ఎం. బి., సి. ఎమ్.,

,, దివాన్ బహద్దర్ నెమలి పట్టాభిరామారావు పంతులుగారు బి. ఏ.,

కోశాధ్యక్షులు (ట్రస్టీలు)

దివాన్ బహదూర్ కంచి కృష్ణస్వామిరావుగారు, సి. ఐ. ఇ.,

ది ఆనరబిల్ రావుబహదూర్ పిట్టీత్యాగరాయసెట్టిగారు, బి. ఏ.

కార్యస్థానము.

2/7 హారిస్ రోడ్డు, పుదుపేట.

చందానిర్ణయము.

పరిషదుద్దేశము:—ఆంధ్రశబ్దములకు సలక్ష్యవ్యుత్పత్తికముగ విపులనిఘంటువు రచించుట, తెలుఁగుభాష కితరభాషలతోఁ గల సంబంధమును దెలుపుచు భాషాతత్త్వమును నిరూపించులక్షణ శాస్త్రమును రచించుట, ఆంధ్రదేశపూర్వవృత్తాంతమును ప్రమాణపూర్వకముగా నిరూపించుట, శాస్త్రపారిభాషికపదముల నిర్ణయించుట, నూతనగ్రంథరచనకు సాహాయ్యమొనర్చుట, భాషావిషయములఁజర్చించుటకుఁ బత్రికనొకదానినిఁ బ్రకటించుట, సమగ్రమగు పుస్తకభాండాగారము నేర్పఱచుట, ఇత్యాదివిధముల నాంధ్రభాషావాఙ్మయాభివృద్ధికై యత్నించుట, పరిషత్తుయొక్క యుద్దేశము

| | | | |
|---|---|---|---|
| 1. | ఉద్ధారకులకు | రు. | 5000. |
| 2. | పోషకులకు | ,, | 1000. |
| 3. | యావజ్జీవసభ్యులకు | ,, | 100. |
| 4. | సాధారణసభ్యులకు సంవత్సరమునకు | ,, | 6. |

పరిషత్సభ్యులు పత్రికకు వేఱుగాఁ జందా నియ్యనక్కఱలేదు.

సభ్యులు కాఁగోరువారు కార్యదర్శుల పేర వ్రాసి పరిషన్నిబంధనలఁ దెప్పించుకొనవచ్చును.

# విషయసూచిక.


1. శృంగారరసవిమర్శనము ... ... 327-350

వల్లాది సూర్యనారాయణశాస్త్రులుగారు

2. ఆంధ్రనాటకములు ... ... 351-385

తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు

3. ఆంధ్రభాష ... ... 386-396

వఝుల చినసీతారామస్వామిశాస్త్రులుగారు

4. శాస్త్రపరిభాష ... ... 397-398 అ.

వ. లు. నరసింహస్వామిగారు

5. శక్తివర్మ పభుబట్టుశాసనము ... ... 399-411

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.


## ప్రతిబింబములు.


1. శక్తివర్మ పభుబట్టుశాసనము.

శ్రీ రస్తు.

ఓమ్

నమః పరబ్రహ్మణే.

# శృంగారరసవిమర్శనము.

"రసో వై సః రసꣳ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి"

ఏయది చతుర్వర్గఫలప్రాప్తిసాధనంబై యమందానందసంధాయకంబై వివేకలోకంబున నలంకరించు, నెయ్యది నిరంతరచింతాసమాకులహృదయంబు హర్షోత్కర్షపరవశంబు గావించు, నేది వివిధప్రపంచవిషయకజ్ఞానంబు బోధించు, నేయది కృత్యాకృత్యప్రవృత్తినివృత్తిమార్గం బుపదేశించు నట్టిసరసజనవంద్యంబు, నవరసభాసురంబు, సుకవిభావితరూపంబు నగుసత్కావ్యంబు, "ఏకశ్శబ్దస్సుప్రయుక్తస్స్వర్గేలోకేచ కామధుగ్భవతి" యను వేదవాక్యంబునను, "కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే। సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే" యను మమ్మటవచనంబునను ధర్మమోక్షోపయోగివాక్యార్థజ్ఞానంబును, కాళిదాసాదులకువలె యశస్సును, ధావకాదులకువలె ధనంబును, రాజసభివగురుత్రాపసాదులకువలె నుచితం బగుసదాచారజ్ఞానంబును, మయూరాదులకువలెఁ బీడాపరిహారంబును, సకలప్రయోజనసారభూతసద్యఃకాలికసమధికానందరసాస్వాదనసుఖంబును, మనోహారిణి యగుప్రియరమణివలె హితోపదేశంబును గావింపఁ గారణం బగుననుట సర్వాలంకారికసమ్మతం బగుప్రాచీనమతం బగుటచే నిది మానవలోకంబునకుఁ బఠనశ్రవణాదర్శనయోగ్యం బైనపురాకృతం బగుమహాభాగ్య మనుచుఁ గా విశ్వసింపవచ్చును. ఏతాదృశం బగుకావ్యంబున కనేకాలంకారికు లనేకవిధంబులుగా లక్షణంబులు నిర్వచించిరి కాని కొంచె మెచ్చుతక్కువగా నడిపించుచున్న నాసిలో నెల్ల బ్రహ్మాండప్రవృత్తికై కొన్ని యిందుదాహరించెదను.

## కావ్యస్వరూపము.

"సహృదయమనోరంజకం బగుసర్థముచే నలంకరింపఁబడిన పదసమూహము కావ్య" మని యాచార్యదండియు, "వాచ్యవ్యంగ్య ప్రభేదంబును సహృ

దయరంజకంబునగు నర్థమే కావ్యంబున కాత్మ యనియు, ధ్వని కావ్యంబున కాత్మ యనియు ద్వివిధంబుగ నానందవర్ధనాచార్యుండును, "గుణాలంకార పూతంబు లగుశబ్దార్థములే కావ్య మనియు, వైదర్భ్యాదిగుణవిశిష్టం బగుపదరచనమె కావ్యంబున కాత్మ" యనియు వామనపండితుండును, "దోషరహితంబులు మాధుర్యాదిగుణసహితంబులు స్ఫుటాలంకారంబులు నగు శబ్దార్థములు కావ్య" మని మమ్మటభట్టును, "రసాత్మకం బగువాక్యమె కావ్య" మని విశ్వనాథకవిరాజును, "మనోజ్ఞం బగునర్థమును బ్రతిపాదించు శబ్దము కావ్య" మని జగన్నాథపండితరాజును నింకను బెక్కండ్రు పెక్కువిధంబులఁ గావ్యలక్షణంబు నిర్వచించిరి. ఇట్టి యెల్లలాక్షణికుల మతంబులు పరికింపంగా సరసగుణాలంకారంబులై రమణీయంబు లగుశబ్దార్థములు కావ్య మనుచున్న వని మనకుఁ దెలియుచున్నది. ఏతాదృశలక్షణలక్షితం బగు కావ్యంబున కేది లేక రుచి గలుగ దని (1) భరతముని వక్కాణించెనో, బహులాక్షణికులు దేనిని గావ్యంబున కాత్మగాఁ బరిగణించిరో, వాగ్వైచిత్ర్యప్రధానం బగుకవికృత్యంబున కెయ్యది జీవితం బగునని (2)యాగ్నేయపురాణాదులు ప్రశంసించుచున్నవో, (3)వ్యక్తివివేకకారునిచే నేది కావ్యంబున కఙ్గియని నిర్వచింపఁబడినదో, దర్పణకారాదులు దేనిచేఁ గావ్యమునకుఁ గావ్యత్వ మంగీకరించిరో, "రసోవైసః" ఇత్యాది శ్రుతివాక్యంబులచేఁ బ్రతిపాదింపఁబడు నిత్యసిద్ధశుద్ధస్వభావంబు పరబ్రహ్మానందరూపంబు నగు రసంబునాఁడ్క నేయది రత్నాకరకారాదులచే నిత్యస్ఫురానందాస్వాదరూపం బని నుతింపఁబడినదో యట్టి కవితాజీవనం బగురసమునుగూర్చి ప్రసంగింతము.

## రసస్వరూపము.

"రస ఆస్వాదనే" యను రసధాత్వర్థముచేతను, "రస్యతే స్వాద్యత ఇతి" యను వ్యుత్పత్తిచేతను గూడ నానందానుభవరూపం బగుస్వాదమే రస మగునని తెలియుచున్నది. దీనినే "స్వాదః కావ్యార్థసంభేదా దాత్మానందసముద్భవః" కావ్యార్థపరిశీలనంబునఁ బైకిఁ బొంగునట్టి యాత్మానందమే రసాభిన్నం బగుస్వాదమనెడి ధనంజయసమ్మతం బగు ప్రాచీనమతమును గూర్చి బలపఱచుచున్నది. కావు ననే సర్వాలంకారికులును బ్రహ్మానందాస్వాదమును సంపాదించుదానిపట్ల నగా

(1) నహిరసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే.

(2) వాగ్వైచిత్ర్యప్రధానేఽపి రస ఏవాత్ర జీవితం.

(3) కావ్య స్యాత్మ న్యంగిని రసాదిరూపే న కస్యచిద్విమతిః.

కిక చమత్కారకారి యైన యీరసమును లౌకికరసముకంటె విలక్షణ మగు నలౌకిక రసముగాఁ బ్రశంసించిరి. ఈదృశం బగురస మెట్లు జనించు ననువిషయంబున నెల్లవిధంబుల నేకీభవించిన సర్వాలంకారికులమతంబులకుఁ బ్రధానాధార మైన భరతమునిమతంబుఁ బ్రమాణముగాఁ గొని విమర్శింతము.

"విభా వానుభావ వ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తిః". రత్యాది స్థాయి భావంబులకు లలనా ద్యాలంబనకారణంబులు నుద్యానాద్యుద్దీపనకారణంబులు నగువిభావాదులతోడను, కటాక్షభుజాక్షేపాదిరూపంబు లగు ననుభావంబుల తోడను, నిర్వేదాది సహాయకారు లగు వ్యభిచారిభావంబులతోడను జన్యజనక పోష్యపోషకభావరూపసంబంధంబున రసము జనించు నని యీసూత్రప్రభావం బును భట్టలోల్లటాదులు వివరించినట్లు గనుపడుచున్నది. ఈసూత్రార్థమునే ప్ర మాణముగాఁ గైకొని ధనంజయ మమ్మటాదులు రసనిర్ధారణమును వ్యక్తీకరించుచు వచ్చిరి. సుఖబోధంబునకై వారిమతంబుల కేకీభావంబుగ నర్థము వివరించెదను.

వాసనాదిరూపంబున నతిసూక్ష్మముగానున్న రత్యాదిస్థాయుల కాస్వాద యోగ్యతను గల్పించునవి విభావంబు లనియు, ఆస్థాయులనే యనుభవవిషయం బులనుగాఁ జేయునవి యనుభావంబు లనియు, వానినే దేహంబున విశేషంబుగ సంచరింపఁ జేయునవి వ్యభిచారు లనియుఁ జెప్పఁబడును. క్రమముగాఁ గారణంబు లు, కార్యంబులు, సహకారులు నగునీవిభావాదులచేఁ బ్రతిపాదింపఁబడు నవిచ్ఛి న్నప్రవాహరూపచిత్తవృత్తివిశేషము (*స్థాయిభావము)రస మనఁబడును. చిత్త వృత్తిరూపం బగుదీనికి శీఘ్రవినాశిత్వము సంభవింపఁ దగియున్నను వాసనా రూపంబున సూక్ష్మముగా నెల్లయెడ నుండునది గావుననే యిది స్థాయి యని చెప్పఁబడుచున్నది. ఈరసము శృంగారాది నామంబుల నవవిధంబై యొప్పా చున్నది.

---

* (1) విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః ।
అనీయమానస్స్వాద్యత్వం స్థాయీభావో రసస్స్మృతః॥

(దశరూపము)

(2) విభావా అనుభావా స్తత్కార్యంతే వ్యభిచారిణః।
వ్యక్తస్స తై ర్విభావాద్యైః స్థాయీభావో రసస్స్మృతః॥

(కావ్యప్రకాశము)

(3) విభా వానుభావ సాత్త్విక వ్యభిచారి సానుగ్రీసముల్లసితిస్థాయీభావో రసః.

(సాహిత్యరత్నాకరము)

కాని, భరతముని నిర్దేశింపక పోవుటచేఁ గొలఁదియాలంకారికులు శాంతము నొకరసముగాఁ బరిగణింపలేదు. ధనంజయాదులు గొందఱు దీని నాట్యములయందు మాత్ర ముపయోగింపఁగూడ దని చెప్పిరి. ఇఁకఁ గొందఱు స్నేహభక్త్యులతో రసములు పండ్రెండని చెప్పిరి. కావున రసములు తొమ్మిదియే యని నియమము సిద్ధించుటలేదు. అయిన నీవిషయంబున పిత్రాదులకుఁ బుత్రాదులయందుఁ గన్న సుప్రీతి స్థాయికమైన వత్సలరసమును, మిత్రాదులయందుఁ దోఁచునార్ద్రతాస్థాయికమైన స్నేహరసంబును, బ్రభుగురుదేవతాదులయందు గోచరమగుతాత్పర్యస్థాయికమైన భక్తిరసంబును విభావాదిరతిసముల్లసితంబులై శృంగారరసంబున నంతర్భూతంబు లగుచున్నవి గావున వానికి వేఱుగా రసత్వము సిద్ధము గాదు. శాంతమునకు శమము స్థాయిభావ మని కొందఱాలంకారికులు సమ్మతించి యుండుటచేతను, శ్రవణమననాది మూలంబుగ శమదమాది సంపన్ను లగుపండితులయం దది సంభవించుచుండుటచేతను దృశ్యేతరకావ్యంబుల శాంతరస ముపయోగింపఁదగు ననెడి మమ్మటాదిసమ్మతం బగుధర్మసూరిమతంబును బ్రమాణముగాఁ గైకొని వర్ణనాత్మకంబు లగుశ్రావ్యకావ్యంబుల రసనవకత్వమును మనము సంపాదించుకొనవచ్చును. ఈ రసంబులకుఁ గ్రమముగా రతిహాసాదులు స్థాయిభావములుగాఁ జెప్పఁబడినవి. ఇట్లు నవవిధంబయి కావ్యజీవనంబై యలరారుచున్న రసంబునకు దేనిచే రసమను నామము సిద్ధించెనో, యెయ్యది యఖిలరసంబులకు నాద్యంబై సకలాలంకారికులకు నూఁత యయ్యెనో, యేది పండితపామరసాధారణమనోరంజకంబై కావ్యకర్తలకుఁ గల్పవృక్షం బయ్యెనో యట్టి శృంగారరసముం గూర్చి విమర్శింతము.

## శృంగారము.

"శృంగం ప్రాధాన్య మియర్తీతి శృంగారః"

సర్వరసంబులలో నిది యుత్తమత్వమును బొందుచున్నది గావున శృంగారమగుచున్న దని ధర్మసూరియు, "శృంగ మనఁగాఁ గామోద్రేకము దానిం గలిగించుటకుఁ గారణమై రత్యాది ప్రధానప్రకృతులచే విస్తరింపు రసము

శృంగార మనఁబడు" నని (1)విశ్వనాథ కవిరాజును, "మన్మథోద్రేక కారణం బై స్త్రీపురుషనిష్ఠమైన రసము శృంగారమనఁబడు" నని కావ్యప్రకాశ వ్యాఖ్యలో (2)భట్టవామనాచార్యుఁడును శృంగారపదమును నిర్వచించిరి. ఈపద్వైవిధ్యముగా నడిపడుచున్న యీనిర్వచనములకు సామరస్యము గలిగించుచు "(3)రసాంతరాపేక్షచే మధురమై యుత్తమమైన శృంగారరసమే రత్యాది ప్రకృతులచే దేవతిర్యఙ్నరాది జాతిసామాన్యంబుగ సమితానంద సంధాయకంబై యలరారుచున్న" దని యానందవర్ధనాభినవగుప్తాచార్యుల మత మొంతయు నొప్పుచున్నది. పైయర్థమిచ్చు శ్లోకమొదలి "ఏవ"కారము తప్పక శృంగారమునకే ప్రాధాన్యము గలిగించు నని ధర్మసూరి మతంబునకు బలంబుగా లోచన కారాభిప్రాయముగూడఁ గన్పడుచున్నది. ఇది యిట్లుండఁగా "రస్యతే స్వాద్యత ఇతి" యనువ్యుత్పత్తిచే రసశబ్దమునకు సుఖాస్వాదరూపమగు శృంగారమే యర్థము. "సుఖ మొక్కటియే యాస్వాద్యం బగుటచే సుఖాస్వాదరహితంబు లగు కరుణాదులకు రసత్వము సంఘటింపదు" అను నభిప్రాయంబుతో శృంగారప్రకాశంబున భోజరాజు

"వీరాద్భుతాదిషు రసేషు రసప్రసిద్ధి స్సిద్ధా కుతో౽పి వట యక్షవదావిభాతి।
లోకే గతానుగతికత్వవశా దుపేతా మేతాం నివర్తయితు మేష పరిశ్రమోనః॥
శృంగారవీరకరుణాద్భుతహాస్యరౌద్ర బీభత్సవత్సలభయానకశాంతనామ్నః।
ఆమ్నాసిషు ర్దశరసానప రే వయంతు శృంగారమేవ రసనాద్రస మామనామ॥
"శృంగారఏకఏవ రసః"

ఏదో యొకమఱ్ఱిమీఁద యక్షగ్రహ మున్న దని నలుగురు చెప్పుకొనుటం బట్టి దానికి దయ్యాల మఱ్ఱి యని పేరు వచ్చినట్లుగానే యెట్లో వీరకరుణాదులకుఁగూడ రసప్రసిద్ధి సిద్ధమయినది. గతానుగతికన్యాయంబున లోకంబున సిద్ధమైన యీప్రతీతిని నివారించుట కష్టసాధ్యము. కొందఱు రసము లెనిమిదని, యింకఁ గొందఱు తొమ్మి దని, మఱికొందఱు పదియని వివిధంబుగఁ జెప్పిరి. "ఇదంతయు మాకేల? మే మొక్క శృంగారమునే రస మని తలంచెదము శృం

(1) శృంగంహి మన్మథోద్భేద స్తదాగమనహేతుకః।
ఉత్తమ ప్రకృతి ప్రాయో రస శ్శృంగార ఇష్యతే॥
(2) ....పురుష ప్రమదాభూమి శ్శృంగార ఇతి గీయతే॥
(3) శృంగారఏవ (ఏకో) మధురః ప్రహ్లాదనో రసః।

గార మొక్కటియే రసము" అని చెప్పిన వాక్యంబులు కరుణాదులకు రసత్వము సంఘటింప దను బహాలాక్షణికవిరుద్ధ మైన యాతనియొక్క యభిప్రాయంబును విడిచితిమేని శృంగారముయొక్క ప్రాధాన్యంబు ప్రాశస్త్యంబు నాస్వాద్యత్వంబు మొదలుగాఁ గల గుణంబుల నపారముగా మనకుఁ దెల్పకపోవు.

మఱియు నాచార్యపాదుఁ డగుభరతమునికూడ "రతిస్థాయిప్రభవంబు నుజ్జ్వలవేషాత్మకంబు నగునది శృంగారము. లోకములో మిక్కిలి పవిత్రమైనదియు దర్శనీయంబు నగువస్తువు శృంగారముతో నుపమానింపఁబడును. ఎవఁడు మనోహరం బగువేషము గలవాఁడో వాఁడు శృంగారవంతుఁ డని చెప్పఁబడును. సద్గోత్రకులాచారోత్పన్నంబులు నాప్తోపదేశసిద్ధంబులు నగు పురుషనామములవలె రసంబులకు భావంబులకు నాట్యాశ్రితంబు లగు నర్థంబులకును నాచారోత్పన్నంబులు ప్రామాణికోపదేశసిద్ధంబులు నగు నామంబులు సంభవించును. ఇష్టే యాచారసిద్ధంబు మనోహరప్రకాశమాన వేషాత్మకంబు నగుటచే నిది శృంగారరస మని వ్యవహరింపఁబడుచున్నది. ఉత్తమయావనప్రకృతి గల యిది స్త్రీపురుషహేతుకంబై యొప్పు" నని దీనిం బ్రశంసించెను. దీనింబట్టికూడ శృంగారము సర్వరసరాజంబై బహుప్రాచీనుల వాక్యంబులకు నిదానంబై యొప్పినట్లు మనము గ్రహింపవచ్చును.

రతిప్రకృతికత్వము శృంగారమునకు లక్షణము. హృదయానుకూలంబు లగు నర్థంబులయందలి సుఖానుభవము రతి యనంబడును. (1)యావనవంతు లగుస్త్రీపురుషుల పరస్పరరిరంస (రమించుకోరిక) రతి యనంబడు నని రససుధాకరకారుఁడును, (2)భార్యాభర్తలకుఁ బరస్పరము రతియందుఁ గలవృత్తి యనఁగాఁ బ్రీతివిషయకమైన వారి యన్యోన్యవర్ణనము శృంగార మనఁబడు నని వాగ్భటుండును నిరూపించిరి. ఆనందసంధాయకంబు, రతిస్థాయిప్రభవంబు, పరస్పరవర్ణనాత్మకంబు నగు నీశృంగార మెల్ల లాక్షణికులమతంబునను సంభోగము, విప్రలంభము నని రెండువిధంబులఁ బ్రకాశించుచున్నది. వీనింగూర్చి క్రమముగాఁ బ్రసంగింతము.

(3)విలాసవంతు లగునాయికానాయకు లెం దానుకూల్యము గలిగి పరస్పరమభీష్టంబు లగుదర్శనస్పర్శనాదులను సేవింతురో యది సంభోగ మనియు, ఎప్పుడు

(1) యూనో రన్యోన్యవిషయస్థాయినీచ్ఛా రతి స్స్మృతా।

(2) జాయాపత్యో ర్మిథో రత్యాం వృత్తి శ్శృంగార ఉచ్యతే।

(3) అనుకూలా నిషేవేతే యత్రాన్యోన్యం విలాసినా।
దర్శనస్పర్శనాదీని స సంభోగ ఉదాహృతః॥

రతిభావ మధిక మయ్యు నభీష్టంబు నొందదో యప్పుడు విప్రలంభ మనియుఁ జెప్పఁబడును. (1) ఈ సంభోగము పరస్పరాలోకనాలింగనచుంబనాదిరూపభేదంబున ననంతంబు నపరిచ్ఛేద్యంబు నయ్యు నొక్క-సంభోగనామంబుననే వ్యవహరింపఁబడుచున్నది. విప్రలంభమో అభిలాషవిరహేర్ష్యాప్రవాసశాపహేతుకంబై యైదువిధముల నొప్పుచున్నది. పూర్వోక్తం బగుసంభోగము ప్రేమ, అభిలాషము, రాగము, స్నేహము, ప్రేమము, రతి, శృంగారము నని మరల సప్తవిధంబుగ బేర్కొ-నఁబడుచున్నది. రమ్యపదార్థంబులయందు (ఆలంబనంబు లగు నాయికానాయకులయెడ) జనించు దర్శనేచ్ఛ ప్రేమ యనియుఁ, దద్వ్యాప్తియుక చింత యభిలాష మనియుఁ, దత్సంగబుద్ధి రాగం బనియుఁ, దదేకధ్యానము స్నేహమనియుఁ, దద్వియోగాసహనము ప్రేమ మనియుఁ, దత్సహవర్తనము రతి యనియు, దన్మయక్రీడ శృంగార మనియు నేతత్సంభోగంబునకుఁ గ్రమస్థితి రసాకరంబున నిర్ణయింపఁబడినది. దీనింబట్టి దిదృక్ష మొదలుగాఁ దన్మయక్రీడ వఱకును గ్రమక్రమముగా నభివృద్ధిఁ జెందుచున్న యీసంభోగము క్రీడారూపంబగుశృంగారనామంబున నాయికానాయకుల కభీష్టసిద్ధిఁ గలిగించునది గావుననే సంభోగశృంగార మనఁబడుచున్న దని మనము గ్రహింపనచ్చును. కావ్యంబుల వర్ణింపఁబడు నిది మరల సంభోగాంగంబులు కామశాస్త్రప్రతిపాదితంబులు నగునాలింగనచుంబనాద్యుపచారంబులసంక్షేపంబున సంక్షిప్తం బనియు సర్వోపచారసంపన్నం బగుటచే విస్తృతంబనియు ద్వివిధ మగుచున్న దని భూపాల మతము. ఇట్లు ద్వివిధం బగునిది మరల(2)చుంబనాశ్లేషాది రూపంబున బాహ్యారతం బనియు, సాక్షాన్నాకరణవిశేషాత్మకం బైన యాభ్యంతరరతం బనియు ద్వివిధ మగుచున్నది. ఇందు రెండవదాని గూర్చిన విశేషవర్ణనము తన్మయచిత్తవృత్తులకుఁ దాత్కాలికానందము నమకూర్పఁ గామసూత్రరతిరహస్యాదుల యందుఁ జూడఁదగినదియే కాని, నీతిదాయకంబులు, పుణ్యకథాగ్రథితంబులు, లోకజ్ఞానదాయకంబులు నగుసత్కావ్యంబులఁ గనుపట్టఁదగవు. ఎందైన నట్టి కా

(1) భావో యదా రతిర్నామ ప్రకర్ష మధిగచ్ఛతి।
నాధిగచ్ఛతి చాభీష్టం విప్రలంభ స్తదోచ్యతే॥

(2) బాహ్య మాభ్యంతరం చేతి ద్వివిధం రత ముచ్యతే।
తత్రాద్యం చుంబనాశ్లేషనఖదంతక్షతాదికం ।
ద్వితీయంతు రతం సాక్షా న్నాకరణకం మతమ్॥

వ్యంబులంగూడ నొక్కొకచో నట్టి వర్ణనలు గన్పడుచున్న వని సంశయము గలుగుచున్నది. అనుమేయాభ్యంతర రతవర్ణనగర్భితంబు లగుబాహ్యరతవర్ణనములే యని మనము గ్రహింపవచ్చును కావుననె యనేక లాక్షణికులు కావ్యములయం దుపయోగింపం దగిన సంభోగశృంగారమునకు లక్ష్యముగా నీక్రింది శ్లోక ముదాహరించిరి.

“(1) శూన్యం వాసగృహం విలోక్య శయనా దుత్థాయ కించిచ్ఛనైః ।
నిద్రావ్యాజ ముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖం ।
విస్రబ్ధం పరిచుంబ్యజాతపులకా మాలోక్య గండస్థలీం ।
లజ్జానమ్రముఖీ ప్రియేణ హసతా బాలాచిరం చుంబితా”

ఇంకం గాలాంతరభావిసంభోగాకాంక్ష గలిగిన విప్రలంభశృంగారమో యభిలాషవిరహమానప్రవాసశాపహేతుకం బై పంచవిధంబుగ నొప్పును. నాయికానాయకుల యన్యోన్యప్రాప్తీచ్ఛ యభిలాషం బనియు, అసంయోగము విరహ మనియు, అపరాధప్రభవం బగుతాత్కాలికకోపము మానం బనియుం, బరదేశవాసంబు ప్రవాస మనియు, గురురాజాదినియమితసుఖవిముఖకాలానుభవము శాపం బనియు గ్రహింపందగును. ఇందు విరహానంతరజాతంబు, మానానంతరజాతంబు నగువిప్రలంభము పూర్వోక్తసంక్షిప్తసంభోగశృంగారంబున నంతర్భూతం బగుచున్న దనియుం, బ్రవాసానంతరజాతంబు, శాపానంతరజాతంబు నగునది విస్తృతసంభోగంబున నేకీభవించుచున్న దనియుం దెలియందగును. ఇంక విప్రలంభశృంగారంబున కాద్య మగునభిలాషమునందే రతిభావము (2)దృఙ్మనస్సంగాది దశావస్థలం గలిగి వర్ధిల్లుచున్నది. ఇం దమంగళకరంబు రసవిఘాతంబు నగుమరణము కావ్యంబులం బ్రత్యక్షముగ వర్ణనీయముగాదు. ఏవంవిధం బగు నభిలాషహేతుకవిప్రలంభశృంగారమే కావ్యప్రపంచంబునం దెల్లెడల వ్యాపించి గుణావయవవర్ణనరూపంబునం బ్రశంసింపంబడుచుం, దుదకుం గావ్యఫలభూతం

---

(1) ఒకానొక ముగ్ధనాయిక, తనచెలికత్తెలు గదినుండి వెడలిపోంగానే తనపడకనుండి మెల్లగా లేచి దొంగనిద్రపోవుచున్న ప్రియుని మొగము చాలసేపు పరిశీలించిచూచి నిద్రించుచున్నాడని నమ్మి యధికానురాగముతో ముద్దుపెట్టుకొని గగురుపాడిచిన గండస్థలంబును జూచి సిగ్గుచేం దలవంచుకొనెను. అంత నాయకుండు నవ్వుచు లేచి గాఢముగా నాయికను గౌంగిలించుకొనెను.

(2) దృఙ్మనస్సంగ సంకల్పా జాగరః కృశతా రతిః।
హ్రీత్యాగో న్మాద మూర్ఛాంతా ఇత్యనంగదశా దశ॥

బగు సంభోగశృంగారంబునకు నిదానంబై యొప్పుచున్నది కావుననే (1)విప్రలంభము లేక శృంగారము పుష్టిని జెంద దని పూర్వాలాక్షణికుఁడు వచించెను. ఇట్లు ద్వివిధం బగునీశృంగారమునందు శృంగారతిలకంబునఁ బరిగణింపఁబడినట్లుగా (2)శంకాసూయాది వ్యభిచారిభావంబులు ప్రయోగింపఁ దగు నని యెల్లలాక్షణికు లంగీకరించిరి. కామపరవశు లగునాయికానాయకులయెడఁ బ్రయోగింపఁబడు నీభావంబులే కావ్యంబుల గుణావయవరూపంబునఁ గన్పట్టుచున్న వని యెఱుంగునది.

ఈశృంగారరసంబునకు స్వీయ, కన్యయగు పరకీయ, సత్యానురాగ యగు వేశ్య యను నాయికలును, ఉత్తమలక్షణలక్షితు లగు దక్షిణాదినాయకులును నాలంబన మగుదురు. (3) కాని పరోఢయుఁ, బ్రేమ లేని వేశ్యయు,నీచనాయకులును నాలంబనంబుగాఁ దగరు. దీనింబట్టి పరోఢానాయికాత్వము కావ్యంబులఁ గేవల నిషిద్ధం బగుటచే నాంధ్రంబున రెండుమూఁడుగ్రంథంబుల కసత్కావ్యత్వము సంభవించుచున్న దని కొందఱూహించుచున్నను, నవి పురాణగాథాగ్రథితంబులై గురుమునిపత్నీసమాగమము మహాపాతకహేతు వగుననెడి యుత్తమనీతిని దెల్పునవి యగుటచే నపరిత్యాజ్యంబు లని చాలమందియాశయము. అట్లు కాదేని పరోఢ నాయికగాఁ గలిగిన కేవలకల్పితకావ్యములు లోకంబున నెందైనఁ జూడఁబడుచున్నవా?

ఈశృంగారము మరల నాయికారబ్ధము, నాయకారబ్ధము నని ద్వివిధము. "(4) ముందుగా స్త్రీ యనురక్త యగును. పిదపఁ దదింగితములచేఁ బురుషుఁడనురక్తుఁ డగును. తరువాత సంభోగవిలాసము. ఇది స్వభావరమ్య మగుస్థితి" యనెడి రుద్రభట్టవచనముగూడఁ బైదానినే ధ్రువపఱచుచున్నది. ఇందు సంభోగలీలాశబ్దమునకుఁ బరస్పరాలోకన సంభాష ణాలింగన చుంబనాదు లగు

(1) నవినా విప్రలంభేన సంభోగః పుష్టి మశ్నుతే॥

(2) శంకాసూయా భయ గ్లానీ వ్యాధి శ్చింతా స్మృతిర్ధృతిః।
ఔత్సుక్యం విస్మయో హర్షో వ్రీడోన్మాదో మద స్తథా॥
విషాదో జడతా నిద్రా వహిత్థా చాపలం మతిః।
ఇతి భావాః ప్రయోక్తవ్యా శృంగారే వ్యభిచారిణః॥

(3) పరోఢాం వర్జయిత్వాత్ర వేశ్యాంచా ననురాగిణీం॥

(4) పూర్వం నారీభవేద్రక్తా పుమాన్ పశ్చా త్తదింగితైః।
తతస్సంభోగలీలేతి స్వభావసుభగా స్థితిః॥

బహువిధచేష్ట లర్థమయినట్లు కనుపడుచున్నది. యౌవనవంతు లగునాయి కానాయకుల యీచేష్టలను సరసముగా వర్ణించుటకంటె వేఱుగా లోకంబున కానందంబు గలిగింపఁ గావ్యరచన మెట్లు నిర్వహింపఁదగునో యాలోచింపుఁడు. సరియే, ఈచేష్టలను వర్ణించుటకుఁ బూనిన యేభాషాకవి హావభావావయవముల మాట యెత్తకుండఁగా మఱియెట్లు వీనిని వివరించి మనోహరంబుగా వ్రాయఁ గలఁడు? ఇట్టివర్ణనలే పరిత్యాజ్యంబు లగునేని కావ్యజీవనంబగురస మెక్కడనుండి వచ్చును? శృంగార మెక్కడ? కావ్యత్వ మేడ? అట్లయినఁ గవికులశేఖరుం డగు కాళిదాసుకూడఁ గుమారసంభవ మేఘసందేశములయందు వర్ణించిన సంభోగ విప్రలంభశృంగారము లనౌచిత్యరసాభాసములకై యుదాహరణ మగునా? ఆహా! యేమి యిప్పటి మూలచ్ఛేది పాండిత్యప్రకర్షము?

మఱియు వ్యంగ్యప్రధానంబైనది ధ్వనికావ్యం బనుపేర నుత్తమం బనియు, వ్యంగ్యాప్రధానం బయినది గుణీభూతవ్యంగ్యం బనుపేర మధ్యమం బనియు, నస్ఫుటవ్యంగ్యం బగునది చిత్రం బనుపేర నధమం బనియుఁ గావ్యంబును ద్రివిధము గా నెల్లరు నిరూపించిరి. ఇందు నగరార్ణవోద్యానసలిలక్రీడావిప్రలంభరతోత్సవా ద్యష్టాదశవర్ణనలం గలిగి మహాకావ్యసంజ్ఞం బడయుచున్న యాకావ్యలక్షణంబున కాలంకారికు లుదాహరించిన పద్యంబు లెల్లఁ జూచినచో శృంగారరస మెంతవ ఱకు వర్ణనీయమో తెలియకపోదు. అందు ధ్వనికావ్యంబునకుఁ గావ్యప్రకాశ కారాదు లుదాహరించిన యీక్రిందిశ్లోకము ప్రకృతం బగుశృంగారరసంబు నవధింగూడఁ జెల్పుచు నెంతసహృదయరంజకముగా నున్నదో చూడుఁడు.

(1) "నిశ్శేషచ్యుతచందనం స్తనతటం నిర్మృష్టరాగోఽధరో
నేత్రేదూరమనంజనే పులకితా తన్వీ తవేయం తనుః।
మిథ్యావాదిని! దూతి! బాంధవజనస్యాజ్ఞాతపీడాగమే
వాపీం స్నాతు మితో గతాసి న పున స్తస్యాధమ స్యాంతికమ్" ॥

కావుననే లాక్షణికులకుఁగూడ లాక్షణికుఁ డగుమహాకవి కాళిదాసు శ్రవ్యకావ్యంబుల రతివర్ణనము నింద్యము గాదనుటకో యనఁ గుమారసంభ వాష్టమసర్గంబున వాచ్యంబుగ బాహ్యరతంబును వ్యంగ్యంబుగ నాభ్యంతరరతం బును వర్ణించి శృంగారంబునకుఁ ద్రోవ త్రొక్కి యుండె నని మన మెఱుంగఁ దగును. అందలిశృంగారము కేవల ముత్తమదేవతావిషయకం బగుటచేఁ గొన్ని వర్ణనంబుల ననుచితంబుగా నున్న దని కొందఱు లాక్షణికులు చెప్పినమాట

సత్యమే కాని యదియే యదివ్యదివ్యాదివ్యవిషయక మయ్యేనేని తగియుండు ననియేకదా వారియభిప్రాయము ? సరియే యిది యిట్లుండనిండు. ఇతఁడే దృశ్య కావ్యం బగుమాలవికాగ్నిమిత్రములోఁగూడ బాహ్యరతం బనఁదగు సంభోగ శృంగారమును వర్ణించియుండలేదా ? ఈ యుదాహరణములఁ జూడుఁడు.

(1) "సస్వజే ప్రియ మురోనిపీడనం ప్రార్థితం ముఖమనేన నాహరత్ ।
మేఖలా ప్రణయలోలతాంగతం హస్త మస్య శిథిలం రురోధసా "॥

(2) హస్తం కంపయతే రుణద్ధి రశనావ్యాపారలోలాంగుళీః ।
హస్తౌ స్వౌ నయతి స్తనావరణతా మాలింగ్యమానా బలాత్ ।
పాతుం పక్ష్మలనేత్ర మున్నమయిత స్సాచీకరోత్యాననం ।
వ్యాజేనా ప్యభిలాషపూరణసుఖం నిర్వర్తయ త్యేన మే॥

ఇట్లే యేకవి యైనను రతంబును వ్యంగ్యముగానే వర్ణించెను గాని వాచ్యముగాఁ జెప్పియుండలే దని విశ్వసింపవచ్చును. ఆంధ్రశృంగార కావ్యంబులఁ గూడఁ దఱచుగా నిట్లే ప్రతికావ్యము సురతపుంభావరత వర్ణనలు గన్పడుచున్న మాటసత్యమే కాని యవి రతిసురతోపరతిపుంభావాదిపదఘటితంబు లగుటచేఁ గొందఱు చదువరులకు జుగుప్సాకరంబులైన యాభ్యంతర రతవర్ణనంబులుగా భ్రమ గలిగించుచున్న వేమో కాని, నిజముగా నవి యట్లుగాక వ్యంగ్యసురత వర్ణన పరంబులైన బాహ్యరతవర్ణనలే యని పరిశీలకులు గ్రహింపకపోరు. ఈ సందర్భంబున నింకను సంస్కృతకవులు సురతవర్ణన సేయునపు డొక్కవిషయ నిగరణముగా వర్ణించిన చోట్లఁగాక మిగిలినయెడలఁ దమపాకమును మార్చక యేకరీతిగా వర్ణించుచు వచ్చినట్లు కనుపడుచున్నది గాని మన తెలుఁగుకవులు మాత్ర మట్లుగాక తమ కదళీ ద్రాక్షాపాకములను నారికేళపాకముగా మార్చి స్త్రీబాలసామాన్యదురవగాహముగా వ్యంగ్యముగానట్టి వర్ణనలు గావించి రని మనము చూడకపోలేదు. పై యెల్లవిషయంబులకుఁ బెద్దనామాత్యాదుల(1) సహసానఖంపచేత్యాది పద్యములే యుదాహరణము. ఇట్టి పద్యంబు లతిక్లిష్టసంస్కృతపదభూయిష్ఠదీర్ఘసమాసార్థగ్రహణశక్తి గలవారికేఁగాక యెల్లరకుఁ దెలియునా? "ఎల్లకావ్యంబుల నిట్లే గూఢముగా వర్ణింపఁబడినవా ? తేటతెల్ల

(1) "సహసానఖంపచ స్తనదత్తపరిరంభ మూమూలపరిచుంబితాధరోష్ఠము" (మనుచరిత్ర)
"ఆననాంభోజవ్యపావర్తనాముహుర్వ్యాఘ్నితాధరపానవిలసనంబు" (ప్రభావతీప్రద్యుమ్నము)
ఇత్యాదు లరయునది.

ముగా నున్న వర్ణనలుమాత్రము లేవా" యని కొందఱనఁగవచ్చును. సత్యమేకాని యట్టి వేనైన నొకటిరెం డున్నను వానికి సర్వజనసామాన్యపఠనపాఠనప్రసిద్ధి లోకంబున రాలే దనియు మనము వ్యవహరించుకొను నుత్తమకవిసత్కావ్యం బులమాత్ర మట్లు లే వనియు నమ్మవచ్చును. పెద్దలు హర్షింపఁదగని నింద్యవర్ణ నలు పూజ్యంబుగానే యుత్తమకవి వర్జించును. కావునఁ గేవలవాచ్యం బులు నశ్లీలంబులు నగునాభ్యంతరసురతవర్ణనలు వచనీయంబులగుటఁ బరిత్యా జ్యంబు లనియు, వ్యంగ్యంబులు తద్వర్ణనగర్భితంబులు నగు వర్ణనలు రసభావజన కంబులు కావ్యోద్యమఫలంబులు నగుటఁ బరిగ్రాహ్యంబు లనియు సాంస్కృతిక లక్ష్యలక్షణగ్రంథములంబట్టి మనము తెలిసికొనవచ్చును. ఇట్లు చెప్పుట నమ రత్యుపరతివర్ణన లవశ్యముగాఁ గావ్యంబుల వర్ణింపఁదగినవియే యనుపట్టుదల సాధించుటకొఱకుఁ గాక భామహుఁ బ్రమాణం బగునలంకారశాస్త్రమునుబట్టి కావ్యత్వసంపదకు సంపూర్ణత నొసంగు సంభోగశృంగారాంగంబు లగునట్టివర్ణ నలయౌచిత్యమును విశదీకరించుటకే యని విశ్వసింపఁదగును.

మఱియుఁ బూర్వోక్తవిషయంబునే బలపఱచుచు సంభోగశృంగారవర్ణ నముం గూర్చి రసతరంగిణిగూడ నిట్లు చెప్పుచున్నది. "యావనవంతులపరస్పర పరిపూర్ణ ప్రమోదము గాని వారిపరస్పరరతిభావము గాని శృంగార మనఁ బడును. ఇందు దర్శనస్పర్శనాదులచే నాయికానాయకు లన్యోన్య మనుభవించు సుఖము గాని, వారిపరస్పర సంయోగంబున జనించు నానందము గాని సంభోగ మనఁబడును. సంయోగ మనఁగా బహిరింద్రియసంబంధము". అనఁగా నాలింగన చుంబనాదులని భావము.

ఈసందర్భంబున సంభోగంబునకు ధనంజయకవి దశరూపంబున నుదా హరించిన యుత్తరరామచరిత్ర నాటకంబులోని "కిమపి కిమపి మందం మంద మాసక్తి యోగాత్" అను పద్యముగూడ నుదాహరణముగాఁ గలదు. ఇట్టి వర్ణనలు గూడఁ గేవలసురతవర్ణనలోనే పరిగణింపఁబడి దృశ్యకావ్యలక్షణదూ రంబులై రసాభాసంబులు నసహ్యజనకంబులు గాఁదగెనేని పూర్వమహాకవులకు నిపుడు సంభవించు నపయశస్సుతోఁగూడ రూపకసముదాయంబును మూటగట్టి యావలఁ బెట్టవలసియే వచ్చునుగదా? అట్లుగాక దృశ్యకావ్యంబులలోని యి ట్టివర్ణనలు దుర్నీతికరములుగాక దృశ్యంబులే కాఁదగెనేని యాపద్వైపమ్యా ముగా వీనింబోలిన యంతర్భావిత వ్యంగీభూత సురతంబు లగుశ్రవ్యకావ్యంబు

లలోని పూర్వోక్త సురతవర్ణనలవంటివర్ణనలుగూడ శ్రావ్యంబులు గాఁదగవా? అట్లును దగ వని యందురేని యఖిలజనవంద్యంబు నార్యకవితానిధానంబు నగు నాదికావ్యంబునకుఁ గూడ జలాంజలి యర్పింపవలసినదియే. ఏమనఁగా? కవి తాబ్రహ్మాండసృష్టికర్త యగువాల్మీకిమహర్షి రామాయణంబున నందందు వర్ణించిన వర్ణనలటుండఁగాఁ గిష్కింధాకాండంబున శరత్కాల వర్ణనాసందర్భంబున జానకీవిరహతప్తుఁడై విప్రలంభావస్థ ననుభవించుచున్న శ్రీరామునివాక్యము లుగా వర్ణించిన యీక్రిందిశ్లోకము లుపమాశ్లేషస్వభావాలంకారభూషితంబులై సంభోగశృంగారంబు మేరఁ జూపుచు హృద్యంబులై శ్రావ్యంబులై యెంత యుక్తముగాఁ గవిలోకంబునకు శృంగారరసవర్ణన మర్యాద నుపదేశించుచున్న వో చూతుఁడు.

(1) "దర్శయంతి శరన్నద్యః పులినాని శనైశ్శనైః।
నవసంగమసవ్రీడా జఘనానీవ యోషితః॥

(2) చంచ చ్చంద్రకరస్పర్శ హర్షోన్మీలితతారకా।
అహో రాగవతీ సంధ్యా జహాతి స్వయ మంబరం"॥

కావున సురతాదిపదఘటితంబులైనంతమాత్రమునఁ దద్వర్ణనంబు లసహ్యం బగుతత్క్రియాస్వరూపంబును బోధింప వనియు, వ్యంగ్యముగా గూఢాభిప్రాయముగా వర్ణింపఁబడిన యవి కావ్యంబునకు రసపుష్టిని బాఠకుల కానందంబును గలిగింపఁ గారణంబు లగుననియు సంతోషింపఁదగును.

## అవయవవర్ణనము.

ఇఁక నవయవవర్ణన మెంతవఱకుఁ దగునను విషయముంగూర్చి విమర్శింతము. ఆలంబనోద్దీపనాది కారణంబు లగువిభావానుభావాదులచేతను స్వభేదంబులగు ప్రేమాభిలాషాదులచేతను శృంగారము పోషింపఁబడు నని యిదివఱకే తెలిసికొనియుంటిమి గదా? అట్టి రసోద్దీపకంబులు వధూవరానురాగాభివృద్ధికరంబులు నగునాయాభావంబులను నాయికానాయకులయెడ సమన్వయింపఁ జేయుటయే తొలుత గుణావయవాదివర్ణనరూపంబును దాల్చి తుద కాలింగన చుంబనాది రూపంబునఁ బరిణమించి బాహ్యరతంబు పేరఁ బరఁగుచున్నట్లుగా నయ్యాలక్షణగ్రంథసరణియుఁ దత్తత్పూర్వకావ్యరచనపద్ధతియు మనకు బోధించుచున్నవి. పూర్వోక్త సర్వవిషయంబునుగూర్చి దశరూపకచతుర్థప్రకాశము

వేనోళ్ళఁ జాటుచుండ నొంత యని యిచ్చట వివరింపఁగలము? ఇఁక నితరలక్షణములనుండి యెన్ని యుదాహరింపనగును? అయినను పై సందర్భంబున కనుకూలముగాఁ గవుల కుపదేశపరముగానున్న యీ క్రింది లక్షణము చూడుఁడు.

(1) “రమ్యదేశకలాకాలవేషోపభోగాదిసేవనంబునను మధురాంగవిచేష్టితంబులను బరస్పరానురక్తు లగుయూనవంతుల ప్రమోదాత్మకం బగురతి శృంగారమనఁబడును(వ్యాఖ్య). ఇట్లు నిర్మింపఁబడిన కావ్యము శృంగారాస్వాదము కొఱకగు నని యీ వాక్యము కవ్యుపదేశపరము. ఇందెల్ల భావంబుల కుదాహరింపఁబడినవానియందెల్లఁ బ్రకృతానుసరణముగా నున్న యువతిభావోదాహరణం బగుమాలవికాగ్నిమిత్రములోని యీ క్రిందిపద్యము చూడుఁడు.

(2) “దీర్ఘాక్షం శరదిందుకాంతివదనం బాహూనతావంసయో।
సంక్షిప్తం నిబిడోన్నతస్తన మురః పార్శ్వే ప్రమృష్టే ఇవ।
మధ్యః పాణిమితో నితంబి జఘనం పాదా వరాలాంగుళీ।
ఛందో నర్తయితు ర్యథైవ మనస స్సృష్టంతథాస్యా వపుః” ॥

ఇట్లున్న పైలక్ష్యలక్షణములఁబట్టి గుణావయవవర్ణనలు నింద్యములుగాక కావ్యశోభాకరంబులై పాఠకానందదాయకంబు లగునని తెలియుచుండఁగా నిప్పటిమతము ననుసరించి కచకుచాదివర్ణంబులు దూష్యంబు లనువిషయమున మనము విమర్శింపఁదగిన దేమియులేదు. కావ్యంబునకు యువతి నాయికగాఁ దగియుండఁగా (3) జవ్వనంబున జవరాండ్రకలంకారములుగా నాలంకారికులు పరి

---

(1) రమ్యదేశకలాకాలవేషభోగాది సేవనైః।
ప్రమోదాత్మారతి స్సైవ యూనో రన్యోన్యరక్తయోః।
ప్రహృష్యమాణా శృంగారో మధురాంగవిచేష్టితైః॥
(వ్యాఖ్య) ఇత్థ ముపనిబధ్యమానం కావ్యం శృంగారాస్వాదాయ ప్రభవతీతి కవ్యుపదేశపర మేతత్॥

(2) (మాలవికయొక్క) మొగమా? పెద్దకన్నులు గలిగినదై శరత్కాలచంద్రునివలె నున్నది. బాహువులా? మూఁపులయందు వంగియున్నవి. ఱొమ్మా? దగ్గఱగాఁ గలిసికొనిన కుచములు గలదై సంకుచితమై యున్నది. ప్రక్కలా? చిత్రికపట్టినట్లున్నవి. నడుమా? గుప్పెఁడున్నది. మొలయా? పెద్దపిఱుఁదులు గలిగియున్నది. పాదములా? వంకరైన ప్రేళ్ళతోఁ జక్కగానున్నవి. ఇఁకఁ జెప్పనేల? సృష్టికర్తయొక్క మనోఽభిప్రాయమెట్లున్నదో దీని శరీరమట్లున్నది.

(3) యౌవనే సత్త్వజా స్త్రీణా మలంకారాస్తు వింశతిః।
భావో హావశ్చ హేలాచ త్రయ స్తత్ర శరీరజాః।
శోభా కాంతిశ్చ దీప్తిశ్చ మాధుర్యంచ ప్రగల్భతా॥ ఇత్యాది (దశరూపకము.)

గణించిన భావహావశోభాకాంతి మాధుర్యాదులకు మూలం బగుసౌందర్యమును గుచాదులను వర్ణింపకుండఁగా నెంతసేపును గాలుసేతులు మాత్రమే గ్రహించి వర్ణించుటచేతనే కావ్యరసంబు పోషింప నలనగునా ? ఇట్లనుటచే నవయవవర్ణనము చేయవచ్చును గదా యని తదేకధ్యానముగా, విపరీతముగా నాశ్వాసముననాశ్వాసమంతయుఁ దద్వర్ణనముతోనే సరిపుచ్చుట సమంజస మని నాయభిప్రాయము గాదు. సహృదయరంజకముగా, మితముగా హద్దుమీఱక యవయవవర్ణనముగూడ నుండినఁగాని శృంగారమే లేదనునాలంకారికమతము విశ్వసింపఁ దగిన దనియే నాయభిప్రాయము. నాయికల యావనసౌందర్యము లేక శృంగారమెట్లు వర్ణింపఁబడును ? కచకుచాదులు లేక తత్సౌందర్యము నాయిక కెట్లు గలుగును ? ఈవిషయంబున మమ్మటపాదభట్టువామనమతముగూడ నెట్లున్నదో చూతము.

"లోకోత్తరవర్ణనానిపుణః బగుకవికృత్యమే కావ్యము. ముఖాదులను గమలాదులతోఁ బోల్చి చమత్కారముగా నసాధారణముగా వర్ణించుటయే కవికృత్య మని ప్రదీపోద్ద్యోతములు చెప్పుచున్నవి. చేఁదుమందు త్రాగుట కిష్టపడని బాలురను దేనెనాకించుటవలెనే నీతిశాస్త్రవిముఖు లగుకుమారులను శృంగారరసకావ్యము క్రమముగా సదుపదేశంబునఁ బ్రవేశ పెట్టును. మఱియుఁ "గావ్యాలాపములను వర్జింపఁదగు" ననునిషేధశాస్త్రము భగవద్భక్తభిన్నవర్ణనవిషయకంబుగాని శృంగారకావ్యవిషయకంబు గాదు. కావుననే కాళిదాసాదులు శాకుంతల, నైషధీయచరితాదులను సరసముగా వర్ణించిరి. భాగవతంబున సశృంగారముగా భగవద్గుణవర్ణనము చేయఁబడినది. భామినీవిలాసంబున, శృంగారోల్లాసంబున జగన్నాథపండితరాజు స్వప్రేయసీవర్ణనము చేసినను గంగాప్రసాదంబు గాంచిన యతనియెడ నది యర్హమే యగు నని సాహిత్యసారటీకగూడ వాక్రుచ్చుచున్నది. మఱియు, "వ్యంగ్యము కామినీకుచకలశంబులమాడ్కిఁ జమత్కారకారి యగును." అని యివ్విధంబుగా శృంగారరసవర్ణన పరిమితిని గూర్చి కనుపడుచున్నది. వీనింబట్టియైన లాక్షణికమత మెంతవఱ కభ్యనుజ్ఞ యిచ్చుచున్నదో తెలియకపోదు. కావునఁ గావ్యరసపోషణంబునఁ గుచాదివర్ణన మంత వ్రీడాకరమై యనుచితము గాఁదగ దని విశ్వసింపఁదగును. ఇఁక నో గుహ్యాతిగుహ్యావయవవర్ణన మెంతయు నింద్య మనుట యుక్తము. అట్టిదానిని నీచాతినీచముగాఁ బరిగణించి గ్రంథములఁ జొరనీకుండఁగఁ జేయవలసినదనియే పూర్వ

మహాకావ్యంబులఁ బరిశీలించిన విద్వాంసులెల్ల నంగీకరింతు రని ప్రశంసించుకొనుచు నిఁక రసాభాసాదులంగూర్చి యాలోచింతము.

## రసాభాసము.

(1) ఇంతఁ గొన్నయుత్తమలాక్షణికుల మతంబులఁ గ్రిందవివరించుచు వాని కేకీభావంబుగ నర్థముఁ దెల్పెదను. ఈక్రింద నుదాహరింపఁబడినవివిధలక్షణములంబట్టి, ఉపనాయకనిష్ఠము, మునిగురుపత్నీగతము, బహునాయకనిష్ఠము, ప్రతినాయకగతము, బహునాయికావిషయకము, ఏకతరనిష్ఠము (అనుభయవర్తి), అధమపాత్ర తిర్యగాదివిషయకము, అనుచితనాయికానాయకంబునై యొప్పుచున్న శృంగారము రసాభాస మగు నని తెలియుచున్నది గదా? కావ్యవిషయకం బైన యీరసాభాసముంగూర్చి యాలంకారికులయభిప్రాయం బేమో విమర్శింతము.

రసాభాస మన నేమి? అది కావ్యంబులనుపాదేయ మగునా కాదా?

రసమువలెఁ బ్రకాశించుట రసాభాసము. విభావాదిసామగ్రి సంపూర్ణముగా లేనిదయ్యు నారోపణంబున రసమువలెఁ గన్పడుట రసాభాసం బనియు, ఆరోపితం బగురతిభావము రసాభాసం బనియు, మర్యాద నతిక్రమించి ప్రవర్తించు నంగరసముచే బాధింపఁబడెడి యంగిరసము రసాభాసం బనియుఁ గొంచెమెచ్చుతక్కువగా మూఁడువిధంబుల నిర్వచింపఁబడుచున్నది. తుదిదానింబట్టి హాస్యాదిస్థాయిష్ఠంబు లగునవరసంబులకుఁగూడ నాభాసత్వము గలుగుచున్నదని భావప్రకాశము చెప్పుచున్నది. దీనింబట్టియుఁ బూర్వోక్తలక్షణంబులంబట్టియుఁ బ్రకృతం బగుశృంగారమున కెట్లు రసాభాసత్వము సిద్ధించునో తెలియకపోదు. ఈసందర్భంబున లోకోత్తరనాయకాశ్రయత్వము ప్రధానముగా నుండఁదగిన శృంగారము పైవిధముగా నాభాసంబగునేని కావ్యంబుల నెట్లు

---

(1) ఉపనాయకనిష్ఠాయాం మునిగురుపత్నీగతాయాంచ। బహునాయకవిషయాయాం రతౌ తథానుభయనిష్ఠాయాం। ఆభాసత్వం కథితం తథైవ తిర్యగాది విషయతాయాం (ఉద్ద్యోతము)

(2) తదాభాసా అనౌచిత్యప్రవర్తితాః (కావ్యప్రకాశము)

(3) పశ్చాదుభయనిష్ఠత్వేఽపి ప్రథమ మేకనిష్ఠత్వే రతే రాభాసత్వం (లోచనకారులు)

(4) ఏకత్రైవానురాగశ్చే త్తిర్యఙ్ మ్లేచ్ఛగతోఽపివా।
యోషితో బహుసక్తిశ్చే ద్రసాభాస స్త్రిధామతః॥ (శృంగారతిలకము.)

(5) అనుచితవిభావాలంబనత్వం రసాభాసత్వం (రసగంగాధరము)

(6) పుంసోఽ ప్యనేకనాయికానురాగే రసాభాసత్వ మితి కేచిత్। సాహిత్యదర్పణ రత్నాకరకారాదయోఽ ప్యేవమ్॥

గ్రాహ్యం బగు ననునాక్షేపంబునకుఁ బ్రతాపరుద్రవ్యాఖ్యాన మిట్లు సమాధాన మిచ్చుచున్నది.

"పరస్పర మనురాగము సమానముగా నుండకపోవుటవలనను, దిర్యగధమనాయకులయం దవివేక మధిక మగుటవలనను, నాయిక కనేకనాయకులయం దనురాగ ముండుటవలనను రతిభాన మారోపింపఁబడినదై హాస్యాస్పదం బగుటచే శృంగారాభాసము త్రివిధ మగుచున్నది. ఓయీ! ఆరోపితరసంబున వారి యందుఁ జమత్కార మెట్లు జనించు నని యడుగుదువేని శుక్తికారజతమును గ్రహించి యానందించువాని నడుగుము. అది యాభాస మని తెలిసినపిదప బాధ గలుగునందువా? పోనిమ్ము. ఆబాధప్రపంచము సత్య మని నమ్ముచున్న సమయమందలి సంసారవ్యవహారమునకువలెనే వారితాత్కాలికచమత్కారమునకు హాని గలిగింపదు. కావున గ్రంథవిస్తర మేల? రసాభాసముగూడ నుపాదేయమే యగును" ఇట్లున్న పైవిమర్శనముం బట్టియు, నేలాక్షణికుఁడుఁగూడ రసాభాసము కావ్యంబుల వర్ణింపఁదగ దని నిషేధింపకపోవుటంబట్టియు, నుత్తమాలంబనం బగురసంబుమాడ్కి ననుచితవిభావాలంబనం బగు నిది సంపూర్ణంబు ముఖ్యంబును గాకపోయినను, అవర్ణనీయముఁ బరిత్యాజ్యమును మాత్రము గాదని తెలియుచున్నది. అయినను, ఈరసాభాసంబును దానియనౌచిత్యమును నెంతవఱకు నియమింపఁబడిన వనునంశంబున లాక్షణికులచర్చ యెట్లున్నదో చూతము.

### (1) రసానౌచిత్యము—రసాభాసము.

ఈయనౌచిత్యముంగూర్చి భట్టవామనాచార్యుఁ డిట్లు చెప్పెను. "ముందుగా స్త్రీ కనురాగము చెప్పఁదగినది. పిదపఁ దచ్చేష్టలచేఁ బురుషునకుఁ జెప్పఁదగినది. ఇది యౌచిత్యము. దీనికి విపరీతం బగుటచే ననురక్త కానిదానియందు వర్ణింపఁబడు ననురాగంబున కనౌచిత్యము సంభవించును. ఇట్టి యనౌచిత్యమునఁ బ్రవర్తింపఁబడు రసమే రసాభాస మగును" దీనింబట్టి యీక్రిందిచర్చ చూడఁదగును.

(1) మొదల నొకరి కనురాగంబు లేకున్నను బిదపఁ గలిగెనేని యది రసాభాసము గాదు. ఇందులకు రత్నావళి నిదర్శనము.

---

(1) ఇందుఁ గావ్యప్రకాశ, ప్రతాపరుద్రవ్యాఖ్యలు, రసగంగాధర, సాహిత్యదర్పణౌచిత్య విచారచర్చలును బ్రమాణము. గ్రంథవిస్తరభీతిచే సంస్కృతమున నుదాహరింపలేదు.

(2) నాయకున కనేకనాయికలయందు జనించునను రాగము రసాభాసము గాదు. అట్లయినచోఁ గావ్యంబుల సుప్రసిద్ధముగా వర్ణింపఁబడెడు దక్షిణనాయకత్వమునకే హానివచ్చును.

(3) స్వభావసిద్ధం బయినతిర్యగాదుల యనురాగంబున కనౌచిత్యము గలుగ దని వృత్తికారులు సెప్పిరి గాన నదియు నాభాసము గాదు.

(4) ప్రతినాయకనిష్ఠరతి యాభాసం బయ్యు ననౌచిత్యదోషపాత్రము గాక యుపాదేయంబే యగును. ఇందులకు రామాయణ ముదాహరణము.

(5) ఏకతరనిష్ఠరతికూడ నాభాసంబే యయ్యుఁ బూర్వోక్తంబునూడ్కి నుపాదేయంబే. ఇందులకు మాలతీమాధవ ముదాహరణము.

(6) ఉద్ద్యోతకారులు "ఉపనాయకనిష్ఠాయాం బహునాయకవిషయాయాం" అని ద్వివిధముగాఁ జెప్పి "మునిగురుపత్నీగతాయాంచ" అని మరలఁ జెప్పుట మాతలవలెఁ బూజ్యలగునట్టివారి యనురాగము పరనాయకవిషయకముగాక భర్తృవిషయకం బైనను రసాభాసమే యగు నను నర్థమును దెల్పుటకొఱకేమో యని తోఁచుచున్నది. అట్లుగాక పరనాయకవిషయక మగునపుడే యాభాస మగు నందురా? యిఁక సందియం బేమి? అట్టియనురాగము తప్పక యనుచితంబై యనుపాదేయంబే యగును. కావుననే మిగిలినవాని కెల్ల నుదాహరణములు చూపిన మమ్మటాదు లీయాభాసంబునకు నుదాహరణమే చూపినట్లు కనుపడదు. కాని యిట్టిరసాభాసములు గూడ నాయావిధంబుగా మహాపాతకవినాశాదులను దన్మూలకంబుగా లోకంబునకు నీతిని దెల్పునవి యగుటచే నంగములుగాఁ గావ్యంబులఁ బ్రతిపాదింపఁదగినవియే యని లాక్షణికులమతమైనట్లు కనుపడుచున్నది. కావుననే యిట్టిసందర్భంబులను భారతాదులలో వ్యాసాదులు వర్ణించి రనియెఱుంగునది. విప్రలంభశృంగారాభాసంబునకు ననుచితసీతాలంబనం బగురావణానురాగ ముదాహరించిన పండితరాజునభిప్రాయము గూడ నేతాదృశరసాభాసము మహాకావ్యంబుల నీతిదాయకముగా వర్ణింపఁదగు నను పైయభిప్రాయమునే స్థిరపఱచుచున్న దని గ్రహింపవచ్చును.

(7) వేశ్యాదివిషయకంబు హాస్యరససంకీర్ణంబునై శృంగారాభాసము పేర నొప్పిన యనేకనాయకనిష్ఠానురాగ మనుచితం బగుటచే నంగముగా గ్రహింపఁదగును గాని యుత్తమకావ్యంబులఁ బ్రధానముగా నుండఁదగదు. ఆవేశ్యయే సత్యప్రేమకల దయ్యెనేని మృచ్ఛకటికాదులయందువలె గ్రాహ్యమే యగును.

(8) ఉపనాయకనిష్ఠరతి పరకీయా (పరోఢా) విషయకం బగుటచేతను, పరకీయ విషిద్ధాలంబనం బగుటచేతను నిది రసాభాసంబు ననుచితంబు నగును. ఇందులకు, నాయకునియెడ ననురాగము గలదైనను బ్రభుకాంత యనుచిత ప్రణాయ యగుటచే దద్విషయకరతి రసాభాసమే యని పండితరాజును, గోపిక తనయందనురాగముగల దైనను బరాంగన యగుటచే దానియందుఁ గృష్ణునకున్న యనురాగము రసాభాసం బగునని విశ్వనాథకవిరాజును, నిట్లే మమ్మటాదులు నుదాహరించిరి. ఇట్లే భావం బనుచితవిషయకం బయ్యేనేని భావాభాసం బగు నని పండితరాజాదులు వక్కాణించిరి. ఇట్లున్నలాక్షణికుల పైచర్చనుబట్టి ప్రధానరసభంగహేతువు గాని యనౌచిత్యాపాదకం బగురసాభాసాదికము కావ్యంబులనుపాదేయ మనియు, రసభంగహేతువును గేవలానౌచిత్యకారణంబున నుచితాలంబనంబు నగునది పరిహరణీయ మనియుఁ దెలియుచున్నది. ఏవిధమైన యాభాసం బైనను దుదకు నీతిదాయక మయ్యేనేని కావ్యముల నంగముగా నుండఁదగును గాని యంగిగా నెప్పుడు నుండఁదగదు.

మఱియు నీక్రిందిచర్చ కూడ సంభోగరతియొక్క యౌచిత్యానౌచిత్యంబుల నిర్ణయించుచుఁ బైదానినే ధ్రువపఱచుచున్నది. చూడుఁడు. చిత్రమీమాంసలో నుత్ప్రేక్షాలంకారసారస్యమున కప్పయదీక్షితు లుదాహరించిన "బాలేందువక్రాణ్యవికాసభావా ద్బభుః పలాశాన్యతిలోహితాని। సద్యోవసంతేన సమాగతానాం నఖక్షతానీవ వనస్థలీనాం" అను కుమారసంభవపద్యమును దత్పూర్వమే యౌచిత్యవిచారచర్చలో రసౌచిత్యమున కుదాహరించిన క్షేమేంద్రుఁడు "ఈశ్లోకంబున వక్ష్యమాణం బగుపార్వతీవిషయకపరమేశ్వరాభిలాషశృంగారంబునకు ముందుగా నుద్దీపనవిభావనభూతుఁడగువసంతునియందుఁ గాముకత్వాధ్యారోపంబున వనస్థలీలలనల కుటిలలోహితపలాశకలికలచే నవసంగమయోగ్యనఖక్షతం బుత్ప్రేక్షింపఁబడుట మిక్కిలియౌచిత్యసారస్యమును బ్రతిపాదించుచున్న" దని చెప్పి మఱియొక్కచో నందే ప్రబంధార్థానౌచిత్యంబున కుదాహరణముగా "ఊరుమూలనఖమార్గపంక్తిభి స్తత్క్షణం హృతవిలోచనోహరః। వాససః ప్రశిథిలస్య సంయమం కుర్వతీం ప్రియతమా మవారయత్" ఈ యంబికాసంభోగవర్ణనంబునఁ బామరస్త్రీలకుఁ దగినట్టి నిర్లజ్జంబు లగునఖక్షతంబులతోఁ గూడిన యూరుమూలములచే నాకర్షింపఁబడిన నేత్రములుగలవాఁడని భగవంతుండు జగద్గురువు నగుత్రిలోచనునియెడ వర్ణించుట యయుక్తంబై

యనౌచిత్యమును గలిగించుచున్న” దని యుత్తమదేవతాప్రకృతుల సంభోగరతి కనౌచిత్యము చూపుటచేతను; గావ్యప్రకాశంబున మమ్మటాచార్యుఁడు "రతిహాస శోకాద్భుతముల దివ్యోత్తమప్రకృతులయందువలెనే దివ్యులయెడ వర్ణింపఁదగును గాని సంభోగరూపం బగురతిమాత్ర ముత్తమదేవతావిషయకంబుగా వర్ణింపరాదు. అట్టిసంభోగవర్ణనము జననీజనకుల సంభోగవర్ణనమువలె నత్యంత మనుచితము.'' అని చెప్పినదానికి భట్టవామనాచార్యుఁడు—"దష్టముక్త మధరోష్ఠ మంబికా వేదనాభిధుతపాణిపల్లవా। శీతలేన నిరవాపయత్ క్షణం మౌళిచంద్రశకలేనశూలినః" అని పరమేశ్వరకృతపార్వతీవిషయకచుంబనదంతక్షతరూపసంభోగరతి యుదాహరించుటచేతను, రసగంగాధరంబునఁ బండితరాజు "మనుష్యులయందువలెనే యుత్తమదేవతలయెడ సంభోగరూపరతియొక్క స్ఫుటీకృత సకలానుభావవర్ణన మనుచితము. సకలసహృదయసమ్మత మగునీసమయమును గీతగోవిందాదులయందు జయదేవాదు లుల్లంఘించి రని యాధునికుఁ డట్లు వర్ణింపఁగూడ"దని గీతగోవిందంబునందలి లీలామానుషవిగ్రహరూపధారియు, నుత్తమదేవతాప్రకృతియు నగు శ్రీనారాయణుని సంభోగరతి కనౌచిత్యము దెల్పుటచేతను, నుత్తమదేవతలయొక్కయు గురుజనముయొక్కయు సంభోగరూపరతివర్ణనముమాత్రమే యనుచితం బనియు మిగిలిన యదివ్యదివ్యాదివ్యసంభోగరతివర్ణన మనుచితము గా దనియు నెఱుంగనగును. అట్లు గాదేని యదివ్యు లగునలవత్సరాజాదులయు దివ్యాదివ్యు లగురామకృష్ణాదులయు సంభోగరతి వర్ణింపఁబడిన తత్తత్కావ్యంబుల కనౌచిత్యమూలకముగా ననుపాదేయత్వము సిద్ధింపక పోవునా? అట్లయిన గీతగోవిందములోని రతిని జగన్నాథకవి నిందింపలేదా? అందలిగోవిందుఁడు దివ్యాదివ్యుఁడు గాఁడా? యని కొంద ఱనుగవచ్చును. సరియే కాని యట్లు కాదు. ఏమనఁగా? అతఁడు దివ్యాదివ్యుఁడే యనునభిప్రాయ మైనయెడల జగన్నాథకవి "యుత్తమదేవతా విషయక సంభోగరతి యనుచిత" మను తనలక్షణమునకు గీతగోవింద మేలయుదాహరించును? సంభోగశృంగారమును దెల్పు రామాయణకథాకావ్యముల నేల యుదాహరింపఁడు? కావున నందలికృష్ణుఁడు శ్రీమద్భాగవతములోని కృష్ణునివలె దివ్యుఁడుగాఁ బరిగణింపఁబడి యుండును. ఆకావ్యము గూడ నట్లే చెప్పుచున్నది. ఈవిషయంబున రామకృష్ణాద్యవతారపురుషులను గవు లొక్కచో దివ్యులుగా నింకొక్కచో దివ్యాదివ్యులుగా మఱొక్కచో నదివ్యులుగాఁ గూడఁ బురాణేతిహాసకావ్యాదులయందు వర్ణించియుండుట యెఱింగిన విద్యావంతు

లకు వేఱుగాఁ జెలుపనక్కఱలేదు. మఱియు నివిషయంబున భరతాచార్యాను మతముగా దివ్యాదివ్యమిశ్రవస్తువులు రూపకేతివృత్తములుగా నిర్ణయించిన ధనంజయకవి తనదశరూపంబున సంభోగశృంగారమున కుత్తరరామచరిత్రలో భవభూతి వర్ణించిన దివ్యాదివ్యనాయకులగు సీతారాముల యాక్రీడి సంభోగరతి వర్ణన ముదాహరించుటయే ప్రమాణము.

(ఆంధ్రీకరణము)

"తరుణీ! యేమిది దుఃఖమో సుఖమొ నిద్రాసౌఖ్యమో మోహమో
గరళవ్యాపనమో మదంబొ యెఱుఁగంగారాదు నీదైనయా
పరిరంభంబున నింద్రియంబులను వేబంధించుహృద్భ్రాంతి యాం
తరచైతన్యము సంచలింప ముదమందంజేయు నాకియ్యెడన్"

దృశ్యకావ్యంబులయందే యిట్లుండ నిఁక శ్రవ్యకావ్యంబుల నుండఁదగునని చెప్పెడిదేమి? కావున నుత్తమదివ్యులకుంబోలె నదివ్యదివ్యాదివ్యుల సంభోగరతి కనౌచిత్యము సంభవింపదు. ఇట్లనుటచేఁ దెగఁబడి వర్ణింపవచ్చునని నా యభిప్రాయము గాదు. దీనిమర్యాదంగూర్చి పూర్వమే చెప్పియుంటిని.

మఱియు నీసందర్భంబున నెల్లలాక్షణికులును "సత్యానురాగ యైనయెడల నాయికగా నుండఁదగు" నని గణికంగూర్చి లక్షణము చెప్పుచు దాని నొక నాయికగాఁ జేర్చుట యటుంచి స్వీయతోఁ దుల్యముగా నిషిద్ధాలంబనంబగు పరోఢనుగూడ నాయికగాఁ జేర్చి దానిభేదంబులను దల్లక్షణంబులను, దదుదాహరణంబులను విస్పష్టముగా వెల్లడించుచు వాత్స్యాయనుఁడు మార్గదర్శిగాఁ దమ లక్షణగ్రంథములను బరకీయాలక్షణముతోఁ నేల పూరించిరో యనునంశము విమర్శింపవలసియున్నది. కాని యిది ప్రత్యేకముగా విమర్శింపఁదగినవిషయ మగుటచేఁ బ్రకృతంబున కనుకూలముగా స్థాలీపులాకన్యాయంబున నిక్రిందిలాక్షణికుల యభిప్రాయ ముదాహరించెదను.

**(1)** "పరకీయనాయకాంతరసంబంధము గలది యన్యోఢ. ఇది యంగియగుప్రధానరసంబున నెక్కడనుగూడ నిబంధింపఁదగదు గావున దీనింగూర్చి వివరింపలేదు" అని ధనంజయధనికులమతము.

**(2)** "పరస్త్రీగమనోపాయము కవు లుపదేశింపరు. ఇఁక నేమనఁగా? నీతిదాయకముగ రమ్యముగాఁ గావ్యాంగముగా దానిలక్షణములను లోకంబున

(1) పరకీయా=అన్యోఢా. ఇయం త్వంగిని రసే నక్వచి న్నిబంధనీ యేతి నప్రపంచితా.

(2) పరస్త్రీగమనోపాయః కవిభి ర్నోపదిశ్యతే।సుందరం కింతు కావ్యాంగ మేత త్తేనోపదిశ్యతే॥

కుపదేశింతుఁ" అని శృంగారతిలకకర్త యభిప్రాయము. ఈవాక్యములంబట్టి యన్యోన్యథావిషయకశృంగారము నీతిదాయకముగా వర్ణింపఁబడెనేని కావ్యముల సంగముగా నుండఁదగు నని తెలియుచున్నది.

## అశ్లీలాదిదోషములు.

ఇఁక నశ్లీలాదులంగూర్చి కొంచెమువిమర్శించి ప్రకృతకాలానుసరణముగా శృంగారరససంస్కరణముంగూర్చి ముచ్చటింతము.

వ్రీడాజుగుప్సామంగళవ్యంజక మగుటచే నశ్లీలము మూఁడువిధంబు లనియు, సందిగ్ధాదులు కావ్యరసపుష్టిని గలిగింపవు గావునఁ గావ్యదోషంబు లనియు నెల్లలాక్షణికులు నిరూపించిరి. ఇం దశ్లీలము పదగతము, వాక్యగతము, అర్థగతము, రసగతము నని వివిధం బగుచున్నది. గ్రామ్యంబుగూడ నశ్లీలంబున నంతర్భూతము. ఈయశ్లీలదోషంబునుగూర్చి దండి మమ్మటాదు లనంతముగా వ్రాసిరి. వారు నిషేధించినట్లుగాఁ బదవాక్యార్థంబులను దత్సమానార్థకంబులను బరిత్యజించుచుఁ దత్ప్రయోగమువిషయమై మాటిమాటికి నశ్లీలతాదోషమునకు జంకుచుంటయే విధి-యయ్యెనేని పూర్వమహాకవులు కావ్యరచనవృత్తి మానవలసియే వచ్చును. కావున వారు వ్రాసినయశ్లీలతాదోషబోధకలక్షణ మంతగా, లక్ష్యగ్రంథములపై నధికారము చేయఁదగినట్లుగా లే దనియు, అట్లు గాదేని వా రుదాహరించిన శబ్దార్థాములను మాత్రమే శాసింపఁదగును గాని తత్సమానార్థకంబులు తత్సదృశంబులు నగుశబ్దాదులను నియమింపఁ దగ దనియు వారిలక్షణంబులును బూర్వకావ్యంబులును జాటుచున్నవి. ఇందుల కొకొక్కటి యుదాహరణ మిట్లరియుఁడు. "సాధనశబ్దమునకుఁ గలసన్యాద్యనేకార్థములలోఁ బురుషలింగ మని యింకొకయర్థము గూడ నుండుట చేతను, వాయుశబ్దము, అపానవాయు వనునర్థముగూడఁ జెప్పుచుండుటచేతను వినాశశబ్దమునకు మరణ మనునర్థముండుటచేతను గ్రమముగా లజ్జను, రోఁతను, అశుభమును దెల్పుచున్నవి గావున నివి యశ్లీలములు" అని మమ్మటభట్టు చెప్పెను. ఈశబ్దములనే సరిగా నీహేతువులచేతనే యశ్లీలము లని విశ్వనాథకవిరాజు చెప్పెను. ఇందు వీరియభిప్రాయం బేమి? అశ్లీలతాదోషాపాదకంబు లగు నివి కావ్యంబులఁ బ్రయోగింపరా దని కదా? సరియే కావ్యప్రపంచమున నీశబ్దము లెన్నియోలక్షలపర్యాయములు గనుపడుచుండలేదా? ఇం కొకయుదాహరణము చూడుఁడు. "కటిశబ్దము గ్రామ్యము. దీనిని బామరులు ప్రయోగిం

తురు. పండితులు శ్రోణి నితంబాదిశబ్దములు ప్రయోగింతురు" అని కావ్యప్రకాశాదులు వాకొనుచున్నవి. యథ మైథున పదంబు లశ్లీలంబు లన్నవారే, రతిసురతపదంబులు ప్రయోజ్యంబు లనిరి. పైదానింబట్టి సాధనాది పదంబులను వా రశ్లీలంబు లన్నను బూర్వకవులు ప్రయోగించుచునే వచ్చి రనియు, భాషలో నత్యల్పముగా నున్న కటి మైథునాదిపదంబు లశ్లీలంబు లని కవులు సుప్రసిద్ధముగా వ్యవహరించిన నితంబ సురతాదిపదంబుల కభ్యనుజ్ఞ యిచ్చి రనియు, వారి నిషేధము నిషేధింపఁబడిన కొన్నిశబ్దములయందు మాత్రమే కాక తత్సదృశ తదర్థకపదంబులయందు వర్తింప దనియుఁ దెలియుచున్న దిగదా? ఇఁక దీనింగూర్చి విశేషచర్చ యేల? మిగిలినసందిగ్ధాదిదోషంబులకుఁ గూడ నిట్లే యరయునది. ఇదిగాక యీయశ్లీలాదిదోషపరిగణనవిషయమై లక్షణగ్రంథములకంటెఁ బూర్వమహాకావ్యంబులే యెక్కుడు ప్రమాణ మని విశ్వసింపఁదగును. కావున దేశకాల పాత్రవ్యవహారయోగ్యతను, భాషాప్రయోగార్హతను, బూర్వకవివ్యవహారంబును నెఱింగి ప్రయోగింపఁబడిన పదవాక్యార్థరసంబులకు నేదోషము నంట దని నా యభిప్రాయము. "సకలసుకవివ్యవహృతంబులు లోకప్రతీతంబులు నగుటచే" భగిని, సుభగ, భగవతి, జన్మభూమి, అభిప్రేతము, ఉపస్థానము, కుమారి, మొదలుగాఁగలశబ్దంబు లశ్లీలంబులుగా" వనువామనపండిత మమ్మటాదులమతము నాయభిప్రాయంబునకుఁ దోడ్పడకుండునా?

ఓ భాషాభిమానులారా! మన మీయపారకావ్యాలంకారలక్షణసుధాసాగరంబు నీఁది శృంగారరసంబు తత్త్వ మెఱుంగఁదలంచుట రసాత్మకుఁ డగు పరమపురుషుని తత్త్వ మెఱుంగఁదలంచుటయే. మనభాషలోని శృంగారంబునకు సంస్కృతలక్షణమునే సంపూర్ణముగాఁ బ్రమాణముగాఁ గైకొంటిమేని "శృంగార మి ట్లుండవచ్చును. ఇ ట్లుండఁగూడదు" అని మాటమాత్రమైనఁ జెప్పఁదగము. చిరకాల ముత్తమరాజ్యాధిపత్యము వహించిన సంస్కృతభాష తత్తద్దేశకాలరాజపాత్రసమ్మతముగా ననేకవిధములుగా వ్యాపించి పెక్కులక్ష్యలక్షణగ్రంథములను నిర్మించినది. దానినే మాతృకగాఁ జేసికొని తత్తత్కాలానుగుణముగా మనభాషకూడఁ గొన్నిచిన్నెలు సేకరించినది. అట్టియెడ "దానిలో న ట్లున్నది. దీనిలో ని ట్లుండఁగూడదు" అని మనబుద్ధితో నిర్ణయింప నెట్లు శక్యమగును? కావున మన మేమియు వానిలో వేయక తీయక వానిని మనపెద్దలు మనకు గడించి యిచ్చిన పెన్నిధులుగా నెంచికొని సంరక్షించుకొనుచు మనభాషకు మన మిప్పుడు చేయఁదగిన నూతనశృంగార మేమైన నున్న దాని నార్జింప

యత్నింతము. అంతియకాని గీర్వాణభాషాయోషామణితోఁ జిరకాలము మైత్రి యొనరించి సరసముగా సర్వవిధాలంకారములు శృంగారించికొని యున్నమన యాంధ్రభాషావధూటి కిపుడు, పూర్వ మున్నట్లుండక యెప్పటి కప్పుడు తనవేషము మార్చికొనుచు నెవ్వరిని నమ్మక యున్న నూతనహూణభాషాచిరంటితో నవీన మైత్రి వచ్చినదిగదా యని తొల్లింటి చెలికత్తెయందలి విశ్వాసము లేకుండఁజేయ నగునా? అయినను, దేశకాలపాత్రములఁబట్టి దేశభాషకుఁ గొంత మార్పు గలిగింపక తప్ప దందురా? సరియే; యట్లయినయెడల నీవిషయంబున సంపూర్ణముగా సంస్కృతలక్షణము ననుసరించినచో నట్లు వలనుపడదు గావునఁ గొంతవఱకు దాని ననుసరించి యాధునికకావ్యరచనంబున కనుగుణంబుగా మన మిట్లు శృంగారరససంస్కరణము చేసికొనిన బాగుగానుండు నని నాయభిప్రాయంబును దెల్పుచున్నాఁడను. ఇందులకు విద్వల్లోకమే ప్రమాణము.

శృంగారరససంస్కరణము.

(1) పరోఢారతి యంగిగాఁ గావ్యంబుల వర్ణింపఁదగదు.

(2) అనుచితాలంబనగు బహుసామాన్య యొంతమాత్రము కావ్యములఁ జొరఁగూడదు.

(3) ఉత్తమదేవతాగుర్వాదివిషయకసంభోగశృంగార మత్యంత మనుచిత మవర్ణనీయము.

(4) అదివ్యదివ్యాదివ్యుల సంభోగశృంగారము వ్యంగ్యమర్యాద నతిక్రమింపక వర్ణింపఁదగును.

(5) అవయవవర్ణనము సహృదయరంజకముగాఁ దగును గాని వ్రీడాజుగుప్సాకరముగా నుండఁదగదు.

(6) కావ్యంబులఁ గథాచమత్కార మధికముగాను, శృంగారవర్ణన మల్పముగాను నుండఁదగును.

ఇవ్విధముగా సంస్కరింపఁబడిన శృంగార ముభయపక్షములవారిమదికి నెక్కు నని తలంచెదను.

ఓవిద్యావంతులారా! నాశక్తికొలఁది విమర్శించి చెప్పిన పైశృంగారరససంస్కరణాభిప్రాయమందును, మహాత్ముల బహులక్షణగ్రంథములను బరిశీలించి వ్రాసిన యీవ్యాసమందును గలలోపములను దయతో మన్నించి భాషాభివృద్ధికై పాటుపడుచున్న మీరు నన్నాదరింతురుగాక!

మల్లాది-సూర్యనారాయణశాస్త్రి.

# ఆంధ్రనాటకములు.



నేను విన్నవింపంబోవువిషయ మాంధ్రనాటకము. దానికి మున్మున్నాంధ్రులన నెవ్వరో, నాటకమన నెట్టిదియో వివరించి పిమ్మట నాంధ్రనాటకములఁ గూర్చి ముచ్చటించెదను. ఈవిషయములను గూర్చినచర్చకుఁ జరిత్రాంశములు కొన్ని యవసరములు. అవి యింతకుమున్ను సునిశ్చితంబులుగాక యుండుటచే వాని కొఱకు నేఁ జేయంబోవు దూరప్రసంగంబుల మన్నించి సావధానముగ వ్యాసము గడముట్టనవధరింప విన్నవించుచున్నాఁడను.

ఆంధ్రులు మొట్టమొదట కోయజాతులవంటి యనాగరకజాతులవారికిఁ జెందినవా రనియును, 'అర్యుల' సాంగత్యము వారికి లభించెడివఱకును వారికి లిఖితభాషయే లేదనియును, వారిస్థితి యిప్పటి యడవిజాతులస్థితివలె నుండెడి దనియును, మధ్య ఆసియానుండి, 'ఆర్యులు' తెగతెగలుగ వచ్చి భరతఖండము నాక్రమించికొనినపుడు వారిలోఁ గొంద ఱుత్తరహిందూస్థానమునుండి దక్షిణ హిందూస్థానముం జేరి రనియు, 'ఆంధ్ర'జాతి యనిన దొల్లింటి మోటుజాతుల లోని యాంధ్రులును బైనుండి వచ్చిపడిన తదితరజాతులును జేరిన సంకీర్ణజాతి యనియును, జరిత్రకారులు చెప్పుచున్నారు. కోయజాతుల భాషలలో నెన్నియో భేదము లున్నవి. వానిలోఁ గొన్నిటి కింకను, నక్షరము లేర్పడి యుండలేదు. ఆంధ్రేతరజాతు లాంధ్రదేశము వచ్చి చేరిననాఁటికి బహువ్యాప్తముగా నున్న దేశభాషకు మాత్రము లిపి యేర్పడి యున్నది. దానినే మన మిప్పు డాంధ్రభాష యనుచున్నాము. ఈలిపి, "పాలీ"భాషనుండి యేర్పఱుపఁబడినట్లు కనుపట్టుచున్నది. దానినుండియే యిది యేర్పడిన దని చెప్పుటకుఁ బ్రమాణ మేమని యందురేని మనపూర్వశాసనముల వ్రాఁతయును, ఉభయభాషలయం దుండెడి యక్షరమాలల యైక్యస్థితియును నాధారము లని చెప్పవచ్చును. 'పాలీ'భాషకును సంస్కృతభాషకును జాల చేరువ. మనయక్షరమాలయం దక్షరము లన్నియును, నీరెండుభాషలలోనుండియే గైకొనఁబడినవి. 'పాలీ' భాష సంస్కృతభాషకుఁ దల్లిభాష యనియును, నయ్యది ప్రాకృతజను లందఱును మాటలాడుభాష యగుటచేఁ గట్టుదిట్టములు లేక యొక్కొక్కదేశమున కొక్క

కమాదిదిగ నుండి బహువిధములగు ప్రాకృతభాషలతో వఱలెడిదనియును, వానికిఁ గట్టుదిట్టము లేర్పఱచి సంస్కరించి సూత్రప్రాయముగ నుండుశుద్ధభాష యొకటి యేర్పఱుపఁబడిన దనియును, నట్లు సంస్కరింపఁబడిన భాషయగుటచే తనే దానికి "సంస్కృత"మను నామము వచ్చెననియును జెప్పుదురు. ఆంధ్రభాష స్థితియును నిట్టిదియే.

'ఆంధ్ర'భాష లిఖితావస్థకు వచ్చిన విమ్మటియాంధ్రులస్థితి వారిప్రాకృత స్థితిగ నెంచఁజనదు. వారు కేవలముగా నితరులతో సంబంధము లేకుండ మెలంగిననాఁటిస్థితియె వారినిజమైనస్థితి. అప్పటియాంధ్రులస్థితి నరయవలె ననిన నాగరకజాతుల సంపర్కము లేక యిప్పటికిని నడవులలో సంచరించు "కోయలు", 'భిల్లులు', "గోండులు", 'లంబాడీలు'మున్నగువారి యాచారములను, నడవడులను గాంచినఁ దెలియవలసినదే కాని, యిప్పు డాంధ్రు లనువారి జనసామాన్యమును బట్టి నిర్ణయింప వలనుపడదు. ఆటవికులైన వఱలు కోయజాతులలో నిప్పు డేమాదిరియాచారము లున్నవి! ఆయాచారములనుబట్టి 'ఆంధ్రులకుఁ' బూర్వమునుండియును నాటకాభిరుచి యున్నట్లు చెప్పుట కాధారము లేమైన నున్నవా? ఉండిన వానిబీజము లెవ్వి? అనువిషయములు ప్రస్తుతమున కనుకూలించునవి విమర్శించి చూడవలయు.

వ్రాఁతకెక్కిన యూహలు, నాచారములును మనుజులవ్యవహారమునుండి వచ్చినవిగాని మఱియొక్కడనుండి వచ్చినవి గావు. మన వ్రాఁతభాషలోఁ బురాతనముగాఁ గనఁబడు గ్రంథములు భాషాంతరీకరణములు గాని స్వతంత్రకల్పితములు గావు. అవియన్నియు సంస్కృతమునుండి వచ్చినవి. అందుఁ జాలగ్రంథములుత్తరహిందూస్థానమువారిచే వ్రాయఁబడినవి.

ఆగ్రంథముల నెచటఁజూచినను, జాలమట్టుకు త్తరహిందూస్థానజాతుల వారి యాచారవ్యవహారములే గాని దక్షిణహిందూస్థానమువారి విషయము లంతగాఁ గానరావు. అందువలన నాగ్రంథములలోని యాధారములను బట్టి నాటకవినోద మాంధ్రులకు నైసర్గిక మైనదా యనువిషయము నిర్ణయించుటకు వలనుపడదు. ఇందులకు వారియాచారవ్యవహారములే శరణ్యములు.

మనుజునియభిరుచి యెట్టిదియో తెలిసికొనుట కతురరూపకమైన విద్య (చదువు) వచ్చునా రాదా యనునంశముతోఁ బనిలేదు. చదువు వచ్చినను రాకున్నను మనుజుని మేధావిశేష మెచ్చటికిఁ బోవును? చదువు స్వతస్సిద్ధముగ

నుండు మేధావిశేషమునకు వన్నియ వెట్టును. మంచిమంచియుక్తేకములతో సంపర్కము గలిగించును. ఈవిషయము వ్యక్తియం దెట్లో జాతియందు నట్లే.

వేనివేనియం దభిరుచియున్న నాటకములం దభిరుచి యున్నట్లెంచవచ్చును" అనువిషయము "Pictorial History of England" అను గ్రంథములోని యీక్రిందిభాగమువలనఁ దేటపడుచున్నది. "The gleemen were the more important characters in the Anglo-Saxon festivals. They were mimics, dancers, tumblers and performers of seight of hand tricks, and the rudiments of the Drama are to be traced to some of the performances by which they amused the people. Some of their dances appear to have demanded great exertion and skill. One of these was a sort of war-dance by two men in martial dresses. They were armed each with a sword and a shield and went through a mock combat to the sound of music. The musicians were a man playing upon a horn and a female dancing round the combatants."

వీనినిఁబట్టి, యాట, పాట వీనియం దభిరుచి యుండిన నాటకాభిలాష జాతికున్నట్లు లెంచవలసియుండును. ఎఱుకులు, కోయలు, మాస్టీలు, పిచ్చుగుంట్లు, పాములవాండ్రు, పంబలవాండ్రు, దేవరవాండ్రు, మున్నగు, నంత్యజాతులను బరికించిన శుభములయందు నశుభములయందునను గూడ వారి కాటపాట లున్నట్లు కనుపట్టుచున్నది. Sir Henry Johnston అనునాతనిచేఁ బ్రచురింపఁబడిన 'Living Races of Mankind' అను నాంగ్లేయగ్రంథములో ద్రవిడజాతులవారి యాచారవ్యవహారములు వర్ణింపఁబడినవి. ప్రపంచము పుట్టినప్పు డెట్టులున్నవారో యిప్పటికి నాస్థితినే యనుసరించియున్న "తోడాలు", "కురుంబాలు" మున్నగు కొన్నితెగలవారికి ("Uncultured Dravidians") 'అనాగరక ద్రావిడు' లని పేరిడుచు వారి కాటలును, బాటలును మొట్టమొదటినుండి యున్నట్లు, నాయభిరుచి వారికిఁ గ్రొత్తగా వచ్చినది కానట్టు నాగ్రంథమునఁ జెప్పఁబడి యున్నది.

మనదేశమునందువలెనే మన యిప్పటి ప్రభుత్వమువారి 'బ్రిటన్'దేశమునందును వారి కక్షరరూప మగువిద్య లేనినాఁ, డాటపాటలయం దభిరుచి యున్నట్టు కనిపెట్టి యాజాతికి నాటకాభిరుచి స్వతస్సిద్ధముగ నుండినట్లు చరిత్రకారులు నిర్ణయించియున్నారు. అట్లే మనమును మనవారికి నాటకాభిరుచి

పూర్వమునుండి యున్నట్లు నిర్ధారణ చేయవలసియున్నది. పూర్వాంధ్రులకు సంగీతమునం దెక్కుడుగ నభిరుచి యుండినట్లు వారియందుఁగల వాద్యవిశేషములనుబట్టి తెలియనగును. పసులకాపరులలోఁ జాలమంది పిల్లనగ్రోవి యూఁదెదరు. ఆపిల్లనగ్రోవి యూఁదుటలో నేమియును, జదువురానివాం డ్రెంతకర్ణరసాయనముగ వాయింతురో మనము పల్లెటూళ్లం దిరుగునపుడు బోధపడును. పాములవాండ్ర నాగస్వరములు, చిన్నతెల్లుపుల్ల, సొరకాయ చేతఁ బుచ్చుకొని వాఁడెంతశ్రావ్యముగఁ బాడుచుండును? ఈనాగసరమునకు శ్రుతికూడ వాఁడాతెల్లుపుల్లలోనే జతఁజేసి యమర్చును. ఈనాగసరము కేవలము సంకీర్ణజాతి యగు నాంధ్రుల దే యని యెట్లు చెప్పఁగల సందురా? ఇప్పటికి నాసాధనము తక్కువజాతులవారే గాని యగ్రవర్ణములవారు ముట్టరు. వల్లభామాత్యుఁడు తనక్రీడాభిరామమున, ఈనాగసరమును "పాములమెంగని" వీథినిఁ బోవుచుఁ జూచి యిట్లు వర్ణించెను.

"సీ॥ పూత్కారరవములు పూరించుపుక్కిళ్లు
మునిడిపండులతోడ ముద్దుగుఱియ।
సందిటిసంకుపూసల సద్దుకటుతుంబి
నాదస్వరోజ్జృంభణముల నడప।
నేడు రంధ్రమ్ముల నిరుకేల వ్రేళ్ళను
వివృతిసంవృతిలీల విస్తరింప।
నాలాపతాళాంత రాంతరంబులయందు
విక్కనుశబ్దముల్ చొక్కటముగ॥
గీ॥ నాగసింధుప్రదేశ నా-నావరాట
రాగ గంధర్వలహరికా-రంభణముల
మిహిపదంబులఁ బాముల-మెంగఁ డూఁదె
భోగిరాజులు నర్తింప-నాగసరము॥"

ఈగ్రంథము రచించిన వల్లభామాత్యుఁడు 1420 ప్రాంతములవాఁడు. ఈపద్యములోని వర్ణనమునుబట్టి, యప్పటి కీవిద్య స్వరయుక్తముగ ననాగరకాంధ్రులవశమునం దున్నట్లు తెలియవచ్చును. పిల్లనగ్రోవియు నిట్టిదియే, కాని యది యుత్తరహిందూస్థానమునఁ గూడఁ బూర్వమునుండి యున్నట్లు గ్రంథములం జదువుచుంటిమి. అది యైనను గృష్ణుఁడు పసులకాపరి యైననాఁ డూఁదియున్నట్లు

వినియుంటిమి. పెద్దయైన వసుదేవకుటుంబమునఁ జేరినఁ వెనుక నాతఁడు దీనిని ముట్టినట్టు కనఁబడదు. అందుమూలమున, నచ్చటఁ గూడ నది తక్కువజాతుల వారియందే యున్నట్లు చెప్పవలయును. ఉత్తరహిందూస్థానమునుండి దక్షిణ హిందూస్థానమున వచ్చిచేరినది కేవల మార్యులుమాత్రమే. పైనుండి వచ్చినజన ములలో దిగువజాతు లున్నట్టు లెక్కడను గనిపించదు. కావున నియ్యది యిచ్చట నుండు క్రింది జాతులవారిలోనిదే యనిచెప్పవలయు. పై నుండివచ్చినవారును దేశ మునఁ బుట్టి పెరిఁగినవారునుగలిసి యిన్ని శతాబ్దములైన తరువాత నిప్పు డేది యెవ్వరికి నైజమైనదియో చెప్పుట కష్టమైనపనియే యగును. డాక్టర్ భండా ర్కార్ గారు "Early History of Deccan" అనిచెప్పఁబడు మహారాష్ట్ర దేశచరిత్రను వ్రాయుచు—

"Though they penetrated there and communicated their own civilization to the aboriginal races inhabiting those parts, they, were not able to incorporate them thoroughly into their own society or to root out their languages and their peculiar civilization. On the contrary, the Aryas had to learn the languages of those races and to adopt a portion of their civilization. Thus, the Canarese, the Telugu, the Tamil and the other languages now spoken in Southern India are not derived from the Sanskrit, but belong altogether to a different stock. Hence it is also that the Southern art is so different from the Northern. The reason why the result of the Aryan irruption was so different in Southern India from what it was in the North appears to be that, when the Aryas penetrated to the south, there existed already well organized communities and kingdoms.

దీనినిబట్టి యార్యులే యిచ్చట నుండువారి యాచారవ్యవహారముల నవ లంబించవలసినవార లైరనియు నప్పటికే దేశమునఁ దెగలును రాజ్యములు నేర్ప డియున్నట్లును నేర్పడుచున్నది. అట్టిస్థితిలో నిప్పటివఱకు ననార్యుల తెగలలో పలనే కనిపించుచున్న యీయాటపాట లార్యులనుండి రాలేదని చెప్పిన నది యథార్థమునకు దూరము కానేరదు. ఈదిగువజాతులవారలు పాడెడుపాటలలో నాటకమునకు బీజరూపక మైనసంభాషణముకూడ నున్నట్లా తెగలవారిలోఁ బాడు కొనుపాటలనుబట్టి చెప్పవచ్చును. వారు పాటలుపాడుచు నాటలాడుచు న్నట్లు క్రీడాభిరామమున వర్ణన లున్నవి.

చ. హరహర యింతయొప్పునె మహారభటీకగజఝుంకృతస్వర
స్స్మరళివిమిశ్రితాంకరవమూర్ఛలఁ జిత్తము లుబ్బి యక్కలేఁ
ద్వ్యాసు నదె యాడఁజొచ్చిరికఁ గడు వేడ్క సమున్నమత్పయో
ధరయుగభారభీకతమతన్వవలగ్నము లైన నృత్యముల్."

ఇట్లే తందానపదములవారిని శృంగనాదములఁ బాడుచు నాడు మైలార వీరభటులను వర్ణించియున్నాఁడు.

"గీ. వీరు మైలారదేవరవీరభటులు
గొండ్లియాడించుచున్నారు గొజ్జెగపకుచు
నాడుచున్నది చూడు మర్థాభినయము
తాను నెట్టికసీలంత గానిలేదు."

గొల్లసుద్దులు, తందానపదములు, దేవరవాండ్రకతలు, పరశురాముని కథలు మున్నగుకథలను వినిన నీసంభాషణావైచిత్ర్యము కనఁబడఁగలదు. ఊడ్పులూడ్చు మాలెతి లేరసమున కారస ముట్టిపడున ట్లుత్తర ప్రత్యుత్తరములతో నున్న సంభాషణములుగల పాటలఁబాడునేర్పు గనిన నాటకసంభాషణము పూర్వాంధ్రులలో లేకపోలే దని చెప్పవలయును. ఇవిగాక దిగువజాతులలో భజనమేళములున్నవి. వానియందును నాటయుఁ బాట యున్నది. ఇవి చిరకాలమునుండి యున్నవే గాని క్రొత్తగా వచ్చినవి గావు. ఈమేళము లగ్రజాతులవారిలో నున్నట్లు కనుపట్టవు. ఉన్నను బహుసకృత్తుగా నున్నందునను, ఆర్యులు ననార్యులును గలసిన వెనుక ననార్యులనుండి యార్యులు నేర్చికొనినవి కూడఁ గొన్ని యుండుటచేత నివి తక్కువజాతులవారివలన నెక్కువజాతులవారికిఁ బట్టుపడినవేమో యని యూహింపవలసియున్నది. గ్రీసుదేశములో Chorus అనుపేర నొకమాదిరి యాటపాటలమేళము లుండెడివి. అం దేఁబదిమందికిఁ దక్కువగాకుండ జనులుండి యందఱును గలసియే పనిచేయుచుండెడివారు. ఈమాదిరివే మనభజనమేళములును. ఈభజనమేళములలో సంభాషణముకూడ నుండును.

ఇవియన్నియును జదువు దేశమునఁ బ్రవేశింపకపూర్వమే యుండెనా యనునంశము యోచింపవలసి వచ్చినచో నివి యన్నియును జదువురానివారిచేతనే యాచరింపఁ బడుచుండుటచేతఁ జదువు దేశమునఁ బ్రవేశింపక పూర్వమే వచ్చె నని చెప్పవచ్చు. అందలికథలు రామకథలును భారత

కథలు నగుటచేత నివి యార్యులు దేశమునకు వచ్చినతరువాతనే బయలుదేఱిన వేమో యని సంశయము కలుగకమానదు. దేశమునఁ గ్రొత్తగా నొకతెగ వచ్చి యాపకొని వారు తమమాట సాగించుకొనఁ దలంచినపుడు తమ్మునుగూర్చి, తమపూర్వులనుగూర్చి, తమశక్తిసామర్థ్యములనుగూర్చి క్రిందిజనులకు బోధించి వారికిఁ దమయం దభిమానము గలుగునట్లు చేయుట స్వభావమై యున్నది. అట్టిసమయములో నక్షరము లాంధ్రమునకుఁ బుట్టకపూర్వమె, యార్యులలోని వారు తమచారిత్రములఁ గథారూపకముగఁ జెప్పి వారియభిమానము కొఱకుఁ బనిచేసి తాము వారిపై నాధిపత్యమును సాగించి రని యెంచఁదగియున్నది. లేదా మొట్టమొదటి కథ లన్నియు నశించి వానిస్థానమున నిప్పటికథలు వచ్చి యైన నుండవచ్చును. పూర్వము 'ఈజిప్టు' దేశమునను 'గ్రీసు'దేశమునను, మన హిందూదేశమునను గూడ నొక్కసారిగ నిట్టిమేళము లున్నట్లు చరిత్రలవలనఁ దెలియుచున్నది. కాని యిందేదేశమునుండి యేదేశమువారు గైకొనినదియు నిశ్చయము చెప్పఁజాలము కాని Col Todd వ్రాసిన రాజస్థానచరిత్రమున మనబలరాముఁ డచ్చటికిఁ బోయి గ్రీసుదేశమున నాగరకత నేర్పినట్లు చెప్పి యున్నది.

సానిమేళములును, భోగముమేళములును, జక్కులమేళములును గూడఁ జాలకాలమునుండి యున్నట్లు మనగ్రంథములు చెప్పుచున్నవి. ఈమేళములలో నివారు కొందఱు దేవదాసీ లనుపేరఁ బరఁగువారు. దేవదాసీత్వమనఁగా దేవాలయములలో నాటయుఁ బాటయును జరుపుట. ఈదేవాలయసేవ లార్యులీదేశమునకు వచ్చినతరువాత బయలుదేఱినవి కావా, యని ప్రశ్నించినచో నవి యార్యులకుఁ బిమ్మటి వనియే చెప్పనగు. వారినాగరకతనుబట్టి, విద్యాబుద్ధులను బట్టి, యాజాతులదేహవర్ణమునుబట్టి వా రుత్తరహిందూస్థానమునుండి వచ్చిన వారే కాని యనార్యులసంతతివారు కా రని చెప్పవలసియున్నది. ఆర్యు లీదేశమునకు రాకపూర్వ మిచ్చటనుండు మోటుజాతులకు నేదియో యొకదేవతాపూజ లేకపోలేదు. కాని యిప్పు డిచ్చటనుండు మాదిరి నాజూకుగా నుండు పూజలు లేవని చెప్పవలసియున్నది. ఇప్పుడు గుడిసెలరూపమున నున్న యమ్మవార్లగుడు లన్నియు నీమోటుజాతులు పూజించు గుడులే. ఇప్పుడు 'మారెమ్మ' యనుస్ఫోటకదేవతను, 'మరిడీ'యను కలరా దేవతను నీలగిరిలో

నివసించుననాగరకజాతులు పూజింతురు. వీరు తమనాగరకత యేమియును బైనుండి తెచ్చికొనినది కాదు. అందుమూలమున నాంధ్రులకుఁ బ్రత్యేకముగ నుండు గుళ్లలో నిట్టివా రున్నారని చెప్పుట కవకాశము కిప్పడదు. ఈదేవదాసీ లుచ్చదశనందిన దేవాలయములకు మాత్రమే చెందియున్నవారు. ఈతెగవా రుత్తరహిందూస్థానమున నున్నట్లు స్మృతికర్తలు తెలిపియున్నారు. కావున వారార్యసంతతివారేయని చెప్పవచ్చు. వీరియాటలును, పాటలు నాంధ్రులు సంకీర్ణజాతి యైనతరువాత బయలుదేఱినట్లు చెప్పినఁ దప్పుకాదు.

భాగవతములును, బగటివేషములును, దోలుబొమ్మలును మనకుఁగలనాటక రూపకము లగు వినోదములు. ఈయాటలు కేవలము కులవృత్తిగా నేర్పఱుచుకొని కొందఱు జీవించుచున్నారు. ఈతెగలలో నేది ప్రాథమికము? ఏది పిమ్మటిది యనునది విచారించుటకు నాధారము దొరకుటలేదు. కోలాచలము శ్రీనివాసరావుగా రాంగ్లేయభాషను రచించిన Dramatic History of the world అనుగ్రంథములో "జావా", 'సుమాత్రా' దీవులలోఁ గొయ్యబొమ్మలయాటలుచిరకాలమునుండి యుండెడి వనియును వాని ననుసరించి మనదేశమునందలి తోలుబొమ్మలు కల్పింపఁబడిన వనియును వ్రాసియున్నారు. ఇప్పటికిని మనదేశమునఁ గొయ్యబొమ్మలాటలు లేకపోలేదు. జావాకును మనదేశమునకును గలయికపోయి చిరకాలమై యుండుటచేత నీయుభయదేశములయందును గల యీ యాటలు వారికిఁ జేరికపెచ్చుగానున్న నాఁ డారంభమయి యుండవలసియుండుటచేతను దోలుబొమ్మలు ప్రాథమికములని చెప్పవలసియున్నది. తక్కిన వీధినాటకములు కూడను జిరకాలమునుండి యున్నట్లు గ్రంథదృష్టాంతరములు గన్పట్టుచున్నవి. ఈవీధినాటకమేళములు పింగళిసూరన, రామరాజభూషణుఁడు వారికాలము నాఁటి కున్నట్లు క్రిందిపద్యములవలన వారు గైకొనిన యుపమలనుబట్టి తెలిసికొనవచ్చును.

"క. జవనిధియను తెరమఱుఁగటు,
వెడలినిలిచినట్టి యాటవెలఁదియపో లెన్."

(ప్ర. ప్రద్యుమ్నము)

"మ. హరిదంభోరుహలోచనన్ గగనరంగాభోగరంగత్తమో
భరనేపథ్యము నెయ్య నొయ్య సడలింపన్ రాత్రిశైలూషికిన్

వరుసన్ స్వా_స్తికపట్టముఙ్ నిటలమున్ వక్త్రింబునుం దోఁచె నా
హరిణాంకాకృతిఁబోల్చె రేకయి, నగంబై, బింబమై, పూర్ణమై"
(వసుచరిత్ర).

క. అవిష్ణులోకమునకన, మావాహిని విరజయనురు-మానితమోక్ష
శ్రీవరణరాగభాగవ, తావళిశుభలగ్నసమయ-యవనిక పోలెన్!"
కళాపూర్ణోదయము.

ఈపైపద్యములలోని వర్ణనలనుబట్టి యందు వర్ణింపఁబడిన వర్ణన కేవల మిప్పుడు సత్యభామవేషమువంటి వేషమని తెలియక మానదు.

శ్రీనాథునివీథినాటకములో భాగవతములు చిరకాలమునుండి యున్నట్లును, బురుషులప్పటి కాఁడువేసములు వేయుచున్నట్లు నీక్రిందిపద్యములవలనఁ దెలిపి యున్నాఁడు.

"ఉ. భూతలమందు ధాతకు నపూజ్యత గద్గెను రెంటమూఁట భా
గోతులబుచ్చిగానికిని * * * *

ఇందలి "భాగోతుల" యనునది యింటిపేరు క్రింద నప్పటికే వ్యవహారమునకు వచ్చినది. పురుషు లాఁడువేసము వేయుచున్నట్టు లాపద్యమువలననే తెలియుచున్నది. దీనినిబట్టి భాగవతములు కూడఁ జిరకాలమునుండి యున్నట్లు చెప్పవలసియున్నది. శ్రీనాథుఁడు సూరనార్యున కొకటిన్నరశతాబ్దములు పూర్వమువాఁడు; పదునైదవశతాబ్దప్రారంభమున నున్నవాఁడు. కావున భాగవతములంతకుఁ బూర్వపువియైనట్లూహింపవలసియున్నది.

ఇంకఁ బగటివేసములయాటలనుగూర్చి విచారింపవలయు. పూర్వము నాటకము లన్నియును బగలే యాడఁబడుచున్నట్లు సూరనార్యుని యీక్రింది పద్యములవలనఁ దెలియఁదగియున్నది.

"క. నను నేలికొను మవశ్యం, బును మీాయాడిగము చిత్త-మున కెక్కఁగ నే
నొనరింతు నేఁటితమి నీ, మనమున నెంతయు నిడుకొని-మన్నింపఁదగున్"

"ఉ. ఎప్పుడువచ్చుఁ గాంతుఁ డినుఁ-డెప్పుడు గ్రుంకు నటంచు నాత్మలో
ముప్పిరిగొన్న రాగము స-ముత్కటమై కనుదోయి కుబ్బుగాఁ
దొప్పగదోఁగుచూడ్కి-ని వ-ధూమణి సారెకుఁ జూడఁగాఁ జుమీా
యిప్పొలుపొందె నీతఁ డన-హేళిక్రమంబునఁ దాల్చె రక్తిమన్"
ప్రభావతీప్రద్యుమ్నము.

ఇందు మొదటిపద్యములోని 'నేఁటితఱి' యనుదానికి నేఁటిరాత్రి యని యర్థము. ఇది యాటలోఁ జెప్పినవాక్యము; రెండవది యాట యైనతరువాత వర్ణించిన సూర్యాస్తమయవర్ణన. వీనినిబట్టి, వేషము లన్నియు నాకాలమునఁ బగలే కట్టెడివారనియును రాత్రులు లేదనియును బోధపడుచున్నది. ఈపగటియాటలు మనదేశమునందుననె కాదు, గ్రీసు, రోము దేశములందుఁగూడ నిట్లే యాడుచున్నట్లు చరిత్రకారులు వ్రాయుచున్నారు. Mr. Lee Baron Hubner అనునాతఁడు వ్రాసిన "Ramble round the world" అనుగ్రంథమున జపానుదేశమున నాటకములు సూర్యోదయమున ప్రారంభించి సూర్యాస్తమయము వఱకు నాడఁబడుచుండునట్లు చెప్పంబడియున్నది. మొదటఁ బగలాడెడియాటలు క్రమముగా రాత్రులకు మాఱినట్లు చెప్పవలయు. కథారూపకమైన యాటలు రాత్రుల నాడ మొదలుపెట్టిన వెనుకఁ, గేవల హాస్యవినోదములు మాత్రము పగటికి నిల్చియున్నట్లు చెప్పవలసియున్నది.

కావున నివియును, భాగవతములును, వీధినాటకములును నొక్కపాదు నుండి బయలుదేఱినవే యని చెప్పవలయు.

ఇంకను జిల్లరయాటలును, పాటలును, వినోదములును జాలఁగ నున్నవిగాని యవియన్నియుఁ దెలుపనారంభించిన వ్యాసము మిగుల విస్తరిల్లునని యావిచారణ నింతటితో విరమించి నాటకము లెట్టివా రాడినదియు నాటకులయందుఁ బూర్వ మెట్టిగౌరవప్రపత్తు లున్నదియుఁ బ్రేక్షకు లెట్టివారు వచ్చునదియు విమర్శించెదను. దీనికిని బ్రభావతీప్రద్యుమ్నముననే యాధారములు కొన్ని దొరకుచున్నవి.

"గీ. అందు రుక్మిణీసుతుఁడు భద్రాఖ్యురూపు
గదుఁడు పారిపార్శ్వకుని యాకారము మఱి
సాంబుఁడు విదూషకునిప్రకారంబుఁ దాల్చి
చనఁగ నియమించి పంచెను దనుజపురికి.

* * మనముల నిట్లుబ్బుచును నటవేషంబుధరియించి తమకును దగినయట్టి వారసీమంతినీవ్రాతంబు గొలువ, వైణిక, వైణవిక, మార్దంగిక, జనాదినాట్యసామగ్రి" యనుపద్యములనుబట్టి పురుషులును స్త్రీలును గలసి యాటలాడెడివారని తెలియుచున్నది. ఇంక నక్కాలమునందు వారిగౌరవప్రపత్తు లెట్లుండెనో విచారింతము. శ్రీనాథుని వీధినాటకములోని పైపద్యమున "బుచ్చిగానికిని" యను

నీచార్థద్యోతక మగుపదప్రయోగమునుబట్టి సంఘమున వారికి గౌరవము లేనట్లు కనఁబడుచున్నది. పూరనగ్రంథములోని

" ... ఏము ముచ్చులమె ముచ్చుఁదనాల పుట్టినయింట్లు మీబోంట్లగాక యాటవాండ్రని నమ్మియనుమతింపఁగ నెట్టిపురమైన నశ్రమంబునను జొచ్చి పగలెల్ల నాటల భ్రమయించుచును సందుగొందులెల్ల నెఱింగికొనుచు రేలు కన్నగాండ్రగుచునగళ్లుప్రవేశించి యందు నెంతటివారలడ్డమైన
* * బ్రతుకు చునికి మీస్వభావ మింతయును"

అను నీపద్యమునుబట్టి వారు దుర్వృత్తుల మెలంగెడివా రని బోధపడుచున్నది.

" ఓరి యాటకాఁడ యీరీతి యఱపులా
పొగడుటనఁగ మెచ్చుపుట్ట దిందు
మగుడఁబుచ్చుకొనఁగఁదగదు నీవంటిన
కోక లిపుడు పుచ్చుకొనక చనము."

(ప్ర. ప్రద్యుమ్నము)

అనునీపద్యములంబట్టి వారంటినబట్టలైన శిష్టులు ముట్టుట లేనట్లు స్పష్టము. ఇప్పటిమనభాగవతులవలెనే వారివృత్తి యాచనావృత్తి. అదియె కులవృత్తిగ జీవించుచుండుటచేత నెవ్వరేమిచ్చినను బుచ్చుకొని యుత్తమాధమనిర్ణయము లేకుండఁగ నందఱిని స్తోత్రపాఠములు చేయుచుండుట వారికి నాధారమైనది.

"చ. కలికిపిసాళినవ్వు లెసఁగన్వటుధూర్తులు కొంద ఱొండొరుల్
దలకొన హెచ్చరించి తమదండపుఁగోలల నున్నమాఱుగోఁ
చులు వెసఁబుచ్చి వైచి కడుసొంపులుగాఁ బొగడించుకోఁజుమీ
తలపఁగ నిప్పు డింత తెగుదారులమైతిమి భద్ర! నావుతుల్."

"వ. ఇవ్విధంబున నాత్మీయవిద్య మాయాప్రపంచసముదంచిత నాట్యవంచితులం గావించి నర్తంచరుల ధనచయంబు నూఁచముట్టుగాఁ దోఁచుకొనుచుం జూచు ఖేచరులకు వేడ్కఁబుట్టించి,"

అని రెండుస్థలములయందునుగూడ వారుయాచించి ధనముల సంపాదించెడివారని యొక్కమాదిరినే ప్రభావతీప్రద్యుమ్నమున వర్ణింపఁబడియున్నది. అప్పటి కది బాహాటముగా జరుగుచుండినదైననే కాని యట్లు వ్రాయుట సంభవింపదు.

ఈనటులు వృత్తులు సంపాదించుకొని వానినే యాధారముగ జీవించుచున్నట్లు వారివారికిఁ బుట్టినమాన్యములవలనఁ దెలియుచున్నది. కూచిపూడి

స్తావనతో ముఖాదు లగుసంధులు సాంగతఁ జెందుప్రబాంధ
గావతరాది నాటకములాదిగ ననేకము లప్పుడుంబునా.
సీ. ఆనాటక ప్రయోగావసరముల భగీరథాద్యాకారధారణమును
గంగాదినిమ్నగాగతియుఁ గైలాసాదిసకల్పనమును నానావన ప్ర
పంచనంబును బహుపక్షిమృగాదిజంతువిశేషరూపప్రవృత్తులు సు మకెను
నెచటి కెయ్యది యో ప్యనుచటఁ దత్తద్వస్తుసృష్టిపన్ని దము వేసియుచుక్కృతక
మగుట నిశ్చయింపఁగలేక యబ్బపడుచుఁ
జూచి సామాజికులు తమసొమ్ము లెల్ల
నొసఁగులుగ వైవ నగుపుచు నొప్పుమీరె
రుక్మిణీసుతుండు మాయానిరూఢి మెఱసి"
వల్లభామాత్యుని క్రీడాభిరామమునందుఁగూడ నీక్రిందిపద్యమున నాటక ప్రసంగమున్నది.
"ఝషధ్వజభుజపరాక్రమసముత్సాహనాటక ప్రస్తావనా ప్రథమనాందీ శ్లోకము వేశ్యవాటికాసికటంబు"
"లెస్సగాక కిరాట యీలేమచరిత
మాడుదురు నాటకంబుగ నవనిలోన
దీనిజూడఁగఁ బోదమా యానెపమున"

* * * * * *

ఇందుఁ గడపటిపద్యమునందలి ప్రథమచరణ మాచరణమునందుఁ గలయు పమ యని చెప్పినఁ జెప్పవచ్చును. కాని రెండవది యట్లు చెప్పుట సముంజసము గాదు. అందుఁ బరిభాషాపదములు లేవు పరిభాషాపదములు లక్షణగ్రంథములుండి నఁగాని కలుగవు. లక్ష్యగ్రంథములు లేక లక్షణగ్రంథములు రావు లక్ష్యగ్రంథ ములు లేవు గనుక యయ్యవి సంస్కృతమునుండి గైకొన్నవి యేయని చెప్పవలెను.

ఈ రెండవపద్యమునుబట్టి నాటకములప్పటికి నున్నట్లు యోచింపవచ్చుం గాని యయ్యవి సంస్కృతనాటకములవంటి నాటకములని చెప్పనాధారము కనఁ బడదు. మనదేశమునందుండు వీథినాటకములవంటి నాటకమనిన యెడల ప్రత్యవాయ మేమియును గనుపట్టదు.

ఇంకఁ బ్రభావతీప్రద్యుమ్నములోని పద్యములయందలి వర్ణనలను గుఱించి చర్చింపవలయు. ఆపద్యములోని వర్ణనలు కవికాలమునాఁటి స్థితి యగునో కాదో యని సంశయింపవలసియున్నది. అప్పటికి దేశమున నట్టినాటకములు ప్రాంతముగ

నాడఁబడుచునే యున్న యెడల వానిజాడ లైన నిప్పటివఱకు నిలిచి యుండ వనుమాట యసంగతము. ఆటలు లేక యున్నను, నావిధ మగునాటలవృత్తాంత మైనను గ్రంథములయందైన నుదాహరింపఁబడక యుండదు. అట్టిగ్రంథములు లేవనుట స్పష్టము. ఇంక నీపద్యములలోని యంశము లెట్లు సమర్థనీయము లగుఁగా ? కవి పూర్వకాలమునాఁటి వజ్రనాభునికొలువు వర్ణించుచున్నాఁడు. ఆతఁడు వర్ణించిన వర్ణనలన్నియు సంస్కృతవాఙ్మయమునుండి కయికొనఁబడినవి.

"శా. కాణాదంబును గౌతమీయమును సాంఖ్యంబున్ భుజంగాగ్రణీ
వాణీమార్గము జైమినీయమతమున్ వ్యాసోక్తశాస్త్రంబు వ
క్కాణించెం గడుఁబూర్వపక్షములు జోకం బెంచుచు న్పెంచి య
క్షీణప్రౌఢిఁ దిరస్కరించుచుఁ దుదన్ సిద్ధాంతము ల్నిల్పుచున్."

అనుపద్యమునుబట్టి యందువివరింపఁబడిన శాస్త్రము లన్నియును సంస్కృతమునం గలశాస్త్రములు గాని తెలుఁగుభాషను గలశాస్త్రములు కా వని తెలియుచున్నది. అట్టి శాస్త్రము లెవ్వియును దెనుఁగున లేవు కదా? అట్లే యిందు వర్ణింపఁబడిన నాటకలక్షణంబులు రంగస్థలకల్పనలును, సంస్కృతము నందలివి. ఉన్నట్లు కల్పించి వర్ణించినాఁడే కాని యప్పు డుండుటంజేసి వర్ణించినవి కా వని యెంచవలయును. కథా సందర్భకాల మప్పటి కాలము కాకపోవుట మనయీయోచన యసంగత మైనది కాదు. అంతియకాని యీపద్యములయందలి రంగస్థలవర్ణనలనుబట్టి నాటకము లాకాలమున నిప్పు డున్న రీతిని దెనుఁగున నాడఁబడునట్లు లెంచ నవకాశము లేదు.

సూరన పైపద్యములలోఁ జెప్పిన నాటకరంగములవంటి రంగము లేర్పఱిచి తెరలు కట్టి యాడుట మనదేశమునఁ గేవలము నూతనము గాని పురాతనము కాదు. అంతకుఁ బూర్వము నుండెడివి యక్షగానములు. ఈయక్షగానము లేమియో యాపేరు వాని కెట్లువచ్చెనో యింక నది విచారింపవలసి యున్నది. వల్లభామాత్యుని క్రీడాభిరామమున నంత్యజాతులలోని "జక్కులవాం"డ్రను నొక తెగ యిట్టియాటపాటలలోఁ బ్రవీణు లైన ట్లీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

"సీ. కోణాగ్రసంఘర్ష ఘుమఘుమధ్వనితార కంఠస్వరంబుతో గారవింప
మసిబొట్టుబోనాన నసలుకొల్పినకన్ను కొడుపుచేఁ దాటించు నెడపఁదడప
శ్రుతికి నుత్కర్షంబుఁ జూపంగవలయుచోఁ జెవిద్రాడుబిగియించు జీవగఱ్ఱ
గిల్కుగిల్కునమ్రోయు కింకిణీగుచ్ఛంబు తాళమానంబుతో మేళవింప

తే. గీ. రాగముననుండి లంఘించు-రాగమునకు
నురుమయూరద్వయంబుపై-నొ త్రిగిల్లి
కామవల్లీమహాలక్ష్మి-కైటభారి
వలపువాడుచువచ్చెజ-క్కులపురంధ్రి ॥

ఈజక్కులవాండ్రను గీర్తిశేషులైన గురుజాడ శ్రీరామమూర్తి పంతుల వారు తమకవిజీవితములలో భోగినీశాఖలోనివా రని చెప్పియున్నారు. ఇం దాండనాండ్రాటల నాడినట్లు దానివెనుకపద్యమునఁ దెలియుచున్నది. ఆడినది యేఁడువాండ్రా మగవారా యనుదానితో మన కిపుడు ప్రసక్తి లేదు గాని యీ జక్కులవాండ్రకును యక్షగానమునకును సంబంధ మేమని విచారింపవల యును. ఈక్రిందివాక్యమువలన నల్లభామాత్యుఁ డీజక్కులకే యక్షకన్య లను పదముపర్యాయపదముగా నుపయోగించినట్లు గనఁబడుచున్నది.

"ఇదె యీయింటి యజమానుండు సంతానకాంక్షియై ప్రతిబాధనార్థంబు యక్షకన్యలం బరితోషారాధనము సేయుచున్నవాఁడు కావలయు"

పైన వర్ణించిన యాటపాటలే యివి. ప్రక్రమమునుబట్టి యీజక్కులే యక్షకన్య లనవలయుం గాని వేఱొండు గాదు. దీనింబట్టి యీ తెగవా రప్పుడాడెడి యాటపాటలకై వ్రాయఁబడిన నాటకము లగుటంజేసి వానికి యక్షగానము లని పేరువచ్చినది. ఆయక్షగానము లెప్పుడు బయలుదేఱినదియును నిశ్చయమైన కాలము మనకుఁ దెలియదు.

ఈనడుమ నాంధ్రసాహిత్యపరిషత్తువా రఱవదేశములోఁ గొన్ని యము ద్రితగ్రంథములు సంపాదించినారు. అందు గోపాలవిలాసము, రంగపురిపారిజాత నాటకము, తారాశశాంకనాటకము, సీతాకల్యాణము, ఎఱుకలకొఱవంజి నాటకము, పార్వతీకల్యాణము, సుందరకాండనాటకము, సుగ్రీవవిజయము, మున్నగుయక్షగానములు దొరకినట్లువ్రాసినారు. ఆగ్రంథములు చదివి చూచుటకు నాకింకను నవకాశము కలుగలేదు. గ్రంథము లఱవదేశములో నుండుటంబట్టి యు నఱవదేశములో నున్న తెలుఁగువారు చిరకాలము క్రిందట నాంధ్రనాయకు లాదేశమునకు దండయాత్రలకుఁ బోయి యచ్చట రాజ్యములు స్థాపించినపు డచ్చట స్థాపనమైనవార లయి యుండుటచేతను నాకాలము 14,15 శతాబ్దములై యుండుటచేతను నయ్యవి యప్పటినుండి వ్రాయఁబడినగ్రంథము లని చెప్పవలసియున్నది.

పదునైదవశతాబ్దము ప్రారంభమునకుఁ బూర్వమే యున్నట్లు మాత్రము చెప్పవచ్చును.

ఇప్పటినాటకములు మనదేశమునం దారంభమెప్పుడు? అనునది విమర్శ విషయము. బొంబయిరాజధానిలో ధార్వాడ యనునొక పట్టనమున్నది. ఆ పట్టనముచేర నచ్చట బయలుదేఱిన మహారాష్ట్రనాటకసమాజ మొకటి 1880 సంవత్సరప్రాంతమున మనదేశమునకు వచ్చి నాటకశాలలను నిర్మించి రంగస్థలము లేర్పఱచి సంస్కృతనాటకములలోఁ జెప్పఁబడిన మాదిరి నాడుటకుఁ బ్రారంభించిరి. ఆకాల మిప్పుడు నడివయస్సులోనివారి కందఱకును గనులఁగట్టినట్లు కనుపడుచుండును. వా రాడిన యాటలమాదిరివి మనదేశమున లేకపోవుటచే నట్టినాటకముల నాడవలె ననుకుతూహలము మనదేశస్థులకుఁ గలిగినది. ఈబుద్ధి మొదట గుంటూరువాస్తవ్యులకుఁ గలిగినట్లును ధార్వాడ సమాజమువారు తమదేశమునకు మరలిన వెంటనే వారు వేసిననాటకశాలలోనే వీరుబయలుదేఱి నాటకములు వేసినట్లును బ్రహ్మశ్రీ వడ్డాది సుబ్బారాయఁడుగారు మున్నగు పెద్దలు చెప్పుచున్నారు. వారుకూడఁ దొలుదొల్త, మనమండలమున నాటకసమాజము లేర్పఱచుటలోఁ గృషిచేసినవార లగుటచేతను వారు తెలుఁగుభాషకుఁ గొన్ని నాటకములు వ్రాసియిచ్చుటచేతను వారివాక్యము మనకాదరణీయము. అప్పటికి నాటకము లేమియు రచనకాలేదు. కనుక నాటకములు రచియింపఁబడినవెనుక సమాజము లేర్పడినట్లు చెప్పనొప్పదు. సమాజము లేర్పడి నాటకములు వ్రాయించికొని రనుట స్పష్టము. ఆగుంటూరిసమాజమువారు బయలుదేఱిన వెనుక ప్రతిపట్టనమునకు నొక్కొటిచొప్పున నిప్పటికిఁ జాలపట్టనములలోను, పెద్దపల్లెలలోను గూడ నాటకసమాజములు చాల బయలుదేఱినవి. ఈ నాటకసమాజములకు మొదట స్థిరమైన నాటకమందిరములు లేవు గాని కాలక్రమమున నవియును బయలుదేఱినవి.

ఇంతవఱ కాంధ్రులకు నాటకాభిరుచి యున్నదా? ఉండిన వాని కాధారము లెవ్వి? అవి యెట్టివి? ఎప్పుడేమాదిరియాట లున్నవి? నాటకు లెట్టివారు? వారి సాంఘికస్థితి యెట్టిది? మున్నగు క్రియావిషయములంగూర్చి ముచ్చటించితిమి. ఇంక నాటకవాఙ్మయ మెట్టిదియో దానిని గూర్చి యోజింపవలయు.

నాటకవాఙ్మయమున మనకిప్పుడు గనఁబడుచున్న ప్రథమగ్రంథ మేది యని చూచినచో వల్లభామాత్యుని క్రీడాభిరామ మని చెప్పవలసియున్నది. ఈ

క్రీడాభిరామ మొకవీథినాటకము. వీథియనునది సంస్కృతమునందలి దశరూపక ములలో నొక్కటి. ఈవల్లభామాత్యుఁడును శ్రీనాథుఁడును సమకాలికులు; పదు నైదవశతాబ్దప్రారంభమున నున్నవారు. ఈక్రీడాభిరామనాటకమునందలి పద్య ములే కొన్ని శ్రీనాథుని వీథినాటకమునం దున్నవి. ఆకారణముచేత ఈవీథి శ్రీ నాథునివీథినాటకమే యనియును నిప్పుడు శ్రీనాథునివీథినాటక మనుగ్రంథ మాత నిపేరఁ గల్పిత మనియు నీగ్రంథమును బ్రకటించిన మానవల్లి-రామకృష్ణయ్య (M. A.) గారి యభిప్రాయమై యున్నది. ఈరెండును రెండుగ్రంథములా యొక్కటే గ్రంథమా యనువిషయమును నిర్ధారణ చేయుట కందున్నపద్యము లిందుంకు టొక్కటియే యాధారముగాని మఱియొక్క యాధార మేమియుఁ గనుపట్టదు. ఏది యెట్లున్నను బదునేనవశతాబ్దప్రారంభమునకుఁ బూర్వ మిట్టినాటకము లున్నట్లు చెప్పుట కాధారము లేమియు లేవు. ఈక్రీడాభిరామములో వేశ్యవాటికయం దుఁ బల్నాటివీరునిచరిత్ర ద్విపద ప్రబంధముగా నాడఁబడినట్లు చెప్పియున్నాఁడు. ఈద్విపదప్రబంధ మనునది యింగ్లీషులోని "Ballad poetry" వంటిది. అది పాడి దాని కనురూపముగ నాడి యొక వేశ్య తనచుట్టుపట్టుల నున్నవారి నంగఱి నా నందపెట్టె నని యీక్రిందిపద్యమువలనఁ దెలియఁదగి యున్నది.

"మ. ద్రుతతాళంబున వీరగుంభితకథుంధుంధుంకిటాత్కారసం
గతివాయించుచు నాంతరాళికయతిగ్రామాభిరామంబుగా
యతిగూడం ద్విపదప్రబంధమున వీరానీకముం బాడె నొ
క్కత ప్రత్యేకముగాఁగుమారకులు ఫీట్కారంబునం దూలఁగన్."

కాని మఱియితరనాటకము లేమియు నున్నట్టు లాతఁడు చెప్పలేదు. ఈ క్రీడాభిరామ మైనను స్వకపోలకల్పిత మైనట్టు వ్రాయఁడు. రావిపాటి త్రిపురాంత కుఁడు వ్రాసిన "ప్రేమాభిరామము" ననుసరించి వ్రాసినట్లు గ్రంథాదిని సూత్రధార సంభాషణను వ్రాసినాఁడు. ఈరావిపాటి త్రిపురాంతకుఁడే రావిపాటి తిప్పరాజు. ఈప్రేమాభిరామమునకుఁ గ్రీడాభిరామము తెనుఁగైన ట్లూహించుటకు గ్రంథ మునందుఁ గొన్ని యవకాశము లున్నవిగాని యీగ్రంథమును బ్రకటించిన బ్రహ్మ శ్రీ మానవల్లిరామకృష్ణయ్యగారి వ్రాఁతలే మనకుఁ బ్రమాణము లైనచో రావి పాటి తిప్పరాజు సంస్కృతకవి యైనట్టు కనుపట్టదు. తిప్పరాజు వ్రాసిన మదనవిజ యము, త్రిపురాంతకోదాహరణము ననుగ్రంథములు తెనుఁగుగ్రంథము లనియు వానిందాము చూచితి మనియును రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు. గ్రంథ

మున వర్ణించిన యీక్రింది కవివర్ణనమున నీతిప్పరాజు తెలుఁగుకవి యైనట్టు మాత్రమే మన మూహించుట కవకాశము కలదు.

"నన్నయభట్టు తిక్కకవినాయకులన్న హుళిక్కిభాస్కరుం
డన్నను జిమ్మపూడి యమరాధిపుఁడన్నను సత్కవీశ్వరుల్
వెన్నుదుటం గరాంజలులు నింతలుఁజేయని రావిపాటి తి
ప్పన్నయు నంతవాఁడ తగునా యిటుఁ దోసపుమాట లాడఁగన్."

"ప్రేమాభిరామంబు ననుసరించి క్రీడాభిరామం బనురూపకంబు తెనుఁగుఁ జేసె" ననువాక్యమునకుఁ బ్రేమాభిరామమునకేఁ గ్రీడాభిరామము చెప్పఁబడినది యని యర్థముఁ జెప్పవలెను. కాని దానిభాషాంతరీకరణ మనిచెప్ప నవసరము లేదు. ఈవిషయము గ్రంథమున స్పష్టపడుటలేదు. సందిగ్ధముగ నున్నది. ప్రేమాభిరామమునకుఁ గ్రీడాభిరామము భాషాంతరీకరణమే యైనయెడల నందు వర్ణించిన దేశ మాంధ్రదేశమే కావలయు. దాదాపు సమకాలికుని గ్రంథము భాషాంతరీకరింపఁబడి యుండవలయు. ఈతిప్పన్న యప్పటికిఁ బ్రఖ్యాతిగ నెంచఁబడువాఁడైన నైనట్టు కనుపట్టదు. ఈక్రిందిపద్యము దాని కాధారము.

"గీ. ఆతఁ డెంతటివాఁడు ప్రే-మాభిరామ
మనఁగ నెంతటియది దాని-ననుసరించి
వీథి యనురూపకము మది-వెఱపులేక
తిప్పవిభువల్లభుం డెట్లు-తెనుఁగుచేసె."

ఆంధ్రదేశమును వర్ణించిన గ్రంథము సంస్కృతగ్రంథ మనుకొనుటకంటె దీనిఁ యాంధ్రగ్రంథ మనుకొనుటయే యనువుగ నుండునేమో? ఇది యనుసరణమై యుండవచ్చును. నాయూహయే యథార్థ మయ్యెనేని గ్రీడాభిరామమునకుఁ బూర్వము ప్రేమాభిరామ మనునాటకముగూడ మఱియొక్కటి యుండును.

వీథి సంస్కృతములోని రూపకభేద మగుటచేఁ దెనుఁగున వ్రాయఁబడిన యీక్రీడాభిరామము సంస్కృతనాటక మార్గవర్తియే యగును గాని స్వతంత్ర గ్రంథము కాదు. ఈవీథిలో రెండుపాత్రములు మాత్రమే కలవు. దీనితరువాత "రంగకౌముది" యనునొకనాటకము నెలకూచిబాలసరస్వతి యనునాతఁడు వ్రాసినట్లు "కవిసమీహితరంగకౌముదీ నామనాటకవిధాన ప్రతిష్ఠాఘనుండ" నని తన యాదవరాఘవపాండవీయమున వ్రాసికొనినాఁడు.

ఈనాటక మెట్టిదియో తెలిసికొనుటకు గ్రంథ మింతవఱకు నెచ్చటను దొరకలేదు. బాలసరస్వతి పదునాఱవశతాబ్దాంత్యభాగమునను బదునేడవశతాబ్ది ప్రారంభమునను నున్నవాఁడు. ఈగ్రంథములకు వినాగ నాధునికములు గాని నాటకములు మఱి యెవ్వియును గానరావు. ఆధునికములలోఁ జాలనాటకములు సంస్కృతనాటకముల ననుసరించియే వచ్చినవి. కొన్ని సంస్కృతమునకు సరియైన తెనుఁగులు; కొన్ని సంస్కృతలక్షణము ననుసరించి వ్రాయఁబడినవి. ఇంగ్లీషు నుండి భాషాంతరీకరణములు కొన్ని, వానియనుసరణములు కొన్ని, స్వతంత్రములు కొన్ని. ఇందు మొట్టమొదట వ్రాయఁబడినవి సంస్కృతమునుండి భాషాంతరీకరణములు. అందు మొదలిది "(కావ్యేషు నాటకారవ్యా నాటకేషు శకుంతలా)" నాటకములలో జగత్ప్రఖ్యాతిఁగన్న శాకుంతలము. ఈశాకుంతలమునకైదాఱుభాషాంతరీకరణము లున్నవి. ఇందు మొట్టమొదట వ్రాసిన దెవ్వరియో యోజించిచూడవలయు. మహామహోపాధ్యాయ శ్రీపరవస్తు రంగాచార్యులు వారు మొట్టమొదటఁ గొంతమట్టు కీనాటకముం దెనిఁగించి విడిచిరి. అది యపరిసమాప్తము. రాయబహద్దరు కం. వీరేశలింగముపంతులవారు రచియించినది పూర్తియైనవానిలో మొదటిది. అపరిసమాప్త మగురంగాచార్యులుగారి శాకుంతలమునకుఁ దరువాత వెలువడినది మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులవారి నరకాసురవిజయవ్యాయోగము. ఈ రెండును నయినతరువాతఁ దక్కిననాటకము లన్నియును బయలుదేఱినవి. ఇప్పటికి సంస్కృతమందలి ప్రసిద్ధమైననాటకము లన్నియుఁ దెనిఁగింపఁబడినవి. తెనిఁగింపఁబడిన ప్రసిద్ధనాటకములలో సర్వసామాన్యమై జనసామాన్యమున వ్యాప్తమైనది బ్రహ్మశ్రీవడ్డాదిసుబ్బరాయకవికృత వేణీసంహారము.

తెనుఁగున రచింపఁబడిన సంస్కృతములోని ప్రసిద్ధనాటకములు శాకుంతలము, విక్రమోర్వశీయము, మాళవికాగ్నిమిత్రము, ఉత్తరరామచరిత్ర, మహావీరచరిత్ర, మాలతీమాధవము, మృచ్ఛకటికము, ముద్రారాక్షసము, నాగానందము,రత్నావళి, ప్రియదర్శిక,అనర్ఘరాఘవము(మురారి), ప్రసన్నరాఘవము. ఇవి గాక సంస్కృతమునం గలనాటకములలో నేమాత్రము పేరుగల నాటకములైనను దెనుఁగునకు వచ్చినవి. ఇప్పటికి సంస్కృతమునందలి దశరూపకభేదములలో నేవియో యొకటిరెండువినా తక్కినవన్నియును దెనుఁగైనవి. ఉపరూపకములు గూడఁ గొన్ని తెలుఁగైనవి. దొరకుటయే తడవుగ నింకను దెనుఁ

గగుచున్నవి. సంస్కృతమునకును దెనుఁగునకును జాలచేరువ యగుటచేతను, దెలుఁగునందు లక్షణగ్రంథము లన్నియును సంస్కృతమునుండియే కైకొనంబడియుండుటచేతను, దెలుఁగుభాషలో ముప్పాతికపాలు సంస్కృతసమములే శబ్దములై యుండుటచేతను, నాచారవ్యవహారములు దేశమునకు భిన్నములు గాకుండుటచే మార్పు లేవియును నవసరములు గాకుండుటచేతను, దెలుఁగులయం దభిరుచిగలవారు సంస్కృతమునందుఁ దప్ప విశేషించి మఱియితరభాషలయందుఁ బాండితి లేనివా రగుటచేతను సంస్కృతనాటకములే ముందు తెలుఁగైనవి.

సంస్కృతరూపకములలోఁ బ్రహసన మొకరూపకభేదముగఁ జెప్పఁబడినది. అయ్యది సంగీతసాహిత్యవిరహిత మగుటచే నుత్తమమైన రూపకముగాఁ జెప్పుటకు వలనుగాకపోయినను జనబాహుళ్యమునకు మిక్కిలిగ ననుకూలించి వారి యాదరణకుఁ బాత్రంబగుటచేత నదికూడ నొకరూపకముగాఁ గైకొనంబడినది. మన తెనుఁగున స్వతంత్రముగా వ్రాయఁబడిన నాటకరూపకములలోఁ బ్రహసనములే మొట్టమొదటి వని చెప్పవచ్చును. శ్రీవీరేశలింగముపంతులవారు సంఘమునందలి లోటుపాటులఁ జూపుటకై ప్రస్తుతవిషయములనే కథారూపముగ మార్చి ప్రహసనమునకుఁ బ్రధానాంగమైనహాస్యరసమును జక్కఁగఁ బోషించి ప్రహసనములఁ బెక్కింటిని రచియించియున్నవారు. పిమ్మటఁ గొందఱు కవులు వానిమార్గము ననుసరించి ప్రహసనములుగొన్నింటి రచియించియున్నవారు గాని యవియెవ్వియును వీరేశలింగముపంతులవారి ప్రహసనములవలె స్వారస్యముగ లేవు. ఈప్రహసనములు పంతులవారు 1880 ప్రాంతముననే వ్రాయమొదలుపెట్టి మొన్నమొన్న వఱకును వ్రాయుచునేయున్నవారు. వారు రచియించిన గ్రంథములలో వాఙ్మయచరిత్రమున వారికి గ్రంథకర్త యనుపేరు నిలుపుటకాధారభూతములైన వీయొక్క ప్రహసనములే.

స్వతంత్రనాటకములుగూడ నెన్నియో బయలుదేఱినవి. ఈనాటకముల వ్రాఁత యంతయును నాటకసమాజములు బయలుదేఱినతరువాత నాసమాజములపోషణకై ప్రారంభమైనది. నాటకసమాజములు బయలుదేఱుటకు ముందు నాటకములు లేకపోవుటయే దానికుదాహరణము. ముందాటలకుఁ బ్రారంభించినది, గుంటూరిసమాజ మని ముందే చెప్పియుంటిమి. దానివెనుకఁ గ్రమక్రమముగ నొక్కొక్కటిచొప్పున బయలుదేఱినవి. వీని కొక్కటికిని నాడుకొనుటకు నాటకములులేవు. తెనుఁగునకు వచ్చినవి సంస్కృతమునం దుండెడినాటకములు.

ఈసంస్కృతనాటకములు మిక్కిలి ప్రౌఢములైనవి. ఆనాటకములు రసజ్ఞులగు విద్యావంతులకే గాని తదితరుల కందలిస్వారస్యము తెలియుటకుఁగాని నాటకప్రదర్శనమువల్ల జనసామాన్యమున కానందము గలుగుటకుఁ గాని యవకాశము లేదు. ఈసంస్కృతనాటకములు వ్రాయఁబడిననాఁటైనను నయ్యవి పండితుల కొఱకే గాని పామరులకొఱకు వ్రాయఁబడినవి కావని "విల్సన"ను నాంగ్లేయ గ్రంథకర్త యీక్రిందివాక్యములలోఁ దన "Theatre of the Hindoos" గ్రంథమునఁ (1 వా. 13 పేజీలోఁ) జెప్పియున్నాఁడు.

"They must, therefore, have been unintelligible to a considerable portion of their audiences, and never could have been so directly addressed to the bulk of the population as to have exercised much influence upon their passions or their tastes."

అందుమూలమున జనసామాన్యమున కనుకూలించునట్లును పామరుల హృదయమున కెక్కునట్లును నాటకములు వ్రాయవలసివచ్చెను. నాటకమునందలి కథ తెలిసినంగదా జనులు నాటకమున కెక్కుడుగ వచ్చుట. అందువిషయములు జనసామాన్యమునకు సుబోధముగా నుండిన సమాజమునకు లాభము. ఆకారణముచేఁ బామరజనగ్రాహ్యము లగుకథలను గైకొని యెచ్చటబయలుదేఱినసమాజము లచ్చటఁ బద్యమల్లఁగలవారి నెల్లఁ బట్టికొని వేధించి స్వతంత్రనాటకములను వ్రాయించికొనిరి. ఇట్లు సమాజమున కొకనాటకకర్త బయలుదేఱి సమాజములోని సామాజికులనుబట్టి తననాటకములను వ్రాయుచు నుండెడివాఁడు. అప్పటినాటకములయందు సంగీతము విశేషముగ లేదు. మహమ్మదీయదండయాత్రలు విశేషముగ జరుగుటచేతనో యేమో కాని తెనుఁగుదేశమునఁగొన్నివందలవత్సరములనుండి సంగీతవిద్య బొత్తిగాఁ దగ్గిపోయినది. ఆదినములలోఁ బద్యములు ధారాళముగఁ జదువఁగలిగిన సామాజికులు దొరకుటయే కష్టము. ఆకారణముచే నప్పుడు బయలుదేఱిన నాటకములలో వచననాటకములే యెక్కువ. మొదట బయలుదేఱిన సమాజము గుంటూరునాటకసమాజమగుటచే నాసమాజమునకు మొదటనాటకములు వ్రాసియిచ్చినకవి మొట్టమొదట స్వతంత్రనాటకములు వ్రాసినకవి యని చెప్పవలయును. గుంటూరువాస్తవ్యు లగు బ్రహ్మశ్రీ కొండుభట్ల సుబ్రహ్మణ్యశాస్త్రులవా రానాటకసమాజమునకు నాటకములు వ్రాసియిచ్చినవా రని బ్రహ్మశ్రీ వడ్డాదిసుబ్బారాయకవిగారివలనఁ దెలిసికొంటిని. కావునఁ

తెలుఁగున మొట్టమొదట స్వతంత్రనాటకములు వ్రాసినకవి యీసుబ్రహ్మణ్యకవి యని చెప్పవచ్చును. ఆయన యప్పుడు వ్రాసిననాటకము లేవియు నచ్చునఁ గానంబడుటలేదు. ద్రౌపదీవస్త్రాపహరణముమాత్ర మున్నది. అది చాలకాలమైనతరువాత నచ్చుపడినది. అది మొట్టమొదట వ్రాసిననాటకములలోనిదియో మఱియొక్కటియో తెలియదు. నాటకముమాత్రము రసవంతముగా లేదు.

ఇట్లే తరువాత బయలుదేఱిన నాటకసమాజములకును నాటకములు వ్రాయుకవులు కొందఱేర్పడిరి. కాకినాడసమాజమునకు బ్ర. జయంతిభావనారాయణగారు, రాజమహేంద్రవరమునకు బ్ర. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, బందరుసమాజమునకు బ్ర. దాసునారాయణరావుగారు, బళ్లారికి శ్రీ. ధర్మవరము రామకృష్ణమాచార్యులవారు, పీఠికాపురమునకు బ్ర. పానుగంటిలక్ష్మీనరసింహరావుపంతులవారు, అంబాజపేటకు బ్ర. కురుమద్దాల శేషయ్యగారు మున్నగువారు నియతకవులై నాటకములు వ్రాసియిచ్చిరి.

ఆకంపెనీలవారు సామాన్యముగ వారి నియతకవులు రచియించిననాటకములే యాడుచుండెడివారు. పైవారి వెవ్వరివైనఁ గొన్ని యాడిన నాడియుందురు. కాని యవి సకృత్తు. ఈసమాజములలో సంస్కృతమునుండి భాషాంతరీకరింపఁబడిన నాటకము లాడినవారు కడుస్వల్పము. ఇటీవల నొక్క వేణీసంహారముమాత్రము బహుజనసమాదరణీయమై బాహాటముగాఁ బ్రయోగింపఁబడుచున్నది. గుంటూరివారికిని బళ్లారివారికిని సంగీతమునం దభిరుచి హెచ్చు. అందుచేత నచ్చటినాటకములయందు మొదటనుండియును బాటలుఁ బద్యములుఁ గూడఁ బ్రయోగింపఁబడుచు వచ్చినవి. గోదావరిజిల్లాసమాజములయందుఁ గీర్తనలు లేవు. అప్పు డొకసమాజము నాటకము లొకసమాజమున కిచ్చువాడుక లేదు. ఇచ్చిన మొదటికంపెనీవారిలబ్ధి పోవు ననుకొనుటయే దానికిఁ గారణము. ఆనాటకములన్నియును నచ్చునకు రాకుండుటకును గారణ మదియె. అచ్చైన నాటకము లన్ని కంపెనీలవారును నాడుకొనుటకు మొదలుపెట్టిరి. ఈయచ్చుపడుట ప్రారంభమై యాటలు ప్రారంభమైనవెనుక నేనాటకము జనసామాన్యమున కింపుగనుండునో యది నిర్ధారణమైన వానికి వ్యాప్తి హెచ్చినది. నాటక మెంతమంచిది యైనను నాడిననాటకము గాని వ్యాప్తిలోనికి వచ్చుట లేదు. అందుమూలమున మొదట కంపెనీలవారు కవులను బట్టికొని నాటకములు వ్రాయించుకొనుకాలము మాఱి

కవులు కంపెనీలవారి నాశ్రయించుకాలము వచ్చినది. ఏవియో యొకటిరెంటికివినా తక్కినవానికిఁ గథనుబట్టియును, గవిని బట్టియును, వ్యాప్తివచ్చినది. గాని నాటకశాస్త్రమునుబట్టి రాలేదు. పునహానాటకసమాజము వారు మిక్కిలి చక్కఁగా నాడిన చంద్రకాంత మున్నగు నాటకములు కొన్ని తెనుఁగున సుప్రసిద్ధకవు లెవ్వరును వ్రాసినవి కాకపోయినను గథ యంతస్వారస్యమైనది కాకయున్నను నెవఁడో తడికెనో యొకదానిని బట్టుకొని దానికిఁ బాటలుఁ బద్యములుఁ గొన్ని చేర్చి పామరజనప్రీతియగునట్లాడుచున్నారు. దానికి వ్యాప్తికూడ నున్నది. కేవలజనసామాన్యమునఁగల వ్యాప్తినిబట్టి గ్రంథగుణాగుణములను నిర్ణయింప వలనుపడదు. వ్యాప్తిగాంచిన నాటకములైన లెక్కకెక్కువగ లేవు. ఇప్పటికిఁ దెనుఁగుదేశమున నంతటను నాడంబడు నాటకములు లెక్కపెట్టిచూచినఁ బదియో పదునైదో యుండును. తఱచుగ నాడఁబడుచుండుటచే నవియు భాగవతముల మాదిరినైనవి. సామాన్యముగ నన్నియును బురాణగాథలే. క్రొత్తగ నాడఁబడు నాటకము పురాణగాథయైనఁ గావలెను. లేక ప్రసిద్ధిఁజెందిన సమాజమువా రాడునదైన నాడవలయు. లేకున్న దానికిఁ బ్రేక్షకులు వచ్చుటలేదు. వ్యాప్తియును లేదు. చరిత్రాత్మకములుగాని, చిత్రకథాత్మకములు గాని, సాంఘికమతవిషయకములు గాని నాటకములు పెక్కులుబయలుదేఱలేదు. వ్రాసినకథలే మరల మరలఁ దలలుమార్చి వ్రాయుచున్నారు.

బ్రిటన్ దేశమున మొట్టమొదట మతసంబంధమైన కథలుమాత్రమే నాటకములుగ నాడుచుండెడివారు. తరువాతఁ దరువాత నాకథలు మాఱి గ్రీసునాటకములవంటి నాటకముల వ్రాఁత ప్రారంభమై క్రమక్రమముగ "ఎలిజబెత్తు" రాణీకాలమునాఁటికి "బెన్ జాన్సన్" "షేక్స్పియర్" వంటిమహానాటకవేత్తలు బయలుదేఱి తమకన్న దేశమునకును నాటకప్రపంచకమునకును వన్నెఁ దెచ్చిరి. మన దేశమునందు నాటకములు కేవలవినోదముల కని మాత్రము బయలుదేఱినవి. అప్పటి కిప్పటికి నొక్కమాదిరి వినోదములుగనే నిల్చిపోయినవి. ఇప్పటికి నాటకము లన్నియును జూచిచూచి విసికినవే యవుటచేతఁ గ్రొత్తనాటకము లన్నఁ బ్రజలకభిరుచి హెచ్చగుచున్నది. చరిత్రాత్మక మగునాటలయం దిప్పు డిప్పు డభిలాష పొడముచున్నది. ఈయభిరుచికిఁ గారణము దేశమునందు బయలుదేఱిన జాత్యభ్యుదయమే. ఈనూతనోజ్జీవము ప్రారంభమైన వెనుక చారిత్రాత్మకమగునాటకములు కొన్ని స్వల్పముగ బయలుదేఱినవి. కాళ్లకూరి సాంబశివ

వుగారి బొబ్బిలినాటకము, (రంగారాయకదనసమవాకారము) ఈజాత్యభ్యుదయమునకుఁ జాలకాలము పూర్వమే బయలుదేఱిన చరిత్రాత్మకమగు నాటకము. అదియే యీవిధ మగునాటకములలో మొదటి దని చెప్పవచ్చును. తరువాత బయలుదేఱినవానిలో దాసునారాయణరావుగారి "బుద్ధనాటకము" బాలాంత్రపు వేంకటరావు,చాగంటిశేషయ్యగారుల "సతీసంయుక్త", బాలాంత్రపు వేంకటరావుగారి "యాచశూరేంద్రవిజయము" అనునాటకములును, కోలాచలము శ్రీనివాసరావుగారి "విజయనగరరాజ్యవినాశము" మున్నగు కొన్నిగ్రంథములుమాత్రము కనుపట్టుచున్నవి. సాంఘికవిషయములను గూర్చి వ్రాసిననాటకములలో వల్లూరు బాపిరాజుగారి 'సుగుణమణి", పానుగంటిలక్ష్మీనరసింహారావు పంతులవారి "వృద్ధవివాహము", గురుజాడ అప్పారావుపంతులవారి "కన్యాశుల్కము", రెంటాల వేంకటసుబ్బారావుపంతులవారి "వరశుల్కము, లేక వాణీస్వయంవరము" అనునట్టివి నాలుగైదుమాత్రమేయున్నవి. ఇందు సర్వవిధములఁ బ్రశస్తమని చెప్పనొప్పినది "వరశుల్క"మని చదివినవారల కందఱకును దెలియకమానదు. ఇది ప్రహసనముమాదిరి వ్రాయఁబడినది. పాత్రౌచిత్యముఁ గనుంగొనినను, ప్రదర్శనానుకూల్యతఁ గనుంగొనినను, రంగవిభజన, సమయానుకూల్యత, ఉచితజ్ఞత మున్నగాఁగల గుణముల పరికించి చూచినచో నింతకన్న మిన్న యగునాటకము తెనుఁగున లే దని నొక్కి చెప్పంగలము. నరసింహారావు పంతులవారి "కోకిల"నాటకమున లోకవ్యవహారము వర్ణింపంబడినది. ఇతివృత్తము కేవలకల్పితము. ఇంక నిట్టివొకటిరెండునాటకము లుండిన నుండవచ్చును. అవి నాకంటఁబడినవి కాకుంటచే నిట్టి వట్టి వని చెప్పఁజాలను. ఇప్పుడు ప్రతిపిల్లవాఁడును నాలుగుఛందస్సుముక్కలు నేర్చుకొని పద్యము లల్లుట యలవడిన తోడుతనే నాటకములను వ్రాయఁ గడంగుచున్నాఁడు. నాటక మనిన గద్యపద్యములు వ్రాయుటయే యని వీరియుద్దేశము. విమర్శకులు పద్యశైలి యెట్లున్నదియో చూచి గ్రంథమంతయుఁ బూర్తిగఁ జదువనైనఁ జదువకుండఁ దమయభిప్రాయముల నిచ్చుచున్నారు. నాటక మనిన నేమో దానిప్రధానాంగ మెద్దియో కథాసంవిధాన మెట్లున్నదో, యితివృత్తమును సందర్భశుద్ధియునున్నవియో లేవో గుణపోషణ మన నెట్టిదియో కాలానుకూల్యత, కార్యానుకూల్యత, స్థలానుకూల్యత యన నెట్టివో యుచితజ్ఞత యన నెట్టిదియో వానిలక్షణములును, నుండవలసినరీతులును

నటించినవారైన నెవ్వరును గానరాకున్నవారు. సంభాషణలలో వాదప్రతివాదములు పుష్టిగనుండిన నదియే మేలైననాటకమని యెంచుచున్నారు. ఛలోక్తి, వక్రోక్తి, హాస్యవచనము, భావప్రౌఢిమ, యన నెట్టివియో వానివానికిఁ గలభేదము లెట్టివో పాటించువారు లేరు. పాత్రౌచిత్యము నాటకమునకుఁ బ్రధానాంశము. అయ్యది యాదర్శముగా నిడుకొని నాటకములు విమర్శింపవలసివచ్చినచో నిప్పుడున్న నాటకములలో నైదారు వినా తక్కిననాటకము లన్నియును వెనుకకుఁ ద్రోయవలసినవిగనే కనుపట్టుచున్నవి. ఆడినమాట తప్పకుండుటకై యాలినమ్ముడుపోయిన హరిశ్చంద్రునకు బ్రాహ్మణద్వేషము, ప్రహ్లాదనాటకమున సంఘసంస్కరణము, రుక్మిణీసత్యభామలకు సవతులకయ్యము, నరనారాయణావతారులగుకృష్ణార్జునులకుఁ బ్రాకృతజనులమాదిరి వాక్కలహము, భారతవీరులకు ముచ్చెదెబ్బలు, ఇంద్రసభలో నాయుబుగారికి సోమయాజులుగారికి గ్రుద్దులాట, యిట్టివి కొందఱ ప్రసిద్ధనాటకములలోని పాత్రౌచితి. పురాణనాటకముల విధవావివాహప్రశంసయా? అయ్యది లోకమునకు బోధింపనెంచిన మతియొక కల్పిత కథ వ్రాయరాదా? నాటకములలోని నాయకునిచర్య లన్నియును గవికిఁగల యుద్దేశమును బట్టియేనా యేర్పడవలసినది. పాత్రము లేకాలములోనివి? ఆకాలమునాఁటిసాంఘికాచారము లెట్టివి? వారియుద్దేశము లెట్టివి? యోజించి వానికిఁ దగిన గుణపోషణము చేసి నాటకము రచియింపవలదా? నాటకముల ప్రతిపాత్రమునకును గథాసూత్రముతోడ సంబంధ ముండవలదా? అనవసరముగ నుండుపాత్రముల మననాటకముల నెన్నింటిఁ జూపుమనియెదరు? మంచి దుఃఖసమయమున, నుత్సాహముగ నొడలుదెలియక పోరుసలుపుసమయమున హాస్యసంభాషణమా? ఇట్టివి రసాభాసములు కావా? దీని కంతకును నిష్పక్షపాతకులైన విమర్శకులు లేకుంటయే కారణము. నాటకము వ్రాయుట కెంతటిప్రపంచానుభవ ముండవలయునో యెంతవ్యవహారదక్షత యుండవలయునో విమర్శకునకును నంతకంటె నెక్కువసామర్థ్యముండవలయును. పూర్వులు "నాటకాంతంకవిత్వం" అనినుడివియున్నారు. నాటకములు కావ్యములు చదివినవెనుకగాని చదువుటకైన నధికారములేదు. అధికారమన నవగాహనఁ జేసికొనుసమర్థత. ఉన్ననాటకము నర్థముచేసికొని యందందుఁ గలప్రయోజనప్రాశస్త్యములఁ దెలిసికొనశక్తి చాలనివారు వ్రాసిననాటకములు వాఙ్మయమున కేమిప్రయోజనకారిగ నుండఁగలవు? ఇప్పుడు నాటకములు వ్రాయుకొందఱికి నక్షరాభ్యాసమే

యక్కఱలేక యున్నది. యాదవదాసు గరుడాచలనాటకము (చెంచునాటకము) వంటినాటకము లెన్నియేని బయలుదేఱుచున్నవి. ఇట్లంటివని గ్రంథకర్తలు నాయెడఁ గినియకుందురుగాక. దోషము లందఱియందు నుండును. కాళిదాసు వంటివానికే కలవందురు. అవివేరు. ఇవివేరు. అక్షరాస్యునిదోషములకును, నిరక్షరకుక్షిదోషములకును, సామ్యముండదు. "ప్రమాదో ధీమతామపి" ప్రమాదము ధీమంతులకైన నుండును. దోషపరిశీలన ప్రమాదములు పడినవారికొఱ కేర్పడినది గాని మొదలేమియును రాక తప్పుడు తడకలల్లువారికొఱ కేర్పడినదికాదు. అట్టినాటకములలో దోషములఁ జూపఁ బ్రయత్నించుట కంబళిలోఁదినుచు వెండ్రుకలు లెక్కఁబెట్టఁ బూనుట? ఈవ్యాస మట్టికవులకొఱకుఁగాని గ్రంథములకొఱకుఁగాని యుద్దేశింపఁబడినదికాదు. దోషపరిగణన చేయఁబడిన పైనాటకములలో గుణములును, గొన్ని లేకపోలేదు. ఉండుఁగాక, లోపము లోపమే, చంద్రుఁడు చల్లనివాఁడని యాతనియందుఁ గలకళంక మెన్నుట మానుదురా?

షేక్స్పియరునకును, కాళిదాసునకును, నంతటి జగత్ప్రఖ్యాత మగుపే రెందునకు వచ్చె? వారు వ్రాసినది మార్చి వ్రాయవలెననిన మఱియొకమాదిరి వ్రాసిన స్వభావసిద్ధముగా నుండదనుటచేతఁ గదా! ఒక్కసారి మనము కాళిదాసులముగాని షేక్స్పియరులము గాని కాలేము గాని యట్టియాదర్శముల ముందిడుకొనినఁ గాని గ్రంథములు మంచివి బయలుదేఱు టెట్లు సంభవించును? గ్రంథవిరచన తంత్రీతద్దినముగాని బలవద్బ్రాహ్మణార్థముగాని కాదే. అట్టిరచనయందు భగవద్దత్త మగుశక్తి యున్నవాఁడే యాపనికిఁ గడంగవలయును. కవి సృష్టికర్త. సృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేయఁగలసమర్థుఁడే కవియనంబరఁగు. ప్రపంచమాతనియందంతర్ధానమై యుండు. ఆతనియందలి భగవద్దత్త మగు ప్రతిభావిశేషము సంతతధారగ బయలుదేఱి యంతర్హితముగ నుండు నా ప్రపంచమునుండి తనశక్తికొలఁది నందలి విశేషములను సవిశేషముగఁ బైకిఁ జేఁదుచుండును. సంతతధారాపాత మగునట్టి జలాశయము లోన లేనపు డూటనీరు తోడ నారంభించిన నది యేమిరుచిగా నుండును? అది యెంతవఱకు నిల్చియుండును? ఇట్టి యంతశ్శక్తి కలవారు లెక్క కెక్కువగ నుండరనిమాట తథ్యము.

ఇప్పు డున్న మననాటకవాఙ్మయమున పాత్త్రౌచిత్య మెఱింగి వ్రాయఁబడిన స్వతంత్రనాటకములు స్వల్పముగ నున్నవని చెప్పియుంటిని. అం దగ్రగణ్యముగా నెన్నఁదగినది పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులవారి "విప్రనారాయణ"

"రాధాకృష్ణ" "నర్మదాపురుకుత్సీయము" అనునాటకములు. కాశీనాథునా రాయణరావుగారి "చిత్రాభ్యుదయ" మనునాటకముగూడ కొంతవఱకు సమంజసముగ నున్నట్లు కనుపట్టుచున్నది. నరసింహరావు పంతులవారి కథాకల్పన ప్రకృతిసిద్ధమైనది యనియును నాయన ఛలోక్తులును, నర్మగర్భ వాక్యములును, మఱియొకరికడ లేవని చెప్పినచో నదిసాహసము కాదని నాయభిప్రాయము. నర్మదాపురుకుత్సీయము మిక్కిలి వ్యాపకమైననాటకము. అందలి మోహపరీక్ష యెంత రసవంతముగ నున్నది. షేక్స్పియరు టెమ్పెస్టు (Tempest) అనునాటకములో వ్రాసిన మోహపరీక్షతో నియ్యది వియ్యమందుటలేదా! విప్రనారాయణలో విప్రనారాయణుని కామతంత్రమునకుఁ గొనితెచ్చిన భోగకాంతను విరాగినిజేసిన తంత్రమెంతసమంజసముగను బ్రకృతిసిద్ధముగను నున్నది? ఈయనకియ్యది స్వతస్సిద్ధముగఁ బట్టుపడినది గాని తెచ్చిపెట్టుకొనినదికాదు. ఈయన గ్రంథములను సవిమర్శదృష్టితోఁ బరికించిచూచినఁ బ్రపంచానుభవము, ప్రకృతిపరీక్ష, యుచితజ్ఞత యీయనకెంతచక్కగనలవడి నదియును దేటపడకపోదు. ఉపమ లీయన సొమ్ము. అందీయనను గాళిదాసునితో సరిపోల్చినఁ బోల్పవచ్చును. చమత్కృతులకును, ఛలోక్తులకును బెట్టినదిపేరు. ఇందీయనను షేక్స్పియరనిన ననవచ్చును. కాని నాటకమునందు వలయు సంగీత బీజము లీయనగ్రంథములందుఁ గానరావు. ఉద్దేశపూర్వకముగ దానినీయన తీసివేసినారు. ఆయనకది రాకకాదు, చేతఁగాకకాదు. అది యభిప్రాయమునందలి లోపము. భావములు సుగమములుగా వ్యక్తీకరించుటకు సులభమైన ఛందస్సవసరమని యెంచి యీయన తన గ్రంథములయందెల్లెడల గీతపద్యముల వెదఁజల్లినాఁడు. గీతపద్యములు సంగీతమునకుఁ బనికిరానివి కావుకాని యీయన గీతములందు ఛందస్సుయొక్క ప్రయోజనముపోయినది. పద్యములందుఁ జక్కని భావము లున్నవిగాని గానబీజములు మాత్రము లేకుండఁ బోయినవి. మననాటకము లింగ్లీషునాటకముల వంటివి కావు. ఆభాషలో సంగీతమే లేదని చెప్పవలయును. ఉన్న నది మనగానమువంటి మృదులగానము కాదు. శృంగారమునకును గానమునకును జాలచేరువ. ఈనాటకములకు గానమెంతయుండిన నంతగంజకత వచ్చును. వీరరసప్రధానములను, రాజకీయవిషయ బోధకములను గానమునకుఁ జోటుతక్కువ. తక్కుంగలచోట్ల, నదిలేకయుండిన రసమునకుఁ గొంత వెల్తి కనుపడును. ఆరసమునకు గాన ముద్దీపనము. గద్యము పామరులకుఁ బద్యము పండితులకుఁ బదములు గానాభిరుచిగలవార

లకు నాటకములం దుద్దేశింపఁబడినవి. గ్రంథస్థమగువిషయముల మనస్సునకుఁ బట్టునట్లు చేయుట ప్రదర్శనముల యుద్దేశము. అయ్యది యెంతసౌకర్యముగఁ బట్టునట్లు చేసిన నంత ఫలసిద్ధి కదా? వెగటుగ నుండుమందున కనుపానము లెన్ని యోపెట్టినఁ గాని జిహ్వకు నింపుగలిగి మందు సేవింపఁబడదు. ఆయనుపానములలో మందుగుణములఁ దెలియకుండనుండు ననుపానముల జిహ్వకు రుచిగానుండునవి యెన్నియైనం బెట్టవచ్చును. అభిరుచిగలవానికొఱకు జనులకాశ హెచ్చు. ఆయభిరుచి తగినపట్టులఁ గలుగఁజేసి తన్మూలమున నాటకములయొక్క ప్రధానోద్దేశమును నెఱవేర్చుట కర్తవ్యము. సంగీతసాహిత్య నృత్యవాద్య ప్రముఖసాధనముల నెన్నియేని గలిగించి నాటకరంగము ప్రేక్షకులకు హృదయంగమముగ నొనరించి జనుల విశేషముగ నాకర్షించి వినోదకాలక్షేపము సేయుచు బోధింపనెంచిన నీతి చక్కఁగ హృదయముల కెక్కింపవలయును. ఇందులకే గదా కృష్ణమిశ్రుఁడు జ్ఞానబోధకై వేదాంతసారము నెల్ల నాటకరూపకముగ బోధింపనెంచి సులభముగ మనఃప్రీతిని గలిగించుచు, శృంగారరసమును మాటుచేసి వేదాంతతత్త్వమును దనప్రబోధచంద్రోదయమున బోధించినాఁడు.

నాటకశాల సర్వజనాకర్షకయంత్రముగ నుండుటకై సంగీతసాహిత్యరసప్రతిపాదకము లగుపదపద్యములు రసోచితముగ నెఱపుట యవసరము. ఇట్టి యవయవము లన్నియుఁ గలుగు నాటకములు ప్రయోగార్హము లైనవి లేకయుండుటచే నేదియో యొకనాటకముఁ బుచ్చుకొని లేనిభాగములను బైనుండి తెచ్చుకొని యందుఁ జేర్చి తాటాతూటముచేసి నాటకము లాడుచున్నారు.

కొందఱు విమర్శకులు నాటకములలోఁ బాటలు వలదనుచున్నారు. అవి యున్న వీథిభాగవతము లనుచున్నారు. రాజువేషము నటియించువాఁడు లేచి సంగీతము పాడుచు సంభాషణము చేయుట స్వభావవిరుద్ధముగాదా యనుచున్నారు. కాని పద్యములుండుట కభ్యంతరము లే దనుచున్నారు. పద్యముల కభ్యంతరము లేనప్పుడు పాటల కేల యుండవలెనో తెలియకున్నది వానివాని ప్రయోగములకుఁ బట్టున్నవి. అవిచూచి తగినరీతిని బదపద్యములు ప్రయోగించినఁ బ్రేక్షకుల కానందము కల్గించును. రసముమాత్రము పోకుండఁ బట్టవలెను. వీరరసమునకును, గరుణారసమునకును హాస్యము పనికిరాదు. అట్లే సంగీతమును గొన్ని యెడలఁ బనికిరాదు. అన్నిరకములజనులకును బనికివచ్చునట్లు రంగమునకు సరిపడిన నాటకము వ్రాయుటలో ధర్మవరము-రామకృష్ణమాచార్యుల

నారు మార్గదర్శకులైనట్టు చెప్పఁదగియున్నది. ఆయన చాలనాటకములు వ్రాసి నట్లు వినియుంటిని గాని నాకొక్కచిత్రనళీయముతో మాత్రమే పరిచయము కలదు. ఇదియెన్ని సారులు చూచినను నాడెడివారురసజ్ఞులైనచో నింకను జూడవల యు ననియే కోరిక యుదయించును. ఇందాయన తెచ్చిపెట్టిన మేల్మియెట్టిది యందురా? షేక్సుపియరు తననాటకములయందు నడుమనడుమ మంచిమంచి వినోదములను గథాసందర్భము చెడకుండఁ బ్రవేశపెట్టినట్లొక్కమాదిరిపాత్రము లఁబదుగురఁ బ్రవేశపెట్టి సర్వజనమనోరంజకముగ నుండునట్లు స్వతంత్రకల్పనలఁ జేసిగాని యున్నకథలో నట్టిమేలిపట్లకుఁ బ్రముఖత నిచ్చిగాని వినోదమును బుట్టించును. ఇట్టినేర్పే దాసునారాయణరావుపంతులుగారి "బుద్ధనాటకము" (సంగీతరసతరంగిణి) నాయన రచించినభాగమునఁ గనుపట్టును. కాల మాయన ను వాఙ్మయమునుండి దూరముచేసెంగాని యీనాటకమంతయును నాయనయే పూర్తిగావించిన నెంతసరసముగ నుండునో?

ఇప్పుడు మనభాషలో మొత్తము లెక్కించిచూచిన రెండుమూఁడు వంద లనాటకములుండును. లోపము లన్నియు నటుంచి యేదో యొకవిధముగ రంగము నకుఁ బనికివచ్చునని చెప్పఁదగినవి యేవియో పదియున్నైను కంటెలేవు. ఇవి యేవి యన్నియు వాడుకలో లేవు. లోపములకేమి? బంగాళిభాషలో సుప్రసిద్ధ మగుగ్రంథములు వ్రాసిన బంకించంద్రునివంటివాని ప్రథమగ్రంథములందుఁగూడఁ గొన్నిలోపములు కనుపట్టును. షేక్స్పియరునాటకములలోఁ గూడ లోపములు లేకపోలేదు. (Hamlet) హేమ్లెట్టు నాటకము షేక్స్పియరునాటకములలో సుప్రసిద్ధమైనది. అందు రాజుదోషము నిర్ధారణచేయుటకై యంతరనాటిక యొ కటి కల్పింపఁబడినది. అది కృత్రిమముగా నున్నట్టుకనుపట్టుంగాని యంతస్వభావ సిద్ధముగానున్నట్టు కనుపట్టుటలేదు. ఇట్లే కాళిదాసునాటకములకును లోపములు చూపవచ్చును. కాళిదాసునాటకముల హాస్యరసము లేదని యాక్షేపించు చున్నారు. వేణీసంహారము పాత్రౌచితిని మిక్కిలి మంచిదియని మెచ్చుకొనుచుఁ జివరంకమున నాతఁడు చేసినమార్పునుబట్టి యది చెడిపోయిన దని "విల్సను" అధిక్షేపించియున్నాఁడు. ఆతఁడు సంస్కృతపండితు లందఱును మంచిది యని విడువకుండ గురుకులవాసము చేసిచదువుకొను "మురారినాటకము" నాటక ములలోఁ బరిగణింపఁదగినది కాదని యీనాటకభాగములను భవభూతి "మహావీర చరిత్ర" లోని కొన్నిభాగములతోఁ బోల్చిచూచి వ్రోసివుచ్చెను.

ఇప్పటికి మనదేశమున నాటకములు వ్రాయనారంభించి ముప్పదిసంవత్సరములైనది. ఇంతవఱకుఁ బ్రౌఢమైన నాటకము సలక్షణమైనది సర్వవిధముల రంగమునకు బ్రదర్శనయోగ్యమైనది సర్వజనమనోరంజకముగా నుండునదియొక్కటి యైన బయలుదేఱలేదు. ఇది కడుంగడు శోచనీయము. దీనికిఁ దగుకారణము లేకపోలేదు. విద్యావైశద్యము కలిగి ప్రపంచానుభవము బాగుగఁగలవారెవ్వరికిని దేశభాషలయం దాదరము లేకయుండుటయే కారణము. కొన్నివిధములనైన మంచివిగా మనమెన్నుకొనిన నాటకములు విద్యాపరిజ్ఞానము బాగుగఁగలవారిచే వ్రాయఁబడినవే గాని విద్యలయందు గట్టిపునాది లేక విశాలమగు ప్రపంచానుభవముఁ బడయక వాఙ్మయప్రపంచమునఁ జాలయాత్రలు సేయక వఱలినవారివి కావు. విద్యాబుద్ధులుగలవారు, దేశమునఁ బ్రముఖత నందినవారు, బుద్ధిసూక్ష్మత నార్జించినవారు, తల్లిభాషను విస్మరించియున్నవారు. విస్మరించుట యనిన బాగుగ నుండదేమో యుపేక్షించినా రందును. విశేషమగు విద్యాసంపన్నత లేక గ్రంథముల వ్రాయఁగడంగుట భాషకనర్థదాయకము. కవిచేయు పని శిల్పియొనరించు పనివంటిది. శిల్పి యెంతసాపుపని చేసిన, నంత మెప్పు నడయును. అగసాలి, యతుకు లెన్నియో పెట్టుచుండును. ఆయతుకులు ప్రేక్షకులకుఁ దెలియకుండ మోసపుచ్చినవాని పనివానితనమే పనివానితనము. కవియు నిట్లే యెన్నియో యతుకులు పెట్టుచుండును. ఈయతుకు లన్నియును మాసికలు వేసినట్లుండినఁ జూచువాని కసహ్యాకరముగ నుండదా? అట్టిపనిని బనియని యెవ్వరేనిఁ జెప్పుదురా? ఒక్కనిదర్శనముఁ జూపుదుఁ. కాళిదాసుని శాకుంతలమున దుష్యంతుఁ డుంగరమును బ్రియంవదచేతికి "శకుంతల" నీళ్లఋణము తీర్చుటకై యిచ్చునప్పు డయ్యది యందుఁ బ్రవేశపెట్టుటలోఁ గవియుద్దేశ మెంత మేధావంతుఁడైనను బ్రథమపఠనమునఁ గాదుకదా మఱిరెండుమూఁడుమారులు చదివినను గ్రహింపఁగలవాఁ డున్నాఁడా? ఆతఁడు చెప్పునప్పు డేమిచెప్పినను నతఁడాయుంగరమునిచ్చినది, యీమెయందుఁ గలమోహముచేత నని యనుకొందుము. ఆయుంగరము నాతఁ డందుఁ బ్రవేశపెట్టిన దెందులకు? శకుంతలయందా దుష్యంతునకుఁ గలిగెడు విస్మృతిని పోఁగొట్టుటకు. అందుచేతనే గదా దాని కభిజ్ఞానశాకుంతల మని పేరిడినది. ఈపరిజ్ఞానము గలుగకుండఁ గాళిదాసు, తానొకటిచెప్పుచు నొకందుకుఁ జేసినట్లు కనఁబడుచు మఱియొకకార్యము సాధించుకొని పాఠకులనందఱం భ్రాంతియుతులం జేసినాఁడు. కల్పన యన నిట్లుండవలదా? ఈ

తఁడు చేసినది యతుకుపని కాదా? భారతకథలో నేయుండ రమున్నదా? మన గ్రంథకర్తలు తాము గన్నబిడ్డలకుఁ దిన్నని పేరైనఁ బెట్టుకొనలేకుండ నున్నారు. ఏరసమును వారువృద్ధిఁజేయ నెంచిరో యట్టిరసమును గొంతదూరము వఱకైన విస్తరించి యెక్కడికో కొట్టికొనిపోవుచున్నారు. షేక్స్పియరు వెనిసువర్తకోదంతనాటకమునకు వర్తకునిపేరిడినాఁడు మనకందఱకు నందు బ్రహార్షికాపాత్రముచేసినపని ప్రస్తవనీయముగఁ గనుపట్టును. ఆపాత్రపేరు వదలి యీపేరుపెట్టెను. ప్రహార్షికావసంతులకుఁ బెండ్లికథా యొకటి. అదియును వదలినాఁడు. ఏల? అతఁడు ప్రధానపాత్రముగా నెంచినది వర్తకుని. ఆవర్తకుని గుణపోషణము ప్రధానాంగముచేసి తక్కినపాత్రముల నన్నింటిని నాతని కుపాంగములు గావించినాఁడు. వేణీసంహారము, మృచ్ఛకటికము, ముద్రారాక్షసము, నివియు లన్నియు నిట్టివేకదా?

మన కిప్పుడు సంస్కృతమునుండియు నాంగ్లేయభాషనుండియును గూడ నాటకములు మేలైనవి భాషాంతరీకరింపఁబడి యున్నవి. తెలుఁగునాటకము కేవలస్వాతంత్ర్యమైనది యని చెప్పుటకు వలనుపడదు. పైరెండుభాషలలోఁగల నాటకములు జగద్విఖ్యాతమైనవి మనకు లభించినవి. ఈరెంటను గూడ మనకుఁ బొందుపడి యున్నవి గాన మన మింక దేనిమార్గము నవలంబింపవలయునో నిర్ధారణచేసికొనవలయును. సంస్కృతభాష మనదేశములోనిభాష గనుక యదియె మనమనుసరింపవలెనన్న నియమము పెట్టుకొనరాదు. అట్టినియమ మెప్పుడు నభివృద్ధికి మార్గముకాదు. ఏది కాలమునకు ననుగుణ్యముగానుండిన నది దేశమునకు జనులకును హృదయరంజకముగా నుండుట కనుకూలించిన నదియెల్ల మనము సేకరించుకొనవలయు. విల్సనుగారు సంస్కృతనాటకములు జనసామాన్యమునిమిత్తమై వ్రాయఁబడినవి కావనియును, విద్యాధికులకొఱకే యేర్పడి యుండు ననియును బామరులకొఱ కియ్యది యుద్దేశింపఁబడకుండుటచే జనానుకూలము లయినవి కావనియు నందుద్రేకమును బుట్టించు రసోత్పాదకములైననాటకములే లేవనియు నానాటకములు తిఱుచాడఁబడునవి కావనియు వ్రాసియున్నట్టు ముందుగనె చెప్పియుంటిని. ఇప్పుడు తెనుఁగునకు వచ్చినసంస్కృతనాటకము లన్నియును మిక్కిలి మేలైనవికదా. అవివ్రాసి యిరువదిసంవత్సరములైనను రంగమున వానికెంత వ్యాప్తి యున్నదో మన మెఱుంగనిది కాదు. విద్యావంతులు చదువుకొనుటకును గవియొక్కమేధావిశేషమును గుశాగ్రబుద్ధి

యును శాస్త్రసాంప్రదాయములును ప్రశంసించుటకును బనికివచ్చినవేగాని నాటకములవలనఁ బుట్టఁదగిన యుద్రేకములను బుట్టించుగుణ మందుఁ గాన రాదు. దీనినిబట్టి విల్సనుగా రూహించిన యూహయే సరియైన దైనట్లు మనము నిర్ధారణ చేయవచ్చును.

ఇంగ్లీషునాటకములలో షేక్సుపియరునాటకములు మేలైనవికదా? అవి చాలవఱకుఁ దెలుఁగైనవి. అం దీలోటు కనఁబడదు. సభారంజకముగను బామర జనగ్రాహ్యముగను గూడ నుండును. షేక్సుపియరు నటుఁడుగా నుండి రంగము నకుఁ దగిననాటకమును వ్రాసికొనె ననియును దేశమున నెయ్యవి యాకాలమున సమాదరణీయము లైయుండెనో యట్టివియే యాతఁడు వ్రాసె ననియును, జరి త్రయందుఁ జదివియున్నాము. ఆయన వ్రాసినకథ లన్నియును బూర్వకథలే. భాషకూడఁ జాలవఱకుఁ బూర్వగ్రంథముల భాషయే. కథానిర్మాణమునందించు కంత మార్పుచేసి భారతములోని శాకుంతలకథను గాళిదాసు నించుకంతమార్చి సుప్రసిద్ధ మగునాటకముగ రచియించినట్లు చక్కనినాటకము లెన్నెన్నియో ప్రేక్షకులకు నాహ్లాదకర మగునట్లుగ నాతఁడు రచియించియున్నాఁడు. వీనిభాషాం తరీకరణములును మనకుఁ బ్రదర్శనీయములు కాకున్నవి. మతాచారములు భేద ముగానుండుటచేత నవి మనజనులకు రుచింపవు. ఇందందుఁ గలమేల్మి యెల్లయే ర్చి మనజనులకుఁ దగినట్లు కాలమునకుఁ దగినట్లు నాటకములను వ్రాసికొనవలె ను. సంస్కృత నాటకలక్షణములు మనకుఁ బ్రతిబంధకములుగ నెంచరాదు. ఆ నాటకలక్షణములు సర్వమును ననుసరించి నాటకము వ్రాయవలెననిన నాటక ము వ్రాయుటయే యసాధ్యమగునని, విల్సను, నాటకలక్షణ విషయములను గూర్చి చెప్పుచున్నాఁడు. సంస్కృతమునందలి నాటకములయభ్యున్నతి పోయిన తరువాత వ్రాయఁబడు నాటకముల యవగుణములం గాంచి పూర్వగ్రంథముల మేల్మిచూపుటకయి మంచిమంచి నాటకములలోఁ గలమేలు లన్నియును నేర్చి ల క్షణగ్రంథములు వ్రాసిరి. ఈలక్షణగ్రంథములు క్రమక్రమముగ వృద్ధియయి నా టకములు వ్రాయుటకెన్నియో ప్రతిబంధకములు తెచ్చిపెట్టినవి. కవిమేధావం తుఁడు ప్రపంచజ్ఞానదక్షుఁడై యుండునపుడు వానియిష్టము వచ్చినట్లు లాతని స్వభావానుగుణ్యముగ సృష్టిచేయనిచ్చుటయే యభివృద్ధిగాని యతనిబుద్ధిపోకడ కు విహారస్థలము నొసంగక కట్టిపెట్టిన నతనికి రచనాస్వాతంత్ర్య మెచ్చటనుండి వచ్చును. ప్రతిభాశాలి ప్రతిబంధముల లెక్కింపఁడు. అతఁడు ప్రపంచకమునకు

వలయుతెన్నునఁ జక్కని గ్రంథముల సృష్టించును. లక్షణగ్రంథము లన్నియు ను వ్రాసిన గ్రంథములలోని స్వారస్యముల నరయుటకును దానిని విలువకట్టుటకును నేర్పడినవి. లక్షణగ్రంథముల ముందిడికొని నాటకముల వ్రాయఁ బ్రారంభించిన మన తెలుఁగులో నున్న ప్రబంధముల పోలిక గ్రంథములు బహులుదేఱును. మన తెనుఁగుప్రబంధముల నొకటి చదివిన మఱియొక్కటి చదువనక్కఱలేదు కదా? అట్టి చిక్కు లుండుటంబట్టియే ముద్రారాక్షసము ప్రబోధచంద్రోదయమును వ్రాసిన గ్రంథకర్తలు లాక్షణికు లొప్పికొనని రసమునఁ దమ నాటకములను వ్రాసిరి. ఆనాటకములు రసవత్తరములయినవి కావని యెవ్వరైన నందురా? లాక్షణికు లంగీకరింపకుండిన నంగీకరింపకుందురు గాక, వానిని లక్ష్యగ్రంథములుగాఁ జేర్చుకొనకపోవుట లక్షణగ్రంథములకు లోపముగాని యీగ్రంథముల కేమియును గొదవలేదు.

సంస్కృతనాటకము లన్నియును ప్రమోదపర్యవసానములు. పర్యవసానము మంగళముగా నుండవలయు నని లాక్షణికుల నియమము. నిజముగ నానియమము హిందువులకు నేఁడు పుట్టినది కాదు. అనాదినుండి వచ్చుచున్నదియే. శ్రాద్ధకర్మము లయినతర్వాతఁగూడ మంగళవాక్యములతోఁ గర్మపరిసమాప్తమగును. అది దేశాచారమునుబట్టి నిర్ణయింపఁబడినది. సంఘసంస్కరణమే ప్రధానముగాఁ గలనాటక మొకటి యీలక్షణగ్రంథముల ననుసరించి వ్రాయవలె నన నీయది పాటించిన నాటకము వ్రాయుటకు సాధ్యమగునేమో యోజింపుఁడు. అదిగాక యాచారములే పాటింపఁబడనినాఁడు ప్రధానోద్దేశము మనకు దేనివలన సాఫల్యము గనునో యట్టిదానిని బర్యవసానమున నిల్పియుంచిన నష్టమేదియు లేదు. ప్రమోదాత్మకములే గాని విషాదాత్మకములు సంస్కృతమున లేవు గనుక మనము వ్రాయరా దనునియమము పెట్టుకొనరాదు. ఏవిషయమువలన దేశమునకును బ్రజలకును లాభము కలుగునో కాలము ననుసరించి దానిని గుఱించి గ్రంథములు వ్రాయుట యవసరము.

అంకమున నొక్కరంగమే యుండవలయు నని సంస్కృతమున నొకనియమ మున్నది. అయ్యది సంభావనాపుష్టిని గలిగించి యొక్కొక్కచోటఁ గథకుఁ బ్రోత్తేయింపును బుట్టించును. నిమేషనిమేషమునకును రంగము మాఱుచుండినఁ గథకు శక్తి యుండదు. ప్రధానరసము నిల్చియుండదు. అది నిజమే. కాని రంగములును, సీనులును, మాఱుచుండినఁ బామరజనరంజకముగానుండును. ఒక్కొ-

క్కచోటఁ గథామార్గము ననుసరించి చిన్నచిన్న రంగములే కథాసౌష్ఠవము నిలుపును. అవసరము వెంబడిని దగినమార్పుఁ జేసికొనుచు బహుద్రష్టలును, బహుశోధకులును, జక్కని గ్రంథముల వ్రాయఁగడంగుదురు. వాని కంతరాయములఁ గల్పించుట భాషకును వాఙ్మయమునకును నష్టము. అత్యుచ్ఛదశ నందిననాటకరాజములు, ఇంగ్లీషుభాషను గలవు కదా? ఆభాషలో నాటకములు వ్రాయుటకు మనసంస్కృతములోవలె లక్షణగ్రంథములున్నవా? లేకున్న వాఙ్మయమునకు లోపమువచ్చినదా? దానియభివృద్ధికి లోపము వచ్చినదా? అవి యున్నప్పుడు కంటె లేనప్పుడే బహుగ్రంథశోధన మెక్కువ యవసర మగును. అప్పుడే మంచిగ్రంథములు బయలుదేఱును. చదివినగ్రంథములనుండి లక్షణములు స్వయముగ నేర్పఱచుకొనుసమర్థులే గ్రంథములు వ్రాయఁ గడంగుదురు.

ఆంగ్లేయవిద్యావిశారదులు విమర్శకు లగువారు దేశభాషయం దభిమానము కలిగి భాషాజ్ఞాన మలవరించుకొని గ్రంథములువ్రాయ మొదలిడుదాఁక మంచిగ్రంథములు బయలుదేఱవు. దేశభాషయొక్క అభివృద్ధియిట్టులే యుండును. వీరి కుక్షింభరత్వము విడుచునందాఁక దేశమునకు హైన్యస్థితి విడువనేరదు. బ్రిటిష్ దేశమున నాటకము జాతీయధనము. అచ్చటిపార్లమెంటులోని సభ్యులలోఁగూడఁ గవులు, నాటకకర్తలును గలరు. వారు స్వయముగ గ్రంథముల రచియించుచు దొరతనమువారివలన భాషకుఁ గలుగవలసిన లాభములను దాము సభలోఁ జర్చించి పొందుదురు. ఆ 1832 సంవత్సరమున నాటకసమాజముల స్వాతంత్ర్యములం గూర్చి యాదేశమున నొకచిక్కు వచ్చి పార్లమెంటులో నొక తీరుమానము బెట్టి "E. L. Bulver" అను నొకసభ్యుఁ డాబాధ నివారణకై యొకసంఘము నేర్పాటుచేయుమని పోరినాఁడు. అందుపైన దొరతనమువారెంతయో విమర్శించి యాబాధ నివారణఁ జేసినారు మనకట్టిమనస్థితులును లేవు. వచ్చినఁ బోరాడువారును లేరు. గ్రామ్యగ్రాంథిక భాషాభివాదము లిప్పుడు ప్రజ్వలించియున్నవి కదా? మనచట్టనిర్మాణసభ్యులలోని సభ్యు లొక్కరైన నీవిషయములు స్వానుభవమున సిద్ధాంతీకరించుకొని పనిచేయఁగలవా రున్నారా? జీవితకాల మంతయును ధారఁబోసి, యన్యభాషలను నాభాషలోనుండు జాతీయములును, వక్తృత్వశక్తియును నలవరించుకొని శాస్త్రము లెన్నెన్నియో హస్తగతము గావించుకొన్నవారలకు దేశభాషయం దభిమానము కల్గిన వాఙ్మయము వృద్ధిలోనికి రాదా? ఇదివఱకు వారికాపరిజ్ఞానము లేకయున్నను, బుద్ధి

పుట్టిన నొకటిరెండువత్సరములలో సంపూర్ణజ్ఞాన మలవరించుకొని దేశము నుద్ధరింపలేరా? రమేశచంద్రదత్తుగా రాంగ్లేయవిద్యాపారంగతుఁడు కాఁడా? బంకించంద్రుఁడు రాజకీయోద్యోగము చేయలేదా? ఈకడపటి యాతఁడాదేశమున డిప్టీకలక్టరీ యుద్యోగము చేసినాఁడు. అందే యుపజీవితము కైకొన్నాఁడు. వారందఱును దేశభాషయందుఁ బాండిత్యము నలవరించుకొనలేదా? బాలగంగాధరతిలకుగా రాంగ్లేయవిద్యావిశారదుం డయ్యు సామాన్యముగఁ దాను దేనిమీఁద నభిప్రాయ మీయవలయు ననినను దేశభాషయందే గాని, ఇంగ్లీషు భాషను వ్రాయనే వ్రాయఁడే. మనకుఁ దెనుఁగున నుత్తరము వ్రాయుట తప్పు. మాటాడిన బూతు. ఇట్టిస్థితివిద్యాధికులలో మాఱకున్నంతవఱకు వారు ప్రజలను దమతోడివారిగఁ బరిగణింపకుండునంతవఱకు వారియభివృద్ధికై మనము పనిచేయవలసిన బాధ్యత మనయం దున్నదని యనుకొనని యంతవఱకు నీహైన్యస్థితి దేశమును విడుచునదికాదు.

ఇప్పు డంకురప్రాయముగ బయలుదేఱిన యీయాంధ్రదేశోద్యమము, నీయాంధ్రసాహిత్యపరిషత్తుఁ గ్రమక్రమముగఁ బెరిఁగి పెద్దవృక్షమై శాఖోపశాఖల విస్తరిల్లి యాంధ్రసాహిత్యమును వర్ధిలఁజేసి వాఙ్మయము దినదినప్రవర్ధమానముగ విజృంభించి, ఫలప్రాప్తి నొందునట్లు విద్యాధిదేవత యగు భారతి యనుగ్రహించుఁగాత!

తథాస్తు,

తల్లాప్రగడ-సూర్యనారాయణరావు.

---

# ఆంధ్రభాష



వ్యవహారవశమున మార్పునొందిన యాంధ్రభాషయొక్క గ్రాహ్యతాగ్రాహ్యతలవిషయమున నాంధ్రభాషాభిమానులు భిన్నభిన్నాభిప్రాయులయి కొంతకాలమునుండి వివదించుచున్నారు గాని రెండుపక్షములవారును భాషాభిమానులమే యనుచున్నారు. ఉభయపక్షులవారును గ్రామ్యమును గ్రహించుట సరికాదనియే ఘోషించుచున్నారు. ఇట్టిస్థితిలో నిట్టివివాదము పుట్టుట విచిత్రముగా నున్నది గాని పూర్వవ్యాకరణ విరుద్ధపదములు గ్రామ్యములని యొకరును పామరజనవ్యవహారమాత్రగత మగుభాష గ్రామ్యమని మఱియొకరును జెప్పుచున్నారు. అరయఁగా నీరెండులక్షణములును సమ్మతింపఁ దగినవే యయినను నిందుఁ బూర్వపక్షు లొకభాష వ్యాకరణ మింకొకభాషకుఁ బ్రమాణమని వాదించుచుండుటచే నిట్టివివాదము గలుగుచున్న దని తోఁచుచున్నది.

ఇఁక నీపూర్వపక్షుల వాద మెంతవఱకు సరిగా నున్నదో వా రెంతవఱకుఁ దమవాదము ననుసరించుచున్నారో విచారించి చూతము. పూర్వవ్యాకరణము లనుటచే నాంధ్రశబ్దచింతామణియు, నాంధ్రభాషాభూషణమును గ్రహింపఁబడినచో మహాభారతమె గ్రామ్యపదభూయిష్ఠము గావలసివచ్చును. ఉ॥ "తత్క్రతుశతంబునకంటె; కోడంద్రురయుండు; లోకహితంబు చేయుపొంటె; నాపుడుఁ గృష్ణుఁ డిట్లను; తనవారణేంద్రముక్కురుకులవీరుమీఁద నెసకొల్పిన; మనుజుల విప్రుం ప సమధికత్వభాజనములు" మొదలగునవి యాంధ్రశబ్దచింతామణిచే సాధ్యములు కావుగదా.

ఇఁక మహాభారతమును సయితము పూర్వవ్యాకరణములలోఁ జేర్తురా? కవిత్రయమువారి భారత మిప్పుడు గలదా! వారి కుత్తరోత్తరు లగు లాక్షణికు లెల్లఁ దమతమయిచ్చకు వచ్చినట్లు సవరించియున్నారు. సవరించుచున్నారు గదా! "నన్నయ ముఖ్యసత్కవిజనంబుల కావ్యములందు లేఖకుల్। గొన్నియుఁ బాఠకాధములు గొన్నియుఁ బోకడఁబెట్టి తక్కునై। యున్నడఁ గాంచి జానపము లోడకదిద్దిన తప్పుత్రోవ లె। ల్లన్నిజమంచుఁ గైకొనిన లక్షణవేత్తలు సమ్మతింతురె." యనునప్పకవిసూక్తి పయియభిప్రాయమును వ్యక్త

పఱచుచున్నదిగదా. ఇంతేగాక తాళపత్రస్థభారతములకును నిప్పటి యానంద ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడు భారతములకును గల పాఠభేదములు గనినచో భారతము సాధ్యమగునంతవఱ కిప్పటికిఁ దెలినవ్యాకరణమునకు లోఁబడునట్లు సవరింపఁబడిన దనక తీరదుగదా? ఎట్లయినను మనుచరిత్ర వసుచరిత్రాముక్తమాల్యదాదులు గ్రామ్యపదభూయిష్ఠములు కాక తప్పదు. "కొఱతంబడుంగుకవి; రతిపయ్యెదకున్నను నైనచేతులఁ; (మనుచరిత్రము), కావుకావనువారి; ముసలిమానుల్; (వసుచరిత్రము), చించిచ్చువారు; గంగనుకాసె; నెలతిచ్చె, శ్రీరంగభర్తంచు; చేష్టుడిగె; (ఆముక్తమాల్యద), అనవలసంటి, అడిగిచ్చు, ముఖమందము (విజయవిలాసము), బచ్చింట, దినవెచ్చము (పాండురంగ మాహాత్మ్యము), పోషించక (దశకుమారచరిత్ర), ఆడిదెనిదుపందెము, (మార్కండేయ పురాణము), వెఱిచిట్లు. క్రమముకు. (నిర్వచనోత్తరరామాయణము), ఉత్సవముకు (ఉత్తరహరివంశము), నేర్చినాను (మొల్లరామాయణము), అక్షింతలు (రుక్మాంగదచరిత్రము), కప్పురగంధులు (పారిజాతాపహరణము), పుడమిఱేఁడు (సకలకథాసారసంగ్రహము)" మొదలగు మహాకవిప్రయోగములు మహాభారతప్రయోగసమ్మతములు కావు గదా! మఱియు సీతారామాచార్యులవారు శబ్దరత్నాకరమున "అవధారు, అట్టము, అపరాతిరి, జెష్ట, పంచవన్నె, పాండవబీడు" అను మొదలైన యనేకగ్రామ్యపదముల నింద్యగ్రామ్యము లని యుదాహరించియున్నారు. ఇట్టివన్నియు నీపూర్వపక్షులమతమున గ్రామ్యములే కదా. ఇట్టి క్రొత్తక్రొత్తప్రయోగములు తత్తత్కాలిక వ్యవహారబలముచే భాషలోఁ జొరఁబడుచువచ్చిన వనక తప్పదుగదా.

ఒకవేళ నిట్టిప్రయోగములు ప్రామాదికము లనియు నట్లయినను శిష్టప్రయోగములు గ్రాహ్యములు గాన సాధువులె యనియు నేఁటివఱకుఁ గల వ్యాకరణములు, ప్రబంధములు, పురాణములు మొదలగు గ్రంథము లన్నియుఁ బ్రామాణికములె యనియు వీనికి విరుద్ధములు గ్రామ్యములనియుఁ జెప్పెదురా? గ్రంథకర్త మృతినొందుట వానిగ్రంథమున గ్రామ్యతకుఁ గారణమయి యున్నది. "మరణాంతాని వైరాణి" యనురామాయణసూక్తిని గ్రహించిరి కాఁబోలు. మేలు మేలు. ఏమిలక్షణము తేలినది. మృతకవిప్రయోగములగ్రామ్యములు.

పోనిండు! అట్లంగీకరించినను వీరు ప్రయోగించుచున్న "మనుష్యహంతకులు; నఱికివేసినాను, అందఱిని; జాగ్రత, (చిలకమర్తి-లక్ష్మీనృసింహాము

పంతులవారు), పాపిష్ఠియెలుక, చాలకాలము, వార్ధక్యము, కొండచికి, కనిపించెను, మాతాశిశువులు, పాత, ముత్యపుచిప్ప, (కందుకూరి వీరేశలింగముపంతులవారు), యజమాని, ఇందతని (తిరుపతి వేంకటేశ్వరమహాకవులు), సాక్షాత్తు విద్యానాథులండీ ఆంజనేయులూ (వేదము వేంకటరాయశాస్త్రిలవారు) మొదలగు పదములు గ్రామ్యములనక తప్పదుగదా. ఇట్టి ప్రయోగములను సాధించుకొనుటకు వీరికి నాగరక వ్యవహారభాషయే యాధార మగును.

పోనిండు వీరివాదమున కేమి. గ్రామ్య మన నెట్టిదో విచారింతము. సంస్కృతవ్యాకరణములలో వ్యాకరణవిరుద్ధపదము లపభ్రంశము లనియు నపశబ్దము లనియుఁ జెప్పఁబడియున్నది గాని యీగ్రామ్యశబ్దము గ్రహింపఁబడలేదు.

ఆలంకారికులు "కన్యేకామయమానం మాం। త్వన్నకామయసే కథం। ఇతి గ్రామ్యోయ మర్థాత్మా। వైరస్యాయైవకల్పతే। కామం కందర్పచండాలో మయి వామాక్షి నిర్దయః। త్వయి నిర్మత్సరో దిష్ట్యే త్యగ్రామ్యోర్థో రసావహః। శబ్దేపి గ్రామ్యతా స్త్యేవ। సాసభ్యేతర కీర్తనాత్। యథా యకారాదిపదం। రత్యుత్సవ నిరూపణే। పదబంధానువృత్త్యా వా। వాక్యార్థత్వేనవా పునః। దుష్ప్రతీతికరం గ్రామ్యం। యథా యా భవతః ప్రియాః" "గల్లాదయ శ్చబ్దాశ్చ గ్రామ్యా ఏవ" అని యిట్లు గ్రామ్యదోషమును బేర్కొని యున్నారు. వైయాకరుణులచేఁ జెప్పఁబడిన యపశబ్దములు (లేక యపభ్రష్టములు) చ్యుతసంస్కృతు లని యాలంకారికులు చెప్పియున్నారు. ఈదోషద్వితయమునందును గ్రామ్యదోషము పామరోక్తులయందు నిర్దుష్టమె యనియు నాటకాదులం దిట్టివి నీచపాత్రముల విషయమున వాడుట రసావహ మయియుండు ననియుఁ జెప్పియున్నారు. ఇట్టి యభిప్రాయముతోఁ జెప్పఁబడిన "గ్రామ్యత్వమధమోక్తిషు గుణాయ" అను నాలంకారికసూక్తిని జ్యుతసంస్కృత్యపరనామకాపభ్రంశము విషయమున నుదాహరించుట భ్రాంతివిలసిత మని తోఁచుచున్నది.

ఆంధ్రవ్యాకరణములం దాంధ్రశబ్దచింతామణిలోఁ బయి నుదాహరించిన చ్యుతసంస్కృతికిని గ్రామ్య మనియే పేరు పెట్టఁబడెను. "అనియమాద్గ్రామ్యంహి యత్త్వపభ్రంశః" అని గ్రామ్యతాపభ్రంశతలు పర్యాయపదములుగాఁ జెప్పఁబడినవి. సామాన్యముగా భాషలలో నపభ్రంశములు పామరజన

వ్యవహారమునను గలుగును గాన నపభ్రంశములు సయితము గ్రామ్యములె యని వీరభిప్రాయపడిరని తోఁచుచున్నది. కావుననే యాలంకారికులు చెప్పిన గ్రామ్యమువలెనే యీయపభ్రంశము సయితము నధమోక్తులందు నిర్దుష్టమే యని యాంధ్రవైయాకరణు లభిప్రాయపడిరి.

పామరజన వ్యవహారమున భాషలలో నపభ్రంశములు పుట్టు ననియు నట్టి యపభ్రంశములు పామరజన సహవాసాదికముచే నాగరకవ్యవహారము లోనికిఁ జొరఁబడు ననియు నట్లు నాగరకవ్యవహారమునఁ బ్రవేశించినపిదప నవి యగ్రామ్యజన వ్యవహారగతము లగుటం జేసి యగ్రామ్యములే యనియు వికృతివివేకమునందు "సన్మూలవత్త్వా ద్రూఢత్వాత్ । గృహీతత్వాచ్చ సాధుభిః । నాపభ్రంశత్వ మేతస్య । నియమాభావతస్తు తత్" అను మొదలగు సూక్తులచేఁ స్పష్టపఱుపఁబడియున్నది. ఇట్లె యాలంకారికులు చెప్పిన గ్రామ్య... సయితము సద్వ్యవహారగతమైనచో నగ్రామ్యమె యగు నని "భగినీ భగవత్యాది । సర్వత్రైవానుగమ్యతే" అను వికృతివివేకసూక్తి స్పష్టపఱచుచున్నది.

సంస్కృతము వ్యవహారవశమున నపభ్రష్టమయి నాగరకవ్యవహారము లోనికి రాఁగా నది ప్రాకృత మనుపేర వాల్మీక్యాదులచే నంగీకరింపఁబడెను. సంస్కృతప్రాకృతములు వ్యవహారవశమున నపభ్రష్టము లయి నాగరకవ్యవహారములోనికి రాఁగా నదియును నన్నయాదులచే నంగీకరింపఁబడెను. సద్వ్యవహారమున నున్న భాషానియమము లెత్తివ్రాసిన నదియె వ్యాకరణము. కాఁబట్టి తత్తత్కాలవ్యవహారభాషకుఁ దత్తత్కాలికవ్యాకరణములు ప్రమాణములయి యుండును. సంస్కృత భాషామయకావ్యమునఁ బ్రాకృతము ప్రయోగించుట తప్పుగాని ప్రాకృతభాషయందుఁ బ్రాకృతపదములు ప్రయోగించుట దుష్టమగునా? ఇట్లే పురాతనాంధ్రమున నధునాతన నాగరవ్యవహారస్థపదములు ప్రయోగించిన నది గ్రామ్య మగును గాని యధునాతన నాగరకాంధ్రభాషామయకావ్యమున నధునాతననాగరక వ్యవహారస్థపదములు ప్రయోగించుట దుష్టము కాదు కావున నధునాతననాగరక భాషామయకావ్యమున నిప్పటి యనాగరకులవ్యవహారమున మాత్ర మున్నయట్టి పదములు ప్రయోగించుట దుష్టమనియు నవి గ్రామ్యము లనియు సిద్ధాంతము.

నన్నయాదులు గ్రహించినభాషయుఁ దాత్కాలికవ్యావహారికభాషయే యగుటవలన దానిని వారు గ్రహించినపుడును నిట్టివివాదము సంభవించెననియు

నప్పుడు నయితము పైరీతిగనె గ్రామ్యతాలక్షణము సిద్ధాన్తీకరింపఁబడె ననియు "సమ్మూలవత్త్వా ద్రూఢత్వా ద్గృహీతత్వాచ్చ సాధుభిః । నాపభ్రంశత్వ మేతస్య । నియమాభావతస్తుతత్" అను మొదలగు వికృతివివేకసూక్తులచే స్పష్టపడుచున్నది. ఇందు సాధుగృహీతము లనఁగా నాగరకవ్యవహారగతము లనియు రూఢము లనఁగా నట్టివ్యవహారమునఁ బ్రసిద్ధము లనియు నర్థము. ఇట్టి పదములకు నపభ్రంశత లేదని యిందుఁ జర్చింపఁబడియున్నది. మఱియు "యథా శాస్త్రం యథాశక్తి । యథాశ్రోత్రానురంజనం । యథాప్రసిద్ధి స్సర్వత్ర । శబ్దానాం కల్పనామతా" అను వికృతి వివేకసూక్తిచేఁ బదవ్యుత్పత్తి శాస్త్రానుకూలములును స్వసంకేతి తార్థబోధన సమర్థములును శ్రుతిహితములును సార్వజనీనములును నగు పదములు గ్రాహ్యము లని స్పష్టపడుచున్నది. పయి లక్షణములు నాగరక వ్యవహార గతపదములకే సంభవించును గాన నవి గ్రాహ్యములె యనుటకు సందేహము లేదు. ఇఁక నాగరకజనవ్యవహారమాత్రగత పదము లన్ననో పదవ్యుత్పత్తి శాస్త్రానుకూలము లయ్యు, స్వసంకేతితార్థబోధన క్షమము లయ్యును నాగరకశ్రుతిహితములును సార్వజనీనములును గాకుండుటచే నవి గ్రాహ్యములు కాఁజాల వని స్పష్టపడుచున్నది.

భాష వ్యవహారస్థమయి యుండునంతకును దానికి వ్యవహారమే నియామక మయి యుండును. ఈయభిప్రాయము తోడనే "సిద్ధిర్లోకాద్ధృశ్యా" యని యాంధ్రశబ్దచింతామణిలోఁ జెప్పఁబడియున్నది. ఇఁక భాషకు వ్యవహారస్థితి తప్పినతోడఁది దాని వ్యవహారకాలమునఁ బుట్టినగ్రంథావళులలోని పదములనియమము లెత్తి వ్రాసినవ్యాకరణములును దద్గ్రంథములును నియామకము లగును.

కాఁబట్టి తత్తద్భాషలకుఁ దత్తత్కాలికవ్యవహారమూలకము లగువ్యాకరణములు ప్రమాణము లని సిద్ధాంతము తేలినది. ఈయభిప్రాయముతోడనే కేతన పురాతనాంధ్రమునకు లక్షణముఁ జేయఁబూని దానివ్యవహారకాలమున గ్రామ్యజనవ్యవహారమాత్రమున నున్నపదములను గ్రామ్యము లని యుదాహరించియున్నాఁడు.

సీ. పంచాకుమయ్యతో పించాకుమయ్య వాటీదెచ్చుతారు మమ్మాదలంచి।
యేగ గొంటూరమ్ము యేదాలు ప్రొదాలు చేసేటివారు నూసేటివారు।
వాడివిరాళితో బాడిగ ప్రొకుమీాయీాడేకదా మమ్ము యినుతిసేసె।
పంపేరు తెంపేరు పాడేరు నూసేరుయిందాము కందాము పొందు మిస్తీ

ఆ-వె. అటుకు దప్పు వెగడు నషువలె నిషువలె
నాడ నీడ నేడ నచ్చు నిచ్చు
మోయ గాయ వేయ మోకుదా ఙ్బామను
గద్ద గుద్దనంగ గ్రామ్యమయ్యె "

అనునుదాహరణములు మాత్రము గ్రామ్యమున కీయఁబడినవి గాని గ్రామ్యతాలక్షణము కేతనచేఁ జేయఁబడలేదు. అట్లయినను నీయుదాహరణములనుబట్టి చూడఁగా నాయాభాషలకు వ్యవహారస్థితి దప్పినవానికు నాగరక వ్యవహారమూలకము లగు నాయాభాషల గ్రంథములలోఁ జేరనట్టివియుఁ దద్గ్రంథప్రయోగములచేఁ గల్పించుటకు వీలుపడనట్టివియు నైన వ్యావహారికపదములు తత్తద్భాషలలో గ్రామ్యము లని కేతన యభిప్రాయపడినట్లు కనుపట్టుచున్నది. భాషకు వ్యవహారస్థితి లేకుండుటంజేసియు వ్యవహారస్థితి సూచకగ్రంథస్థితినైన లేమింజేసియు నట్టివ్యావహారికపదము లగ్రామ్యము లని సాధించుటకు నాధారము లేదు గదా.

పురాతనాంధ్ర వ్యవహారకాలమున ననాగరక వ్యవహారస్థము లగుటచే నవి గ్రామ్యములే యైనను వానిలో "పంపేరు, తెంపేరు, చూసేరు, ఇస్తిని" మొదలగుపదము లిప్పటి నాగరకవ్యవహారభాషలోఁ బ్రవేశించినవి గనుక నవి యీభాషలో గ్రామ్యములు కావు. తక్కిన "యినుతి, యిందాము, సూసేరు" మొదలగుపదము లిప్పటికిని గ్రామ్యజన వ్యవహారమాత్రస్థములే యగుటచే నవి యీభాషయందును గ్రామ్యములే యనుట నిర్వివాదాంశము.

పంపేరు మొదలగునవి పంపినవారు మొదలగుపదముల యపభ్రంశరూపము లగుటచే నవి యెప్పుడును గ్రామ్యములె యనినచో సంస్కృతాపభ్రంశ మగు ప్రాకృతమును సంస్కృతప్రాకృతాపభ్రంశమగు పురాతనాంధ్రమును గ్రామ్యము లెట్లు కాకుండును? అపభ్రష్టములగు ప్రాకృతపురాతనాంధ్రము లగ్రామ్యములగునపు డధునాతనాంధ్రిమమాత్ర మెట్లు గ్రామ్యమగును?

"భవే ద్వర్ణాగమా ద్ధంస। స్సింహో వర్ణవిపర్యయాత్। గూఢోత్మా వర్ణవికృతే। ర్వర్ణనాశా త్పృషోదర" మ్మనుసూక్తిచొప్పున వర్ణాగమ వర్ణలోప వర్ణాదేశాదివికారము లొందిన పదములు సంస్కృతభాషయందును గ్రహింపఁబడిన వని కనుపట్టుచున్నది. ప్రాకృతభాషకుఁ గలవర్ణాగమాదివికారములు వాల్మీక్యాదులచే ననేకములు చూపఁబడినవి. "వర్ణలోపాగమా నేకే। సర్వస్మిం

స్తద్భవే పదే। భిన్నత్వం యుక్తవర్ణస్య। లోపాదేశాగమా స్తథా। స్యాద్వర్ణస్య వ్యత్యయశ్చ। కుత్రచి త్కవిసమ్మతః” అనువికృతివివేకసూక్తిప్రోక్తమునఁ బ్రాచీనాంధ్రభాషయందును వర్ణాగమవర్ణలోపవర్ణాదేశాది వికారములు పొందినపదములు గ్రహింపఁబడిన వని వ్యక్తమగుచున్నది. అట్లగుచును నీవర్ణాగమాదివికారముల నొందినపదములలో నాగరకవ్యవహారస్థములే గ్రాహ్యములనియు ననాగరకవ్యవహారమాత్రస్థితపదములు “పామరాదిప్రయుక్తం యత్తద్గ్రామ్యమభిధీయతే” యనునాలంకారికసూక్తిప్రోక్తమున గ్రామ్యము లగుటంజేసి యవి గ్రాహ్యములు కానని గ్రహించునది. “లచ్చి యన లక్ష్మిపే రగు। నచ్చంబన నచ్ఛమునకు నభిధానము వి। వ్వచ్చుఁడు బీభత్సుఁడు వి। ద్వచ్చయమనునిట్టి తెనుఁగు తద్భవ మయ్యెన్” అనుకేతనసూక్తి యీయభిప్రాయమును వ్యక్తపఱచుచున్నది. ఇట్టినాగరకవ్యవహారగతము లగున నేకము లగునపభ్రంశపదములు సుశబ్దములుగ వైకృతదీపికయందును గవిసంశయవిచ్ఛేదమందును నుదాహరింపఁబడినవి.

ఇట్లు వర్ణాగమాదివికారముల నొందుట భాషాసామాన్యమునకు స్వభావమైయున్నది. ప్రకృతి పరిణామశీలముగానఁ బ్రకృత్యంతర్భూతము లగుపదములు సహితము నాయాకాలములందలి జనసంఘములను బట్టియు, నాయాదేశముల శీతోష్ణాదిస్థితులను బట్టియు భాషలోని యక్షరములశక్తినిబట్టియుఁ బలువిధము లగుమార్పుల నొందుచుండును. ఇట్లు మార్పు నొందుట సర్వభాషాసామాన్యమై యున్నది. సృష్ట్యాదినుండియు నొక్కటియే భాష యని చెప్పుట యనుభవవిరుద్ధము గదా.

ఈనవీనాంధ్రమునఁ గల్గిన వర్ణాగమాదివికారములు ప్రాకృతప్రాచీనాంధ్రములందు సైతము గల వని చూపించుటకయి యిచ్చటఁ గొన్ని మార్పుల రీతు లుదాహరించెదను.

ఉచ్చారణమునందలి త్వరాదికముచేతను సౌలభ్యాపేక్షచేతను వర్ణలోపములు గలుగుచుండును. ఉదాహరణము. వచ్చినవాఁడను=వచ్చినాఁడను; వచ్చినాను=వచ్చాను=వచ్చేను - వీనిలో మొదటిరెండును బ్రాచీనాంధ్రమునఁ గలవు. మఱియును, “వలుఁద=వల్ద, చినుకు = చిన్కు, అపుడు=అప్డు, ఇరుగు = ఇర్గు, చెయిది=చెయ్ది, ఇట్టివాఁడు=ఇట్టిఁడు, చేయఁగలవాఁడు=చేయఁగలాఁడు, మొదలగు ననేకస్థలములలో వర్ణలోపములు ప్రాచీనాంధ్రమునందును గనుపట్టుచు

స్సవి. ప్రాకృతమునందు సంయుతము "ప్రాయో లుక్కచజతదపయవాం" అను సూత్రముచేఁ బ్రాప్త "ఆతపః = ఆఅవో, కపిశ్వరః = కఇసరో" అను మొదలగు పెక్కుచోట్ల వర్ణలోపములు గలవు.

హల్లు లోపించునపుడు కొన్నిచోట్ల వెనుకనుండు హల్లునకు ద్విత్వము గాని మొదటియచ్చునకు దీర్ఘముగాని వచ్చును. ఉదా. కిలకు=కిద్దు, దోసిలు= దోల్లు, తరలి=తిల్లి, చెప్పిసన్=చెప్పినా, సీతయుచు=సీతా, చెప్పెసీ=చెప్సి, దళహారి=దళారి, చేసిన వెనుక=చేసినాక, మొదలగునవి. అంతదనుక=అందాఁక, ఇంతదనుక=ఇందాఁక, నెఱ + తావి=నెత్తావి, కొ త్త + కాపు=క్రొక్కాపు, అలదు=అద్దు, వలదు=వద్దు, కొలఁది=కొద్ది, చేసినవాఁడను=చేసినాఁడను, చేయఁ గలవాఁడు=చేయఁగలాఁడు, మొదలగు ప్రాచీనాంధ్రపదములందును వైకృతరూపములు గనుపట్టుచున్నవి.

వెనుకహల్లునకు ద్విత్వము వచ్చునపుడు ముందటిదీర్ఘము హ్రస్వ మగును. ఉ. పోయేవారు=పొయ్యేవారు, తీయుగా=తియ్యగా. కోయుగా=కొయ్యగా మొ.—ఈరీతి ప్రాచీనాంధ్రమునందును "ఆయడి=అయ్యడి, ఈతరి= ఇత్తరి, తేప=తెప్ప, పూవు=పువ్వు, ఆయె=అయ్యె," అను మొదలగుచోట్లఁ గన్పట్టుచున్నది. ఇట్లే ప్రాకృతమునందును "దీర్ఘస్య హ్రస్వతా నిత్యా। సంయుక్తో త్తరతాయది" అనుసూక్తిచేఁ బ్రాప్త "రాజ్యం=రజ్జం" అను మొదలగురూపములు సిద్ధించుచున్నవి.

సంయుక్తాక్షరములలో నొకటి మిగులుటయు నట్లు మిగిలినవానిలో వనాది హల్లునకు ద్విత్వము వచ్చుటయుఁ గలదు. ఉ. క్రింద=కింద, ప్రాఁత=రాత, వ్రణము=రణము, ప్రాఁత=పాత, క్రొత్త=కొత్త, అర్ధాన్నము=అద్ధాన్నము, శ్రేష్ఠి=సెట్టి, మొ. ఈరీతి "ప్రయాణము=పయనము, బ్రహ్మ=బమ్మ, అర్పణము= అప్పనము, కర్పూరము=కప్పురము" అను మొదలగు ప్రాచీనాంధ్రపదములందును; "ప్లవః=పవో, భ్రమః=బమో, కల్పః=కప్పో, లబ్ధవ్యం=లద్ధవ్వం, గుణగ్రాహీ=గుణగ్గాహీ" అను మొదలగు ప్రాకృతపదములందును జూపట్టుచున్నది.

ఇరుపార్శ్వముల నుండునచ్చులబలముచే నచ్చు తత్సజాతీయ మగును. తొమ్మిదులు=తొమ్ముదులు, చదువక = చదవక, చెప్పుమనెను=చెప్పమనెను, సరకులు=సరుకులు, కఱవు=కరువు, పొసఁగు=పొసుగు, మొ. ఈరీతి ప్రాచీ

నాంధ్రమునందు "హారిలు=హారులు, కలిమిలు=కలుములు, కొట్టిరు=కొట్టిరి, గెలుచెను=గెలిచెను, హారికు=హారికి, మొదలగుచోట్లను గనుపట్టుచున్నది. ఇట్టిమార్పు పాశ్చాత్యపండితులు "(Vowel Harmony)" "వొవెల్ హార్మని" యందురు.

తాలవ్యాచ్చులతోఁ గూడినవకారము లోపించును; కొట్టివేసెను = కొట్టేసెను, ఔతవి=ఔతయి, చేసినవి=చేసినయి, చేసేయి. మొ. "ఈరీతి, వీఁగు=ఈఁగు, వేయు=ఏయు, వేఁచు=ఏఁచు, వెలయు=ఎలయు, వీఁడు=ఈఁడు, వీరు=ఈరు" అను మొదలగు ప్రాచీనాంధ్రపదములందును గనుపట్టుచున్నది.

చకారమునకు శకారమును, శచలకు సకారమును లకారమునకు నకారమును గొన్నిచోట్ల వచ్చుచుండును. ఉ. చాలమంది=శానమంది, రాశులు=రాసులు. చుమా=సుమా. మొ. ఈరీతిమార్పులు ప్రాచీనాంధ్రమునందును "శోధించు=సోదించు, చాగెను=సాగెను, చచ్చు=సచ్చు, చలువు=సలువు, అతఁడుచనియె=అతఁడుసనియె, తోల = తోన, ములుఁగు=మునుఁగు." అను మొదలగుచోట్లఁ గలవు.

కొన్నిచోట్ల వర్గాక్షరములకుఁ బరస్పరము మార్పులు గల్గుచుండును. చోపు=జోపు, చల్లు=జల్లు, కడచు=గడచు, కడప=గడప, కనుక=గనుక, కాని=గాని, తోవ=దోవ మొ. ఈరీతిప్రాచీనాంధ్రమునందును "తన్ను=దన్ను, కుంతి=గొంతి, సుఖము=సుకము, బుద్ధి=బుద్ది, కథ=కత, భాష=బాస, ప్రౌఢ=ప్రోఢ" అను మొదలయినచోట్లఁ జూపట్టుచున్నది.

తాలవ్యము లగుయకారచకారములకు దంత్యసంబంధము గల్గినపుడు దంత్య మగుసకారము వచ్చును. తవర్గమునకు చటవర్గములతో మార్పులు గలుగును. ఉ. చదువుచున్నాఁడు=చదువుతున్నాఁడు, గెలుచుచున్నాఁడు=గెలుచుతున్నాఁడు=గెలుస్తున్నాఁడు. పోయుచున్నాఁడు = (పోయుతున్నాడు)=పోస్తున్నాడు. ఈరీతిఁ బ్రాఁదెల్గునందును "పోయు + ఎను=పోసెను, చుమా=సుమా, చెమ్మ=తెమ్మ," అను మొదలగుచోట్లఁ గలదు.

కవర్గీయములకు హకారము వచ్చును. ఒకటి=ఒహాటి, ఇఁక=ఇహా, సగము=సహాము, ముఖము=మొగము=మొహాము, మొ. ఈరీతి ప్రాకృతమునందును "నికషం=నిహసం, చికురః=చిహురో, మేఖలా=మేహాలా, విఘసః=విహాసో" మొదలగుచోట్లఁ గనుపట్టుచున్నది.

కొన్నిచోట్ల హకారము లోపింప దాని ముందటియచ్చునకు దీర్ఘము వచ్చును. ఒకటి=ఒహటి=ఓటి, మహాభాగు=మాభాగు, మొ. ఈరీతి ప్రాంత తెలుఁగునందును, "వరహాలు=వరాలు, సహాయము=సాయము, సహజము=సాజము," అను మొదలగుచోట్లఁ గలదు. ఈరూపములనుబట్టిచూడఁగా "మోము" అనుదానికి "మొహము" అనియు, "నాము" అనుదానికి "సహము" అనియుఁ బ్రకృతు లయియుండు నని తోఁచుచున్నది గాని య్యాప్రాఁడెనుఁగున "మోము, నాము" అనుపదములంగీకరించి "మొహము, సహము" అనుపదము లంగీకరింపకుండుట వింతగ నున్నది.

పయినుదాహరించిన మార్పులు పదవ్యుత్పత్తిశాస్త్రానుకూలములును, బదస్థాక్షరశక్తిజన్యములును భాషాంతరసామాన్యములును విశేషించి మన మంగీకరించుచున్న ప్రాకృతప్రాచీనాంధ్రములకు సామాన్యములును నయియున్న వనకతప్పదుగదా. కాఁబట్టి ప్రాకృతప్రాచీనాంధ్రములవలెనే యీనవీనాంధ్రము నయితము నగ్రామ్యమగుటచే నిదియు గ్రాంధికావస్థ నొంది భాషాంతరములవలెనె యాచంద్రతారకముగ వెలయునట్లు చేయుటకు నిష్పక్షపాతబుద్ధు లగు పండితులు ప్రయత్నింతురుగాక.

వఝల—చినసీతారామస్వామిశాస్త్రి.

# శా స్త్ర ప రి భా ష.

## Chemistry = నవ్యసాంఖ్యశాస్త్రము.

| (1) Elements | ప్రకృతులు |
|---|---|
| Oxygen | ఓషజని. |
| Hydrogen | అభ్రిదవజని. |
| Nitrogen | నార్థజని. |
| Carbon | అంగారము. |
| Chlorine | గలారి. |
| Sulphur | గంధకము. |
| Phosphorus | భాస్వరము. |
| Silicon | శైలికము. |
| Iron | లోహాము. |
| Calcium | క్షారశిల. |
| Sodium | స్వర్జికము. |
| Potassium | స్ఫుటాషము. |
| Magnesium | మహాగ్నీష. |
| Copper | తామ్రము. |
| Zinc | రంగము. |
| Mercury | పారదము. |
| Silver | రజతము. |
| Gold | సువర్ణము. |
| Manganese | మంగనైశము. |
| Platinum | అతిరజతము. |
| Bromine | భ్రూనామము. |
| Pluorine | ఫుల్లవర్ణము. |

| (2) Compounds | వికృతులు |
|---|---|
| Hydrogen dioxide | ద్వ్యోషితాభ్రిదవజని. |
| Nitric Acid | నార్థికామ్లము. |
| Ammonia | అహామ్మానము. |

| | |
|---|---|
| Liquor Ammonia | అహామ్మ్యానధృతి |
| Nitrogen Monoxide | ప్రథమౌషితనార్థజని. |
| Nitrogen dioxide | ద్వితీయౌషితనార్థజని. |
| Nitrogen tetroxide | తూర్యౌషితనార్థజని. |
| Nitrogen Pentoxide | పంచమౌషితనార్థజని. |
| Carbonic acid gas | అంగారికవాయువు. |
| Hydrochloric acid | అభ్రిదవగలారికామ్లము. |
| Hydrochloric acid gas | అభ్రిదవగలారికవాయువు. |
| Sulphuric acid | గంధకికామ్లము. |
| Iron oxide | ఓషితలోహము. |
| Iron Sulphate | గంధకేతలోహము. |
| Calcium oxide | ఓషితక్షారశిల. |
| Calcium Chloride | గలారితక్షారశిల. |
| Calcium sulphate (Gypsum) | గంధకేతక్షారశిల (జతుసమము). |
| Sodium nitrate | నార్థేతస్వర్జకము. |
| Sodium sulphate | గంధకేతస్వర్జకము. |
| Sodium chloride | గలారితస్వర్జకము. |
| Caustic soda | స్ఫోటస్వర్జికము. |
| Soda (oxide of sodium) | స్వర్జికము. |
| Potassium chlorate | గలార్యేతస్ఫుటాషము. |
| Potassium nitrate | నార్థేతస్ఫుటాషము. |
| Magnesia | మహాగ్నీష. |
| Magnesium sulphate | గంధకేతమహాగ్నీష. |
| Copper oxide | ఓషితతామ్రము. |
| Black oxide of copper | కృష్ణౌషితతామ్రము. |
| Copper sulphate | గంధకేతతామ్రము. |
| Copper nitrate | నార్థేతతామ్రము. |
| Mercuric oxide | పారదౌషితము. |

| | |
|---|---|
| Red oxide of mercury | రక్తౌషితపారదము. |
| Silver chloride | క్లోరితరజతము. |
| Silver nitrate | నార్థేతరజతము. |
| Black oxide of manganese | కృష్ణౌషితమంగనైశము. |
| Manganese dioxide | మంగనైశద్వితీయౌషితము. |

## (3) General terms — సామాన్యనామములు

| | |
|---|---|
| Chemistry | నవ్యసాంఖ్యశాస్త్రము. |
| Physics | నవ్యవైశేషికశాస్త్రము. |
| Change | వికారము. |
| Physical Change | వైశేషికవికారము. |
| Chemical change | ప్రాకృతవికారము. |
| Chemical union or combination | సృష్టి, లేక సంశ్లేషము. |
| Double decomposition | వ్యతిశ్లేషము. |
| Chemical decomposition | సంహారము. |
| Resolution | విశ్లేషము. |
| State (of a body) | సంస్థానము లేక స్థితి. |
| Physical state | వైశేషికసంస్థానము. |
| Combined state (as opposed to free state) | సంకీర్ణస్థితి. |
| Solid, liquid and gas | ఘనము, ద్రవము, వాయువు. |
| Element and compound | ప్రకృతి, వికృతి. |
| Metal or Metallic element | తైజసము లేక తైజసప్రకృతి. |
| Non-metal or non-metallic element | అతైజసము లేక యతైజసప్రకృతి. |
| Atom | పరమాణువు. |
| Molecule | త్రసరేణువు. |
| Combining weight | సంకరోన్మానము. |
| Oxide | ఓషితము. |
| Alkaline or Basic oxide | క్షారౌషితము. |
| Acid-forming oxide or an hydride | ఆమ్లౌషితము. |

| | |
|---|---|
| Sulphate | గంధకేతము. |
| Nitrate | నాగ్ఫేతము. |
| Chlorate | గలార్యేతము. |
| Chloride | గలారితము. |
| Acid | ఆమ్లము. |
| Strong (acid) | గాఢ (ఆమ్లము). |
| Oxidation | ఓషము. |
| Crystallisation | ఘనీభావము. |
| Solution | ధృతి. |
| Distillation | స్వేదనము. |
| Distilled (water) | స్వేదిత (జలము) |
| Filtration | గాలనము. |
| Filtered (solution) | గాలిత (ధృతి). |
| Funnel | పుష్పిక. |
| Funnel-tube | పుష్పికానాళము. |
| Porous | విశదము. |
| Amalgam | నవనీతము. |
| Oxi-hydrogenflame | ఓషాభిద్రవజ్వాల. |
| Refractory | దుర్విలాపము. |
| Mineral | ఆకరజము. |
| Electricity | దివ్యశక్తి. |
| Electrified | దివ్యశక్త్యావిష్టము. |
| Cell (of a battery) | (దివ్య) పాత్రిక. |

శ్రీ. ప. ల. నరసింహాస్వామి.

# శక్తివర్మప్రభు బెజ్జుశాసనము.

---

ఈశాసనము 8½ అంగుళములు పొడవు 4 అంగుళములు వెడల్పును గల 5 రాగిరేకుల మీఁదఁ జెక్కఁబడియున్నది. 1, 5 రేకులకు లోపలిప్రక్కను మాత్రమే యక్షరములు గలవు. తక్కినమూఁడు రేకుల కిరువైపుల నున్నవి. ఐదవరేకు నడిమికి విరిగిపోయి యున్నది. ముద్ర మీఁదిభాగమునందు సూర్యచంద్రులు, అంకుశము, వరాహము మఱికొన్ని చిహ్నములు నున్నవి. వాని యడుగున "శ్రీత్రిభువనాంకుశ" యను నక్షరము లున్నవి. వానిక్రింద నొక పుష్పాకారము గలదు.

ఈశాసనము కొంతకాలముక్రిందట కృష్ణాజిల్లాలోని తణుకుతాలూకాలో నున్న నత్తలరామేశ్వర మను గ్రామమం దొక కాపువానికి దొరికినదఁట. ఇది దొరకినది మొదలు కష్టము లనేకములు తటస్థించుటచే నవి యన్నియు శాసనమువలననే కలిగినవనియూహించి రాగిరేకులను తిరిగి భూస్థాపితములు చేయవలె నని యత్నించుచుండఁగా నాయూరికరణ మది తెలిసికొని యాశాసనము తాను తీసికొనఁగా, 1910 సంవత్సరములోఁ బాఠశాలాధికారి యగు చేకుమళ్ల-అచ్యుతరావుపంతులుగారు కరణమువల్ల దానిని సంపాదించిరఁట. దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారి మూలమున నే నది యెరవుదీసికొంటిని.

శాసనభాష సంస్కృతము. గద్యపద్యాత్మకము. వ్రాఁతతప్పు లచ్చటచ్చట నున్నవి. దాన భూమి హద్దులు వివరించుటలోఁ దెలుఁగుపదములు కొన్ని ప్రయోగింపఁబడియున్నవి. ఆపదములు ముందుముందు విమర్శింపఁబడును. లిపి నందంపూడిశాసనము పూర్వభాగపులిపిని బోలియున్నది. ఆశాసనము చివరభాగములిపి రాజరాజుకాలమునందే పుట్టినట్లు తోఁచుచున్నది. ఆలిపిని బోలినలిపి రాజరాజుకాలమునకుఁ బూర్వము పుట్టిన శాసనములలో నింతవఱకుఁ గనఁబడలేదు. ఈరెండులిపులకు సంధి నందంపూడిశాసనమువలన స్పష్టపడుచున్నది. కాఁబట్టి యాంధ్రలిపి స్వరూప పరిణామ విచారమున శాశాసన మత్యంతానుకూల మయినది.

ప్రస్తుతశాసనము రాజరాజుపెదతండ్రియగు శక్తివర్మనాఁటిది. ఈ రాజు శాసనము లిదివఱ కెచ్చటను ప్రకటింపఁబడిన ట్లగపడదు. ఈనడుమ కృష్ణా

జిల్లా, ఏలూరుతాలూకా, నాయుడుగూడెం గ్రామనివాసి గారపాటి రామబ్రహ్మం గారివలన నొకశాసనము లభించినది. అది కూడ ముందీపత్రికయందు బ్రచురింపఁబడును. మొదటి యయిదుపుటలలోను కుబ్జవిష్ణువర్ధనుఁడాదిగా శక్తివర్మ వఱకు రాజ్యము చేసినవారిపేరులును రాజ్యకాలమును వివరింపఁబడియున్నవి. అది యెట్లనఁగా

| | | | |
|---|---|---|---|
| 1 | కుబ్జవిష్ణువర్ధనుఁడు | 18 | సంవత్సరములు. |
| 2 | జయసింహుఁడు | 33 | ,, |
| 3 | విష్ణువర్ధనుఁడు | 9 | ,, |
| 4 | మంగియువరాజు | 25 | ,, |
| 5 | జయసింహుఁడు | 13 | ,, |
| 6 | కొక్కిలి | ... | 6 నెలలు |
| 7 | విష్ణువర్ధనుఁడు | 37 | సంవత్సరములు |
| 8 | విజయాదిత్యుఁడు | 18 | ,, |
| 9 | విష్ణువర్ధనుఁడు | 36 | ,, |
| 10 | విజయాదిత్యుఁడు | 48 | ,, |
| | (నరేంద్రమృగరాజు) | | ,, |
| 11 | కలివిష్ణువర్ధనుఁడు | 1½ | ,, |
| 12 | విజయాదిత్యుఁడు | 44 | ,, |
| | (గుణగవిజయాదిత్యుఁడు) | | |
| 13 | చాళుక్యభీముఁడు | 30 | ,, |
| 14 | విజయాదిత్యుఁడు | | |
| | (కొల్లభిగండ విజయాదిత్యుఁడు)... | | 6 నెలలు |
| 15 | అమ్మరాజు | 7 | సంవత్సరములు |
| 16 | తాడరాజు | ... | ఒక నెల |
| 17 | విక్రమాదిత్యుఁడు | ... | 11 నెలలు |
| 18 | యుద్ధమల్లుఁడు | 7 | సంవత్సరములు |
| 19 | రాజభీముఁడు | 12 | ,, |
| 20 | అమ్మరాజు | 25 | ,, |
| 21 | దానన్నృపతి | 3 | ,, |

22 తదనంతరము శక్తివర్మ.

ఈరాజులచరిత్రములలో విశేషముల విచారింతము. 10వవాఁడగు నరేంద్రమృగరాజు గంగరాష్ట్రకూటాదిరాజులతో 108 యుద్ధములు చేసి నూటయెనిమిదేసి శివప్రతిష్ఠాది ధర్మకార్యములు చేసినట్లు గుణగవిజయాదిత్యుని యురుటూరుశాసనమువలన మన మెఱిఁగియున్నారము. ఆయంశ మీశాసనమందుఁగూడ నుదాహరింపఁబడియున్నది. గుణగవిజయాదిత్యుఁడు మంగిరాజును, సంకిలుని నిర్జించినట్లు 13—16 పంక్తులలోఁ జెప్పిన యంశము శాసనాంతరములవలనఁగూడఁ దెలియవచ్చుచున్నది.—తమ్ములతోఁ గూడి యితఁడు రాజ్యము చేసె నన్నది విశేషము. గుణగవిజయాదిత్యునియనంతరము రాజ్యమునకు వచ్చిన చాలుక్యభీముఁడు మొదలు శక్తివర్మవఱకుఁ గల రాజుల రాజ్యక్రమమును రాజ్యకాలమును నందంపూడిశాసనమున కనుగుణముగానే యున్నవి. చాలుక్యభీముని గుణవర్ణన రెండవఅమ్మరాజునాఁటి యొకశాసనమునుండి (South Indian Inscriptions Vol I. p 46—49) గ్రహింపఁబడినది. ఈవర్ణనను బట్టియు, నితరశాసనములఁబట్టియు నీచాలుక్యభీముఁడు చాలుక్యరాజులలో సుప్రసిద్ధుఁడయిన ట్లగపడుచున్నది. ఈరాజే గోదావరిజిల్లాలో చామర్లకోటవద్దనున్న భీమవరములోని భీమేశ్వరుని బ్రతిష్ఠించినట్లు వదంతి కలదు. రాజభీముని సుతుఁడగు రెండవయమ్మరాజు మహాధీరుఁడైనట్లును, నొక్కయేనుఁగుసహాయముతోఁ దొమ్మిదిశత్రుగజములను జంపినట్లును, లోకోత్తరవీరుఁడగు దాయాది నెవనినో రణరంగమందు హత మొనర్చినట్లు నీశాసనమువలనఁ దెలియుచున్నది.

అమ్మరాజు పిదప నాతని సవతితమ్ముఁడగు దానరాజు మూఁడుసంవత్సరములు మాత్రము రాజ్యముచేసిన తరువాత వేంగిదేశ మరాజక మయిపోయెను. దానరాజు విద్యాధికుఁడని "విద్యాకలాప చతురః" అను విశేషణముచే నందంపూడి శాసనములో సూచించిన యంశము నీశాసనము 33, 34 పంక్తులలో గవి పద్యార్థమున వివరించియున్నాఁడు.

అమ్మరాజునాఁటికే చాళుక్యులలో గృహకలహములు గలిగి క్రమక్రమముగా దానార్ణవునినాఁటికి హెచ్చి యందుచేతనే దేశ మనాయకమైనది. ఈయిరువదియేడు సంవత్సరములలో నితరవంశపు రాజులు వేంగిదేశమును బాలించినందు కాధారము లింతవఱకు లభింపలేదు. చాళుక్యులు తమలోఁదాము పోరు

చుండ నెవరికిని జయములేక దేశము బహునాయకముగా నున్న గ్లాహింపఁ దగియున్నది.

ఈ27 యేండ్లు గడచినపిదప దానార్ణవుసకును, ఆర్యామహాదేవికి నగ్రతనయుఁడగు శక్తివర్మ శత్రుల నిర్జించి దేశమునంత తనయధీనము చేసికొని వసుమతి రాజన్వతి యగునట్లొనర్చెను. ఈతఁడు చిన్నతనమందే ద్రమిళ (ద్రవిడ) యుద్ధమం దనేక శత్రుగజముల స్వఖడ్గముచే ఖండించె ననియు, చోడభీముని చేఁ బంపఁబడిన మహావీరు నొక్కని దాను స్వయముగా రణరంగమునందుఁ జంపె ననియు, జటాచోడుఁ డనుమహావృక్షమును వేళ్లతోఁ బెరికివైచె ననియు నీశాసనమువల్ల మనకుఁ దెలియుచున్నది. ఈచోడభీమ జటాచోడు లెవ్వరో నిర్ణయించుట కవకాశ మంతగా దొరకలేదు. ఈకాలమం దరవదేశమును బాలించుచుండిన చోళరాజులలో నీపేళ్లుగలవారు లేరు. తెలుఁగుదేశ మనఁగాఁ బాకనాఁటి నేలుచుండిన చోడులలో భీమనామము కొందఱకుఁ గలదు, కాని శక్తివర్మతోఁ బోరిన యాతఁ డెవఁడో యిదమిత్థ మనిచెప్పుటకు వీలులే కున్నది. ఈజటాచోడభీమచోడులవృత్తాంత మింకను మనకుఁ దెలియవలసియున్నది. వారు శక్తివర్మ దాయాదులకు సహాయులుగా వచ్చినట్లు తోఁచుచున్నది. శక్తివర్మ 12 సంవత్సరములు మాత్రమే రాజ్యము చేసినట్లు శాసనాంతరములవలన మనకుఁ దెలియుచున్నది. ఇంచుమించుగా నీకాలమంతయు నాతఁడు తనరాజ్యమును స్థిరపఱచుకొనుటకే వినియోగపఱచియుండవచ్చును. దేవాదాయమగు పభుబట్లుగ్రామమున కధికారిగా నుండిన యాతఁడు రాజద్రోహిగా నుండుటచే వానిఁ దొలఁగించి యాయధికారము యుద్ధమునందుఁ గృతక్లేశుండును, రాజభక్తుఁడునగు దాదిభీమునకే శక్తివర్మ యిచ్చెనని చెప్పుటచే నాకాలమందు రాజద్రోహులు పలువు రుండిరనియు, రాజట్టివారల నదిమిపట్టి రాజభక్తుల కుత్సాహముకల్పించుచుండెననియు నీశాసనము చాటుచున్నది. ఈకలహములు విమలాదిత్యునికాలములోఁ గూడఁ గొంతవఱకుండి పిదప నశించి రాజరాజపట్టాభిషేకకాలమునకు దేశమంతయు శాంతముగా నున్నట్లు కనఁబడుచున్నది. కావుననే రాజరాజు నన్నయభట్టాది విద్వజ్జనుల నాకర్షించి విద్యల కభివృద్ధియొనర్పఁ జాలెను.

## శాసనోద్దేశ్యము.

అత్తిలినాడుదేశమున సలికేశ్వరాలయ మనుశివాలయ మొకటి యుండెను. దేవునియర్చనాదులకు (రెండవ) అమ్మరాజు పభుబట్లు అనుగ్రామము దేవా

ఛాయముగా నొసఁగెను. ఆదేవస్థానమునకు శిష్యానుక్రమముగా బాలసోమ పండితుఁ డనునాతఁడు స్థానాధిపతి (ధర్మకర్త) యయ్యెను. స్థానాధిపతివలన గ్రామాధిపత్యము వడసినయతఁడు రాజద్రోహియగుటచే నతనిఁ దొలఁగించి యాస్థానమందు పాంగునామునకును గౌరకాంబకును బుత్రుఁడును, స్వామిభక్తుఁడును, రాజునిమిత్తమై యుద్ధమునందు శ్రమపడినవాఁడునగు దాడిభీముని నియమించి దేవాలయమునకు మఱికొంత భూమికూడ నిచ్చెను. ఈభూమి మూఁడు ఖండములుగా నున్నది. అందులోఁ బెద్దది పెనుఁగొండ అఢకప్రమాణముచేత నూరుధాన్యపుఖండికలు విత్తుటకుఁ జాలినంత భూమియఁట. తక్కిన రెండుభాగములు నిరువదేసిఖండికలు విత్తుటకుఁజాలిన వఁట. అఢకమనఁగా అడ్డ - పెనుఁగొండ యనునది ప్రస్తుతము కృష్ణాజిల్లాలో నున్న తిరువూరుతాలూకాలోనిది. పెనుఁగొండ పూర్వము పెద్దపట్టణమై యుండినట్లును గోమటులనువారందఱు నీ గ్రామమునుండియే యెల్లదేశములకు వెళ్ళియుండిరనియుఁ గన్యకాపురాణమువల్లఁ దెలియుచున్నది. ఈకాలమునందు మాత్రమే గాక తరువాతఁ జాలకాలమువఱకుఁగూడ పెనుఁగొండ అడ్డయె ప్రమాణముగా గ్రహింపఁబడుచుండిన ట్లనేక శాసనములవలనఁ దెలియవచ్చుచున్నది. ఖండిక శబ్దము ధాన్యరాశివిశేషవాచకము. సాధారణముగా ఖండికయనఁగాపుట్టెడని వాడుదురు. పూర్వపులెక్కలలో పుట్లకు బదులుగా"ఖ"యనివ్రాయుట యాచారము. ఖ ౪ అనఁగా నాలుగుపుట్లనియర్థము. "పెనుంగొం డాఢక ప్రమాణేన శతవ్రీహి బీజావాప ప్రమాణక్షేత్రమ్" అనఁగా పెనుఁగొండ అడ్డతో నూరుపుట్లధాన్యము చల్లుటకుఁ జాలినంత భూమి యని తేలినది. గోదావరి, కృష్ణాజిల్లాలలో పుట్టెడుభూమి, రెండుపుట్లభూమి యనివాడుదురు. కాని, కడపజిల్లా మొదలగు నితరాంధ్రప్రదేశములందుఁ బుట్టెడువిత్తనాలభూమి యనఁగా బుట్టెడువిత్తనాలు చల్లుటకుఁ జాలినభూమి యనియే వాడుదురు. పుట్టెడుభూమి యనుదానికిఁగూడ నిదియే యర్థము. వ్రీహి శబ్దమునకు వడ్లు అర్థము. కావున, నాకాలమందు గోదావరి కృష్ణాజిల్లాలలో వడ్లపంట వ్యాపించి యున్నట్లు తెలియనగును.

## గ్రామనిర్ణయము

పభుబఱ్ఱు అనుగ్రామము ప్రస్తుతము లేదు. దీనికిఁ దూరుపు హద్దయిన దుతిక కిప్పుడు జుత్తిగ యందురు. దక్షిణసీమయయిన మాపుణ్ణూరు మూఁడూ

రయినది. ఉల్లికొండపణ్ణి అను గ్రామము ప్రస్తుతము లేదు. దానిస్థానము కూడఁ దెలియదు. ఈహద్దులను బట్టిచూడ పభుబజ్జు నత్తలరామేశ్వరము సమీపములో నుండిన ట్లూహింపఁ దగియున్నది.

## ఆంధ్రపదములు

శాసనమంతయు సంస్కృతభాషావిరచిత మయినను హద్దులు వివరించుటలోఁ గొన్ని తెలుఁగుమాటలు ప్రయోగింపఁబడినవి. పెద్దఅలంపక్షేత్రమన్నప్పుడు 'అలంప' అనునది దేశ్యశబ్దముగాఁ గనఁబడుచున్నది. పుచ్చగుణ్ణ, చోడికి లోలగుణ్ణ, చిలుకరవిగుణ్ణ, పెనుంగొణ్డ శబ్దములలో ననుస్వారస్థానమున ణకార ప్రయోగము విశేషము. పూర్వకాలమం దనుస్వారమునకు బదులుగా ననునాసికాక్షరముతే తఱచుగా వాడఁబడుచుండిన ట్లనేక శాసనములవలనఁ దెలియుచున్నది. అనునాసికాక్షరము చెడి పూర్ణానుస్వారమును, అది చెడి కొన్నిచోట్ల అర్ధానుస్వారము నయినట్లూహింపఁ దగియున్నది. చెఱువు, తేలముకోడు, మఱ్ఱి, నైకఱాలకోడు, పఱుచు పదములలో శకటరేఫ ప్రయోగము గమనించునది. పూర్వము ర, ఱల కుచ్చారణ భేదము తప్పక పాటింపఁ బడిన ట్లగపడుచున్నది. ఈనాఁ డది యంతగాఁ బాటింపఁబడుట లేదు. పెనుకొణ్డ, పెనుంగొణ్డ యని రెండురూపములు కనుపట్టుచున్నవి. పెను + కొణ్డ యనియుండఁగా రెండు శబ్దములకు నడుమ నుచ్చారణసౌలభ్యార్థము ద్రుతాగమము వికల్పముగా వచ్చుటం జేసి ద్రుతము వచ్చినప్పుడు సంధి శాస్త్రమునుబట్టి పరుషమునకు సరళమును ద్రుతమునకనుస్వారము నాదేశములుగా వచ్చి పెనుంగొణ్డ యయ్యెను. ద్రుతము రానప్పుడు పెనుకొణ్డ యనుపూర్వరూపమే నిలిచెను. "పొలమేరకోడు".— నందంపూడి శాసనములోఁ బొలమేర శబ్దమునకు బదులు "పొలగరుసు" అనియున్నది. ఈశబ్దములకు వ్యుత్పత్తి పొలము + మేర, పొలము + + గరుసు ... అనఁగా ఊరిపొలమునకు హద్దు అని చెప్పవలసియున్నది. ఇప్పుడీశబ్దము సాధారణముగాఁ బొలిమేర యని ప్రయోగింపఁ బడుచున్నది. పొలి యనునది పొల శబ్దమునకు వికృతి యని భావించినను భావింప వచ్చును. అట్లుగాక గ్రామదేవతకు పొలి (బలి) వేయు మేర యని చెప్పినఁ జెప్పవచ్చును. "సలికేశ్వర" యనుదానిలో 'సలిక' శబ్దము చాళుక్యశబ్దభవ మని యెఱుంగునది.

శాసనము పుట్టిన కాలము నూహించుటకుఁ దగిన యాధారము లేవియు లేవు. రాజరాజు 1022 వ సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁడైనట్లు నందంపూడి శాసనమువలనఁ దెలియవచ్చుటఁ జేతను, శక్తివర్మ 12సంవత్సరములు, విమలాదిత్యుఁడు 7సంవత్సరములు వెరసి వీరిద్దరు 19సంవత్సరములు రాజ్యము చేయుటచేతను, శక్తివర్మ 1003వసంవత్సరమున రాజ్యము పొందెననియు, నీశాసనము 1003, 1015 ఈమధ్యకాలమునఁ బుట్టియుండె ననియు నూహింపవలసియున్నది.

జ. రామయ్య.

---

# శక్తివర్మ ప్రభు బ్రహ్మశాసనము.

## మూలము.

### మొదటి పత్రము.

---

స్వస్తి శ్రీమతాం సకలభువనసంస్తూయమానమానవ్య
సగోత్రాణాం హారీతిపుత్రాణాం కౌశికివ
2 రప్రసాదలబ్ధరాజ్యానాం మాతృగణపరిపాలితా
నాం స్వామిమహాసేనపాదానుధ్యాతానాం (భగవన్నా)
3 రాయణప్రసాదసమాసాదిత వరవరాహలాంఛనే
క్షణక్షణవశీకృతారాతిమణ్డలానా మశ్వమే
4 ధావభృతస్నాన (1) పవిత్రీకృతవపుషాం చాళుక్యా
నాం కులమలంకరిష్ణోః సత్యాశ్రయవల్ల
5 భేన్ద్రస్య భ్రాతా కుబ్జవిష్ణువర్ధనో ష్టాదశవర్షా
ణి వేంగీదేశ మపాలయత్॥ తదాత్మ
6 జో జయసింహ స్త్రయస్త్రింశతం। తదను జేన్ద్ర
రాజనన్దనో విష్ణువర్ధనో నవ తత్సూను
7 ర్మఙ్గి(2)యువరాజః పంచవింశతిం। తత్పుత్రో
జయసింహ స్త్రయోదశ। తదవరాజః (3)కొక్కిలిః షణ్మాసాన్
8 తస్య జ్యేష్ఠో భ్రాతా విష్ణువర్ధన స్త ముచ్చాట్య స
ప్త త్రింశతం। తత్పుత్రో విజయాదిత్యభట్టారకో
9 ష్టాదశ। తత్సుతో విష్ణువర్ధనః షట్త్రింశతం॥
తత్సూను ర్భానుభాసో రణవిగణనయా నీల

రెండవపత్రము; మొదటిపుట.

10 కణ్ఠాలయానాం సగ్రామారామకానాం సలలిత
రమణీసంపదా సత్ప్రదానాం। క్రీత్వా (4) ప్రోత్తుంగ

(1) భృథస్నాన (2) మఙ్గి (3) తదవరజః (4) కృత్వా

11 మష్టోత్తరశత మభున గ్వీరష్టయుక్త(1)శ్చత్వా
రింశత్సమా శ్శాన్మజనసుతవిజయాదిత్యనామా నరేన్ద్రః॥
12 తత్సూను స్సతత మనూనదావృష్టేః । (2)
దిజగణికా ర్తిః(3)సస్యం(4) । సన్తోష (5)సకల మవాపయ
13 స్నపా ద్గా మద్ధ్యర్థం(6)కిల కలవిష్ణువ నోద్ధం (7)
తత్ప్రియతనయః । అగ్గా త్సంగ్రామరగ్గే విల
14 సదసినా మగ్గిరాజో త్తమాగ్గం తుగ్గాద్రే
శృంగ ముర్వ్యా మశని రివ ముదా పాతయ త్కాన...
15 నిశ్శంకం శంకిలేన ప్రధితజపదా ద్దుర్గ్గమా న్నిర్గ్గమ
య్య ద్రా గ్ధావం య త్ప్రివేశ్య ప్రభు...
16 నాప్రత్యసా ద్బుద్దెగాంకం (8)॥స శ్రీమా న్విజయా
దిత్యభూపతి ర్భ్రాతృభి స్సహ(9) । చత్వారింశత్సమా సార్ధం(10)
17 చతృభి రభున గ్భువం ॥ తద్భ్రాతృ(11)ర్విక్రమాది
త్యభూపతే స్సచ్ఛః(12)మూపతేః విలత్సత్కణ్ఠి(13)కాదా
18 మకర్తాస్య తనయో నయీ ॥ దీనానాధాతురా
ణాం ద్విజ వరసమితే ర్యాచకానాం యతీ

రెండవపత్రము; రెండవపుట.

19 నాం నానాదేశాగతానాం పటువటునటసద్గాయ
కానాం కవీనాం। బన్ధూనా మన్ధకానా మఖిల
20 షితఫలద్రానవా ద్రక్షణా ద్వ్యో మాతేవ త్రింశ(14)దబ్దా
న్భువ మభున గసౌ చారుచాలుక్యభీమః ॥ తత్పు
21 త్ర స్స్వభుజాసి(15)ఖణ్డితరిపుక్ష్మాభృద్బలా ద్వ్యాసవి(16)జిత్వా
సాంవిరజే ప్రతిష్ఠితజయ స్తంభ(17)పటిష్ఠో ర

(1) వీరోష్టయుక్తా. ఈపాదమందుగణభంగదోషమున్నది. (2) దానవృష్టిః. (3) ద్విజగణికార్తిః (4) ఈపాదమందు గణభంగదోషమున్నది (5) సన్తోషం (6) మధ్యర్థం (7) కలివిష్ణువర్ధనోద్ధమ్. (8) ఈభాగమస్పష్టము. (9) పతిర్భ్రాతృభిస్సహ. (10) సార్థం (11) తద్భ్రాతృ (12) స్సచ్ఛ (13) విలసత్కణ్ఠికా. (14) మాతేవత్రింశద (15) తత్పుత్రస్స్వభుజాసి (16) ద్వ్యాస వో. (17) స్తంభఃపటిష్ఠో.

22 ణే। స్వర్ణారూఢతులో త్ర భాఢ మతులో ధాత్రీతలే
త్రిశై మిత్రాభా (1) పరిరక్షితిస్మ విజయా
23 దిత్య స్సమార్ధ్ధం ధరాన్ (2)॥ తస్యాత్మజ (3) ప్రణత
వైరిశిరోవిలగ్నరత్నద్విరేఫపరి
24 చుంబితపదాపద్మః (4)। మేకం హాసం స్తులితహాటకరా శిఘా సా వర్షాణి
స్స ప్త (5) సమహా
25 ద్భువ మమ్మరాజః॥ తత్సుతం విజయాదిత్యం బాల ముచ్చాట్య లీలయా।
తాడాధిపతి రాక్రమ్య నూ
26 స మేక మహా ద్భువం॥ తం జిత్వా యుధి చాలుక్య
భీమభూమభూమిప తేస్సుతే (6) విక్రమాదిత్యభూ
27 పో పా న్మాసా నేకాదశ క్షితిం॥ తత స్తాడపరాజస్య
సూను సూనృతవా (7) క్ప్రభుః। యుద్ధమల్లధరా

మూఁడవపత్రము. మొదటిపుట.

28 ధీశ స్స ప్తవర్షాణ్యా పా త్సృవం॥ తం యుద్ధమల్లం యు
ధి యుద్ధమల్లో నిర్ఘాట్య విక్రాన్తన్నృపాదివీరాన్
29 హత్వా సమా ద్వాదశ రాజభీమో భూమిమ్ మహా త్కో-
ల్లభిగణ్డసూనుః॥ పత్యు స్తస్య సుతః పరాక్ర
30 మధనః క్షోణీభృతా మగ్రణీ రేకే నైవ గజేన వైరిణాం (8) హం
తా నవానాం రణే। కీర్త్యా నిర్మలయా ది
31 శో ధవలయ న్నర్ధ్యం దధానో మతిం వర్షాణాం
భువ మమ్మభూపతి రపా త్పంచో త్తరం విశ
32 తిం॥ సంగ్రామభూమా సురవాసభూమి మానోస్య
వీరో త్తర మమ్మరాజః దాయాద ము
33 గ్రాసినిపాతి తేభ సంతానసోపానపరంపరాభిః॥
భూభృద్విద్యాపారదృశ్వ (9) గుణాఢ్యైః శ
34 శ్వద్విద్వత్స త్కృతార్థైః కృతార్థైః। ఖ్యాతో ధాత్రీం రా
జభీమస్యపుత్రః పాతిస్మ శ్రీ న్వత్సరాన్ దానభూపః॥ త

---

(1) భాః (2) ధరామ్ (3) జః ప్రణత (4) పాదపద్మః (5) స ప్త. (6) భీమభూమిపః
స్సుతః (7) నూనుస్సూనృత (8) వైరికరిణాం (9) దృశ్వా.

35 తో దానార్ణవాధీశోః (1) దను వేంగిమహీతలః (2)।
సప్తవింశతివర్షాణి వేంగీదేశమరాజకః(3) ॥ శ్రీమానా
36 ర్య్యామహాదేవ్యా (4) దానార్ణవమహేశయోః సూ
ను రత్రాంతరే ధీరః శక్తి(5)వర్మ్మేతి విశ్రుతః॥ యస్మి

మూడవపత్రము. రెండవపుట

37 న్విశ్వంభరాభారం సాసహాజాతవమీ (6) దిగ్గజేన్ద్రాః
ఫణీన్ద్రాశ్చ విశ్రాన్తా ఇవ తద్భురాత్ ॥ గాంభీర్య్యం
38 జలజస్మృతాం జలనిధేః స్థైర్య్యం క్షితే క్షున్నతాం (7) సౌ
ర్య్యం (8) కేసరిణో మృగాధివసతం (9) మాయాం హ
39 రేః పౌరుషం । లావణ్యం శశినః కలంకసఖితాం
త్యక్తుం య ధైతే గుణా । య త్రైకత్ర ముదా వసంతి నిత
40 రాం చాలుక్యనారాయణే॥ యస్యార్క్కరవ స్యేవ శైశవం
సమసోభత (10) । సౌర్య్యేణా(11)
41 భీలశుక్లాలనిబ్భిదా (12) ద్రమిళాహవే॥ ప్రేషితం
చోడభీమేన యచ్చిత్రీకృతసాహ
42 సః । పంచత్వ మన తీక్ష్ణ (13) మేకవీరం స్వబాహునా॥ బద్ధేను
శ్చ మహారాజో మదాన్యో బ...
43 లినే । ఉభా వబిభితాం యస్మా ద్విభద్విపనా వివ (14)॥
ఉచ్చై బ్బలస్కన్ధ మతిప్రరూఢం భూభృచ్ఛిరః కో
44 (టి) విసారితాంఘ్రి మామూల మున్మూలయతిస్మ
యో త్తసారం విశాలం జటాచోడవృక్షం॥ రుద్ధ
45 త్తం దిగిభోపమై ర్నిజగజై రాజ్ఞాః కీర్తనం మహీ మ
శ్వానాం నివహైశ్చ వి...ప్రేంఖ

నాల్గవపత్రము. మొదటిపుట.

46 ద్రజశ్ఛద్మనా । యుద్ధే (ధ) మర్రథ విధాయ సన
య న్తత్సైన్యసమ్మర్ద్దనా ప్రాప (15) జ్జయసంభవం స్తుతి

---

(1) ధీశాదను (2) మహీతలమ్. (3) సమతిష్ఠదరాజకమ్. (4) శ్రీమదార్యా మహాదేవీ (5) ధీరశ్శక్తి. (6) ఇందుతప్పున్నది (7) క్షితేఃక్షున్నతాం (8) శౌర్యం (9) వసతిం (10) సమశోభత (11) శౌర్యేణా (12) నిర్భిదా (13) మనయత్తీక్ష్ణ (14) ఈపద్యముస్పష్టముగాలేదు (15) నాతాప్రిప

47 పథాతీతం ప్రతీతం యశః॥ స సంభ్రమ(1) ప్రణతనృప

తిమకుటమణిమరీచిరోచిష్ణుచరణారవి

48 న్దః సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధనమహా

రజధిరఃపరమమహేశ్వరః (2) పరమబ్రహ్మ

49 ణ్యః అత్తిలినాణ్డు విషయనివాసినో రష్ట్రకూట(3)

ప్రముఖా న్కుటుంబినః సమహూయ (4)

50 మంత్రిపురోహిత సేనాపతియువరాజదౌవారి

కాధ్యక్షు మిత్తమా (5) జ్ఞాపయితి॥ పూ

51 ర్వ్వం సలికేశ్వరన్నామ మహేశ్వరాలయ మస్యా

ఖణ్డస్ఫుటితనవం కర్మ్మకపాత్రబలి

52 నివేద్యర్థ మమ్మరాజ దవాప్తః(6)పథుబల్లునామ

గ్రామోస్యావధయః పూర్వ్వతః డుతికసీ స్సైవ సీ

53 మా। దక్షిణతః మూర్పుణ్డూరుసీస్సైవ సీమా। పశ్చి

మతః ఉల్లికొడమణ్డ్రిసీస్సైవ సీమా। ఉత్త

54 రతః ప్రోలిసీస్సైవ సీమా। ఏత త్థ్సానాధిపతి గ్గర్గ్య

న్వయః (7) శిష్యానుక్రమా దాగతః బా

55 లసోమపణ్డితః తస్యా నుమతేన త్థ్సానాధిపతిప్రతి

స్థితం చిరన్తనగ్రామస్యైః (8)

నాల్గవపత్రము. రెండవపుట.

56 స్వామిద్రోహం దోపుటువ్వం నిరస్య తద్గ్రామసణి

స్వామిత్వం (9) సర్వ్వకచేన పాంగునామ్నా దారకాం

57 బాయాశ్చ సుతాయ స్వామిభక్తాయ కృతక్షేత్రిసే

యుద్ధనిమిత్తే దాడిభీమనామ్నే మయా దత్త మి

58 తి విదిత మస్తు వః॥ గ్రామపశ్చిమదిశి పెనుంగొ

ణ్డఘక ప్రమాణేన శతద్వీహిఖణ్డికాబీజా

(1) ససంభ్రమ (2) రాజాధిరాజపరమమహేశ్వరః (3) రాష్ట్రకూట (4) సమాహూయ. (5) కాధ్యక్షానిత్థమా. (6) రాజాదవాప్తః. (7) గార్గ్యాన్వయః. (8) గ్రామణ్యే. (9) తద్గ్రామస్వామిత్వం.

59 వాపప్రమాణ పెద్ద అలంపక్షేత్రా (1) మస్యా వధ
యః। పూర్వ్వతః పుచ్చగుణ్ణసీమా। దక్షిణతః
60 ...లచెఱువుసీమా। పశ్చిమతః పేలముకోనసీ
మా। ఉత్తరతః। పమ్మితెరు
61 తెరువుసీమా। గ్రామప్రాచ్యా...చిఅపక్షే
శ్రోం తాదాఘక (2) ప్రమాణేన వింశ
62 తిగ్రీహిఖణ్డికా బీజవాప(3)ప్రమాణ మస్యా వధ
యః। పూర్వతః చోడకీలో
63 లగుణ్ణ। దక్షిణతః కాకిమఱ్ఱి। పశ్చిమతః చిఱు
కిరవిగుణ్ణ। ఉత్తరతః ప్రోలిసాని చెఱు
64 వు। పెద్దఅలంపక్షేత్ర స్యోత్తరస్యాం దిశి పెను
కొణ్డాఢకే నైవ వింశతిప్రీహిఖణ్డికాబీజవాప(4)
65 ప్రమాణం శ్రోవిణ్డివక్షేత్రం। అస్యా వధయః పూ
ర్వతః చిగొజుపన్నస। దక్షిణతః పమ్మితెరు

అయిదవ పత్రము.

66 వు పశ్చిమతః పోలమొరకోడు। ఉత్తరతః
నైకతాలకోడు। ... ... ...
67 నద్ద్రియ పడకతల దాంక బఱుచుడు పుట్టి ఋ
నుమద్ది ... ... ... ... ...
68 నియ బద్దియ షూదలుగా మన్నియ సామిత్వమె
ల్లరద్దొడ్ల ... ... ...
69 ధాయమ్మనుగాట్టెలుం బుచ్చి పుట్టబ
డడిరట్లాడకు ... ... ...
70 కొనచి బాధా కర్తవ్యా। (5)

---

(1) క్షేత్ర. (2) తదాఢక. (3), (4) బీజావాప. (5) కేనచిద్బాధా కర్తవ్యా.

శ్రీ

ఆంధ్రులపౌరుషము! ఆంధ్రులమహోన్నత్యము!! ఆంధ్రులబుద్ధివైభవము!!

# ఆంధ్రులచరిత్రము.

## రెండవభాగము.

ఇందు క్రీ. శ. 1100 నుండి 1350 వఱకుఁగల ఆంధ్రదేశచరిత్ర వర్ణింపఁబడినది.

పురాణములు, కావ్యములు, శాసనములు, విదేశీయుల వ్రాఁతలు, మొదలగువాని నన్నింటిని శోధించి తెలుఁగుచోడులు, నాగవంశోద్భవులైన మహారాజులు, కాకతీయచక్రవర్తులు, పల్నాటివీరులు, కమ్మవారు, రెడ్లు, వెలమలు మొదలగువారి చరిత్రలు, ఈ యుద్గ్రంథమునందు క్రోడీకరింపఁబడినవి.

రామానుజుఁడు, బసవేశ్వరుఁడు, నన్నెచోడ కవిశిఖామణి, ఖడ్గతిక్కన, కవితిక్కన, గణపతిదేవచక్రవర్తి, ప్రతాపరుద్రమహారాజు, మహారాణి రుద్రమదేవి, మొదలగువారల పవిత్రజీవితములు శ్రద్ధతో వ్రాయఁబడినవి.

ఆయాకాలమందలి సాంఘిక, రాజకీయస్థితులు చక్కఁగ వివరింపఁబడినవి. ప్రదేశముల యొక్కయు, కట్టడముల యొక్కయు, పటములు కలవు.

పౌరుషమునందును, పాండిత్యాతిశయంబునందును రాష్ట్రపాలనయందును ఆంధ్రులు హిందూదేశములోని యితరదేశములవారికి తీసిపోవువారు కారని యీగ్రంథము సప్రమాణముగా సిద్ధాంతీకరించుచున్నది.

ఇట్టిగ్రంథము తెలుఁగులోఁగాని మఱియే యన్యభాషలోఁగాని యెవ్వరును రచించియుండలేదు.

విఖ్యాత లేఖకులగు శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు పంతులుగారిచే నిది రచింపఁబడినది. 400 పేజీలు గలిగి మంచికాగితములమీఁద చిన్న యక్షరములతో ముద్రింపఁబడి చక్కని క్యాలికో బైండు చేయఁబడిన యీయమూల్యగ్రంథము మా చందాదారులకు పోస్టేజితో రు 1-0-0 కును, చందాదారులు కాని వారలకు పోస్టేజిగాక రు 1-8-0 లకును ఇయ్యఁబడును.

☞ **విజ్ఞానచంద్రికా బుక్కుడిపో యందు సంస్కృతాంధ్రగ్రంథము లనేకములు దొరకును. వలయువారికి క్యాటలాగులు పంపఁబడును.**

చిరునామా:—

ఆ. లక్ష్మీపతి, బి. ఏ., ఎం. బి. సి. ఎం.

మేనేజరు.—విజ్ఞానచంద్రిక,

చింతాద్రిపేట.—మద్రాసు.

# ఆంధ్రసాహిత్య పరిషత్తు, చెన్నపురి.

ప్రతిష్ఠాపకులు:—

శ్రీపిఠాపురము రాజాగారగు శ్రీరాజా రావు కుమార వేంకటమహీపతి సూర్యారావు బహద్దరుగారు.

శ్రీవేంకటగిరిరాజాగారగు మహారాజా సర్ - వెలుగోటి శ్రీరాజగోపాల కృష్ణయాచేంద్రబహద్దరుగారు, కె. సి. ఐ. ఇ., పంచహజారీమన్సబ్దార్.

అగ్రాసనాధిపతి:—

శ్రీవేంకటగిరి మహారాజాగారు.

కార్యనిర్వాహక సభాధ్యక్షుఁడు.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులుగారు. బి. ఏ., బి. ఎల్.

కార్యదర్శులు.

మ-రా-రా-శ్రీ పురాణం నాగభూషణంపంతులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

,, ఆచంట లక్ష్మీపతిగారు, బి. ఏ., ఎం. బి., సి. ఎమ్.,

,, నెమలి పట్టాభిరామారావు పంతులుగారు బి. ఏ.,

కోశాధ్యక్షులు (ట్రస్టీలు)

దివాన్ బహదూర్ కంచి కృష్ణస్వామిరావుగారు, సి. ఐ. ఇ.,

,, రావుబహదూర్ పిట్టిత్యాగరాయసెట్టిగారు, బి. ఏ.

కార్యస్థానము.

2/7 హారిస్ రోడ్డు, పుదుపేట.

చందానిర్ణయము.

పరిషదుద్దేశము:—ఆంధ్రశబ్దములకు సలక్ష్యవ్యుత్పత్తికముగ విపులనిఘంటువు రచించుట, తెలుఁగుభాష కితరభాషలతోఁగల సంబంధమును దెలుపుచు భాషాతత్త్వమును నిరూపించులక్షణశాస్త్రమును రచించుట, ఆంధ్రదేశపూర్వవృత్తాంతమును బ్రమాణపూర్వకముగా నిరూపించుట, శాస్త్రపారిభాషికపదముల నిర్ణయించుట, నూతనగ్రంథరచనకు సాహాయ్యమొనర్చుట, భాషావిషయములఁజర్చించుటకుఁ బత్త్రికనొకదానిని బ్రకటించుట, సమగ్రమగు పుస్తకభాండాగారము నేర్పఱచుట, ఇత్యాదివిధముల నాంధ్రభాషావాఙ్మయాభివృద్ధికై యత్నించుట, పరిషత్తుయొక్క యుద్దేశము

| | | |
|---|---|---|
| 1. ఉద్ధారకులకు | రు. | 5000. |
| 2. పోషకులకు | ,, | 1000. |
| 3. యావజ్జీవసభ్యులకు | ,, | 100. |
| 4. సాధారణసభ్యులకు సంవత్సరమునకు | ,, | 6. |

పరిషత్సభ్యులు పత్త్రికకు వేఱుగాఁ జందా నియ్యనక్కఱలేదు.

సభ్యులు కాఁగోరువారు కార్యదర్శులపేర వ్రాసి పరిషన్నిబంధనలఁ దెప్పించుకొనవచ్చును.